"కమ్యూనిజం" ప్రత్యేక సంచిక

# భారతదేశంలో మతం



కపిలవస్తులో బోధిస్తున్న గౌతమ బుద్ధుడు

జనవరి 1994 రూ. 10. వెల.

# భారతదేశంలో మతం

విశాలాంధ్ర విజ్ఞాన సమితి
"కమ్యూనిజం" మార్క్సిస్టు సిద్ధాంత
మాసపత్రిక ఆధ్వర్యాన

## అధ్యయన సదస్సు

హైదరాబాద్ – 1993 , డిసెంబరు 5

## ప్రత్యేక సంచిక

వెల : రూ. 10/-

## సంపాదకవర్గం

శ్రీ ఈడ్పుగంటి నాగేశ్వరరావు

(సంపాదకుడు)

శ్రీ ఏటుకూరు బలరామమూర్తి

శ్రీ పరకాల పట్టాభిరామారావు

'కమ్యూనిజం' పత్రికలో వెలువడుతున్న వ్యాసాలలోని భావాలతో పత్రికా సంపాదకవర్గం ఏకీభవించనవసరంలేదు. అవి రచయితల అభిప్రాయాలు మాత్రమే.

– 'కమ్యూనిజం' సంపాదకవర్గం

"కమ్యూనిజం"

సంపుటి : 18 జనవరి 1994 సంచిక : 9

విషయ సూచిక

## అనుబంధం

# ముందుమాట

విశాలాంధ్ర విజ్ఞానసమితి విభాగం అయిన "కమ్యూనిజం" మార్క్సిస్టు సిద్ధాంత మాసపత్రిక ఆధ్వర్యాన 1993 డిసెంబరు 5వ తేదీన హైదరాబాద్ ప్రెస్‌క్లబ్ - దేశోద్ధారక కాశీనాదుని నాగేశ్వరరావు భవన్ - సురవరం ప్రతాపరెడ్డి హాలులో "భారతదేశంలో మతం" అన్న అంశంపై అధ్యయన సదస్సు జరిగింది.

కమ్యూనిజం పత్రిక సంపాదకులు శ్రీ ఈడ్పుగంటి నాగేశ్వరరావు అధ్యక్షత వహించారు. సంపాదక వర్గసభ్యులు శ్రీ పరకాల పట్టాభిరామారావు సదస్సు లక్ష్యాలను వివరించి వక్తలకు స్వాగతం పలికారు. శ్రీమతి శారదారెడ్డి పాడిన గురజాడ దేశభక్తి గేయంతో సదస్సు ప్రారంభమైంది.

హైదరాబాద్ రామకృష్ణ మిషన్ భాషాధ్యయనసంస్థ అధిపతులు స్వామి బ్రహ్మస్థానంద "మతం - సామరస్యం" అన్న అంశంతో సదస్సు ప్రారంభించారు. వేదాధ్యయనవేత్త, స్వాతంత్ర్యసమరయోధులు శ్రీ మాడభూషి భావనాచారి "హిందూమతం" పై తమ అధ్యయనపత్రాన్ని ప్రవేశపెట్టారు. ప్రముఖ సాహితీవేత్త అధికార భాషా సంఘం మాజీ అధ్యక్షులు శ్రీ నండూరి రామకృష్ణమాచార్య" హిందూమతం - వైష్ణవం" అన్న అంశంపై తమ అధ్యయనపత్రాన్ని ప్రవేశపెట్టారు.

హైదరాబాద్ సెంట్రల్ యూనివర్సిటీ అధ్యాపకులు, చరిత్ర పరిశోధకులుప్రొఫెసర్ వి.రామకృష్ణ "మతసంస్కరణ ఉద్యమాలు" అన్న అంశంపై తమ అధ్యయన పత్రాన్ని ప్రవేశపెట్టారు. హైదరాబాద్ మహిళాభ్యుదయ సమితి డైరెక్టర్, ప్రముఖ మహిళా ఉద్యమ నాయకురాలు శ్రీమతి మల్లాది సుబ్బమ్మ "మతఛాందసవాదం - స్త్రీలు" అన్న అంశంపై తమ అధ్యయన పత్రాన్ని ప్రవేశపెడుతూ ప్రసంగించారు.

ప్రజా గాయకుడు గద్దర్ పాడిన పాటతో మధ్యాహ్న సమావేశం ప్రారంభమైంది. ప్రముఖ సాహితీ విమర్శకులు, బహుభాషా పండితులు శ్రీ తిరుమల రామచంద్ర "జైనమతం" పై అధ్యయన పత్రాన్ని ప్రవేశపెట్టారు. ఖురాన్ తెలుగు అనువాదకులు జామాయత్ - ఇ - ఇస్లామీ ప్రముఖులు శ్రీ షేక్ హమీదుల్లాషరీఫ్ "ఇస్లాం"పై తమ అధ్యయన పత్రాన్ని ప్రవేశపెట్టారు. ప్రముఖ ట్రేడ్‌యూనియన్ నాయకులు, మార్క్సిస్టు అధ్యయన వేత్త శ్రీ కె.ఎల్.మహేంద్ర "ఇస్లాం మతం - సూఫీ ఉద్యమం"పై తమ పత్రాన్ని సమర్పించారు. హైదరాబాద్ జగ్జీవన్‌రామ్ కాలేజీ సీనియర్ లెక్చరర్ - డాక్టర్ ఆచంట హేమలతాదేవి "మత ఛాందసత్వం - స్త్రీల హక్కులపై మతం ప్రభావం" అన్న అంశంపై తమ అధ్యయన పత్రాన్ని ప్రవేశపెట్టారు.

దళిత ఉద్యమ నాయకులు, న్యాయవాదులు శ్రీ బొజ్జా తారకం "దళితులు - హిందూమతం" అన్న అంశంపై ప్రసంగించారు. హైదరాబాద్ అంబేద్కర్ కాలేజీ అధ్యాపకులు ఆంధ్రప్రదేశ్ అభ్యుదయ రచయితలసంఘ ప్రధాన కార్యదర్శి శ్రీ ఎస్వీ సత్యనారాయణ "భారతదేశంలో మతం - కులం" అన్న అంశంపై తమ అధ్యయన పత్రాన్ని ప్రవేశపెట్టారు. తత్వవేత్త శ్రీ పుట్టా సురేంద్ర "మతము - తత్వశాస్త్రము" అన్న అంశంపై ప్రసంగించారు.

చివరగా రాష్ట్ర ట్రేడ్ యూనియన్ అధ్యక్షులు, మార్క్సిస్టు అధ్యయనవేత్త శ్రీవై.విజయకుమార్ "మతము - మార్క్సిజం" అన్న అంశంపై ప్రసంగించారు.

సభాధ్యక్షులు శ్రీ ఈడ్పుగంటి నాగేశ్వరరావు వక్తల ప్రసంగాలను సమన్వయపూర్వకంగా సమీక్ష చేశారు. శ్రీమతి వి.సరళ మతతత్వంపై పాడిన గేయంతోను, శ్రీ పట్టాభి రామారావు వందన సమర్పణతోను సదస్సు జయప్రదంగా ముగిసింది.

ఈ సదస్సుకు కమ్యూనిజం పత్రిక సంపాదకవర్గ సభ్యులు శ్రీ ఏటుకూరి బలరామమూర్తి "బౌద్ధమతం"పైన ప్రముఖ సాహితీవేత్త డాక్టర్ ఆరుద్ర "లోకాయత"పైన, తమ అధ్యయన పత్రాలను పంపారు.

పలువురు స్వాతంత్ర్య సమరయోధులు, అధ్యాపకులు, చరిత్ర పరిశోధకులు, కమ్యూనిస్టునాయకులు, సాంఘిక కార్యకర్తలు మహిళలు సదస్సులో పాల్గొన్నారు.

నేడు దేశాన్ని ఎదుర్కొంటున్న మత సమస్యపై ఇటువంటి అధ్యయన సదస్సు జరిగినందుకు పలువురు అభివందనలు తెలియజేశారు.

ఆకాశవాణి హైదరాబాద్ కేంద్రంవారు 6వ తేదీ రాత్రి సదస్సుపై శ్రీ పరకాల పట్టాభి రామారావు సమీక్షను ప్రసారంచేశారు.

కమ్యూనిజం పత్రిక ఆధ్వర్యాన 1992 సెప్టెంబరులో విజయవాడలో భారతదేశంలో కులవ్యవస్థ"పై సదస్సు జరిపి అక్టోబరు - నవంబరు నెల ప్రత్యేక సంచిక ప్రచురించాం. ఆ సంచిక యిప్పటికి మూడు ముద్రణలతో బహుజనాదరణ పొందింది.

1993 మార్చిలో కాకినాడలో ప్రదేశ్ మహిళా సమాఖ్య స్థానిక విభాగం వారి సహకారంతో "మహిళా సదస్సు" జరిపి - ప్రత్యేక సంచిక వెలువరించాం.

ఇప్పుడు "భారతదేశంలో మతం" అంశంపై హైదరాబాద్‌లో 1993 డిసెంబరులో జరిగిన సదస్సుకు సమర్పించబడిన అధ్యయనపత్రాలను వీటితోపాటు ఈ సమస్యపై ఒక సమగ్ర చిత్రణకు అవగాహనకువీలుగా పలువురు ప్రముఖులు, పరిశోధకులు, చరిత్రకారులు రచించిన వ్యాసాలను, అనుబంధంగా చేర్చి ఈ ప్రత్యేక సంచికను పాఠకులకు సమర్పిస్తున్నాం".

హైద్రాబాద్ సదస్సులో పాల్గొన్నవారికి సదస్సును జయప్రదం చేసిన వారికి ధన్యవాదాలు తెలియజేస్తున్నాం.

# అధ్యక్షుని తొలి పలుకులు

**- శ్రీ ఈడ్పుగంటి నాగేశ్వరరావు**

మనదేశ సామాజిక వ్యవస్థకు కొన్ని ప్రత్యేకతలున్నాయి. అందులో ఒకటి ఈ దేశంలో జనించిన కుల వ్యవస్థ. రెండవది ఈ దేశంలో ఏర్పడిన మత వ్యవస్థ; ముఖ్యంగా హిందూ మతం. దానికి కొన్ని ప్రత్యేకతలున్నాయి. ఈ కుల వ్యవస్థ, మత వ్యవస్థ మన దేశంలోని పార్శ్వాలన్నింటిని ప్రగాఢంగా ప్రభావితం చేస్తున్నాయి. ఇతర దేశాలలో మతం యొక్క పాత్ర గురించి నేనిక్కడ ప్రస్తావించడంలేదు. మన దేశంలో సామాజిక జీవితాన్ని యింత గాఢంగా ప్రభావితం చేస్తున్న ఈ వ్యవస్థలగురించి చారిత్రకంగా పరిశీలించడం అవసరం.ఈనాడు ఉన్నటువంటి లేదా సమకాలీన సమస్యల పరిష్కారానికి కూడా ఈ పరిశీలన అవసరమని మా నిశ్చితాభిప్రాయం.

నేడు మనం చర్చిస్తున్నది ప్రధానంగా మత వ్యవస్థ. దీనికి చాలా పార్శ్వాలున్నాయి. Multi-dimentional aspects ఉన్నాయి. మన దేశ చరిత్రకు, సంస్కృతికి సంబంధించి ఈ మతం, మత భావాలు, ఆచారాలు, హరప్పా నాగరికత కాలం నుండి కనిపిస్తున్నాయని చరిత్రకారులు, మానుషశాస్త్రజ్ఞులు (Anthropologists) నిర్ధారణకు వచ్చారు. అంతకుముందు నాగరికత ఏమి ఉండేదో! అది చరిత్రకు అందనిదేమో!

## హరప్పా నాగరికత నుండీ మతం

చారిత్రక అవశేషాల ఆధారంగా హరప్పా నాగరికత నుండి మతం అనేది మనకు కనుపిస్తున్నది. అంటే దాదాపు అయిదు వేల సంవత్సరాలుగా మతం అనేది ఒక వ్యవస్థీకృతమైనదిగా కనుపించకపోయినా, ఆ భావాలు, ఆ చిహ్నాలు, ఆచారాలు అప్పటినుండి కొనసాగుతున్నాయి. ఆ తరువాత చాలా మార్పులు కూడా వచ్చాయి. అది వేరే అంశం.

ఈ అయిదు వేల భారతదేశ చరిత్రలో లేదా వివిధ చారిత్రక దశలలో కొత్త మతాలు వచ్చాయి. మత ఉద్యమాల రూపం తీసుకున్నాయి. మత సంస్కరణ ఉద్యమాలూ వచ్చాయి. ఈ మతాలమధ్య సహజీవనమూ కొనసాగింది. మతాలమధ్య కొంత సంఘర్షణ లేకపోలేదని కొంతమంది చరిత్రకారులు సోదాహరణంగా రాసినవీ ఉన్నాయి. ఒక అశోకుడు, ఒక అక్బర్, ఒక హర్ష చక్రవర్తి. వీరి కాలంలో మతసహజీవనం ప్రస్ఫుటంగా కనిపిస్తుంది. మరికొంతమంది చక్రవర్తుల కాలంలో, రాజుల కాలంలో మత సంఘర్షణలు లేకపోలేదు. సామాజిక జీవితంతో ఇవి పెనవేసుకొనిపోయి ఉన్నాయి. కాని వివిధ మత విశ్వాసాలు కలిగిన వారిమధ్య ఈ సహజీవనం ఉన్నందుననే సమాజం నిలబడింది. కొనసాగుతూంది. జీవిస్తున్నది కూడా.

ఈరోజున మతం గురించిన చర్చ కొత్తరూపం తీసుకొంది- ఆధునిక యుగంలో వున్నాం గనుక. మతం గురించిన పరిశీలన వివిధ దృక్కోణాలనుండి సాగుతున్నది ఇది యిప్పుడు మన దేశానికి, మన సమాజానికి సంబంధించి కేవలం ఇది Academic discussion (విద్వద్గోష్ఠి) కాకుండా ఆచరణలో ప్రాధాన్యతను సంతరించుకొంది. ఒక అత్యవసరంకూడా ఏర్పడిందని మా అభిప్రాయం.

## మతతత్వ విజృంభణ

కారణం ఏమంటే గత రెండు మూడు సంవత్సరాలుగా మతతత్వం అనేక రంగాలలో విజృంభించింది. కేవలం మతాన్ని, రాజకీయాలలో చొప్పించే ప్రయత్నమేకాదు. సామాజిక జీవితంలో, సాంస్కృతిక రంగంలో ఇది ప్రవేశించింది. దానికి ఉదాహరణలు కూడా మనకు కనిపిస్తున్నాయి. Cultural Sphereలో, Social Sphereలో వ్యాపించింది. రాజకీయ రంగంలో మరింత వికృత రూపం తీసుకుంది. అందువలన సంఘర్షణలు ఏ రూపం తీసుకున్నాయో, హింస ఎలా చెలరేగిందో గత సంవత్సరం నుండీ చూస్తున్నాం. రెండు, మూడు సంవత్సరాలుగా రాజుకుంటున్న ఈ పరిణామం సరిగ్గా ఒక సంవత్సరం క్రితం తీవ్ర రూపం తీసుకోవడంతో భారతదేశ సమాజమే అతలాకుతలమైపోయింది. ఒక రకమైన సంక్షోభం కనిపించింది. దాని పర్యవసానంగా దేశంలో హింసాకాండ చెలరేగింది. ఇది కూడా దనే మనందరి అభిప్రాయం.

మనదేశ రాజ్యాంగ మౌలిక లక్ష్యాలు, లౌకిక వ్యవస్థ ప్రజాస్వామ్యం, సోషలిజం- ఇవి మహోన్నతమైన ఆశయాలు. ఈ ఆశయాల కనుగుణ్యంగానే మనదేశం పురోగమించాలి. మన ప్రజలు అభివృద్ధి చెందాలి-అనేదీ మనందరి యొక్క ఆకాంక్ష.

దీనికి భిన్నంగా, మత సహనం వుండేచోట- మత ఘర్షణ ఏర్పడితే సమాజం మత పరంగా విభజించబడుతుంది. మతపరంగా ద్వేషాలు పెచ్చరిల్లి ఒక వికృత రూపం తీసుకొనే ప్రమాదం ఉంది. అందుచేతనే మతం, మత విశ్వాసాలు- ఇవన్నీ కూడా వ్యక్తిగత జీవితానికి, వ్యక్తిగత విశ్వాసాలకు సంబంధించినవి. వ్యక్తిగత వ్యవహారం రాజకీయాలు, రాజవ్యవస్థ అనేది దీనికి అతీతంగా ఉండాలి.

## భారతదేశ లౌకిక విధానం

ఈ సందర్భంలో పేర్కొనవలసిన మరొక విషయం ఏమంటే భారతదేశ సెక్యులరిజానికి కొన్ని ప్రత్యేకతలున్నాయి.

ప్రతీదేశానికి కొన్ని ప్రత్యేకతలుంటాయి. మన సెక్యులరిజానికి పునాదులు అశోకుని కాలంలో పడ్డాయని ముల్కరాజ్ ఆనంద్ లాంటివారు ఇటీవల తమ రచనలలో పేర్కొన్నారు. ఇవి చరిత్రకారులు, మేధావులు పరిశీలించవలసిన విషయాలు. భారతదేశ లౌకిక వ్యవస్థ ప్రత్యేకతలు ఏమిటి? అనేది ప్రధానాంశం. ఏది ఏమైనప్పటికీ మనం లౌకిక విధానాన్ని అంగీకరించాం. ఆ మార్గాన్నే మనం వెళ్లవలసి ఉంది.

ఇట్టి నేపథ్యంలో ఈ సదస్సును నిర్వహించడంలో మా ఉద్దేశ్యం - సమాజంలో మతం యొక్క స్థానం ఏమిటి? వివిధ చారిత్రక దశల్లో మతాలు ఎందుకు పుట్టాయి? వాటి సామాజిక పునాదులు ఏమిటి? అవి నిర్వహించిన పాత్ర ఏమిటి? ముఖ్యంగా దాని నైతిక బోధ ఏమిటి? అన్నది ప్రధానాంశం. మహాత్మాగాంధీ లాంటివారు నేను సనాతన హిందువును అని అన్నప్పుడు, వారి ఉద్దేశ్యం ఆ మతంలోని నైతిక పాత్ర, నైతిక బోధనలగురించి ఆయన నొక్కి చెప్పారని నేను భావించు తున్నాను. Moral aspect of religion; spiritual aspect of religion ethical Aspect of Religion అని నేను అర్థం చేసుకుంటున్నాను. అయితే మతాలను గురించిన పలువ్యాఖ్యానాలున్నాయి. మతాన్ని గురించిన వక్రీకరణలు న్నాయి. మతాన్ని స్వార్థానికి ఉపయోగించుకుంటున్నవారు న్నారు. రకరకాలుగా ఉన్నారు. అందుచేతనే Multi-demensional approach ఉండాలి అని మనవి చేశాను.

ఇది ఏ ఒక్కరూ పరిష్కరించేదికాదు. మొత్తం సమాజం, ప్రజలు, మేధావులు అందరూ పరిష్కరించవలసినది. ఆలోచించవలసిఉంది. అందుచేతనే ఈ సదస్సుకు వివిధ రంగాలలో ప్రముఖులను ఆహ్వానించాం. వారందరూ వచ్చారు. వారందరికీ ధన్యవాదాలు.ఈ సదస్సును ప్రారంభించవల సిందిగా శ్రీ స్వామిబ్రహ్మస్థానందగారిని కోరుతున్నాను.

దేశమును ప్రేమించుమన్నా
మంచి అన్నది పెంచుమన్నా
వొట్టి మాటలు కట్టిపెట్టోయ్
గట్టిమేల్ తలపెట్టవోయ్!

దేశాభిమానం నాకు
ఒట్టి గొప్పలు చెప్పుకోవోయ్
పూని ఏదైనాను ఒక మేల్
కూర్చి జనులకు చూపవోయ్

సొంత లాభం కొంత మానుకు
పొరుగు వాడికి తోడుపడవోయ్
దేశమంటే మట్టికాదోయ్
దేశమంటే మనుషులోయ్!

అన్నదమ్ముల వలెను
జాతులు, మతములన్నీ
మెలగవలెనోయ్

— మహాకవి గురజాడ

# మతం, సామరస్యం

– స్వామి బ్రహ్మస్థానంద

(ప్రారంభోపన్యాసం)

మానవ జాతి భవిష్యత్తును రూపొందించిన అన్ని శక్తుల లోను, మతమనే సమైక్యశక్తి అత్యంత బలీయమైనది. ఈ శక్తి శతాబ్దాలుగా, దేవుని పేరుతో వారి వారి విశ్వాసాలననుస రించి ప్రజలను ఐక్యంచేస్తూ వచ్చింది. మతం పుట్టుక మానవుని మనస్సులోనే ఉంది. మానవ మేధస్సునుండి పుట్టిన రెండు మౌలిక సూత్రాలనుండి మతం ఆవిర్భవించింది. తెలియని దానిని, చూడని దానిని, తెలుసుకోవాలనీ, చూడాలనే ఆకాంక్ష మతానికి వుంది.

మానవ శరీరంలోని ఆత్మ మొదటిది, అఖండ పరమాత్మ రెండవది.

అకస్మాత్తుగా తనకు అత్యంత సన్నిహితులైనవారు చని పోవటం మానవుణ్ని ఆశ్చర్యచకితుణ్ని చేసింది. తనకు ప్రేమపాత్రులు, బంధువులు, స్నేహితులు చనిపోతున్నారు. మరణ రహస్యం, మానవుని మరణానంతర జీవితాన్ని గురించి అన్వేషించేటట్లు చేసింది. మరొక వైపున ఆర్ష సాహిత్యంలో, అమానుషమైన ప్రాకృతిక శక్తుల ఉపాసన మతానికి ప్రాతి పదికగా కనిపిస్తుంది. సూర్యుడు, చంద్రుడు, నక్షత్రాల కదలిక, తుపానుల బీభత్సం, వర్షాలు, వరదలు, సృష్టిలోని అందాలు, క్రమపద్ధతిన ఋతుపరిభ్రమణం, ఇవన్నీకూడా మానవుణ్ని ఆశ్చర్య చకితుణ్నిచేసి దిగ్భ్రాంతిని కలిగించేవి సృష్టి వెనుక మూల రహస్యం ఏమిటో తెలుసుకోవాలనే ఆసక్తి మానవునికి కలగటానికి ఇవన్నీ కారణాలు.

పై రెండు సూత్రాలు పైకి విరుద్ధంగా కనిపిస్తాయి. కాని, ఈ రెంటికి మరో సూత్రాన్ని జోడించాలి. ఇంద్రియ జ్ఞానాన్ని అధిగమించి సత్యాన్ని తెలుసుకోవాలనే ఆకాంక్ష.

స్వామీ వివేకానంద ఇలా అంటాడు : "ప్రకృతిని అధిగమించి సమున్నతుడు గావటానికి ప్రయత్నించిన మేరకు మానవుడు మానవుడుగానే ఉంటాడు. ఈ స్వభావం బాహ్యమైనది, అంతర్గతమైనదీకూడా. శరీరానికి బాహ్యంగావున్న పదార్థ లక్షణా లను నియంత్రించే నియమాలు మాత్రమేగాక, మానవుని లోపలవున్న సూక్ష్మస్వభావాన్నికూడా నియంత్రించాలి. నిజానికి ఈ సూక్ష్మస్వభావమే బాహ్యశక్తినికూడా నియంత్రి స్తుంది. బాహ్య ప్రకృతిని జయించటం నిజంగా గొప్పపని, నిస్సందేహంగా ఘనకార్యం. కాని అంతరంగిక స్వభావాన్ని జయించే కృషి మరింత గొప్పది. నక్షత్రాలను, గ్రహాలను నియంత్రించే సూత్రాలను తెలుసుకోవటం నిస్సందేహంగా గొప్ప విద్య. మానవుని ఆవేశాలను, భావాలను, మనస్సును, చిత్తాన్ని నియంత్రించే సూత్రాలను తెలుసుకోవటం అంత కంటే గొప్పపని. మానవుని ఆంతరంగిక జీవనాన్ని నియం త్రించే ఈ కృషి, మానవ మేధస్సులోని సూక్ష్మ ప్రపంచాన్ని అర్థం చేసుకునే కృషి, ఆ రహస్యాలను గ్రహించటం, ఇదంతా పూర్తిగా మతానికి సంబంధించినది."

## అన్ని మతాల లక్ష్యం ఒక్కటే

కనుక అన్ని మతాల లక్ష్యం, ఇంద్రియ గ్రహణశక్తి కంటే అతీతమైన అనుభవాన్ని గ్రహించటం, బాహ్య, ఆంతరంగిక స్వభావాల పరిధిని అధిగమించటం. అన్ని మతాలలోను ఒక సాంప్రదాయక విశ్వాసమున్నది. మానవుడు వస్తుతః లోప రహితుడు. అతని ప్రస్తుత స్థితి జీర్ణావస్థకు చిహ్నం. జీవిత లక్ష్యం తిరిగి ఆదర్శప్రాయమైన, లోపరహిత స్థితిని తిరిగి పొందటం. ఈ విధంగా మోక్షాన్ని గురించి, ఆదర్శస్థితిని గురించి వేర్వేరు సిద్ధాంతాలు ఏర్పడ్డాయి. ఆధ్యాత్మిక దృష్టిలో ఇవన్నీ గురు – శిష్య సంబంధంమీద ఆధారపడి ఉన్నాయి. వీటినే వేర్వేరు మతాలు అంటున్నాము. మానవుణ్ని, జంతు వునీ వేరుచేసేది మతం. సంస్కృతంలో ఈ అర్థాన్ని స్ఫురింప చేసే సంస్కృత శ్లోకం ఒకటి ఉన్నది.

"ఆహార నిద్రా భయ మైధునంచ
సమానమేతత్ పశుభిర్నరాణాం
ధర్మోహితేషాం అధికో విశేషో
ధర్మేణ హీనాః పశుభిస్సమానః"

"తినటం, త్రాగటం, నిద్ర, భయం, పునస్సృష్టి ఇవి మానవు లకు, జంతువులకు సమానమే. ధర్మం ఒక్కటే మానవుల ప్రత్యేక లక్షణం. ధర్మం అనేది లేకపోతే మానవులు పశువులు సమానమే."

ధర్మానికి సంబంధించిన ఈ లక్షణమే వివిధ మత సిద్ధాం తాలుగా రూపొందింది. అన్ని మతాల లక్ష్యం ఒకటే. భౌతిక జీవిత పరిధిని అధిగమించి దివ్యశక్తితో సాన్నిహిత్యాన్ని పొంద టం. ఆయా మత కర్తల విశ్వాసాల ననుసరించి వివిధ మతాలు దైవసిద్ధాంతాన్ని రూపొందించుకున్నాయి. అంత మాత్రాన పరమేశ్వరుని అనంత స్వభావానికి ఏ భంగమూ వాటిల్లదు. శ్రీరామకృష్ణ తనదైన ప్రత్యేకతరహాలో, ఈ క్రింది విధంగా చెప్పాడు "మతాన్ని గురించి మాట్లాడేవారు తరచు తమలో తాము దెబ్బలాడుకుంటూ ఉండటం నేను గమనిస్తున్నాను

హిందువులు, ముసల్మానులు, బ్రాహ్మసామాజికులు, శాక్తులు, వైష్ణవులు, శైవులు అందరూ తమలో తాము దెబ్బలాడుకుంటూ ఉంటారు. కృష్ణుడు అని పిలవబడేవాడే, శివుడనీ, ఆదిశక్తి అనీ, అతనినే జీసస్ అని, అల్లా అని పిలుస్తారని వారు గ్రహించటంలేదు. రాముడు ఒక్కడే, అతనికి వేయి పేర్లున్నాయి. సత్యం ఒక్కటేదానికి మారుపేర్లు ఎన్నో ఉన్నాయి. వ్యత్యాసమల్లా వాతావరణం, పేరు. అందరూ ఒకే సత్యాన్ని చేరుకోవాలని ప్రయత్నిస్తున్నాం. ఒక సరస్సుకు అనేకమైన ప్రవేశ మార్గాలుంటాయి. ఒక చోట నుండి హిందువులు నీరు తీసుకుంటారు, దాన్ని 'జలం' అంటారు. మరొక చోట నుండి ముసల్మానులు నీరు తీసుకుంటారు. దానిని 'పానీ' అంటారు. మరో చోటునుండి క్రైస్తవులు నీరు తీసుకుంటారు. దానిని 'వాటర్ (నీరు) అంటారు. ఎవరైనా ఒకరు ఇది 'జలం' కాదు, పానీ అని ఇది పానీ కాదు వాటర్ అని, ఇది వాటర్ కాదు జల్ అని అంటే, ఈ వాదన హాస్యాస్పదంగా ఉంటుంది. కాని, సరిగ్గా ఇలాంటి వివాదం వివిధ శాఖల మధ్య తగాదాలకు కారణం. వారి మధ్య ఘర్షణను సృష్టిస్తున్నది. ఇదే. దాంతో ఒకరినొకరు చంపుకుంటున్నారు. ఇతరుల రక్తాన్ని చిందిస్తున్నారు. ఇది చాలా చెడ్డపని, అందరూ దేవుడ్ని చేరుకోవలసినవారే. చిత్తశుద్ధి, దేవుని చేరుకోవాలనే కాంక్ష ఉంటే అందరూ తమ లక్ష్యాన్ని చేరుకుంటారు. (2)

శ్రీరామకృష్ణయొక్క ఈ విశాల దృక్పథంద్వారా అందరూ తమ లక్ష్యాలను సాధించగలరు. త్రోవలోగల ఆటంకాలను తెలుసుకోగలరు. రామకృష్ణ అన్ని మతాలను పాటించాడు. దేవుని గురించిన అజ్ఞానంవలన, లేక పాక్షిక జ్ఞానం వలన మాత్రమే, మతమౌఢ్యం ఏర్పడుతున్నది. ఏనుగు పూర్తి స్వరూపాన్ని గ్రహించలేని గుడ్డివారు వేర్వేరు అవయవాలను తాకి అదే ఏనుగు అన్నట్లుగా ఉంటుంది. ఏనుగును కొందరు స్తంభమని, కొందరు పెద్ద విసనకర్ర అని, కొందరు గొట్టం అని, కొందరు తాడు అని అనుకుంటారు. ఇది పిడివాదం, మత మౌఢ్యం కలిసి పోయిన దుస్థితి. మతాల మాలిన్యభావాన్ని గురించి గ్రహించటంలోను, మనం ఇంతగా విభేదిస్తున్నాము. హిందువుల మత గ్రంథాలననుసరించి ప్రతిమానవుడిలోను దైవత్వం ఉన్నది. ఈ దైవత్వం ఈశ్వరునితో శాశ్వతంగా ఐక్యమై ఉంది.

---

రామకృష్ణుని సూక్తులు - *423* పేజి

# దైవత్వం గురించి వివేకానంద నిర్వచనం

స్వామి వివేకానంద ఇలా అంటాడు "ప్రతి ఆత్మ మౌలికంగా దైవస్వభావం కలిగి ఉన్నది. అంతరంగిక, బాహ్య ప్రవృత్తులను నియంత్రణ చేసుకుని మన అంతరాత్మలో ఈ దైవత్వాన్ని సందర్శించటమే జీవిత లక్ష్యం. ఈ పనిని రోజువారీ నిత్యకర్మల ద్వారాగాని, ప్రార్థనద్వారాగాని, మానసిక నియంత్రణద్వారా గాని, లేక, తత్వశాస్త్రంద్వారా గాని లేక వీటన్నిటిద్వారా గాని సాధించవచ్చు. తద్వారా స్వేచ్ఛను సాధించవచ్చు. ఇదే మత సర్వస్వం. సిద్ధాంతాలు, సూత్రాలు మతకర్మలు, పుస్తకాలు, దేవాలయాలు, ఇతర కర్మకాండ ఇవన్నీ ద్వితీయ శ్రేణికి చెందినవి."

దైవభావాన్ని వర్ణించటం నిజంగా కష్టసాధ్యం. ఈ భావం ఇంద్రియాలకు అతీతమైంది. దేశ, కాలాలకు అతీతమైంది. మునీశ్వరులు, తపస్సుద్వారా, సాధనద్వారా దానిని సాధించారు. అది వారికి సాక్షాత్కారమైంది. ఈ సాక్షాత్కారమే ఉపనిషత్తులలో వర్ణించబడ్డది. దీనినే వేదాంతమంటున్నాము. వేర్వేరు వ్యక్తులు, వేర్వేరు కాలాలలో గ్రహించిన ఆధ్యాత్మిక సూత్రాల సమాహారం ఇది. ఇవి శాశ్వత సూత్రాలు. ప్రపంచంలో జరిగే మార్పులకు ఇవి అతీతమైనవి. వీటినే శ్రుతులు అంటున్నారు. శ్రుతుల అర్థాన్ని నిష్కల్మషులైనవారు గ్రహించగలరు. నిశితమైన మేధస్సు, ఆత్మావలోకనం కలిగిన పవిత్ర వ్యక్తులు ఈ అర్థాన్ని గ్రహించగలుగుతారు. ఈ నిష్కల్మషత్వం, ఈ ఆత్మ అందరిలోనూ ఉన్నది. అయితే ఇది అందరికి కనపడదు. నిశితమైన మేధస్సుకల వారికే బోధపడుతుంది.

ఉపనిషత్తుల నుండి, భగవద్గీత నుండి కొన్ని శ్లోకాలను ఉదాహరించి, ఈ దైవత్వం అంటే ఏమిటో మీకు వివరిస్తాను. శ్వేతాశ్వేతర ఉపనిషత్తులో ఆత్మస్వభావం ఈ క్రింది విధంగా చెప్పబడ్డది.

*ఏకోదేవః సర్వ భూతే షురాఢ ః*
*సర్వవ్యాపీ సర్వభూతాంతరాత్మా*
*కర్మాధ్యక్షః సర్వభూతాధివాసః*
*సాక్షీభూతో కేవలో నిర్గుణన్య*

అనగా అందరిలోను ద్వంద్వరహిత దైవశక్తి, అద్వితీయశక్తి నిక్షిప్తమై ఉంది. ఇది సర్వవ్యాపి అన్ని భూతాలలోను అంతర్గతమైనది. కార్యాచరణకు చోదకశక్తి అందరిలోనూ ఉంది. అతడు సాక్షీభూతుడు అఖండుడు, క్రియాశీలి, నిర్గుణుడు. సత్య, రాజస్తమో గుణాలు ఏవీలేనివాడు.

ఇది గొప్ప ఆవిష్కరణ, విశ్వవ్యాపితమైన మహాశక్తి భావము. ఒకే సత్యమై ఉండి కూడా వేర్వేరు రూపాలను ధరిస్తూ ఉంటుంది. శ్రీకృష్ణుడు భగవద్గీతలో ఇదే సత్యాన్ని ఈ విధంగా తెలియజేస్తాడు.

*అవిభక్తంచభూతేషు*
*విభ్యాతమివ చాస్తితం,*
*భూతభూతశ్చ అజ్ఞేయం*
*గ్రసిష్ణు ప్రభవిష్ణుచా*

"ఈ పరబ్రహ్మను తెలుసుకోటానికే భక్తులందరూ యత్నిస్తుంటారు. ఇది అఖండమైన శక్తి కాని అందరిలోనూ వేర్వేరుగా, విభజితమైనట్లు కన్పిస్తు ఉంటాది. అన్ని భూతాలను సృష్టించేవాడు, పోషించేవాడు ఇతడే. సంహారకర్త ఇతడే.

## సర్వమానవ సమగ్ర
## అభివృద్ధి దృష్ట్యా వేదాంతం

సర్వమానవ సమగ్ర అభివృద్ధి దృష్ట్యా వేదాంత శాస్త్రాన్ని వివరించిన మొట్టమొదటివ్యక్తి స్వామి వివేకానంద. ప్రతి వ్యక్తిలోను ఉండే ఈ దైవస్వభావాన్ని గ్రహించటంద్వారానే, మానవాళి, అభివృద్ధి ఆధారపడి ఉంది. మతం విద్య యొక్క మూలలక్ష్యమని వివేకానంద ఎప్పుడూ చెబుతూ ఉండేవాడు. అతడెన్నడూ, ఆచారాలు, పిడి సూత్రాలు కలిగిన మతాన్ని బోధించలేదు. వ్యక్తిగత దైవత్వాన్ని ఆరాధించలేదు. మానవత్వంతో కూడిన మతాన్ని అతడు ప్రచారం చేశాడు. ఇది మానవునిలోని ఆంతర్గత దైవత్వాన్ని బహిర్గతంచేసే సాధన. 1894లో అమెరికా నుండి తన తోటి శిష్యులకొక లేక రాస్తూ వివేకానంద ఇలా అన్నాడు "మీరు ఏదైనా మంచి పని చేయాలనుకుంటే, మీ మతాచారలన్నీ విసర్జించండి, సజీవమైన దైవత్వాన్ని, మానవునిలో ఉన్న దైవత్వాన్ని ఆరాధించండి. మానవ ఆకారంలో ఉన్న వాడే ఈశ్వరుడు. అది ఈశ్వరుని సాధారణ రూపం, వైయక్తికరూపము. ఈశ్వరుని విశ్వవ్యాపిత రూపం అంటే ఈ ప్రపంచం. దానిని పూజించటమంటే, ప్రపంచానికి సేవచేయటమే. ఇదే నిజమైనసేవ. మంత్రతంత్రాలు, ఆచారాలు కావు".

ఇదే వివేకానందుని మత మానవత్వం ఆత్మ సర్వవ్యాపితం అనే అవగాహనపై ఈ మానవత్వం ఆధారపడి ఉంది. ఇంతటి

---

స్వామీ వివేకానంద లేఖలు 109వ పేజీ

గొప్ప వేదాంత దర్శనం లభించికూడా భారతదేశం, సంపూర్ణ మానవ వికాసాన్ని సాధించటంలో విఫలమైంది. ఈ విషయాన్ని స్వామీజీ గ్రహించాడు. అసమానతలపట్ల తన బాధను వ్యక్తం చేశాడు. ఆల సింగపెరుమాళ్‌కు స్వామీజీ ఇలా రాసాడు.

"హిందూమతం వలె, ఏ మతం కూడా మానవుని ఔన్నత్యాన్ని గురించి బోధించదు. హిందూమతంవలె, తన పేద ప్రజల పైన దళితులపైన స్వారీ చేసే మతమూ మరొకటి లేదు. ఇది హిందూమతంలోని లోపం కాదు. హిందూ మతంలోని సాధువులు, మోసకారులు ఇందుకు కారణం. పారమార్థిక, వ్యావహారిక అంటూ, హింసామార్గాలను అమలు జరిపే మోసకారులు హిందూమతంలో ఉన్నారు"

కనుకనే స్వామిజీ వేదాంత మార్గాన్ని అనుసరించమని మనందరికి బోధిస్తున్నాడు. శ్వేతాశ్వతర ఉపనిషత్తులోని రుషి అందరి మానవులలోని దైవత్వాన్ని ఈ క్రింది విధంగా బోధిస్తున్నాడు :

*త్వంస్త్రీ త్వం పుమాంశ్చ*
*త్వం కుమారః అధవాకుమారీ*
*త్వం వృద్ధో దండేన వీచాపి,*
*త్వం జాతోభవసి విశ్వతోముఖః"*

*(శ్వేతాశ్వతర ఉపనిషత్)*

నీవే స్త్రీవి, నీవే పురుషుడివి, నీవే యువకుడవు, నీవే కన్యవు, నీవే కర్రబట్టుకు నడిచే వృద్ధుడివి, నీవే అన్ని రూపాలలోను కనిపిస్తున్నావు.

ఈ విధంగా వేదాంతం మన దృష్టిని ప్రకాశవంతంచేసి ప్రపంచాన్ని ఆత్మజ్ఞానాన్ని గ్రహించటానికి తోడ్పడుతుంది. అప్పుడు అన్ని విభేదాలు తొలగిపోతాయి విశ్వవ్యాపిత మతం దిశగా మనం పురోగమిస్తాం. చికాగోలోని ప్రపంచమతాల మహాసభలో చారిత్రాత్మక ప్రసంగంచేస్తూ స్వామీ వివేకానంద ఇలా అన్నాడు :

## విశ్వవ్యాపిత మతం అంటే...

"విశ్వవ్యాపిత మతం అంటూ లేక విశ్వమతం అంటూ ఏదైనా ఉంటే, అది ఏదో ఒక ప్రాంతానికి పరిమితమైంది కాకూడదు. ఈశ్వరునిలాగానే అనంతమైనది కావాలి. ఈశ్వరుని బోధించేదిగా ఉండాలి. కృష్ణ అనుయాయులను, క్రీస్తు అనుయాయులను కూడా ఉత్తేజపరచేదిగా ఉండాలి. పుణ్యాత్ములను, పాపాత్ములనుకూడా ప్రభావితం చేయాలి. బ్రాహ్మణ, బౌద్ధ, క్రైస్తవ, ముస్లిం మతం ఏదీ కాకూడదు. వీటన్నిటియొక్క సమాహారంగా ఉండాలి. అయినప్పటికి అనంతమైన అభివృద్ధికి అందులో అవకాశం ఉండాలి. తన విశాల దృష్టిలో అనంతమైన బాహువులద్వారా ప్రతిమానవునికి అందులో స్థానం ఉండాలి. పశుస్థాయిలోఉన్న అత్యంత హీనుడైన ఆటవికుని దగ్గరనుండి, తన హృదయం, మేథస్సుయొక్క ప్రతిభద్వారా ఉత్కృష్ణత స్థానం ఆక్రమించిన వ్యక్తివరకు ప్రభావితం చేసేదిగా ఉండాలి. మానవ సమాజానికి అతీతమైనదిగా ఉండాలి. దానిని చూసి మానవ ప్రకృతి దిగ్భ్రాంతి చెందేదిగా ఉండాలి. అలాంటి మతంలో నిర్బంధానికి, హింసకు తావు వుండదు. ప్రతి పురుషునిలోనూ, స్త్రీలోనూ ఉండే మానవత్వాన్ని గుర్తించేదిగా ఉండాలి. ఆ మతంయొక్క మొత్తం లక్ష్యం, మొత్తం శక్తి, మానవాళి తనలో నిక్షిప్తమై ఉన్న దైవాంశను గుర్తింపచేసేదిగా ఉండాలి."

స్నేహితులారా, మన మతంయొక్క, తత్వ శాస్త్రం యొక్క మూల సూత్రాను మీకు వివరించాను. ఇది జీవితాన్ని పరిపుష్టం చేస్తుంది. మానవుడ్ని సమగ్రపరుస్తుంది; మన అఖండ శాశ్వత విజ్ఞానానికి మూలకందం. మనం దీనిని అంగీకరించాలి. మన సామాజిక, సాంస్కృతిక జీవనాన్ని రక్షించుకోవాలి. పాశ్చాత్య దేశాల భౌతికవాద సంస్కృతి నుండి మనం జ్ఞానాన్ని అపేక్షించటం దురదృష్టకరం. మన ఋషులు పూర్వీకులు ఇంతటి విజ్ఞానాన్ని మనకు ఇచ్చి వెళ్ళారు.

మతాన్ని గురించి నా అభిప్రాయాలను తెలియజెప్పే అవకాశం ఇచ్చినందుకు, మీ అందరకీ ధన్యవాదాలు.

***ఓం, శాంతిః, శాంతిః***

# విహంగ వీక్షణలో హిందూమతం

–డాక్టర్ మాడభూషి భావనాచార్యులు

"హిందూ మతం" అనే పేరు మన మూల గ్రంథాలలో గానీ – ప్రస్థానత్రయంలోగాని లేదు. క్రీ పూ॥ రెండవ శతాబ్దిలో గ్రీకులు ప్రపంచాన్ని నాలుగు భాగాలుగా విభజించి, సింధు నదీ తీరవాసుల్ని సింధీయులు అన్నారు. "సి" కి "హి"కీ వారికి అబేధమవుటచే మనల్ని హిందువులనీ – మన మతం హిందూ మత మని పిలిచారు. నిజానికి మనమతం వేద విహితమైన వైదిక మతం – లేక – సనాతన మతం – లేక మానవ మతం. "సనా" అవ్యయం నైరంతర్యార్థకం. అనగా నిత్యమైనదీ శాశ్వతమైనదీ అని అర్థం. సనా + అస్తీతి సనాతనః = శాశ్వతమైనది. ఇది నిత్యప్రవాహశీలీ – పరిణామ శీలీ (భారతం నీలకంఠీయం) ఋగ్వేద ప్రోక్తమైన ఆదిమనువు (మను ధర్మశాస్త్ర కారుడు కాదు) ప్రవాచాత్మకమైనది మానవ ధర్మం. మను వంటే యోచన, బుద్ధి (అమరం).

## ప్రాజగ్ వేదయుగం

వేదాలు భారతీయ సంస్కృతికి ముఖ్యభూమికలు. కాని వేదయుగ ఆవిర్భావానికి పూర్వమే భారత దేశంలో పూరాతన మత భావన వుండేది. ఆనాడు భారతదేశంలో ఆరు జాతులుండేవి. ఇవి భారతదేశంలో వ్యవసాయానికి – మతాభినివేశానికీ ఎంతగానో కృషి చేశాయి. ఈ మత భావనలు కొన్ని వేదాలలో చోటు చేసుకొన్నాయి కూడా. ఆ జాతులలో 1) నీగ్రిటోలు, 2) ప్రోటో ఆస్ట్రలోయిడ్స్, 3) మంగోలోయిడ్స్, 4) పాలియోమెడిటేరియన్స్, 5) ఆల్ఫినోడ్స్-డైనరిక్-ఆర్మినోయిడ్, 6) నోరిడినులు యింకా కొంత మంది వుండేవారు. వీరందరిలోకీ ప్రోటో ఆస్ట్రలాయిడ్స్ భారత సీమకు చేసిన సేవలు విశిష్టమైనవి. ఈ జాతులన్నీ సంచార నాగరికత – పల్లె పట్టుజీవితం. నీగ్రాటోలకు ఆహార సంచయమేగాని ఆహారోత్పత్తి తెలియదు. ఈ తెగల సంప్రదాయులు అస్సాంలోని నాగాలలోనూ, కొచ్చిన్ వద్ద పలియన్‌లలోనూ, తిరువాన్ కూరు పర్వతశ్రేణులలోనూ అండమాన్ నికోబార్ దీవులలోనూ గోచరిస్తారు. అయితే వీరికి ఒక ప్రత్యేక మతం వుంది. మర్రి చెట్టును ఆలింగనం చేసుకొంటే సంతాన ప్రాప్తి కలుగుతుందనీ, భూతప్రేత పిశాచాల బారి నుండి రక్షించుకొనేందుకు ప్రక్రియలున్నాయనీ విశ్వసించి, అనుసరించేవారు.

ఇక, ప్రోటో ఆస్ట్రలాయిడ్స్ అవశేషాలు కోల్-ముండా జాతులలో కనిపిస్తాయి. అలాగే అస్సాం – నికోబార్ మోన్ ఖమీర్ జాతులలో కూడ భారత దేశంలో మట్టితో కుండలు తయారు చేయడానికి వీరే ఆద్యులు. ఇది నాగరికతాభివృద్ధికి తొలి మెట్టు. అలాగే రొద్దాలికంతో వ్యవసాయం చేసే కృషికి వీరే ప్రారంభకులు. లక్ష్యాన్ని ఛేదించి తిరిగి వెనకకు వచ్చే "భూంరాంగ్" ఆయుధాన్ని కనిపెట్టారు. రాతి గొడ్డలి కూడా వీరి ఆయుధం. "వ్రీహి" అంటే ధాన్యం వీరి భాషలో తినుటకు "జోమ్" దాని నుండే "వరి" పదం వచ్చింది. అరటి పండుకు కదలీఫలం-కొబ్బరికి నారికేళం – తమల పాకులకు తాంబూలం – నిమ్మకు నింబు – ఆపిల్‌కు జంబూ ఫలం – ప్రత్తికి కారపాస – కోడికి కుక్కుటం గంట అంటే నది వంటి అనేక పేర్లు వీరిభాష నుండే వచ్చాయి. నూలు వడకడం బట్టలు నేయడం చేసేవారు. చెరుకు నుండి చక్కెరను తయారు చేసేవారు. ఏనుగులనూ, ఆవులనూ-మచ్చిక చేసుకొనేవారు. వైవాహిక వ్యవస్థ – అందుకు మంత్రాలూ వుండేవి. వీరి మతంలో ఇంద్రజాల – మాయాజాల ప్రక్రియలుండేవి. భారత దేశంలో నేటికీ బలిష్టంగా వున్న పునర్జన్మసిద్ధాంతం వీరితోనే ప్రారంభమయింది. దృష్టి దోషంపై నమ్మకం వుంది.సృష్టి, స్థితి, ప్రళయాల కథలనూ-గాథలనూ- కల్పనలను విశ్వసించేవారు. పండగల్లో వివాహాలలో పసుపు కుంకుమలను వాడేవారు. శివునీ-లింగాన్నీ పూజించేవారు. మత్యకూర్మాలను భగవంతునిగా భజించేవారు. రజస్వల సమయంలో స్త్రీ భూమిపై దొర్లితే ఆ భూమి బాగా పంట పండుతుందను కొనే వారు. చంద్రగమనం పై ఆధారపడి తిధులను నిర్ణయించే వారు.

ఆర్యులు ప్రప్రథమంగా వీరిని కలిసినప్పుడు వీరిని నిషాదులని పిలచేవారు. ఈ ప్రోటో ఆస్ట్రలాయిడ్సే భారతీయ ఆదిమ నాగరికతకూ వ్యవసాయానికి ఎంతగానో తోడ్పడ్డారు. ఇక యితర జాతుల తోడ్పాటు అంతంత మాత్రమే.

ఈ జాతుల వివరాలు ఆర్కిలాజికల్ స్టడీస్ ద్వార బయట పడ్డాయి. భారత నాగరికత సుమర్ – అక్కడే – బాబిలోన్ – ఈజిప్టు – అస్సీరియా నాగరికతలకు మించినదని మొహంజొదారో హరప్పాత్రవ్వకాలు రుజువుచేశాయి. ఈ యిండస్ వేలీ నాగరికత పురాతన నాగరికతలలో అత్యుత్తమమైనదని త్రవ్వకాలు – అక్కడ దొరికిన సామాగ్రీ చెబుతోంది. ఆ నాగరికతలో గృహనిర్మాణం-రోడ్లూ-డ్రైన్సు-వగైరాలు నేటి మన పట్టణాలలో కూడా లేవని చెప్పాలి. ఇండస్‌వేలీ మతాన్ని గూర్చి వివేచనలో ఆవివరాలు అప్రస్తుతం.

మొహంజొదారో హరప్పా త్రవ్వకాలలో బయటపడిన సీల్సు -బొమ్మలూ-శిలా విగ్రహాలే మత వివరణకు ఆధారాలు. శక్తి ఆరాధన వుండేది. మదర్‌గాడెస్‌ను పూజించేవారు. ఆమెను సర్వ ఆభరణాలతోనూ అలంకరించేవారు. పురుష దేవతలలో త్రిముఖ మూర్తి. ఆయన సింహాసనంపై యోగ నిష్టలో ఆశీనుడై వుంటాడు. ఆ సింహాసనం చుట్టూ ఏనుగులూ పెద్దపులులూ-దున్నలు ఖడ్గమృగాలూ వున్నాయి.

అలాగే శివతాండవం వుంది. ఆయన త్రిముఖ పరమ శివుడూ-పశుపతీ-యోగీశ్వరుడూ-నృత్యకళా కోవిదుడూ అన్నారు శాస్త్రజ్ఞులు. శివవిగ్రహారాధనేకాక, లింగారాధన కూడా వుంది. ఈ లింగారాధన సంతాన ప్రాప్తికోసం అని శాస్త్రజ్ఞులు భావించారు. వీరు వృక్షాలనూ - పశువులనూ - అగ్నినీ - నీటినీ ఆరాధించారు. నాగదేవతారాధన వున్నట్లు తలపై పడగ విప్పిన పాము చిత్తరువు నిరూపిస్తూంది. స్వస్తిక్ చిహ్నాన్ని పవిత్రంగా భావించేవారు. ఈ మతాచారాల అవశేషాలు నేటికీ కొన్ని వున్నాయి. రేడియో కార్బన్ డేటింగ్ ప్రకారం యీ నాగరికత క్రీ॥ పూ॥ 3500 సంవత్సరాల క్రితానిదని చెపుతున్నారు. మహెన్‌జోదారో మృత కళేబరాల విశ్లేషణ ద్వారా వీరు ద్రవిడియనుల-రున్నీల - అసురుల-వ్రాత్యుల-దాసుల - నాగుల - ఆర్యుల వంటి అనేక జాతుల సమ్మిశ్రమమని తేలింది.

## వైదికయుగం

భారత చరిత్రలో వైదిక నాగరికత విశిష్టమైంది. వేదసంహితలు మూడు వేదత్రయం తరువాత నాలుగు అయాయి. ఇవి ఒక ఋషిచే గానీ - ఒకే కాలంలో గానీ - ఒకే ఛందస్సులోగానీ సమకూర్చబడలేదు. అతిపురాతన పత్రం ఋగ్వేదం. 460 మంది ఋషులు యిందులోని సూక్తాలకు ద్రష్టలు. అందులో 63గ్గురు స్త్రీలు . వేదాలు అపౌరుషేయాలు. ఇది అనేక అర్థాలకు గురి అయింది. ఇవి పురుషకారాలు కావు. అందుచే దైవ కృతాలు అన్నారు. కాదు బహు ఋషి ప్రోక్తాలవుటచే అపౌరుషేయాలు అన్నారు కొందరు. వేదాలు ప్రకృతి శక్తులను దైవీకరించుటచే Objective Phenomena అపౌరుషేయాలు-ఉపనిషత్తులు వ్యక్తి-ఆత్మ వివేచన చేయుటచే పౌరుషేయాలని శ్రీ కె.ఎం.మున్షీ పండితుడన్నాడు.

## వేదకాల నిర్ణయం

జర్మన్ సంస్కృత మహాపండితుడు మాక్స్‌ముల్లర్ వేదాలలోని భాషనుబట్టి అవి క్రీ. పూ. 1200 సం॥లు అనీ విట్నీ పండితుడు క్రీ. పూ. 1200 నుండి 1500 అనీ, తిలక్, డాంగే, జాకోబ్ పండితులు క్రీ. పూ. 4000 సం॥ క్రితం అని వేదకాలాన్ని నిశ్చయించారు.

## వేదాలు కేవలం ఆర్యుల నాగరికతా?

వేదాలు ఆర్యులచే సమకూర్చబడ్డాయి అనే అపప్రధ ఉంది. వేదాలలో ఆర్య అనార్య సంస్కారాలు ఎన్నో గోచరిస్తాయి. వైదిక రాజుల పేర్లు సుదాసు, దివోదాసు అనార్య నామాలే దాసు అనే శబ్దం అనార్య శబ్దం అని సుప్రసిద్ధ పరిశోధకులు కీ.శే. బట్టిప్రోలు హనుమంతరావుగారు వ్రాక్కుచ్చారు. హరప్పన్ నాగరికతలోని అనేక మతైక విషయాలు వేదాలలో గోచరిస్తాయి. శివుడు, రుద్రుడు-విఘ్నేశ్వరుడు, నంది వగైరా ఆర్యేతర దేవతలను వేద సూక్తాలు ప్రస్తుతించాయి. ఈ విషయంలో ప్రఖ్యాత పురాతత్వశాస్త్రవేత్తలు పరిశోధనలు పూర్తిగా వివరిస్తున్నాయి.

శ్రీ జగత్పతి జోషి, భారత ప్రభుత్వ పురాతత్వశాఖ డైరెక్టరు, యితర శాస్త్రవేత్తలూ పంజాబ్, హరియానాలలో జరిపిన త్రవ్వకాలలో కొన్ని వినూత్న అంశాలు బయటపడ్డాయి. వాటిని యధాతథంగా యిక్కడ పొందుపరుస్తున్నాను.

The archaeological studies conducted by Indian Scientists (expeditions led by Prof. J.P. Joshi, Now Director General of Department of Archaeological Servey of India) in Punjab and Haryana have raised the question of mutual relationship between the people of Harappan Civilisation and Indo Aryan tribes in a new way and have indicated the point of interaction and subsequent cooxistance of the late Harappan culture with the "Culture of gray painted ceramics" which may scientists indentify with the Indo Aryan tribes of the epoch of the Rigiveda. Excavations revealed that Indo Aryan tribes had established contacts with Harappan population on the Eastern periphery of the Harappan Civilisation and that they had inherited certain features of their material culture from the Harappans.

(Sovit Land Jan 1981–2)

అందుచే వేదాలు గానీ, వేద సంస్కృతి గానీ భారతదేశంలో ఉన్న అన్ని జాతుల సమారాధనే! ఋగ్వేదంలో ఈశ్వరవాదం మొదలు నిరీశ్వరవాదం వరకూ ఎన్నో సూక్తాలు ఉన్నాయి. నాసదీయ సూక్తం చార్వాకులకు బౌద్ధులకూ ఆలంబనమైంది. ఇంద్రుడు, అగ్ని, సవిత, ఆకాశం, వాయువు, వంటి 33గురు దేవతల్ని ప్రస్తుతిస్తూ అనేక సూక్తాలున్నాయి. వివిధ దేవతల్ని ఆరాధించినా, సత్యం ఒకటే, జ్ఞాన సంపన్నులు అనేక పేర్లతో పిలుస్తారు అంది ఋగ్వేదం.

" ఇంద్రం మిత్రం వరుణం అగ్నిం ఆహుః
రధోదివ్యః ససుపర్ణా గరుత్మాన్
ఏకం సత్ విప్రాః బహుధావదంతి
అగ్నిం యమం మాత 'రిశ్వానం ఆహుః ।

(ఋగ్వే 1 - 164 - 46)

ఈ సూక్తాన్ని ప్రస్తుతిస్తూ స్వామి వివేకానంద యిలా అన్నాడు. "It is a grand explanation, one that has given that theme to all the subsequent thought in India and that will be the theme of the whole world of Religion " వేదాలలో అహింసా సూత్రం ఉన్నా, హింసతో కూడిన యజ్ఞ యాగాదిక్రతువులూ - జ్ఞాన సూక్తాలూ ఉన్నాయి ఇందులో మతసూక్తాలూ, తాత్విక సూక్తాలూ - సెక్యులర్ సూక్తాలు ఉన్నాయి. సెక్యులర్

సూక్తాలలో ద్యూత సూక్తం, యమయమి సంవాదం - వైవాహిక మంత్రాలు చెప్పవచ్చు. ఋగ్వేద అధిష్ఠాన దేవత ఇంద్రునికి 250 సూక్తాలు - అగ్నికి 200 సూక్తాలు, సోమునికి 100, పర్జన్యునికి 3, యమకు 3, వేదాలలో యముడు భయం కరుడు బాధాకరుడూకాదు. పితృదేవతలకు ఆతిధ్యమిచ్చి ఆహ్వానించే మహాపురుషుడు ప్రాఙ్గ్ వైదిక యుగ విశ్వాసమైన పునర్జన్మం వేదాలలో లేదు. సూక్తాలూ - యజ్ఞాలూ దేవతలకు హవిస్సులను పొగడ్తలనూ సమర్పించి, మాకు గోవులనూ, సంపదలను యివ్వమని, శత్రువుల నుండి రక్షించ మని కోరడం. ఇవి యిచ్చి పుచ్చుకునేవే! ద్యూత సూక్తంలో జూదగాడు ద్యూతం వల్ల అవమానాలను పొంద కంటే పొలం పోయి వ్యవసాయం చేసుకోవడం మిన్న అని ఆక్రోశిస్తాడు. ఋగ్వేద వైదిక ఋషులు సమత్వ భావనలకూ సమిష్టి జీవిత విధానాలకు తమ సూక్తాల ద్వారా ఆమోదం తెలిపారు. "సంగచ్ఛధ్వం - సంవదధ్వం -సంవోమానాంసిజానతాం- అందరం కలసినడుచు కొందాం. అందరం కలసి మాట్లాడు కుందాం. అందరం కలసి మెలసి జీవిద్దాం. యీ కాలంలోనే గొడ్డాళికం వ్యవసాయంలో అంతరించి, నాగలి ప్రవేశించింది. వ్యవసాయం - దానికి అనుబంధ వృత్తులూ అవసరమ య్యాయి. కాలక్రమంలో ఋగ్వేదంలో పురుషసూక్తం ఆవిర్భ వించింది. వేదాలకు అనేక భాష్యాలు అవసరమయాయి. 13వ శతాబ్దపు శాయనాచార్యులు పురుషసూక్తానికి భాష్యం రాస్తూ, బ్రహ్మముఖం నుండి బ్రాహ్మలు, భుజాలనుండి క్షత్రియులూ, తొడల నుండి వైశ్యులూ, పాదాల నుండి శూద్రులు పుట్టారని అన్నాడు. దీనిని స్వామి దయానంద సరస్వతి తీవ్రంగా నిరసించాడు. సాయనాచార్యుల తప్పుడు భాష్యం అన్నాడు. ప్రశ్న సూక్తంలో గాని, సమాధాన సూక్తంలో గాని లేని దానిని భాష్యంలో చొప్పించాడన్నాడు.

ముఖం కిమస్య కౌబాహూ కావూరూ పదావుచ్యేతే ఆవిరాట్ పురుషుని ముఖం ఏమి? బాహువులేమిటి, తొడలేమిటి, పాదాలు ఏమని చెప్పబడ్డాయి?

బ్రాహ్మణోస్య ముఖ మాసీద్ బాహూరాజన్య కృతః
ఊరూ తదస్యయద్వైశ్యః పద్భ్యాం శూద్రో అజాయత॥

సమాజాన్నంతనూ ఒక పెద్దవ్యక్తిగా పోల్చారు. ఆవిరాట్ ముఖం బ్రాహ్మణుడయ్యెను. బాహులు రాజులు తొడలు వైశ్యుడు. పాదములు శూద్రులుగా వికసించెను. వేద భాష్యా లకు సమగ్రత సక్రమతలేదని స్వామి అరవింద అన్నాడు. కోల్‌బ్రాక్ "సవితాగోః" అంటే సూర్యుని ఆవులన్నాడు. గోః శబ్దానికి అమరం ప్రకారం పది అర్థాలు. అందులో కిరణం ఒక అర్థం. అందుచే సూర్యకిరణాలు అని చెప్పాలని, అరవింద అన్నాడు.

వేదాలు పవిత్రగ్రంథాలని చెబుతూ, వాటి అర్థాలనేకాక, శబ్దాలనూ సూక్తాలనూ కూడ తమ వర్గ ప్రయోజనాలకు మార్చిపారేశారు. స్మశాన సూక్తం 10-18-7 ఋగ్వేదంలో

"ఇమాశారీరవిధవా సపత్నీ రజంశేన
సర్పిషాసందిశన్తు
అనశ్వరోదనమీదా, సురత్నా ఆరోహన్తు
జనయో అగ్రే.

వైధవ్యరహిత అయిన యీ స్త్రీ, ఘృత, కృత కాటుకనుపెట్టుకొని, అశ్రురహిత అయి, ఖేదరాహిత్యంతో మొదట గృహాన్ముఖురాలవాలి!

ఆ సూక్త తరువాత సూక్తం 10-18-8 లో యిలా ఉంది.

"ఉదీర్ష్వనార్యభి జీవలోకం గతాసు
మేత ముపశేషిహి
హస్తగ్రాభస్యదిధిషోస్తవేతం పత్యుర్జని
త్వమమభిసంబభూథ॥

హేవనితా! లే. నీ నిద్రాభాగుడు యిప్పుడు ప్రాణరహి తుడు. జీవలోకంలోని, నీజబ్బ పట్టుకొని వెళ్ళే మరదితో జీవించు. వేదకాలంలో అన్నచనిపోతే, మరిది వదినను వివాహం చేసుకునే ఆచారం ఉంది. దీనిని దేవర న్యాయం" అంటారు.

నేటికీ యీ ఆచారం మధ్యప్రదేశ్‌లో భోల్ తెగలోఉంది. రామాయణంలో రాముడు మాయలేడి కోసం వెళ్ళి, మాయాఆర్తనాదంతో మనస్సు కలవరపడిన సీతలక్ష్మణున్ని అన్నసాయంకోసం వెళ్లమంటుంది. లక్ష్మణుడు తిరస్క రిస్తాడు." మీ అన్న చనిపోతే, నువ్వు నన్ను వివాహమాడాల నే దుష్టచింతనలో ఉన్నావు" అని నిందిస్తుంది.

అగ్రే' అని వుంది. 14వ శతాబ్దపు వేద పండితుడు రఘునందనుడు అగ్రే అన్న పదాన్ని 'అగ్నే' అని మార్చాడు. దానితో సతివైదికాచారమని ప్రచలితం చేశారు. దీనిని మహామహోపాధ్యాయ పాండురంగ వామనకానే తీవ్రంగా ఖండిస్తూ, ఇది ఫోర్జరీ అన్నాడు. సతి వైదిక సంప్రదాయమైతే, దానికి మంత్రక్రియలుండే వని, అట్టివి ఏ కోశాన లేవని చెప్పాడు. వేద ప్రమాణాలను అంగీకరించేందుకు మత కర్తలు ధార్మిక కర్తలూ కొన్నింటిని వక్రీకరించారు.

వేదాలలోని అనేక దేవతారాధన ఉపనిషత్కాలం వరకూ సాగింది. వేదాంత దృష్టి ప్రబలి ఏకోపాసన ప్రబలింది.

## బౌద్ధం – దాని ప్రభావం

భారతదేశంలో గణతంత్ర ప్రజాస్వామ్యం కూలిపోయింది. యజ్ఞాలపేరుతో హింస పెరిగిపోయింది. పశుబలుల వల్ల వ్యవసాయం కుంటుబడుతోంది. తత్ఫలితంగా యితర వృత్తులూ భంగపడుతున్నాయి. యీ విషాద చిత్రణ మధ్య బౌద్ధం అవతరించింది. బౌద్ధం భారతీయ సంస్కృతిని దేశం లోనే కాక, ప్రపంచ వ్యాప్తంగా వ్యాప్తిచేసింది. బుద్ధుని బోధన లను అతి క్లుప్తంగా చెప్పాలంటే :-

బుద్ధం శరణం గచ్ఛామి, సంఘం శరణం గచ్ఛామి ధర్మం శరణం గచ్ఛామి. ధర్మం అంటే బహుజన హితాయ - బహు జన సుఖాయ. బుద్ధం = హేతువును, శరణం = శరణుకు గచ్ఛామి వచ్చాను. సంఘం = సమూహం, హేతువాద సమా జం శరణం = శరణం గచ్ఛామి = మా సంఘానికి సమాజానికీ ధర్మం వుండాలి. ధర్మం అంటే ఏమిటి? అది ఎక్కువ మందికి అర్థమైంది. సుఖ ప్రదమైందే ధర్మం. యిలాంటి సమాజం

కొరకు బుద్ధుడు కృషి చేశాడు. ఆనాటి మూఢాచారాలను తొలగించడంలో, నూతన చైతన్యాన్ని కలిగించడం బుద్ధుడు చాలా వరకు కృతకృత్యుడయ్యాడు. బౌద్ధం కాలక్రమంలో 18 శాఖలుగా చీలిపోయింది.

## అథోగతి – అణచివేత

వేదకాలంలో వృత్తిపరంగా ఏర్పడిన కులాలు సూత్రకారుల కాలం పుట్టుకతో కులాలుగా మారాయి. కులధర్మాలు, కుల సంస్కృతుల నూరిపోశారు. స్త్రీలూ – శూద్రులు వేదాధ్యయనానికి అనర్హులన్నారు. అసలు వీరు వేదాలను వినడమే మహాపాతకం అన్నారు. పుష్యమిత్రుడు అధికారంలోకి వచ్చి వైదిక ధర్మపునరుద్ధరణ చేశాడు. అస్పృశ్యులు అనే పదం 'విష్ణుధర్మశాస్త్రం'లోనే ఉంది.ఈ అస్పృశ్యులు ఎవరో కాదు. వైదికధర్మ పునరుద్ధరణను వ్యతిరేకించిన బౌద్ధులు, వీరిని చెల్లా చెదుగా చెదరకొట్టారు. కొంతమంది కొన్ని పల్లెలకు మరికొంత మంది యితర పల్లెలకూ, భీతచిత్తులై పారిపోయారు. అక్కడ కూడా వీరిని ఊరు బయట ఉంచి, నిప్పు, నీరు వీరికి యివ్వడం మహాపాపమని, వీరిని ముట్టుకొన్న వారు సచేల స్నానం చేయాలని వైదికాచారులు ఆంక్షలు విధించారు. అస్పృశ్యుల్ని, స్త్రీలనూ అణగతొక్కడంలో అత్యంత క్రూరంగా వ్యవహరించారు. ఇది యీ నాటికీ మానవావళికి తీరని కళకంగా ఉంది. రామానుజాచార్యులు, రాజారామ్మోహన్‌రాయ్, గాంధీ మహాత్ముడు అస్పృస్యతా నివారణకు ఎంతగానో కృషి చేశారు. కుల సంస్కృతి పట్టి పీడిస్తున్న హిందూ సమాజం దీని నుండి యింకా తెప్పరిల్లలేదు.

## జాతీయ సమైక్యతాకరుడు శంకరుడు

క్రీ.శ.1 లేక 2 శతాబ్దాలలో మహాయాన బౌద్ధ మతాన్ని నాగార్జునుడు ప్రచలితం చేశాడు. యీయన శూన్యమే శాశ్వతమైందనీ, తక్కిన ప్రపంచమంతా మిధ్య అని సిద్ధాంతీకరించారు. ఇది అద్వైతానికి చేరువయింది. అందుచే వీరిని "ప్రచ్ఛన్న అద్వైతులు" అని పిలిచేవారు. కాశ్మీర్‌లో శైవాద్వైతం ప్రచారంలో వుంది. క్రీ.శ. 8వ శతాబ్దంలో శంకరుడు తన అద్వైత సిద్ధాంతాన్ని రూపొందించారు. దీనికి వేద సార సముద్ధరణ అన్నాడు. నిజానికి నాగార్జున హేతువాదాన్నీ, కాశ్మీర్ శైవుల అద్వైతాన్ని రంగరించి, ఉపనిషత్ సారంతో అద్వైతాన్ని రూపుదిద్దాడు.

శంకరుని కాలానికి దేశం మత విద్వేషాలతో అట్టుడికి పోతోంది. గౌడపాదుని పూర్వ మీమాంసా - బౌద్ధుల 18 శాఖలూ – శాక్తేయులు, కాపాలికులూ ఇత్యాది 72 మతాలు పరస్పరం కలహాలతో, హింసా దౌర్జన్యాలతో పరస్పరహనన కదన రంగమైంది దేశం. భౌతిక వస్తుజాలం శాశ్వతమైంది కాదనీ – చైతన్య స్వరూపుడె పరమాత్మే శాశ్వతమని ప్రపంచంలో రెండు లేవని, ఒక్కటే ఉన్నది అని ప్రచారం చేశాడు.

శ్లో॥ మృత్పిండ మేకం బహుభాండ రూపం
సువర్ణ మేకం బహుభూషణాని
గోక్షీర మేకం బహు దేహజాతం
ఏకః పరమాత్మ బహుదేహవర్తి

కుండలెన్ని ఉన్నా అందులోని మట్టి ఒకటే. నగలు అనేకమైన బంగారం ఒక్కటే. ఆవులెన్ని అయినా పాలు ఒక్కటే అలాగే అనేక శరీరాలలో ఉండే పరమాత్మ ఒక్కడే!

అనేక జలభాండాలలో అనేక సూర్యులు ప్రతిబింబిస్తారు. కాని సూర్యుడొక్కడే!

అందుచే మత కలహాలను విస్మరించి, ఏ పేరుతో ఉన్నా పరమాత్మ ఒక్కడని, ప్రజలకు పండిత పామరులకును హెచ్చరించాడు.

శంకరుని ఆత్మవిశ్వాసం అనన్యసామాన్యం. తన గురువు గోవిందపాదుని వద్దకు ఉపదేశార్థం వెళ్ళాడు. అందుకు శంకరుడు యిలా సమాధానమిచ్చాడు.

శ్లో॥ మనో బుద్ధ్యహం కార చిత్తాని, నాహం
న శ్రోత్రం నజిహ్వాన చఘ్రాణ నేత్రే
నచవ్యోమ భూమిర్న తేజో నవాయుశ్చి
దానంద రూపశ్శివో ఽ హం శివో ఽ హం

శాంకరదర్శనలో చైతన్యం ఒక్కటే శాశ్వతమైంది. తక్కినవన్నీ మిధ్యారూపాలు. ఛండాలునితో సంవాదమయాక మనీషా పంచనం రాశాడు.

శ్లో॥ జాగ్రత్స్వప్న సుషుప్తి షుట్పుదతరాయా సంవిదుజ్జృంభతే
యాబ్రహ్మాది పిపీలి కాంత తనుషుప్రోతా జగత్సాక్షిణీ
సైవాహం నచదృశ్యవస్త్వితి దృఢ ప్రజ్ఞాపి యస్యాస్తి చేచం
డాలో ఽ స్తు సతుద్విజోస్తు గురు రిత్యే షా మనీషామమ

శరీరంలో నేను అను ఆత్మను వేరుగా తెలుసు కొనుటకు శంకరుడు ప్రబోధించాడు. సర్వావస్థలలోనూ ఉండే చైతన్యం వేరనితెలుసుకోవాలన్నాడు.

శంకరుడు తర్కాన్ని అంగీకరించినా, దానికి పరిధుల్ని ఏర్పరచాడు.

శ్లో॥ వాక్యా ర్థశ్చ విచార్యతాం।
శ్రుతి శిరః పక్షః సమాశ్రితాం।
దుస్తర్కాత్సు విరమ్యతాం
శ్రుతి మతస్తర్కో నుసందీయతాం ।

వేద వేదాంతాలకు అనుకూలమైన తర్కాన్నే చేపట్టాలి!
తద్విరుద్ధతర్కం దుస్తర్కం. దానిని విడిచిపెట్టాలి!

ప్రపంచం సర్వం పరమాత్మ స్వరూపం అన్నాడు కాని వర్ణాశ్రమ వ్యవస్థను సుస్థిరం చేశాడు. కాల క్రమేణా "అద్వైతులొస్తున్నారు, కర్రాబుర్రా జాగ్రత్తపెట్టుకోం"డనే దుర్దశకు దిగజారింది. ఏది ఏమైనా భారత సీమపై జాతీయ సమైక్యతాకరుడు శంకరుడు!

ఆధ్యాత్మిక విద్యా ప్రభావితుని కర్మలాచరించనక్కర్లేదన్నాడు శంకరుడు. కాని తాను ఆధ్యాత్మిక విద్యా ప్రవీణుడై భారతదేశం యావత్తుకాలినడకను 3 సార్లు పర్యటించాడు. 8 మఠాలను దేశ దశ దిశలా స్థాపించాడు. ఆ అల్ప జీవితకాలంలో 300 గ్రంథాలు రచించాడు. శంకరుడు తన అద్వైతాన్ని గూర్చి యిలా అన్నాడు.

శ్లో॥భావాద్వైతం సదాకుర్యాత్.
కుర్యాత్ నతుక్రియాద్వైతం॥

అద్వైతసిద్ధాంతాన్ని భావాత్మక పరిధిలోనే ఆచరించు. అనుష్ఠానం అనగా ఆచరణలో అద్వైతం కూడదు.

12వ శతాబ్దంలో భక్తి ఉద్యమం ప్రారంభమైంది. రామానుజుడు సర్వమానవులూ సమానమని, కుల కట్టుబాట్లను విదళించ యత్నించాడు. హరిజనోద్ధరణకు ఉపక్రమించాడు. ప్రజలంతా స్వర్గానికి వెళ్తుంటే నేను నరకానికి వెళ్ళడం మంచిదే అన్నారు.

శ్లో॥పతిష్య మేకం ఏవ అహంనరకే
సర్వేగచ్ఛన్తి భగవత్గాం కృపయాం పరమం పదం॥

రామానుజుడు యింకా యిలా ఉద్బోధించాడు.

శ్లో॥ విద్యామదోధనమద్ తృతీయోఅభిజనోమద్
ఏతే మదావలిప్తానాం ఏత ఏవ తతాందమాః॥

తా॥ విద్యామదం ధనమదం, అగ్రవర్ణముద్రాలకు వ్యతిరేకంగా పోరాడాలి అన్నాడు రామానుజుడు.

ఆ తరువాత రాజారామ్మోహన్‌రాయ్, సంఘ సంస్కరణలను సతీసహగమన వ్యతిరేకోద్యమాలను సాగించాడు. విగ్రహారాధనను నిరసించి, ఏకేశ్వరోపాసనను ప్రచారం చేశాడు.

18వ శతాబ్దంలో వివేకానందుడు భారత దాస్యశృంఖలాల నుండి జాతి విముక్తికి శంకరుని మేధాశక్తినీ బుద్ధుని హృదయాన్ని సంధానపరచి, దివినుండి వేదాంతాన్ని భువికి తెచ్చాడు. ఆయన ఉపదేశాలు భారతజాతిని పునరుద్దీపింపచేశాయి.

జవహర్‌లాల్ నెహ్రూ హిందూయిజాన్ని గూర్చి తన "డిస్కవరీ ఆఫ్ ఇండియా"లో యిలా అన్నాడు."హిందూమతం విశ్వాసపరంగా అనిశ్చితమైంది. రూప రహితమైంది. ఎవరి స్థాయికి సరిపడిన విశ్వాసాలను వారి వారికి అందిస్తుంది. దీనిని మతం అని నిర్వచించేందుకు వీలులేదు. శిఖరాగ్ర భావనల నుండి నిమ్నభావ సముదాయం వరకు ఎవరి నమ్మకాలను వారికి కల్పిస్తుంది. అందుచేత తరచు పరస్పర విరుద్ధంగా గోచరిస్తాయి. దాని ప్రధానాశయం సర్వమానవాళి సహజీవనం - సహకారం"

గాంధీ మహాత్మునికి వివేకానందుని స్ఫూర్తి ఆలంబనం. మహాత్ముడు హిందూమతాన్ని గూర్చి యిలా అన్నాడు. "హిందూమతానికి స్వయంసంస్కరణ శక్తి ఉంది. వేదకాలంలోని దేవతలు ఇంద్రుడు, వరుణుల స్థానంలో రాముడు కృష్ణుడు వచ్చారు. యజ్ఞయాగక్రతువులూ ప్రార్థన - పూజ - వ్రతాలుగా పరిణామం చెందాయి. యూరోప్‌లో 500 సంవత్సరాల క్రితం ప్రొటెస్టెంటు ఉద్యమం వచ్చింది. మరల మరొకటిలేదు. కాని, హిందూమతం నిత్యపరిణామశీలి, హిందూమతంలో స్వేచ్ఛగా తమ భావనలను చెప్పుకోవచ్చు. హిందూమతం తనలోకి మరొకరు రావాలని కోరదు. మతాంతీకరణను ఒప్పుకోదు. ముస్లిం మంచి ముస్లింగా జీవించాలనీ క్రైస్తవులు మంచి క్రైస్తవులుగా జీవించాలని కోరుతుంది. వారంతా హిందువులవ్వాలని కోరదు. హిందూమతానికి ఒక కేంద్రీకృత అధికార పీఠంగానీ మతంగాని లేదు. ప్రవక్త అంతకన్నాలేడు. అదీ దీనిగొప్పతనం హిందూ మతమంటే అహింసా మార్గంలో సత్యాన్వేషణ భగవంతునిలో నమ్మకం ఉన్నా లేకపోయినా అతను హిందువే! సహజీవనం దాని జీవనథాతువు. విశ్వమహోన్నత భావాలను జీర్ణించుకోవడం వాటిని తనదైన రీతిలో మలచుకోవడం హిందూయిజం విశిష్టత. అందుచేతనే ఎన్ని ఒడుదుడుకులు ఎదురైనా వాటిని ఎదిర్చి నిలబడ గలిగింది.

మానవుడు తనకు కావలసిన దానిని స్వీకరిస్తాడు. అక్కర్లేని దానిని విడిచిపెడతాడు. గతానుగతికత్వం మానవాభ్యుదయానికి ఆటంకం. అందుచే కాళిదాస కవి కులగురువు యిలా అన్నాడు.

శ్లో॥ పురాణ మిత్యేవన సాదుసర్వం
నచాపి కావ్యం నవమిత్యవద్యం
సన్త పరీక్ష్య అన్యతరం భజంతే
మూఢపర ప్రత్యేయనేయ బుద్ధిః ॥

పాతదైనంతమాత్రాన అంతా శిరోధార్యంకాదు. క్రొత్తదైనంతమాత్రాన తిరస్కారార్హమూకాదు. సజ్జనులు గతానుగతత్వాన్ని పరిత్యజించి, విచక్షణాజ్ఞానంతో వీక్షిస్తారు. మూర్ఖుడు యితరుల బుద్ధినే నమ్ముకుంటాడు.

నిజానికి ఇదే మన చారిత్రక విశ్లేషణకు కరదీపిక.

మతం వేరైతేను ఏమోయ్!
మనసు లొకటై మనుషులుంటే
జాత మన్నది లేచి పెరిగి
లోకమున రాణించునోయ్
— మహాకవి గురజాడ

# బౌద్ధం – మాధ్యమికవాదం–వజ్రయానం

– శ్రీ ఏటుకూరు బలరామమూర్తి

గౌతమ బుద్ధుడు క్రీ। పూ। 544 లో మరణించాడు. ఆయన జీవించినది 80 ఏండ్లు. అనగా ఆయన జన్మించినది క్రీపూ। 624 లో.

బౌద్ధతత్వశాస్త్రంలో ఆత్మకు, దేవునికి స్థానంలేదు. శాశ్వత పదార్థమేదీ వుండజాలదనే సూత్రాన్ననుసరించి, గౌతముడు, ఆత్మను, సృష్టికర్తను నిరాకరించాడు.

వర్ణ విభజనను బుద్ధుడు గుర్తించలేదు. సర్వులకు తన ఆరామాలలో స్థానం కల్పించాడు. స్త్రీలకు సైతం అందులో స్థానం వున్నది. జంతు హింసా ప్రధానమైన యజ్ఞయాగాదు లను బుద్ధుడు తీవ్రంగా నిరసించాడు. బుద్ధుని కృషి వల్లనే తత్కాలానికి యజ్ఞయాగాదులు దేశమంతటా కాకపోయినా, బీహార్, బెంగాల్‌లలో అంతరించాయి. సర్వమానవుల పట్ల మాత్రమేగాక, సర్వజీవుల పట్ల ప్రేమ, దయ, కరుణ – బౌద్ధ మత సారం. కరుణా సింధువు అనే పేరు బుద్ధునికి పూర్తిగా అర్థమైన పర్యాయపదం.

బౌద్ధానికి గల ప్రధాన ఆకర్షణలు ఇవి. మార్పుకు సంకేతాలు. వర్ణ వ్యత్యాసాలతో సతమత మౌతున్న హిందూ సమాజంలోని పతితులు, సామాన్యులు, ధనికులు, రాజులు సైతం, ఈ బోధనలపట్ల ఆకర్షితులైనారు. మార్పు, చలనం, పుట్టుక, మరణం, అనివార్యమనే సూత్రాన్ని గౌతముడు తాత్వి కంగా కూడా వ్యాఖ్యానించాడు. తాత్విక చలన శీలతా భావం ఆనాడు మేధావులను ఆకర్షించింది.

అన్నికోణాలనుండి, బౌద్ధం ఒక ప్రశాంత మహా విప్లవం. వాదనా పటిమ, ఆదర్శ జీవితం, సర్వసంగ పరిత్యాగంలాంటి సాత్విక లక్షణాల ద్వారానే బౌద్ధం వ్యాపించింది. క్రమంగా రాజా దరణ, ధనికుల ఆదరణ లభించటంతో, అసంఖ్యాకమైన బౌద్ధ భిక్షు పరివారానికి ఆహార, సదుపాయాల విషయంలో కూడా పెద్ద ఇబ్బందులు ఏర్పడలేదు.

అష్టాంగ మార్గాన్ని బుద్ధుడు తన భిక్షువులచే అతి కఠినంగా అమలు జరిపించాడు. ఆయన జీవించి వున్నంతవరకూ భిక్షు శ్రేణి భరించింది. ఆయన నిర్యాణం చెందిన వెంటనే సుభద్రు డనే భిక్షువు యిలా అన్నాడు. "అమ్మయ్య మా గురువుగారు మరణించారు. బడిపంతులుగా మమ్ములను కఠిన వ్యాయామా లకు గురిచేసేవాడు ఇకలేడు".

ఆయన ముఖ్య శిష్యుడైన మహాకశ్యపునికి ఈ మాట వినిపించింది. బౌద్ధసంఘంలో చీలికలు ఏర్పడవచ్చుననే భయం కలిగింది.

బుద్ధుడు మరణించిన కొద్ది రోజులకే, రాజ గృహంలో మొదటి బౌద్ధ సంగీతి జరిగింది. సంగీతి అంటే సభ. ఆ సభలో బుద్ధుని బోధనలన్నింటినీ గ్రంథస్థం చేయాలను కున్నారు. బుద్ధునికి అంతే వారసులు ఇద్దరు. ఉపాలి, ఆనం దుడు. ఉపాలి, బుద్ధుని నీడలాగా అనుసరించిన అంగరక్షకుడు. ఆనందుడు, ఆయన నోటినుండి వెలువడిన ప్రతి మాటను, ప్రసంగాన్ని విని, మననం చేసుకుంటూ, తిరిగి పునశ్చరణ చేయగలిగిన ధీశాలి.

ఉపాలి సహాయంతో వినయ పిటకాన్ని, ఆనందుని సహా యంతో సుత్త పిటకాన్ని, లేక ధమ్మ పిటకాన్ని భిక్షు సముదా యం ధృవపరిచింది.

వ్యక్తిగత విభేదాలు ఈ సంగీతిలోనే పొడసూపాయి. గౌత ముని అంతేవాసి ఐనందున ఆనందుడు, అతిశయంతో ప్రవర్తి స్తున్నాడనేది మొదటి ఆరోపణ. మహా కశ్యపుడు, కాత్యాయ నుడు, బౌద్ధ సిద్ధాంతంలో దిట్టలు కాని వారెవ్వరూ గౌతముని అంతేవాసులు కారు.

కొంత విమర్శ జరిగిన తర్వాత ఆనందుని తప్పులు క్షమిం చినట్లు, ప్రథమ సంగీతి చర్చల ద్వారా తెలుస్తున్నది.

నిజానికి ఈ విమర్శలకు, విభేదాలకు లోతైన కారణాలు న్నాయి.అవి బహుశా ఆ సంగీతిలో భాగస్వాములైన భిక్షులకు సైతం తెలియకపోవచ్చు. తెలిసినా, గౌతముడు మరణించిన వెన్వెంటనే విభేదాలు బహిర్గతం కావటం సహజంగా వారికి ఇష్టం కాదుగదా! కాని ఇవి ఎక్కువ కాలం దాగలేదు. బుద్ధుని మరణా నంతరం ఒక శతాబ్దికి ఈ విభేదాలు బహిర్గతమై ద్వితీయ సంగీతిలో బహిష్కరణలు, చీలికల వరకు వచ్చాయి.

## ద్వితీయ సంగీతి

వైశాలి నగరంలో, గౌతముని మరణానంతరం సరిగ్గా శతాబ్దానికి ఈ రెండవ సంగీతి జరిగింది. భిక్షువుల మధ్య ఏర్ప డిన విభేదాలు గమనిస్తే, ఎంత స్వల్ప విషయాలపై ఎంతటి తీవ్ర విభేదాలు ఎర్పడ్డవా అనిపిస్తుంది. విభేదాలకు మూలమైన అంశాలు.

1) ఉప్పును స్వీకరించ వచ్చునా?
2) సాయంకాలం భోజనం చేయవచ్చునా?
3) భోజనానంతరం మజ్జిగ తాగవచ్చునా?
4) భోజనానంతరం తీపికల్లుతాగవచ్చునా?
5) బంగారం, వెండి, బహుమానాలను స్వీకరించ వచ్చునా?

తీపికల్లు, బౌద్ధ భిక్షువులు సంచరించే ప్రాంతంలో ఆహార పదార్థం క్రింద జమ. అది తీసుకు రాదు అంటే, పేద ప్రజలు బౌద్ధులకు భిక్ష పెట్టే అవకాశమే వుండదు. పేద ప్రజలకు, అందునా ఆదిమజాతుల ప్రజలకు సన్నిహితంగా బౌద్ధం సాగిన కొద్దీ, వారి ఆహారపు అలవాట్లను స్వీకరించక తప్పలేదు.

మహా సాంఘికులు ఈ మార్పులన్నీ ఆహ్వానించారు. థేర వాదులు కూడదన్నారు.

బంగారు, వెండి కానుకల విషయం ముఖ్యమైనది. ధని కులు ఈ కానుకలను యివ్వగలరు. ఈ కానుకలను స్వీకరిం చినవారు క్రమంగా స్వంత ఆస్తిపట్ల మమకారం పెంచుకోవటం సహజం. తప్పనిసరిగా స్వీకరించవలసిన వాంఛనీయమైన మార్పులు కొన్ని.ధనికుల ప్రలోభాలకు లొంగిపోయే ప్రమాద మున్న మార్పులు. కొన్ని రెండూ ఇందులో వున్నాయి. మహా సాంఘికులు రెంటినీ ఆహ్వానించారు.

థేరవాదులు పశ్చిమ ప్రాంతాలకు, మహసాంఘికులు తూర్పు ప్రాంతాలకు చెందినవారు. పేరునుబట్టే అధిక సంఖ్యా కులు మహా సాంఘికులని తెలుస్తున్నది.

ఈ చీలిక అనంతరం థేరవాదులు, మహాసాంఘికులు ఎవ రికి వారు స్వంత గ్రంథాలను సంకలనం చేయటానికి పూను కున్నారు. అప్పటికి రెండు పిటకాలు మూడు ఐనాయి. పిట కం అంటే పెట్టె. గ్రంథాలను మూడు పెట్టెలలో వారు విభజిం చారు.

వినయ పిటకం - భిక్షువులు అవలంబించవలసిన నియ మాలు, సూత్త పిటకం - బుద్ధుడు బోధించిన సూత్రాలు, ధమ్మ పిటకం - ఈ సూత్రాలకు అంతర్గతంగా వున్న ధర్మ సూత్రాలు,పోను పోను ధర్మ సూత్రాలు, అభిదర్మ సూత్రా లుగా మారాయి. అభి అనగా వ్యాఖ్యాన సహితమైన ధర్మ సూత్రాలు.

హీనయానం,మహాయానంఅనే విభజన అప్పటికి స్పష్టంగా ఏర్పడలేదు. కాని అందుకవసరమైన బీజాలు ఏర్పడ్డాయి.

మూడవ సంగీతి అశోక చక్రవర్తి కాలంలో (శతం 250) లు పాటలీ పుత్రంలో జరిగింది. అప్పుడు సైతం నియమ నిబంధనలపైననే చర్చ కేంద్రీకృతమైంది. అశోకుడు ఒక సందర్భంలో పొరపాటున కొందరు భిక్షులను వధించమని ఉత్తర్వు చేశాడు. ఆ తర్వాత పశ్చాతాపం చెంది, క్షమాభిక్ష కోరాడు.

నాలుగవ సంగీతి కనిష్కుని కాలంలో, జలంధర్‌లోనూ, పెషావర్‌లోనూరెండు మార్లు జరిగింది. ఈ సంగీతిలోనే మహా యాన శాఖ స్పష్టమైన ధోరణిగా అవతరించింది. (క్రీశ100) అనగా బుద్ధుడు మరణించిన పిమ్మట 650 ఏండ్లకు, మ మహాయాన విభజన ఏర్పడ్డది.

అశోకుని కాలం నాటికే కొందరు భిక్షువులు, ఆత్మశాశ్వ తత్వాన్ని అంగీకరించేవారని, వారిని బౌద్ధ భిక్షువుల సంఘం వెలివేసిందని తెలుస్తున్నది. సర్వం అనిత్యం అనేది బుద్ధుని బోధ. ఆత్మ శాశ్వతత్వాన్ని ఆమోదించటం ఆ బోధలకే వ్యతి రేకం

బౌద్ధ జాతక కథలు రచించిన వారందరూ ఈ ఆత్మ శాశ్వ తాన్ని అంగీకరించినవారు. కనుకనే బుద్ధుడు పదేపదే జన్మలు ఎత్తుతున్నట్లు వారు కథలు కల్పించారు. మహాయానం కూడా ఆత్మ శాశ్వతత్వాన్నిఆమోదించలేదు. వారుశూన్యత అన్నారు.

మహాసాంఘికులు క్రమంగా టిబెట్ వైపు వ్యాపించారు. ఆత్మ శాశ్వతత్వాన్ని కాక, ధోరణి దేవత ఆరాధనను కూడా వారు అలవరచుకున్నారు. బుద్ధునితోపాటు స్త్రీ దేవతలను ప్రవేశపెట్టారు. టిబెట్‌లో వ్యాపించిన బౌద్ధం, మూల బౌద్ధం నుండి పూర్తిగా వేరైపోయింది.

బుద్ధుడు మహోన్నత వ్యక్తి. ప్రతి ఒక్కడూ ఆ స్థితిని చేరుకోవచ్చు. అతడిని విగ్రహాలలో చెక్కి పూజలు చేయ రాదు. ఇది హీనయాన మతం. హీనయాన మంటే చిన్న బండి. ఎవరికి వారు నిర్వాణం పొందటం వారి లక్ష్యం.

మహాయానం అంటే పెద్ద బండి. వీలైనంత మందిని నిర్వాణ మార్గంలో ప్రవేశపెట్టాలి. ఎవరికి వారు నిర్వాణం పొంద టమనే సూత్రం కరణా సముద్రుడైన బుద్ధుని బోధనలకు వ్యతిరేకం. కనుక ఆదిమ ప్రజల విశ్వాసాలు, నమ్మకాలతో రాజీ పడైనా సరే, బౌద్ధాన్ని విశ్వ వ్యాపితం చేయాలి అనేది మహా యానం.

హీనయాన, మహాయానాలు మత పరమైన విభేదాలు. తాత్విక విభేదాలు మరింత ప్రధానమైనాయి.

హీనయానం, సౌత్రాంతిక వైభాషిక శాఖలుగాను, మహా యానం మాధ్యమిక, యోగాచార లేక విజ్ఞానవాద శాఖలుగాను విడిపోయాయి.

పదార్థమూ, చైతన్యం ఏది బుద్ధుడు నిర్ద్వంద్వంగా చెప్ప లేదు. రెండుపరస్పరాధారాలని మాత్రమే అన్నాడు. ఇందులో పదార్థం ప్రాథమికమైనదనే మొగ్గు గలవారు సౌత్రాంతికులు, వైభాషికులు, వీరిలో భౌతికవాద భావాలు హెచ్చు. మాధ్యమిక, యోగాచార వాదులు భావవాదులు మౌలికంగా పదార్థం నిస్స్వ భావం, శూన్యత అంటారు. అనగా ఏ లక్షణమూ లేదు. అద్వై తుల వ్యవహారసతత్వం పారామార్థిక సత్యం అనే విభజన ఇందులో నుంచి వచ్చినదే.

మౌలికంగా శూన్యమైన ప్రపంచం, సంవృతి సత్యం ఎలా ఐంది? ఇందుకు వారు 'మాయ' అని ఒక మాట వాడారు. శంకరాచార్యుడు వాడిన ' మాయ' బౌద్ధుల పరిభాష.

చండాలిక అనే జాతక గాధలో ఈ మాయ ప్రస్తావన వుంది.

చండాలిక అనే మాలపిల్ల తన కులమేమిటి అని ప్రశ్నించి ఆనందుని పట్ల అభిమానం పెంచుకుంటుంది. తన మాయ ద్వారా అతడిని తనకు వశం చేయమని తల్లిని కోరుకుంటుంది. అలా చేయకూడదు. తద్వారా ఆనందుడు తన చైతన్యాన్ని కోల్పోతాడు అని తల్లి హెచ్చరిస్తుంది. కాని చండాలిక వినదు. కూతురు మాటను కాదనలేక 'మాయ' ను ఆమె ప్రయోగి స్తుంది. ఆనందుడు నిజంగానే చైతన్య విహీనుడౌతాడు. చండా లిక పశ్చాత్తాప పడి తన తప్పును గుర్తిస్తుంది.

మోహాజాలంతో వ్యక్తిని బంధించటం మాయ.బౌద్ధంలో నుండి మాయ అద్వైతంలోకి ప్రవేశించింది. పరమాత్మను ఆవ రించింది అవిద్య రెంటిని అధిగమించినవారు పరబ్రహ్మ ప్రాప్తిని పొందుతాడు అని అద్వైతం తెలియజేస్తుంది.

బుద్ధుని సిద్ధాంతాలన్నింటిలోకి కీలకమైనది ప్రతీత్య సముత్పాద వాదం. అనేక కారణాలు కలిసి, ఒక కార్యం ఏర్పడు తుంది అని బుద్ధుని భావన. మాధ్యమిక వాదంలో 'అనేకం' అనే మాట అంతరించింది. కార్యకారణవాదం, ఏక కారణం

ద్వారానే ఫలితం నెరవేరుతుందన్నారు. ఆది బౌద్ధంలోని పటుత్వం కాస్తా మాధ్యమిక వాదంలో నశించింది.

ఆటవిక తెగలలో ఆనాడు తాంత్రిక విశ్వాసాలున్నాయి. భారతదేశంలోని అన్ని తెగలలోనూ ఇవి సామాన్య విశ్వాసాలు. హిందూమతం, బౌద్ధం రెండూ, ప్రజాదరణ పొందేందుకు ఆటవిక తెగలలోకి వ్యాపించ సాగాయి. తమ సిద్ధాంతాలను వాటికి జోడించటంతోపాటు, వారి ఆచారాలను తాము స్వీకరించటం కూడా తెలిసో, తెలియకో జరిగేది. అధర్వణ వేదంలో భూతప్రేత పిశాచాల ప్రస్తావన చాలా వుంది. అలాగే బౌద్ధం కూడా వజ్రాయాన శాఖగా మారిన కొద్దీ తంత్ర వాదంలోకి వెళ్ళింది.

మాధ్యమిక వాదం అనగా నాగార్జునుని కాలం వరకు (క్రీ॥శ 200) ఈ పతనావస్థ రాలేదు. నాగార్జునుడు ఉదారవాది. లౌకిక రాజ్యాంగ మూల సూత్రాలు కలిగిన సుహృల్లేఖను, యజ్ఞ శ్రీ శాతకర్ణికి బోధ చేసినవాడు. కుల, జాతి, మత బేధాలు లేకుండా, నాగార్జునకొండ, అమరావతి నగరాలలో విశ్వవిద్యాలయాలను ఏర్పరచి సర్వ విద్యలను నేర్పిన మహా పండితుడు వైదిక ధర్మశాస్త్రాలను కూడా ఇందులో నేర్పేవారు.

సర్వవిద్యలనూ నేర్పే ఉదారవాదం, క్షీణ విద్యలను సైతం ఉపేక్ష చేసే ధోరణిలోకి దిగింది. ఆ విధంగా వజ్రయాన తంత్రం పెరిగి పెద్దదైంది.

కాల పట్టికలో బౌద్ధమే ముందుగా ఇందుకు గురైంది. క్రీ॥శ 700 కు శంకరాచార్యుని కాలంనాటికి, గాని శాక్తేయగాణా పత్య రూపంలో ఈ వ్యాధి వైదికమతంలో వృద్ధికాలేదు.

మాధ్యమిక వాదం తర్వాత, తాత్వికంగా వృద్ధిచెందిన మరోశాఖ, యోగాచారం లేక విజ్ఞానవాదం. వీరు మాధ్యమికులవలె, సంవృతి సత్యాన్ని కూడా అంగీకరించరు. కేవలం ఆలయ విజ్ఞానం అనే తమ మనో ప్రపంచ భావనలే సర్వస్వం అంటారు. నేను గ్రహిస్తున్నాను కనుక, ప్రపంచం అంటూ వుంది. నేను అనే కర్తలేక పోతే, ప్రపంచ వాస్తవికత లేదు అనే ఆత్మాశ్రయవాద ధోరణి ఇది.

నాగార్జునుడు, ఆ తర్వాత శంకరుడు అంతదూరం వెళ్ళలేదు. ఒకరు సంవృతి సత్యం అనీ, మరొకరు, వ్యవహారసత్యం అనీ, ప్రపంచ వాస్తవికతను ఏదో మేరకు గుర్తించారు. పారమార్థకంగా, ఒకరు శూన్యత అంటే, మరొకరు నిర్గుణ పరబ్రహ్మ అన్నారు.

రెంటి అర్థాలు ఒకటే.

బౌద్ధం ఎన్ని రూపాంతరాలు చెందినా, సృష్టి కర్త అనే ప్రాతిపదికను ఆమోదించలేదు.బుద్ధుడు, బోధిసత్యుడు-వీరంతా మానవులు, సృష్టి కర్తలు కారు. సృష్టి ఆది మధ్యాంతరహితం. బుద్ధుడ్ని విగ్రహ రూపంలో పూజచేసిన మహాయానం కూడా, సృష్టికి అతడ్ని కారణం అని చెప్పలేదు. ఆ మహోన్నత నిర్వాణ పదాన్ని చేరుకోవాలనే ఆకాంక్షను మాత్రమే అతడు చిహ్నం.

వజ్రయాన తాంత్రిక మతానికి, వైదిక తాంత్రిక మతానతికి, అనగా అధర్వణ వేదాంతర్గతమైన తాంత్రిక మతానికి ఒక తేడా కనిపిస్తుంది.

వైదిక తాంత్రిక మతానికి మూలం, శక్తి శివుడు. ఇందులో శక్తి స్త్రీ రూపం. శివుడు పురుష రూపం శక్తి చోదకశక్తి, శివుడు కర్మణి ప్రత్యాయం. సాంఖ్యంలోని ప్రధానం అనే భావన, పదార్థం అనే భావన, రూపాంతరం చెంది, శక్తిగా వైదిక తాంత్రిక మతం రూపు దాల్చింది.

బౌద్ధ తాంత్రిక మత మూలం వేరు. ప్రజ్ఞ, ఉపాయం అని వారంటారు. ఇందులో ప్రజ్ఞ స్త్రీ రూపకం. ఉపాయం పురుష రూపకం. ఉపాయం క్రియాశీలం. ప్రజ్ఞ స్థిరరూపం.

టిబెట్‌లోని తాంత్రిక ధోరణులకు, వైదిక తాంత్రిక ధోరణులకు ఈ వ్యత్యాసం కనిపిస్తుంది.

సిద్ధాంత రీత్యా ఈ వ్యత్యాసం ఉన్నా ఆ చరణలో రెండూ క్షీణ సంస్కృతికి, లైంగిక దురాచారాలకు మూలమైనవే. మధువు, మాంసం, మత్స్యం, ముద్ర, మైధునం అనే పంచ మకారాలను ఆచరించారు.

సాధారణ నీతి నియమాలు తమకు వర్తించవని తమ చర్యలను సమర్థించుకుంటారు. మతం, క్షీణ సంస్కృతిగా రూపొందిన తీరు ఇది.

## పతనానికి కారణాలు

మంత్ర తంత్రాలను, తాంత్రిక విద్యలను బుద్ధుడు తీవ్రంగా ఖండించాడు. భూత ప్రేతాదుల ఉనికి అసత్యమన్నాడు. సృష్టికర్త భావాన్నే నిరాకరించాడు. బౌద్ధతాత్విక శాఖలన్నీ చివరి వరకు, అనాత్మ శాఖలుగానే నిలిచిపోయాయి. శాశ్వతమైన ఆత్మభావం బౌద్ధానికి పూర్తి వ్యతిరేకం.

అలాంటివి, బుద్ధుడు మరణించిన 500 ఏండ్లకే, చీలికలు రావటం, మరో 500 ఏండ్లకు, వజ్రయానా తాంత్రిక ధోరణులు తలెత్తడం, పునర్జన్మ ప్రాతిపదికపై బౌద్ధ జాతక కథల సృష్టి ఎందుకు జరిగింది? ఈ పతనానికి కారణమేమిటి?

బౌద్ధంలోని ప్రధాన ఆకర్షణ కుల, మత, జాతి, ప్రాంతీయ విభేదాల కతీతంగా సర్వులను భావించటం ఆనాటికది అది గొప్ప విప్లవాత్మక ప్రాతిపదిక. వేల సంఖ్యలో బుద్ధుని శిష్యులుగా, భిక్షువులుగా ప్రజలు చేరటానికిదే కారణం.

మొదట్లో బౌద్ధంలో పీడితులు, తాడితులే చేరారు. ఆ తర్వాతనే క్రమంగా మేధావులు చేరనారంభించారు. బుద్ధుని బోధల వ్యాఖ్యాతలుగా సహజంగానే మేధావులు ముందు నిలిచారు.

వీరిలో చాలామంది, అంతకు ముందు ఏదో గురువును ఆశ్రయించి, వైదికమో, జైనమో, మరో ధోరణిలోనూ తర్ఫీదు పొందినవారు బౌద్ధంలోని అష్టాంగ మార్గం, చలన శీల తాత్విక దృష్టితో ఆకర్షితులై వీరు బౌద్ధుని శిష్యులైనారు. వీరే బౌద్ధానికి వ్యాఖ్యాతలు.

బుద్ధుడు మరణించిన మరు క్షణమే మహా కాశ్యపుడనే మేధావి ఆయన వారసుడైనాడు. అంతరంగికుడైన ఆనం

దుడు కాదు. అంతకుముందే ఏదో సిద్ధాంతాల ప్రభావం వున్న వీరు సహజంగానే పూర్వ వాసనలు పూర్తిగా పరిత్యజించ లేకపోయినారు.

మహాకాశ్యపుడు మొదట వైదికుడు, పిమ్మట బౌద్ధుడు. సారిపుత్త మొగ్గలాన మొదట జైనులు, తర్వాత బౌద్ధులు. అశ్వఘోషుడు, నాగార్జునుడు,ఆర్యదేవుడు- అందరూ మొదట వైదికులు. వసుబంధు, అసంగుడు అను సుప్రసిద్ధ తాత్వికులు కనిష్కుని కాలంవారు. వీరు మొదట్లో సౌతాంత్రికులు.అనగా భౌతిక వాద సన్నిహితులు. అలాంటిది కాల క్రమేణా వారు విజ్ఞాన వాద మూలపురుషులైనారు. భౌతిక ప్రపంచంలేదు అను వాదనకు వచ్చారు.

భర్తృహరి, గౌడపాదుడు మొదట్లో బౌద్ధులు. విజ్ఞాన వాద శాఖకు చెందిన వారు. తర్వాత వైదికులైనారు. గౌడపాదుడు మాండూక్యోపనిషత్తుకు కారికను రాశాడు. అతని శిష్యుడు గోవిందుడు. అతని శిష్యుడు శంకరాచార్యుడు.

ఈ పరిణామం ఒకరకంగా అనివార్యం. బుద్ధుని సామాజిక బోధనలు చూసి ఆకర్షితులైనవారు, ఉన్నత తాత్విక స్థాయికి ఎదగలేక పోయారు. అంతకు ముందే ఏదో తాత్విక మార్గానుయాయులైనవారే, బుద్ధుని వ్యాఖ్యాతలుగా ప్రసిద్ధి చెందారు.

బుద్ధుడు తన బోధలను పాలీ భాషలో చేశాడు. 500 సంవత్సరాలు అలానే సాగింది. అశ్వఘోషుడు మొదటిసారిగా సంస్కృతంలో రచనలు చేయసాగాడు. అశ్వఘోషుడే మహాయానానికి మూల పురుషుడు. నాగార్జునుడు దానిని మాధ్యమిక వాదంగా వృద్ధి చేసినవాడు.

సామాన్య ప్రజలకు మరింతగా బౌద్ధం దూరం కాసాగింది. వారు అంతకు పూర్వం తమ ఆచారాలైన తాంత్రిక విద్యలకు తిరిగి మళ్ళారు.మేధావులకు,సామాన్యులకు విభజన హెచ్చింది.

దాదాపు ప్రాచీనకాలంలో అన్ని మతాలు ఇదే పరిణామం చెందాయి. వేల సంఖ్యలో భిక్షవుల సంఘాన్ని బుద్ధుడు నిర్మించటంలోనే ఈ పతన లక్షణమున్నది. భిక్షువులందరూ, కొన్ని ప్రయోజనకర వృత్తులను తొలి రోజులలో చేపట్టారు.

తర్వాత పరాన్న భుక్తులు ఐనారు. మొదట్లో ప్రజలందరి ఆదరణ వుండేది. క్రమంగా ధనికులు, రాజుల ఆదరణపై భిక్షు సంఘాలు ఆధారపడసాగాయి. అశోకుని కాలంలో విస్తృతమైన రాజాదరణ లభించింది. దాదాపు ప్రభుత్వ మతమైంది. ఇందులోనే మత పతనానికి కారణాలు వున్నాయి.

పరాన్న భుక్కుల సంఘం, శతాబ్దాల తరబడి తమ పవిత్రతను కాపాడుకోలేదు. అధికార వర్గాల అండదండలపై ఆధారపడడంతో తప్పనిసరిగా పతనం ఏర్పడి తీరుతుంది.

అన్ని మతాలకు ఇదొక అనివార్య పరిణామం.

మతాలను, మత మౌఢ్యాలనుండి వేరుచేయటమేకాక, మత భావాలను, తాత్విక నేపథ్యంలో అర్థం చేసుకోవాలని, మతానికి, తత్వశాస్త్రానికి వ్యత్యాసం వస్తే, తత్వశాస్త్రం వైపే మొగ్గు చూపాలని డాక్టరు రాధాకృష్ణన్ లాంటి మేధావుల చివరి రోజులలో అభిప్రాయపడటానికిదే కారణం.

సర్వజనులకు విద్య మేధోశక్తి కలిగి, విచక్షణా జ్ఞానం వృద్ధి అయ్యేంతవరకు ప్రజాదరణకై మతశాఖలు పొందే పతనాన్ని ఆపలేము, అర్థం చేసుకోగలం.అంతే.

---

"Once having come into being, religion had a long carrer. On a few occasions of course, it roused in the oppressed pea-sants the hopes and aspirations of the down-trodden people who received the central message of religion in a sense very different from that which the ruling class wanted it to be taken. But these are cases more of the nature of exceptions. On the whole, the fact is that religion throughout history served as the instru-ment to maintain the status quo : it wanted to keep the slaves, serfs and working people in general under the control of the privileged classes. But it will be too simplified an understanding of religion to take a purely negative view of it as having been juts a tool of exploitation. Human history is indeed far too complex to allow us to take such a simplistic view."

***- The Beginnings — Devi Prasad Chattopadhyaya***

# జైన మత పరిచయం

-డాక్టర్ తిరుమల రామచంద్ర

ఈ జగత్తుకు కారణమేమిటి? కాలమా? స్వభావమా? నియంతికావచ్చునా? యాదృచ్ఛికంగానే ఇది రూపొందిందా? భూతాలా? కర్త ఎవడైనా ఉన్నాడా? వీటన్నిటి సంయోగంతో ఈ జగత్తు ఏర్పడిందా? అనే మీమాంస అనాదిగా ఉంది. ఈ మీమాంస మనదేశంలో వేదాలకు అనుబంధప్రాయాలు, వ్యాఖ్యాప్రాయాలు అయిన బ్రాహ్మణాలు, అరణ్యకాలు, తచ్ఛిఖర ప్రాయాలయిన ఉపనిషత్తులలోనేకాక, వేదప్రామాణ్యాన్ని, వేద విహిత యజ్ఞయాగాది, పశువిశసనాది కర్మలను అంగీకరించని సంఘాలలోను, గణాలలోను జరిగింది. ఇలాంటి వారు ఉన్నట్టు జైన బౌద్ధ ధర్మ గ్రంథాలవల్ల తెలుస్తున్నది. వీరిని తీర్థంకరులని వ్యవహరించేవారు. తీర్థమంటే, ఆగమం, దర్శనం అనే అర్థాలూ ఉన్నాయి. తీర్థంకరులంటే జగత్సృష్ట్యాదులను గురించి, మానవ జీవిత సార్థక్యం గురించి చెప్పే జ్ఞానాన్ని, దర్శనాన్ని ప్రవర్తింపజేసేవారు. సంసార సాగరానికి రేవులు - తీర్థాలు ఏర్పరచినవారు.

ఇలాటివారు వేదప్రామాణ్యాన్ని అంగీకరించకపోయినా, నాస్తికులేమీ కాదు. వీరి సిద్ధాంతాలు కొంతకు కొంత జైన,బౌద్ధ ధర్మ గ్రంథాలనుంచి తెలియవస్తున్నవి. ఇలాంటి తీర్థంకరులే ఒకవిధంగా జైన బౌద్ధులకు మార్గదర్శకులయ్యారనవచ్చు. ఈ రెండు మతాల ప్రవర్తకులూ వీరిని ఖండించడానికే వీరి రచనలను తరచు ఉదాహరించినా, ఆ మతాలు ఒక విధంగా వారి పరిణామమే. అందువల్ల జైన మతాన్ని తెలుసుకొనడానికి ముందు తీర్థంకరుల దర్శనాన్ని రేఖామాత్రంగానయినా తెలుసుకోవడం అవసరం.

## అవైదిక తీర్థంకర ధర్మం

జైన బౌద్ధాల ప్రారంభం నాటికి ఈ అవైదిక తీర్థంకర ధర్మం జనంలోను, మేథావులలోను బాగా విస్తరించే ఉంది. వాటిలోని లోపాలను పై రెండు మతాల ప్రవర్తకులూ ఖండించి తమ మతాలను స్థాపించుకొనడానికి ప్రయత్నించడాన్ని బట్టే తీర్థంకరుల ప్రాచుర్యం స్పష్టమవుతుంది. అలాటివారిలో అతి ప్రసిద్ధులు అయిదుగురు - పురాణ కాశ్యపుడు, మక్ఖలి గోశాలుడు, అజితకేశకంబళుడు, ప్రకృధకాత్యాయనుడు, సంజయ మేర్థి పుత్రుడు. వీరంతా క్రీస్తుకు పూర్వం ఆరు శతాబ్దాల ముందువారు. వీరిని శ్రమణులని కూడా అన్నారు. శ్రమణులంటే క్లిష్టమైన తపస్సుచేసి శ్రమపడేవారు. వీరికి సనాతన బ్రాహ్మణులతో దాదాపు సమాన ప్రతిపత్తి ఉండేది ఆనాటి సంఘాలలో.

ఇలాటి దర్శనాలు, సిద్ధాంతాలు జైన బౌద్ధమతాలవారికి మార్గదర్శకాలయ్యాయి. ఋషభదేవుడు మొదలు మహావీరుని వరకు 24 మంది తీర్థంకరులు ప్రచారం చేసినది జైనదర్శనం. ఇది భారతదేశపు అతిప్రాచీన దర్శనాలలో ఒకటి. ఋషభుడు మనువంశం వాడయిన నాభి చక్రవర్తి కుమారుడని, భరత చక్రవర్తి తండ్రి అని పురాణాలవల్ల తెలుస్తున్నది. ఇతనిని విష్ణు అవతారమనికూడ అన్నారు. కాశీరాజయిన అశ్వసేనుని కుమారుడయిన పార్శ్వనాథుడు 23వ తీర్థంకరుడు. కాలం క్రీస్తుపూర్వం 817. ఇతడు సంసారం వదలి సన్యాసి అయి, జ్ఞాని అయి, అహింసా అస్తేయ సత్యఅపరిగ్రహాలను అనుష్ఠించిందని ప్రజలకు ప్రభోదించాడు. 24వ తీర్థంకరుడైన వర్ధమానుడు జ్ఞాతృ అనే క్షత్రియ వంశంలో వైశాలీనగరంలో క్రీ.పూ. 599లో జన్మించాడు. ఈ వంశం లిచ్ఛవీ గణంలోది. తండ్రి సిద్ధార్థుడు వర్ధమానుని జ్ఞాతృపుత్రుడని, భవబంధ గ్రంధులు విడగొట్టడంవల్లి నిర్గ్రంధుడని, రాగద్వేషాలు జయించడంవల్ల మహావీరుడని పేరు పొందాడు. తల్లిదండ్రులు మరణించిన తర్వాత, 30 ఏళ్లవయస్సులోనే సంసారం వదిలి సన్యాసి అయి 13 ఏళ్లు కఠోర తపస్సు చేసి, కైవల్యజ్ఞానం (సర్వజ్ఞత్వం) పొందాడు. అంగమగధ, కౌశాంబీ మొదలయిన రాజులు ఈయన శిష్యులు. ఈయన తన ధర్మాన్ని ఉపదేశిస్తూ 72వ ఏట నిర్యాణం చెందాడు.

ఈ 24 మంది తీర్థంకరులు సర్వజ్ఞులు, రాగద్వేష రహితులు, పరమార్థవాదులు, పూజితులు గనుక అర్హత్ శబ్ద వాచ్యులని, రాగద్వేషాలను జయించినవారు గనుక జినులు అని స్తుతించడానికి యోగ్యులని ఈ మతానుయాయుల విశ్వాసం. వీరు బోధించినది అర్హత లేక

## జైన ధర్మదర్శనం

మహావీరుని ప్రధాన ప్రచారం అహింస. ఈ అహింసా సిద్ధాంతంపైనే ఆయన సన్యాసులకు, గృహస్థులకు నియమావళి రూపొందించాడు. జైన సంఘం ఏర్పాటుచేసి - కుల మత జాతి లింగబేధం లేకుండా అందరికీ సమానావకాశం ఇచ్చాడు సంఘంలో.

మహావీరుని కృషివల్ల పశువధ తగ్గిపోయి, అహింస జీవిత సూత్రమయింది. ఈ మతాన్ని అనుసరించని వారిలోను, జైన సన్యాసులు దేశమంతటా వ్యాపించి అహింసా మతాన్ని ప్రచారం చేశారు. భద్రబాహు నాయకత్వంలో కొందరు జైన సన్యాసులు దక్షిణాపథానికి వెళ్లి కర్నాటకలోని శ్రావణబెళగోళ వద్ద ప్రధాన కేంద్రం ఏర్పరచుకొన్నారు. మౌర్య చంద్రగుప్త చక్రవర్తికూడ దక్షిణానికి వారి వెంట వెళ్లాడని, శ్రవణబెళగొళలోని చంద్రగిరి పైనున్న శాసనం దీనిని నిరూపిస్తుందని, చంద్రగుప్తుడు రావడంవల్లనే ఆ కొండకు చంద్రగిరి అని పేరు వచ్చిందని జైనులంటారు.

## ఆంధ్రదేశంలో జైనమత విజ్ఞప్తి

క్రీస్తు పూర్వం 2వ శతాబ్దిలో కళింగరాజైన ఖారవేలుడు జైన మతాన్ని ప్రోత్సహించి తీర్థంకరుల విగ్రహాలు స్థాపించాడు. క్రీస్తుశకం ప్రారంభ శతాబ్దాలలో మధుర నుంచి శ్రావణ బెళ గొళ వరకు అనేక జైన కేంద్రాలు వెలిశాయి. ఆంధ్ర దేశంలో దాదాపు 40 చోట్ల కేంద్రాలున్నట్టు చరిత్ర చెబుతున్నది. విజయవాడ, వేములవాడ, కొనకొండ్ల మొదలయిన క్షేత్రాలలో గొప్ప జైనాచార్యులు జన్మించి పెక్కు గ్రంథాలు రచించి జైనమతాన్ని పరిపుష్టం చేశారు. ఆంధ్రదేశంలో అతి ప్రాచీనమయిన జైన క్షేత్రం అనంతపురం జిల్లాలోని కొనకొండ్ల. ఇక్కడ జన్మించిన కుందకుండాచార్యుడు క్రీస్తుశకం ప్రధమ శతాబ్దంలోనే దేశమంతా పర్యటించి, పెక్కు గ్రంథాలు రచించాడు దక్షిణాపథంలో గంగా, కదంబ, చాళుక్య, రాష్ట్రకూట రాజులు దీనిని ప్రోత్సహించారు. వీరి ప్రోత్సాహంతో జైన కవులు ఎందరో గొప్ప రచనలు చేశారు. దీనిలో తత్వానికి సంబంధించినంత వరకు భేదాలు లేకపోయినా, తర్వాత దిగంబర, శ్వేతాంబర అనే రెండు తెగలు ఏర్పడ్డాయి. పార్శ్వనాథుడు యతులుకూడ వస్త్రాలు ధరించవచ్చునని చెప్పాడు. కాని, మహావీరుడు తీవ్రవిరాగి గనుక సన్యాసులు వస్త్రాలు ధరించరాదని, దిగంబరులుగా వుండాలని శాసించాడు. మహావీరుని నిర్యాణానంతరం కొన్ని శతాబ్దాలకు యతులు తెల్లని బట్టలు ధరించవచ్చునని పార్శ్వనాథుని అనుసరించి అట్లా ఆచరించారు. అంతేకాక కేవలం జ్ఞానం పొందినవారు ఆహారం తినరని, స్త్రీలకు (పురుష జన్మ ఎత్తితే తప్ప) మోక్షం ఉండదని దిగంబరుల విశ్వాసం. ఇది ఈ రెండు శాఖలలో ప్రధాన భేదం. సన్యాసులు దిగంబరులు గనుక స్త్రీలను దిగంబరులనుగా వుండనివ్వడం ఉచితంకాదని ఆ విధంగా అన్నారేమో! తర్వాత మరొ సంప్రదాయమూ వ్యాప్తిలోకి వచ్చింది. వీరికి గోప్యులు అ. పేరు. దిగంబరులు తిరగడం, పాణితల భోజనం, నగ్న ి హ పూజ, నెమలిపింఛం ధరించడం, తమకు నమస్కారం చేసిన వారికి మోక్షమార్గం చెప్పడం ఈ గోప్యుల పని. వీరు శ్వేతంబర దిగంబరుల సిద్ధాంతాలలో కొన్నింటిని స్వీకరించారు. తర్వాత కొన్ని శతాబ్దాలకు శ్వేతాంబరులలో తేరాపంథీ అనే ఉపశాఖ, దిగంబరులలో సమైయ్యాలు అనే ఉపశాఖ బయలుదేరాయి. వీరు విగ్రహారాధనను వదలి జైన ధర్మ గ్రంథాలను పూజించడం ప్రారంభించారు.

## జైనుల సాంస్కృతిక సేవ

భారతీయ సంస్కృతికి జైనుల సేవ అసాధారణమైనది. భాషా సాహిత్యాభివృద్ధికి వారి సేవ అపారం. వైదిక ధర్మ ప్రచారానికి సంస్కృతభాష ప్రధాన సాధనమయినట్టు, బౌద్ధ ధర్మ ప్రచారానికి పాళీ ప్రధాన భాష (ఒక్కొక్క చోట సంస్కృతం) అయినట్టుకాక, జైనులు అవసరాన్నిబట్టి, కాలదేశ వర్తమానానుగుణంగాను అన్ని భాషలనూ స్వీకరించారు. మహావీరుడు అర్థమాగధీ ప్రాకృతంలో, ప్రజలకు సుబోధంగా ధర్మోపదేశం చేయడంవల్ల, జైనులు, అర్థమాగధిని మాత్రమే కాక తక్కిన ప్రాకృతాలను ప్రోత్సహించారు. ప్రాంతీయ భాషలకుకూడ, తొట్ట తొలుత సాహిత్య రూపమిచ్చారు. దీనికి తమిళ, కన్నడాలను ఉదాహరణలుగా పేర్కొనవచ్చు.

మహావీరుడు తన ప్రబోధాలను మగధ, శౌరసేనీ భాషలో వారిద్దరూ అర్థం చేసుకొనడం కోసం అర్ధమాగధని అవలంబించాడు. ఆయన బుద్ధునిలాగానే ప్రవచించాడేగాని, గ్రంథాలేమీ వ్రాయలేదు. ఈయన ప్రవచనాలను సూత్రాంగాలనేపేర పన్నెండు సంపుటాలుగా క్రోడీకరించారు. వీటిని వేదాలలాగా పరంపరగా అధ్యయనంద్వారానే పరిరక్షించారు. కాని, కారణాంతరాలవల్ల శిలమయ్యాయి. తర్వాత మహావీరుని నిర్యాణానంతరం వెయ్యేళ్లకు క్రీస్తుశకం 454లో పునఃలిఖితాలయాయి. అర్ధమాగధిలో, మరల వ్రాసిన వారు శ్వేతాంబరులు. కాని, దిగంబరులు వీటిని మన్నించరు. తమవద్ద ప్రాచీన మహావీర ప్రబోధలే ఉన్నవంటారు. ఒకమారు ఉత్తరాపథంలో 12 ఏళ్ల కరువువస్తే చాలామంది దిగంబరులు దక్షిణాపథానికి వలస వెళ్ళారు. కొంత కాలం తర్వాత తిరిగి వచ్చారు. అప్పుడు ఇరువర్గాలవారికి ధర్మ గ్రంథాలలో భేదం కనిపించింది. ఇప్పటి ఉత్తరాపథ భాషలకు పూర్వమూలమైన అపభ్రంశాన్ని జైనులు రక్షించి అమూల్యమైన గ్రంథాలు, మతంవి, మతేతరంవి రచించారు. కన్నడ, తమిళ భాషలలో తొలి సాహిత్యం జైన రచితమే. అగననూరు, పురనానూరు, తిరుక్కురళ్, పంప భారతం మొదలయినవి.

వాస్తు శిల్పాల రంగంలోను జైనుల సేవ చాలా వుంది. వారు బౌద్ధులలాగ తీర్థంకరుల గౌరవార్థం స్తూపాలు నిర్మించారు. మధురలో అతిప్రాచీనమయిన జైన వాస్తు శిల్పాలు బయటపడ్డాయి. బుందేల్ ఖండం జైన శిల్ప వాస్తుమయం. ఇవన్నీ 11, 12 శతాబ్దాలవి. శ్రావణ బెళగొళలోని బహుబలి - గోమతేశ్వరుని భారీ విగ్రహం ప్రపంచ ఆశ్చర్యాలలో ఒకటి. గంగరాజయిన రాచమల్లుని సేనాపతి చాముండ రాయుడు ఇది చెక్కించాడు. గ్వాలియర్‌లో పర్వతాల ఉల్బణ చిత్రాలు 15వ శతాబ్దంవి. జైనులు గుహాలయాలు కూడ నిర్మించారు. దీనికి ఖారవేలుని హాథీగుంఫా ప్రాచీనతకు ఉదాహరణ. జునాగఢ్, జున్నార్, ఉస్మానాబాద్ ఆది స్థలాలలోను గుహాలయాలు నిర్మించారు. బీహార్‌లోని పార్శ్రినాథ్ కొండలు, పవపురి, రాజగర్ దేవాలయాల శిల్పాలు, గుజరాత్‌లోని గిర్‌నార్, పాలిటానా మొదలయిన జైన యాత్రా క్షేత్రాలు శిల్పవాస్తు వైభవానికి ప్రసిద్ధిగన్నవి. రాజస్థాన్‌లోని అబూ పర్వతంమీది జైన మందిరాలు పదకొండవ శతాబ్దంవి, తర్వాతివి. ఇవి అలంకరణ వాస్తు శిల్పంలో భారత శిల్ప నైపుణ్యానికి మచ్చుతునకలు.

## జైనతత్త్వం – సిద్ధాంతం

జైన సిద్ధాంతత్త్వాన్ని ఒక్కమాటలో ఈ విధంగా చెప్పవచ్చు. జీవం, అజీవం అనేవి రెండు ద్రవ్యాలు. ఈ రెండింటి కలయికవల్ల కొన్నిశక్తులు ఉద్భవించి జీవితంలో జనన మరణాలు, వివిధానుభవాలు కలుగుతున్నాయి. ఈ పద్ధతిని

ఆపి, ఉద్భవించిన శక్తులను నాశనం చేయవచ్చు కొన్ని నియమనిష్ఠలవల్ల. ఇది మోక్షానికి మార్గమవుతుంది. దీనికి ఏడు ప్రమేయాలున్నాయి. మొదటిది జీవం, రెండవది అజీవం. మూడవది ఈ రెండింటి సంయోగం. నాలుగవది ఈ సంయోగంవల్ల కలిగే శక్తులు. ఐదవది ఈ సంయోగాన్ని ఆపడం. ఆరవది ఉన్న శక్తులనుకూడ క్షయింపజేయడం. చివరి ఏడవది మోక్షం పొందడం. ఈ ఏడు ప్రమేయాలను ఏడుతత్త్వాలంటారు. మొదటి రెండు తత్త్వాలు జీవ అజీవులు. ఈ రెండింటి మధ్యనే ప్రపంచ మార్గాలన్నీ ఉన్నాయి. ఈ జీవతత్త్వం, అజీవ తత్త్వాలయిన ఆకాశ, ధర్మ, అధర్మ, పుద్గలాలనే నాలుగూ మొత్తం అయిదూ కలిపి, పంచాస్తికాయం. ఇవి ఉన్నాయి కాయం వలెనే వ్యాప్తి కలవి. బహుదేశాల్లో ఉండేవి. కనుక అస్తులు, కాయములు ఇలా కానిది అనస్తికాయం. కాలం అలాంటిది.

జీవం అంటే ఆత్మ ఇది జ్ఞానం కన్నా వేరు కాదు. వేరు కాకనుపోదు. భిన్నాభిన్నము కాదు. జ్ఞానం పూర్వాపరం. జీవం భూతాల పరిణామం కాదు. శరీరం దాని అధికరణం - ఆశ్రయం జీవం అసంఖ్యాకం; కాని, సర్వవ్యాప్తం కాదు. అణువును గాదు. మధ్యమ పరిమాణం కలది. అంటే, శరీరం ఎంత వుంటే అంతే వుంటుంది. చీమలోని ఆత్మ చీమ శరీరమంత. ఏనుగులోని ఆత్మ ఏనుగు శరీరమంత. ఆత్మ తాను ఆశ్రయించిన దానిని బట్టి పెరుగుతుంది, తరుగుతుంది.

జీవాలలో ఇంద్రియ సంఖ్య కూడా వేరువేరుగా వుంటుంది. వృక్షజీవంలో ఒక్క స్పర్శేంద్రియమే ఉంటుంది. చీమలో స్పర్శ రస గంధాంద్రియాలుంటాయి. మనుషునిలో స్పర్శ రస గంధ సృష్టి శబ్ద మనస్సులనే ఆరు ఇంద్రియాలుంటాయి.

జీవులు జననమరణాలతో ఈ సంసారంలో కొట్టుకుంటున్నాయి. దీనికి కారణం కర్మ. జీవులను కర్మ ఆవరించి వుంటుంది. తపస్సంయమాదులతో ఈ ఆవరణాన్ని ఛేదించుకొని జీవుడు ముక్తుడవుతున్నాడు. కొన్ని జీవులలో సంజ్ఞ (చైతన్యం), మనస్సు ఉండవు. కొన్నిటిలో వుంటుంది. కొన్ని కదలలేవు. అవి స్థావరాలు - చెట్టు, భూమి మొదలయినవి. కొన్ని ఉద్దేశపూర్వకంగా కదలగలవు.ఇవి త్రసములు. ప్రపంచం నిగోదాలతో నిండి వుంది. నిగోదమంటే జీవుల గుంపు. అనాది కాలం నుంచి ఇంతవరకు ఒకటి రెండు నిగోదాలే ముక్తి పొందాయి. ముక్తి పొందవలసినవి అసంఖ్యాకంగా ఉన్నాయి. లోకంలోని జీవులు అందరూ ముక్తులు కావడం సంభవం కాదు గనుక సంసారం ఎన్నటికీ ఉచ్ఛిన్నం కాదు.

ప్రతి జీవమూ - ఆత్మా అనంత జ్ఞాన సామర్థ్యాది గుణ సంపన్నం. కాని, కర్మ ఆవరణం వల్ల అవి ప్రకాశించవు. ఆవరణం తొలగగానే జ్ఞానాది గుణాలు ఉదయిస్తాయి, ప్రకాశిస్తాయి. జ్ఞాన సామర్థ్యాలను బట్టి జీవులకు తారతమ్యం ఉంటుంది. కర్మల కర్త, ఫలభోక్త జీవుడే. చైతన్యాన్ని బట్టి జీవుల ఉనికి తెలుస్తుంది. జీవానికి రూపం లేదు, శరీరానుకూల రూపపరిమాణాలుంటాయి.

వ్యాపించే స్వభావం గల జీవాది ద్రవ్యాలకు అవకాశమిచ్చేది ఆకాశం. అనుమానం వల్ల ఇది వుందని తెలుస్తుంది. సంసార జీవులుండే లోకానికి పైన వుండే ముక్త జీవలోకం వరకు ఈ ఆకాశం వ్యాపించి వుంది.

ధర్మమనే విశ్వవ్యాప్త చాలక తత్త్వం ఒకటి వుంది. గతివల్ల ఇది వున్నదని అనుమానించవచ్చు. జీవాది ద్రవ్యాల కదలికకు ఈ ధర్మం సహకార కారణం. చేపల కదలికకు నీరు ఎలా సహకరిస్తుందో, ఆ విధంగా ఈ ధర్మం జీవుల గతికి సహకరిస్తుంది. దీనికి వ్యతిరేకమయింది. విశ్వవ్యాప్తంగా వున్న నిరోధక శక్తి అధర్మం. కదలికలేని స్థితి. ఇది కూడ అనుమానంతో తెలిసేదే. అలసిన బాటసారి ఆగడానికి చెట్ల నీడ సహకరించినట్లు, జీవుల స్థితికి అధర్మం - గతి నిరోధం - సహాయపడుతుంది. ఈ ధర్మాధర్మాల వల్ల సృష్టిస్థితి ప్రళయాలు జరుగుతాయి.

స్పర్శ రస గంధ వర్ణాలు గలది పుద్గలం. పుద్గలమంటే భౌతిక పదార్థం. జైనదర్శనంలో శబ్దం మూలగుణం కాదు. సూక్ష్మత్వ స్థూలత్వాల వలె తర్వాత ఏర్పడే గుణం కనుక జైనులు శబ్దాన్ని గ్రహించలేదు. భౌతిక పదార్థంలో నిండుకొనేవి, విస్తరించేవి, వదులై విచ్ఛిన్నమై నశించేవి పుద్గలాలు. పూరయంతి, గవంతిచ అని వ్యుత్పత్తి అత్యంత సూక్ష్మాలు, నిరవయవాలు, అవిభాజ్యాలు అణుపుద్గలాలు. వీటి సంయోగంతో ఏర్పడేవి సంఘాత పుద్గలాలు. శరీరాదులన్నీ సంఘాతపుద్గలాలే. కర్మ కూడ పుద్గలమే - భౌతిక పదార్థమే. ఇదే జీవులను ఆవరించి దుఃఖమయ ప్రపంచంలో పడేస్తుంది. దీనివల్ల జ్ఞానాదులు మూసుకొనిపోయి, మోహాదులు కలుగుతున్నాయి. జీవుల దేహ సంబంధం - సంసార సంబంధం కర్మ వల్లనే.

జీవులలోనికి కర్మ ప్రవేశించడాన్ని ఆస్రవం అంటారు. కాలువలోకి నీరు వచ్చేట్టు మనోవాక్కాయ క్రియలవల్ల రాగాదులు, వాటివల్ల కలిగే కర్మ పుద్గలం జీవులలోకి ప్రవేశిస్తుంది.

జీవులు క్రోధామోహాది రాగాలతో లిప్తులై, విషయాసక్తులై, కర్మావృత్తులై సంసారంలో కొట్టుకొంటూ దుఃఖం పొందడం బంధం. అంటే, జీవుల కర్మల అన్యోన్యానుగమం బంధం. మిథ్యాత్వం, అవిరతి, ప్రమాదం, కషాయం, యోగం - ఈ అయిదూ బంధ కారణాలు. మిథ్యాత్వమంటే, నిజం కాని దాన్ని నిజం అనుకోవడం; అవిరతి అంటే, వదలవలసిన వాటిని వదలకపోవడం; ప్రమాదమంటే, కర్తవ్యాన్ని జాగరూకతతో పాటించకపోవడం; కషాయమంటే సమభావం లేక క్రోధరాగాదులకు వశం కావడం; యోగమంటే, మనోవాక్కాయ క్రియలు.

ఈ ఆస్రవాలను అరికట్టి కర్మలను రాకుండా చేయడం సంవరం. అంటే సంయమం. మరొక విధంగా చెప్పాలంటే మనోవాక్కాయాలను రక్షించుకోవడం. దీనిని గుప్తి అని కూడా అంటారు. ప్రాణుల రక్షణ, హిత ప్రియ భాషణం, శుద్ధభిక్ష పై బతకడం, సకల కాలాలలోను ప్రాణి హింస చేయకుండడం, ప్రపంచాన్ని వదలడం - అంటే త్యాగం - ఈ ఐదింటిని

సమితి అంటారు. వీటిని అభ్యసించడమే సంవరం - ఇది త్రికరణాలకు సంబంధించింది. ఆస్రవం భావహేతువు. సంవరం మోక్ష హేతువు - ఇదే జైనధర్మ సారం.

జన్మాంతర సంచితాలయిన కర్మలను నిర్జరణం చేయడం నిర్జరం. నిర్జరణమంటే నాశం. వెంట్రుకలు పీకుకొనడం, నగ్నంగా శీతాతపాలను సహించడం మొదలయిన తపశ్చర్యతో నిర్జరం సిద్ధిస్తుంది. దీనివల్ల సంచిత కర్మ ఇంకిపోతుంది. బంధహేతువు నశిస్తుంది.

జైనంలో ప్రతి వస్తువును సమగ్రంగా తెలుసుకొనడానికి చేసిన ప్రయత్నం స్యాద్ వాదం. ప్రతి వస్తువుకు అనంత ధర్మాలు వున్నవి గనుక అవి కేవల జ్ఞానంగల అర్హతులకే తెలుస్తాయి. సాధారణ మానవునికి కొన్ని ధర్మాలే తెలుస్తాయి. ఇలా పాక్షికంగా ఏకదేశ విశిష్టంగా వస్తు ధర్మం తెలియడాన్ని నయ అంటారు. ఉన్నదానిని దేనినైనా ఉన్నది అని గ్రహించడం నయం. కాని వేరే విధంగా వేరే దృష్టులతో చూస్తే అది నిషేధింపబడుతుంది. అప్పుడు అది లేదనవచ్చు. దేనినైనా ఇది ఉన్నది కావచ్చును (సత్‌స్యాత్) అని తెలుసుకోవడమే సరైన జ్ఞానం. అంశమాత్ర జ్ఞానం నయం. మానవ జ్ఞానమంతా నయమే. తీర్థంకరులు సర్వజ్ఞులు గనుక వారి జ్ఞానం పూర్ణం.

వస్తువును గూర్చి మనం ఉన్నది అని చెప్పరాదు. ఎందుకంటే, వర్తమాన దేశకాల పరిస్థితులలో ఆ వస్తువు వుంది. అన్ని దేశకాలాలలోను, అన్ని అవస్థలలోను అది వుండదు కదా! కనుక దానిని గూర్చి ఉన్నది కావచ్చును(స్యాద్ అస్తి) అని మాత్రమే చెప్పడం సమంజసం. ఉదాహరణకు - ఒక కుండ ఉందనుకుందాము. అది ఉన్నది కావచ్చు. అంటే, ఈ వేళ ఒక విశేష స్థానంలో విశేష రూపంలో కుండ ఉన్నది. అది లేనిది కావచ్చును - స్యాన్నాస్తి - అనగా వేరొక చోట వేరొక రూపంలో అది లేదని అర్థం. ఈ సత్తాత్మక నిషేధాత్మక జ్ఞానాలను కలిపితే, ఉన్నది లేనిది కావచ్చు. స్యాదస్తిచ నాస్తిచ - అనే నిర్ణయం అవుతుంది. కుండ మొదట మట్టితో చేసినప్పుడు దానికి ఒక రంగు వుంది. కాల్చిన పిదప మరొక రంగు వస్తుంది. మరి కుండ యథార్థ స్వరూపమేది?? అది అవక్తవ్యం. చెప్ప వీలులేనిది కావచ్చును. స్యాత్ అవక్తవ్యం. అనేక పరిస్థితులు, నానా విరోధి ధర్మాలు ఒక చోట వుండవచ్చు. వాటిని బట్టి స్వరూపం మారుతుంది. ఏది దాని నిజ స్వరూపమో అవక్తవ్యం. ఈ నాలుగు విధాలయిన నయాలు కలపడం వల్ల మారి మూడు నయాలు కూడ ఇలా ఏర్పడుతాయి. ఉన్నదీ అవక్తవ్యం కావచ్చు. లేనిదీ అవక్తవ్యం కావచ్చు. ఉన్నదీ లేనిది కూడ కావచ్చు. అవక్తవ్యము కావచ్చు ఇలా ప్రతిపదార్థానికి ఏడు విధాలయిన పాక్షిక వైకల్పిక జ్ఞానాలు (నయాలు) ఉంటాయి. దీనిని సప్తభంగీనయమంటారు. దేనిని గూర్చిగాని ఇదమిద్ధమని ప్రతిపాదింప వీలులేదు. కావచ్చును - స్యాత్ అని మాత్రమే చెప్పగలం. ఇదే స్యాద్వాదం. దీనిని అనేకాంత వాదమనీ అంటారు.

దేవలోక సుఖాలు కూడా శాశ్వతాలు కావు. ఇంద్రుడు కూడా భగవత్సామ్రాజ్యంలో అడుగుపెట్టలేదు - అనగా మోక్షం పొందలేడు. అతడు మోక్షం పొందాలంటే మానవుడు కావలసిందే.

జైనులకు, బ్రహ్మ, ఇంద్రుడు, స్వర్గాలూ వున్నాయి.

## జైనుల సాహిత్య సేవ

జైనులు సాహిత్యానికి కూడ గొప్ప సేవ చేశారు. జైన సాహిత్యం తీర్థంకర మహావీరునితో ప్రారంభమవుతుంది. (బి.సి. 599 - 527) అతడు అహింసా ధర్మాన్ని ప్రజల భాష అయిన ప్రాకృతంలో బోధించాడు. దానిపేరు అర్ధమాగధి అంటే, శుద్ధమాగధి కానిది.

మహావీరుని బోధలను అతని ప్రియ శిష్యుడైన ఇంద్రియ భూతి గౌతముడు గ్రంథస్థం చేశాడు. ఇదే జైన సాహిత్యంలో మొదటిది. ఈ బోధలు పన్నెండు అంగాలుగా (భాగాలుగా) వింగడించారు.

1. ఆచారంగ సుత్తం - ఇది సన్యాసుల నియమ నిష్ఠలను తెలుపుతుంది.

2. సూత్రకృతంగా - ఇది సన్యాసులకు శిక్షణను ఇవ్వడంతో పాటు ఇతర ధర్మాలను కూడ వివరిస్తుంది.

3. స్థానంగా - ఇది ప్రకృతి సత్యాలను గురించిన జ్ఞానాన్ని వివరిస్తుంది.

4. సమవాయంగా - కాలదేశ సంఖ్యాసాదృశ్యాలతో వస్తువులను వివరిస్తుంది.

5. వ్యాఖ్యా ప్రజ్ఞప్తి- జీవిత, ప్రకృతి వాస్తవాలను వివరిస్తుంది. దీనికి భవత్ అని కూడ మరొక పేరు.

6. జ్ఞాతృ ధర్మ కథా - ధర్మ ప్రచార పద్ధతులను, నైతిక బలం పెంపొందించే కథలు, ఉదంతాలు తెలుపుతుంది.

7. ఉపాసకాధ్యయన లేక ఉపాసక దశక - ఇది గృహస్థులకు అవసరమైన ధర్మ బోధలు వివరిస్తుంది. నియమ నిబంధనలు వున్నాయి.

8. అంతకృద్దశక - ఘోర కష్టాల తర్వాత మోక్షం పొందిన పదిమంది ముక్తుల కథలు చెబుతుంది.

9. అనుత్తరౌపపాతిక - ఘోర తపస్సు తర్వాత అత్యున్నత స్వర్గానికి చేరిన పది మంది ముక్తుల కథలు చెబుతుంది.

10. ప్రశ్నవ్యాకరణ - ప్రత్యర్థి వాదాలు ఖండించి స్వధర్మాస్థాపన పద్ధతులు, పుణ్య కార్యాచరణ, పాపకార్య నిరసన చెబుతుంది.

11. విపాకసూత్ర - పుణ్యానికి గుర్తింపు ప్రశంస, పాపానికి శిక్ష వివరిస్తుంది.

12. దృష్టివాదం - దీనిలో ఐదు భాగాలున్నాయి. పరికర్మాణి - దీనిలో సూర్య చంద్ర, జంబూ ద్వీపాదులు, సముద్రాలు, స్థావర జంగమాల వివరణ వుంది. (2)సూత్ర - దీనిలో దాదాపు 363 ఇతతత్వ సిద్ధాంతాల వివరణ వుంది. (3) ప్రథమానుయోగ - ఇది ప్రాచీన చరిత్రను, గొప్ప రాజుల, ఋషుల చరిత్రను చెబుతుంది. (4) పూర్వగత - జనన మరణాలు వివరిస్తుంది. మరి 14 ఉపభాగాలు

ఉన్నాయి. (5) చాలికా - నీటిపై నడవడం, గాలిలో ఎగరడం, వివిధ రూపాలు పొందే అద్భుత క్రియలు, ఇంద్రజాలం మున్నగువాటి వివరణ.

ఈ జ్ఞానమంతా మహావీరుడు నిర్యాణం చెందిన తర్వాత 162 సంవత్సరాల వరకే రక్షితమైందని, అనగా భద్రబాహు వరకు రక్షితమైందని, తర్వాత క్రమంగా శిలమయ్యాయ 683 ఏళ్ళ తర్వాత ఆచార్యులకు తెలిసింది. కేవలం శిలా పోగా మిగిలినవేనని దిగంబరులంటారు.తర్వాత పునర్నిర్మితమైంది.

కాని శ్వేతాంబరుల ధర్మ సాహిత్య సంప్రదాయం దీనికి భిన్నం. భద్ర బాహు ద్వాదశ వర్ష క్షామం కారణంగా దక్షిణా పథానికి తన సహచరులతో పాటు వలస పోయాడు. మగధలో వున్న సన్యాసులు స్థూల భద్రుని అధ్యక్షతన పాటలీపుత్రంలో సమావేశమై శేషించిన పన్నెండవ అంగంతో పాటు పదకొండు అంగాలను పునర్లిఖించారు. జైనాగమాలను సక్రమంగా సేకరించడానికి జరిగిన ప్రథమ ప్రయత్నమిది. కాని కాలక్రమాన ఈ సంప్రదాయం అస్తవ్యస్తం కాగా, గుజరాత్‌లోని వలభీ నగరంలో దేవర్థి క్షమాశ్రమణుని అధ్యక్షతన 5వ శతాబ్దంలోసమావేశమై మరల గ్రంథస్థం అయ్యాయని శ్వేతాంబరులంటారు.

కుంద కుందాచార్యుడు పెక్కు సిద్ధాంత గ్రంథాలు రచించి శ్వేతాంబర శాఖకు దన్నుగా నిలిచాడు. పాహుడాలన్న పేరుతో ఇతనికి 12 రచనలున్నాయి. ప్రవచనసారం, సమయసార అనేవి చాల ప్రసిద్ధాలు.

జైనులు సంస్కృతాన్ని కాదనలేదు. సంస్కృతంలో పెక్కు రచనలు చేశారు. ఇలాంటి వాటిలో మొదటిది ఉమా స్వామి రచించిన తత్త్వార్థాధి గమసూత్రం. దీనిని దిగంబరులు, శ్వేతంబరులు గౌరవించారు.

సంస్కృత ప్రాకృతాపభ్రాంశాలలో పెక్కుజైన గ్రంథా లున్నాయి. 12వ తీర్థంకరుడైన వసుపూజ్యుని జీవితాన్ని వర్ధమాన సూరి రచించాడు. 13వ తీర్థంకరుడైన విమలుని జీవితాన్ని కృష్ణ దేవుడు, 15వ తీర్థంకరుడైన ధర్మనాదుని జీవి తాన్ని హరిచంద్రుడు, 16వ తీర్థంకరుడైన శాంతినాదుని జీవి తాన్ని దేవసూరి, మాణిక్య నంది, సకల కీర్తి అనే వారు, 22వ తీర్థాంకరుడు నేమినాదుని జీవితాన్ని వాగ్భట్టుడు, సూర్యా చార్యుడు, 23వ తీర్థంకరుడైన పార్శ్వనాదుని జీవితాన్ని జిన సేనుడు, వాదిరాజు (11వ శ), భావదేవ మాణిక్య చంద్రుడు రచించారు. సంస్కృత ప్రాకృతాల రామాయణ భాగవత, హరివంశ కథలు జైన సంప్రదాయంలో రచితమయ్యాయి.

జైన సాహిత్యంలో కథా సాహిత్యం బాగా విస్తరించింది. ఇవి మత ప్రచారానికి ఉద్దేశించినవయినా, వినోదం కోసమూ బాగుంటాయి. హరిసేనుని కథాకోశం (12 శ.) సంస్కృతం లోను, శ్రీచంద్రుని కథాకోశం అపభ్రంశంలోను (11శ) పేర్కొనదగింది. ప్రాకృతంలోధూర్తాఖ్యానం హరిభద్రుడు రచించాడు. ఇది గొప్ప వ్యంగ్య రచన - జైన వాఙ్మయంలో స్తోత్రాలు. అపారంగా వున్నాయి. జైన కథలన్నీ మానవత్వాన్ని పెంపొందించే ఉత్తమ కథలు.

జైనులు తర్కశాస్త్రానికి గొప్ప సేవ చేశారు.

## ఆంధ్రదేశంలో జైన క్షేత్రాలు

క్రీస్తుకు పూర్వమే ఆంధ్రదేశంలో జైనం వ్యాపించిందని జైనులు అంటారుగాని, దానికి తగిన చరిత్రకాధారాలు లేవు. కాని ఒకటవ శతాబ్దం వాడయిన కుంద కుందాచార్యుడు దేశమంతా పర్యటించి జైనాన్ని వ్యాపింపజేసి, గ్రంథాలు వ్రాసి, ఆచార్యుడయ్యాడు గనుక, అంతకు ముందే అది ఆంధ్ర దేశంలో ప్రవేశించిందని అనుకోవడం అహేతుకమేమీ కాదు. అయితే ఇప్పటికీ కొన్ని ప్రాంతాలు శిథిలాలు, అశిథిలాలు అయిన జైన దేవాలయాలు ఉన్నవి.

అమరాపురం - అనంతపురం జిల్లా దేశీయ, కాసూరు జైన మునులు ఇక్కడ ఉండేవారు. బ్రహ్మజివాలయం, ప్రసన్న పార్శ్వదేవ బసది వున్నాయి.

అమరావతి - గుంటూరు జిల్లా ఇక్కడ జైనం బౌద్ధంలాగ అభివృద్ధి కాకపోయినా, కొంత వుంది. నల్లరాతి పార్శ్వనాథ విగ్రహం వెలువడింది.

ఆచంట - పశ్చిమ గోదావరి జిల్లా పెద్దజైన విగ్రహాలు రెండు వున్నాయి.

ఆదోని - కర్నూలు జిల్లా, కోటలోని బారాకిల్లా మార్గంలో తీర్థంకరుల విగ్రహాలు వున్నాయి. కొండమీది గుహలో పార్శ్వనాదుని విగ్రహం వుంది.

ఆర్యవటం - తూర్పుగోదావరి జిల్లా, ద్రాక్షారామ సమీప గ్రామం. తీర్థకరుల ఆరు విగ్రహాలు దొరికాయి. క్రీ.శ. 3వ శతాబ్దపు ఇక్ష్వాకుల కాలం నాటివి.

కంచుమర్రు - పశ్చిమ గోదావరి జిల్లా ఇక్కడ చాళుక్య రెండవ అమ్మరాజు కాలంలో జైనుల ఆవాసాలు వున్నట్టు శాసనాధారాలు వున్నాయి. అర్హనంది ఆచార్యుని శిష్యు[illegible] చామెకంబె జైన దేవాలయం, వసది నిర్మించింది. దీ[illegible] జినభువనం.

కంబదూరు, అనంతపురం జిల్లా మూడుజైన దేవాలయా లున్నాయి.

కప్పరావుపేట - కరీంనగర్ జిల్లాపెద్దపల్లి తాలూకా. ఈ గ్రామం సమీపంలోని మునుల గుట్టమీద గుహలో సల్లేఖనదీక్ష కోసం నాలుగు శయ్యలు చెక్కి వున్నాయి. క్రీస్తుపూర్వంవని భావిస్తున్నారు. సల్లేఖనమంటే ప్రాయోపవేశం.

కుర్క్యాల - కరీంనగర్ జిల్లా జగిత్యాల దారిలో వుంది. ఈ ప్రాంతాన్ని పాలించిన అరికేసరి పంప మహాకవికి, అతని తమ్ముడు జినవల్లభునికి ఆశ్రయమిచ్చాడు. 930-953 పంపనికి కవితా గుణార్ణవ బిరుదు, ధర్మపురం అగ్రహారం దానం ఇచ్చాడు. గ్రామం గుట్టపై చక్రేశ్వరి ఆలయాన్ని జినవల్లభుడు మలిపించాడు. జినోత్సవాలు, అభిషేకాలు చేయించినట్లు శాసనం వుంది.

కొనకొండ్ల - కొండకుంద - అనంతపురం జిల్లా గుంతకల్లు - ఉరవకొండ దారిలో గుంతకల్లు సమీపంలో

ఉంది. ఆంధ్రలో అతిప్రాచీన తమ జైన క్షేత్రం. ఇక్కడ కుంద కుందాచార్యుడనే గొప్ప జైనాచార్యులు వున్నారు. ఇతనికి పద్మ, పద్మనంది, కుంద కుందాచార్య అనే పేర్లు ఉన్నాయి. సమయసార, పంచాశక్తీయ,ప్రవచనసార మున్నగు గ్రంథాలు రచించాడు. ఇతడు బలాత్కారంగా సరస్వతిని పలికించాడ గాడు. సరస్వతీ గచ్ఛ, వక్రగచ్ఛ అనే జైన సంఘాలు స్థాపించాడు. దేశమంతటా పర్యటించి పండితులను జయించి వక్రగచ్ఛ అనే సంప్రదాయం నెలకొల్పాడు. అందువల్ల ఇతనికి వక్రగ్రీవుడు, ఎలాచార్యుడు అనే పేర్లు వచ్చాయి. క్రీసు శక 1వ శతాబ్ది అర్వకుల పూజ నిరసించాడు. వీతరాగ, విరాగమార్గాలు ప్రచారం చేశాడు. ఈ గ్రామం సమీపంలోని రససిద్ధుల గుట్ట మీద కాయోత్సర్గన ముద్రలో ఇద్దరు జైన తీర్థంకరుల విగ్రహాలున్నాయి.

కొలనుపాక - నల్లగొండ జిల్లా, పశ్చిమ చాళుక్యుల శాసనాలలో ఇది కొల్లిపాక 7000 విషయం, కొల్లిపాక 21000 వేల విషయంగా పేర్కొనబడింది. చాళుక్యులు శైవులయినా జైనాన్ని ఆదరించారు. ఇక్కడి ద్విబాహు విఘ్నేశ్వరుడు మధురైలోని ద్విబాహు విఘ్నేశ్వరుని పోలి వుంది. అంతటా జైన విగ్రహాల ఖండాలుపడి వున్నాయి.

గుంటుపల్లి - పశ్చిమ గోదావరి జిల్లా, రామవరపుకోట దగ్గర కొండ గుహలున్నాయి. ఈ కొండ మహా నాగపర్వతమని శాసనాల్లో వుంది. భారవేల్లుడు జైనుడు, ఇతనికి మహా మేఘవాహన బిరుదు వుంది. మహామేఘ వాహన శాసనాలు దొరికాయి. కనుక క్రీసుపూర్వమే జైనం వుంది.

చందవోలు - గుంటూరు జిల్లా 12, 13 శతాబ్దాలలో శ్వేతాంబర జైనాచార్యులు ఇక్కడ వున్నారు.

చిప్పగిరి - కర్నూలు జిల్లా. ఇక్కడ జైనాలయాలు కళచురి బిజ్జలుని చివరి దశలో వెలిశాయి. 1162 క్రీ.శ.

తాటిపాక - తూర్పు గోదావరి జిల్లా రాజోలు తాలూకా ఇక్కడ ఆసీన జైన విగ్రహం లభించింది.

దానవులపాడు - కడప జిల్లా జమ్మలమడుగు తాలూకా. 10వ శతాబ్దంలో రాష్ట్రకూట ఇంద్రరాజు జైన స్థావరాలు నెలకొల్పాడు. పెన్న వరదలలో పూడిపోయిన దేవాలయాన్ని జయంతి రామయ్య పంతులుగారు ఉద్ధరించారు. 914 - 917 నాటిది.

ధర్మవరం - ప్రకాశం జిల్లా ఒంగోలు తాలూకా గ్రామం. ఇక్కడ కొండ చరియలలో జైనాలయాలున్నాయి. ఇక్కడున్న జైనాచార్యుడు శ్రీ మందిర దేవుడు 950 క్రీ.శ.

నాగర్జున కొండ - గుంటూరు జిల్లా. ఈ బౌద్ధ క్షేత్రం లోను జైన దేవాలయం తీర్థంకరుల విగ్రహాలు దొరికాయి. కొండమీది కోటలో వున్నాయి. 13వ శ.

నాయకల్లు -కర్నూలు జిల్లా. పెద్ద జైన క్షేత్రం. పార్శ్వ గాంధ, ఇంద్ర విగ్రహాలు వున్నాయి.

నింద్ర - చిత్తూరు జిల్లా. ఇక్కడ జైన విగ్రహాలు చాలా వున్నాయి. కొన్ని జైన దేవాలయాలు శైవ, వైష్ణవ దేవాలయాలయ్యాయి.

నెల్లూరు - కనుపర్తిపాడులోని విడాలచోళజినాలయానికి 1285 మనుమ సిద్ది మంత్రి సాగర దేవుడు దానం చేసిన శాసనం వుంది. ఇదిపులిచ్చంద జైన స్థావరం.

నేదునూరు - తూర్పుగోదావరి జిల్లా,అమలాపురం సమీపంలోని గ్రామం.పూర్వం దీనిపేరు నేమినాథునూరు. జైన తీర్థంకరుల విగ్రహాలు - సుపార్శ్వనాథుని విగ్రహం లభిస్తున్నవి.

పటన్‌చెర్వు - మెదక్‌జిల్లా గొప్ప జైన క్షేత్రం, మూడు మీటర్ల జైన విగ్రహాలు వున్నాయి. శిథిలాలు చెల్లాచెదురుగా పడి వున్నాయి. బోధన్‌లోని గోమటేశ్వర శిల్ప ప్రభావం కనిపిస్తుంది.

పుదూరు - మహబూబ్‌నగర్ జిల్లా. గద్వాల్ సమీప గ్రామం. 11-12 శతాబ్దాల జినప్రతిమలు వున్నాయి.

పెద్ద తుంబళం - కర్నూలు జిల్లా ఆదోని తాలూకా. ఇక్కడ జైన వసది, ఆలయం వున్నాయి.

పెద్దమారం - పశ్చిమ గోదావరి జిల్లా భీమవరం సమీప గ్రామం. పెద్దమారం అంటే పెద్ద మఱ్ఱి. జైనపల్లి కొలని రాజుల కాలంది ఉంది. తీర్థంకరుల విగ్రహాలు వున్నాయి.

పెనుకొండ - అనంతపురం జిల్లా. రెండు జైనదేవాలయాలు సంగమ కాలంది వున్నాయి. జైన ప్రపంచంలో ప్రసిద్ధి పొందిన విద్యా స్థానాలలో ఘలుగింటిలో ఇదొకటి. జైన పురోహితులను జైన బ్రాహ్మణుల ంటారు.

పెనుగొండ - పశ్చిమ గోదావరి జిల్లా పూర్వ జైన క్షేత్రం చెరువుగట్టుమీద జైన విగ్రహం వుం న్యకాపరమేశ్వరి కథ జైనత్వానికి నిదర్శనం.

పెనుమంచిలి - తూర్పు గోదావరి జిల్లా ఆకుపచ్చరాతి తీర్థంకర విగ్రహం లభించింది. ఇది ప్రస్తుతం కాకినాడ కాలేజీ ఆవరణలో వుంది.

పేరూరు - కడప జిల్లా సిద్ధవటం తాలూకా. ఈ క్షేత్రానికి సింహనందితో సంబంధం వుందని ఐతిహ్యం. పశ్చిమ గంగ రాజ్యం రూపొందించిన వాడు సింహనంది. గంగపేరూరని దీనికి వ్యవహారం. కుంద కుందాచార్యునికి కొనకొండ్లలాగ సింహనందికి ఈ వూరు.

బయనపూడి - తూర్పుగోదావరి జిల్లా. సామర్లకోట రైలు స్టేషన్ దగ్గర వుంది. తీర్థంకర విగ్రహాలు, యక్షిణీ విగ్రహాలు లభిస్తున్నాయి.

బాపట్ల - గుంటూరు జిల్లా. దీని సమీపంలో జైన తీర్థంకరుల కాంస్య విగ్రహాలు చిన్నవి లభించాయి. ఇవి గృహ పూజా విగ్రహాలు కావచ్చు.

బిక్కవోలు -తూర్పుగోదావరి జిల్లా. చరిత్రాత్మక గ్రామం. దీని ప్రాచీన నామం బిరుదాంకప్రోలు. రెండవ విజయాదిత్యునికి బిరుదాంకరాయ బిరుదు వుంది. అతడు ఈ గ్రామాన్ని నెలకొల్పి వుండవచ్చు. జైన దేవాలయం వుంది. వర్ధమాన ప్రతిమ వుంది. రాష్ట్ర కూట రాజు అమోఘవర్షుని ప్రతినిధి. కరకుడు తన కుమార్తె శీలమ విజయాదిత్యుని

కుమారుడు కలి విష్ణువర్ధనుని భార్య. ఈ దేవాలయం ఆమె కట్టించింది.

బోధన్ - నిజామాబాద్ జిల్లా. శాసనాలలోదని పేరు బహుధాన్యపురం. జాతక కథలలో అశ్మక దేశంలోని పోతన, పెద్దన అనే పేర్లున్నాయి. జైన బౌద్ధ వైదికావశేషాలు చాలా వున్నాయి. మొదటి తీర్థం కరుని పుత్రుడయిన బాహుబలి ఇక్కడ వున్నాడు. శ్రావణబెళగొళ కన్నా ఎత్తయిన విగ్రహం యిక్కడ వుండేదట. ఇక్కడి దేవర్ మసీదు మొదట జైన దేవాలయం. శుభనంది, గండ ముక్తభట్టారక చంద్ర ప్రభ ఇక్కడ నిర్వాణం చెందారు.

భోగాపురం - విజయనగరం జిల్లా. విజయనగరం భీముని పట్టణం దారిలో వుంది. తూర్పు గంగరాజు అనంతవర్మ రాజరాజు కాలంలో మన్నవ నాయకుడు రాజరాజు పేర జైనాలయం నిర్మించాడు. 1187 క్రీ.శ.

మాచెర్ల - గుంటూరు జిల్లా. ఇది జైన కేంద్రమయినట్టు మాన స్తంభాలవల్ల విదితమవుతున్నది.

మునుగోడు - గుంటూరు జిల్లా. ఇక్కడి రెండు జైన దేవాలయాలకు వెలనాటి రెండవ గొంకరాజు భూదానం చేశాడు.

రామతీర్థం - విజయనగరం జిల్లా. ఈ గ్రామ సమీపంలోని కొండల మీద మునుల కోసం గుహలలో ఆసనాలు తొలచబడ్డాయి. ఊరిలో గుడులు, విగ్రహాలు కనిపిస్తున్నాయి.

వరంగల్లు - వరంగల్లు కోటలో పార్శ్వనాథ విగ్రహం వుంది. శంభు దేవాలయంలో పార్శ్వనాథుని విగ్రహం వుంది.

వర్ధమానపురం - మహబూబ్‌నగర్ జిల్లా నాగర్‌కర్నూల్ తాలూకా. ఇది కళ్యాణి చాళుక్యుల కాలం నుంచి ప్రసిద్ధం. నేమినాథాలయం వుంది.

విజయవాడ - మల్లిఖార్జున కొండపై శ్వేతాంబరుల నడుంబి వసతి వుండేది. ఈ వసదికి కుబ్జ విష్ణువర్ధనుని భార్య అయ్యణ మహాదేవి 627లో ముసినిగొండ గ్రామం దానమిచ్చింది. ఈబసదిలో జైన ధర్మదీక్ష పొందగోరే స్త్రీలక్కూడ అవకాశం వుంది. ఈ గ్రామాన్ని తర్వాత ఎవరో ఆక్రమించుకోగా కవిభద్ర జైనాచార్యుడు మూడవ విష్ణువర్ధనునికి విన్నవించగా, మరల యిప్పించాడు. ఇతనికి దేవనంది అని పేరు.

వేగాయమ్మపేట - తూర్పు గోదావరి జిల్లా, ద్రాక్షారామం సమీపంలో వుంది. పూర్వం జైన బసది పొలంలో యక్షిణీ విగ్రహం వుంది.

వేములవాడ - కరీంనగర్ జిల్లా. మధ్య యుగంలో ప్రముఖ జైన స్థానం. రెండవ అరికేసరి (930 - 955) పాలన కాలం. ఇక్కడ ఒక పెద్ద విద్యాస్థానం వుండేది.దాని పేరు సూరి స్థానం. దీనికి ఒక ఉత్తర దేశపు ఆచార్యుడు పెద్ద. పంపడు ఈతని ఆస్థానంలో వుండి విక్రమార్జున విజయం, ఆదినావు పురాణం రచించాడు. ఈ అరికేసరి మనమడు మూడవ అరికేసరి జైనాచార్యుడయిన సామదేవ సూరికి గ్రామదానం చేశాడు. ఇతడే యశస్తిలక చంపూ రచయిత. (966) ఇతడు గౌళ సంఘీయుడు. అరికేసరి పుత్రుడు బద్దెన శుభదామజి నాలయం నిర్మించాడు. ఇది శిథిలం. ఎన్నో జైన విగ్రహాలు పరిసరాలలో వున్నాయి. వేణుగోపాలస్వామి దేవాలయంలో జైన విగ్రహాలున్నాయి.

హనుమకొండ - కొండపైన పద్మాక్షి గుడి. మూల విగ్రహం కాయోత్సర్గ ముద్రలో వున్న జైన విగ్రహం. గుడి సమీపం లోని కొండ మీద పెక్కుజైన విగ్రహాలున్నాయి.

**పరిశీలిత గ్రంథాలు :**


1. తెలుగు భాషా సమితి, విజ్ఞాన సర్వస్వం - దర్శనా సంపుటి
2. గిడుగు రామమూర్తి పంతులు సప్తత్యబ్దపూర్తి సంచిక - పంచాగ్నుల ఆదినారాయణ
3. Cultural Heritage of India. Vol-I, VII. Ramakrishna Mutt Publication.


మతములన్నియు మాసిపోవును
జ్ఞాన మొక్కటె నిలిచి వెలుగును
అంతస్స్వర్గ సుఖంబు లన్నవి
అవని విలసిల్లున్

**- మహాకవి గురజాడ**

# లోకాయత – ఇతర నాస్తిక మతాలు

– ఆరుద్ర

మార్క్స్ చెప్పినట్టు మనిషి మతాన్ని సృష్టించుకుంటాడు గాని మతం మనిషిని సృష్టించదు. ప్రపంచంలోని చాలా మతాలకు రెండు ప్రబల విశ్వాసాలే ప్రాతిపదికలు. ఒకటి - ప్రకృతి పరిణామాలూ, వైపరీత్యాలూ ఒక దైవేచ్ఛకు లోబడే సంభవిస్తాయి. రెండు - ఆ దైవాన్ని ప్రార్థనలతో, ఉపశాంతులతో, బలులతో సుముఖం చేసుకుని ప్రకృతి సంఘటనలను వాటి నిర్ణీత మార్గంలో కాక మనకు అనుకూలంగా ఆ మహత్తర శక్తిని ప్రేరేపించి ఒప్పించవచ్చును. అందుకే చాలా మతాలలో మొక్కలు, ముడుపులు, పూజలు, వ్రతాలు, కొలుపులు, జాతరలు, జంతుబలులు, ఆత్మ హింసలు మొదలైనవి సర్వసామానం. కొన్ని మతాలు ఒక్క దైవాన్నేకాక చాలా దైవాలను విశ్వసిస్తాయి. అయితే మానవ చైతన్య వికాస చరిత్రలో దేవుణ్ణి నమ్మటమనేది ఆదిలో లేదు.

ఆటవిక అనాగరిక దశలోని మానవులు కార్యవాదులు. తమకు కావలసినవి చేసిపెట్టమని ఏ దేవుణ్ణీ ప్రార్థించకుండా ఆ పనులు తామే చేసుకుంటారు. లేదా చేసుకొనడానికి ప్రయత్నిస్తారు. ఒక్కమాటలో చెప్పాలంటే 'మ్యాజిక్' విధానం పాటిస్తారు. తదేక నిష్ఠగా తరుచుగా మ్యాజిక్ నాట్యాలను ఆడుతారు. ఆటవిక మానవులు తమకు ఎండగానీ, వానగానీ, గాలిగానీ, కావాలనుకుంటే ఏ దేవుడికీ మొక్కక ఎండనృత్యం, వాన నృత్యం, గాలినృత్యం సామూహికంగా చేస్తారు. ఆది మానవులు కొన్ని క్రూర జంతువులను వేటాడి పట్టుకోదలిస్తే అందుకు తగిన బలాన్ని ప్రసాదించమని దేవుళ్ళను ప్రార్థించరు. తమకు తాముగా ఆయా నాట్యాలను వేటకు ముందుగా ఒద్దికల రూపాన ఆడి ఉత్తేజితులవుతారు.

## మంత్ర విద్య తప్ప మతం తెలియని స్థితి

ఆదిమ మానవులకు మ్యాజిక్కే గాని మతం తెలియదు. అందుకే వాళ్ళకే దేవుణ్ణి నమ్మడం, ప్రార్థనలు చేయడం, బలులు వెయ్యడం చేతకాదు. ఇప్పటికీ ప్రపంచంలో అత్యంత నిమ్న స్థాయిలో ఉన్న ఆటవిక మానవులు మ్యాజిక్కునే అనుసరిస్తారు.

మ్యాజిక్కు ఒక ముఖ్యమైన సూత్రంపై ఆధారపడి ఉంటుంది. వాస్తవాన్ని తమ అదుపులో పెట్టుకున్నామనే భ్రమను సృజించుకుంటే వాస్తవాన్ని తప్పకుండా అదుపులో పెట్టుకొనవచ్చు. ప్రాథమిక దశలోనే మ్యాజిక్ అభినయ ప్రాయం. వానకురవాలనుకుంటే మబ్బులు మూయడం, పిడుగులు గర్జించటడం, వర్షాలు కురవడం అభినయిస్తారు. కోరికలు వాస్తవంగా ఈడేరినట్టు మానసిక భ్రమలో అభినయిస్తారు. ఈ అభినయంలో చిట్టచివరకు 'వర్షించు' అనే ఆజ్ఞను మంత్రోచ్చాటనం చేయవచ్చు. ఇది ఆజ్ఞేకాని, ప్రార్థన కాదు. గణంలోని వ్యక్తులు విడివిడిగా ఉన్నప్పుడు బలహీనులే కావచ్చును గాని మూక ఉమ్మడిగా ఉంటే ప్రతికూల ప్రపంచాన్ని, ప్రకృతినీ ఎదుర్కొనవచ్చుననే నమ్మకం తోనే ప్రకృతి శక్తులను శాసించడం ఈ దశలో జరుగుతుంది.

## గణంలోని ముఖ్యుడు గణపతి

ఆదిమ యుగాలలో మనుషులు ముంపులుగా, మూకలుగా, తెగలుగా, ముఠాలుగా, తండాలుగా కలసి మెలసి జీవించేవారు. సంస్కృతంలో ఈ కలసికట్టు వర్గాలను గణము, మతము, పూగము, సంగము, శ్రేణి అనే పదాలతో గుర్తిస్తారు. భారతీయ మతాలు ఆదిమకాలంలో ఎలా ఆవిర్భవించాయో అవగాహన చేసుకోవాలంటే ఎక్కువగా సంస్కృత వాఙ్మయం మీదనే ఆధారపడి విశ్లేషణ చేయాలి. ఆస్తిక మతాలన్నీ వేద జీవితం గడిపిన వారే. గణంలోని ముఖ్యుణ్ణి గణపతి అంటారు. ఋగ్వేదంలోని రెండవ మండలం కడు ప్రాచీనమైనది. అందులోని ఒక ఋక్కులో గణపతి ప్రసక్తి, ప్రశంసా ఉన్నాయి. (ఇప్పటికీ ఈ ఋక్కునే హిందువుల శుభకార్యాలలో పురోహితులు చదువుతూ విఘ్నేశ్వర పూజ చేయిస్తారు.)

"గణానాంత్వా గనపతిగ్ంం హవామహే
కవిం కవీనా ముపమశ్రవీస్తవం
జ్యేష్ఠరాజం బ్రహ్మణాం బ్రహ్మణస్పత
ఆనశ్శృణ్వన్నూతిభి స్సీదసాదనం"

(ఋ. II. 23-1)

ఈ ఋక్కులోని దేవత బ్రహ్మణస్పతి. ఇతడు గణాలలో గణపతి. కవులలో కవి. పెద్దలలో పెద్ద. ఊహించలేనంత ఆహార సమృద్ధి కలవాడు. ఈ బ్రహ్మణస్పతితో పాటు బృహస్పతిని కూడా ఈ సూక్తానికి ద్రష్ట అయిన ఋషిగృత్సమదుడు లేక గృత్సమదుడు కీర్తించాడు. (బృహస్పతి గృత్సమదుల సంబంధంలో ఒక విశేషముంది. దాని గురించి తర్వాత చెప్పకుందాం ఋగ్వేదంలోని ప్రాచీనమైన రెండవ మండలంలోనే కాక కొంత అర్వాచీనమైన పదవ మండలంలోకూడా గణపతిని ఆవాహన చేయడం కనబడుతుంది (X - 112 - 9) యజుర్వేదం వాజసనేయ సంహిత కూడా గణపతిని ప్రశంసిస్తుంది. ఈ గణపతి ప్రియణం ప్రియపతి, నిధీనాం నిధిపతి. (XX 111-19) ఇదే వాజస నేయ సంహిత ఇంకొకచోట గణాలతో పాటు గణపతులను, వ్రాతములతో పాటు వ్రాపతులను, గృత్యులను కీర్తిస్తుంది. (XVI - 25)

ఋగ్వేద ప్రజలు గణజీవితం నుండి వ్రాతజీవనానికి ఎదిగారు. గణపతుల లాగే వ్రాతపతులు కూడా సామూహిక జీవితానికి అవసరమయ్యారు. వ్రాతములో జీవించేవారిని

వ్రాత్యులు అంటారు. వీరు ఒక దశలో గౌరవనీయులే గాని ఉత్తరోత్తరా అభివృద్ధి చెందినా వైదిక ప్రజల దృష్టిలోనే హీను లయ్యారు. దానికి కారణం వారు బృహస్పతి నిర్దేశించిన జీవిత విధానాన్ని అనుసరించడమే.ఒకప్పుడు వైదిక ప్రజలకు బృహస్పతి పూజనీయుడే గాని ఉత్తరోత్తరా అతడు తన ప్రాముఖ్యాన్ని కోల్పోయాడు. అందుచేత అతని సిద్ధాంతాలను మారిన పరిస్థితులలో కూడా పాటించేవాళ్ళు నింద్యు లయ్యారు. బృహస్పతి దేవగురువు, శుక్రుడు అసురగురువు అన్న విషయం సర్వ విదితం.ఈ ఇద్దరూ చెరొక నీతి శాస్త్రాన్ని రచించారు. దండనీతి ఒక్కటే విద్య అని శుక్రుడు చెప్పాడు. వార్త, దండనీతి ఈ రెండూ మాత్రమే విద్యలని బృహస్పతి బోధించాడు.వృత్తి నుండి వార్త అనే పదం పుట్టింది. వ్యవ సాయం. పశు పాలన, వాణిజ్యం అనే మూడు కలసి వార్త అనిపించుకుంటాయి. వార్త సక్రమంగా సాగితేనే జీవితావసరాల ఉత్పత్తి సమృద్ధిగా ఉంటుంది. వార్తకు ఆటంకాలు కల్గించే వారిని మార్చడానికి గానీ, పరిమార్చడానికి గానీ దండం సాధనం. దీని ప్రయోగమే దండ నీతి. ఇది బృహస్పతి మతం. ఇతడు ఈ సిద్ధాంతాలను చార్వాకుడికి ఉపదేశించాడు. బృహస్పతి నీతిని అనుసరించే వాళ్ళను బార్హస్పత్యులంటారు. ఆదిమ బార్హస్పత్యులు వ్రాత్యులే.

## వర్ణాశ్రమ ధర్మాల వ్యవస్థ ఎలా ఏర్పడింది

ప్రాచీన కాలంలో జనులు గణాలలోనూ, వ్రాతలలోనూ జీవించేవారు. అయితే క్రీస్తు పూర్వం 500నాటికి గణాలూ, వ్రాతములు విచ్ఛిన్నమయి వాటి శిధిలాలపై వర్ణాశ్రమ ధర్మాల వ్యవస్థ రూపొందింది. రాచరికం మొలకెత్తింది. ద్విజాదుల కోసం శ్రౌత సూత్రాలనూ, గృహ్యసూత్రాలనూ కాత్యా యనుడు, గౌతముడు వంటి ఆచార్యులు రచించవలసి వచ్చింది. సమాజంలోని వ్యక్తులకు సొంత ఆస్తులు ఏర్పడ్డాక వారసత్వపు హక్కులను నిర్వచించడానికి వాటిని సంరక్షించ డానికి ధర్మ శాస్త్రాలను రచించవలసి వచ్చింది. వారసత్వ మన్నది సపిండ సంబంధాలపైన శాస్త్ర విధులపైన ఆధారపడి ఉంటుంది.గణ జీవితంలో వారసత్వపు ప్రసక్తి అంతగా ఉండదు. వాళ్ళ దృష్టిలో అర్థం అంటే ధనం కాదు. వార్త మాత్రమే. ప్రాచీన గణ జీవితం గురించీ, వ్రాత్యుల వ్యవహారం గురించీ వ్యాకరణ సూత్రాల వల్లా ధర్మ శాస్త్రాల వల్లా కొంత తెలుసుకోవచ్చు.

## వ్రాత్యులే శూద్రులు

క్రీస్తుపూర్వం 300కి కొంచెం ప్రాచీనుడైన పాణిని 'వ్రాతేన జీవతి' అనే సూత్రం ఒకటి చెప్పాడు. దీనికి క్రీ.పూ. 150 ప్రాంతాల వాడైన పతంజలి తన 'మహాభాష్యం'లో వివరిస్తూ వ్రాతములు విభిన్న మానవ సంఘాలనీ, అందులోని వాళ్ళకు ప్రత్యేకమైన వృత్తులంటూ ఏమీ ఉండవని, కాయకష్టం చేసు కుని బ్రతుకుతారనీ చెప్పాడు. కాశికారుడు వ్రాతములోని మానవులకు అర్థకామాలు రెండే ప్రధానమైనవని (ధర్మాన్ని పట్టించుకోని) చెప్పాడు. భట్టోజీ ఇంకొక విషయం స్పష్టం చేశాడు. వ్రాత్యులు శరీరాయాసం మూలంగానే గాని బుద్ధి వైభవం వల్ల జీవించరన్నాడు. ఈ వైయాకరణులందరూ ఎందరెందరో కాయకష్టంతో ఉత్పత్తి చేసిన సమస్తాన్నీ కొద్ది మంది అగ్రవర్ణాల వాళ్ళు తమ బుద్ధిబలంతో అనుభవించే రాచరికపు తొలి దినాల వాళ్ళు. వాళ్ళకు ధర్మమే,అందులో వైదిక ధర్మమే ముఖ్యం. బార్హస్పత్యులకు అర్థకామాలూ రెండే జీవిత సత్యాలు.ఈ వ్రాత్యులకు ఉపనయన సంస్కారం లేదు. అక్కర్లేదు. అందుచేత వీళ్ళు వైదికుల దృష్టిలో శూద్రుల కింద లెక్క.

## గణ యజ్ఞం అంటే ఏమిటి?

శూద్రులు గణ జీవిత సూత్రాలనే పాటిస్తారు. గణపతిని పూజిస్తారు. గణయాగాలనూ, గణయజ్ఞాలనూ చేస్తూ ఉంటారు. (మనువు చెప్పాడను కొంటున్న ఒక శ్లోకం వల్ల పీడిత వర్గాల వాళ్ళూ, శూద్రులు గణపతిని ఆరాధిస్తారన్న సంగతి ధ్రువపడిన విషయం) శూద్రులవల్ల జీవనోపాధిని గడించే వారినీ, గణాలకై యాగాలు చేసేవారినీ, శ్రాద్ధాలలో భోక్తలుగా పిలవకూడదని మనుస్మృతి శాసిస్తోంది. (III-164). ఇంతకీ గణయాగం అంటేఏమిటి? మనువు కంటే చాలా ప్రాచీనుడైన కాత్యాయనుడు తన శ్రౌత సూత్రాలలో గణ యజ్ఞం అంటే ఏమిటో తెలుసుకొనడానికి వీలైన సూచనలను ఇచ్చాడు. (కా.శ్రౌ.సూ. XX II- 11-12) గణంలోని భ్రాతలూ, సఖులూ కలసికట్టుగా తమలో తాము జరుపుకునే మ్యాజిక్ తంతును గణయజ్ఞం అంటారు. ఇందులో దేవతారా ధన, అర్చన మొదలైన వేమీ ఉండవు. ఈ మ్యాజిక్ చర్యలను ఆద్య వైదికార్యులు కూడా చేసేవారు. బృహస్పతిని గణపతిగా స్తుతించిన గృత్సమదుడు బార్హ స్పత్యుడని భావించడంలో తప్పులేదు. ఈ ఋషి పేరులోని 'గృత్స' లేక 'తృత్స్య' అనే పదానికి మ్యాజిక్ చేసేవాడని అర్థం. యజుర్వేదం లోని వాజస నేయ సంహిత ఒక చోట గణాలకూ, వాళ్ళతో పాటు, గృత్స్యు లకు (మ్యాజిక్ చేసేవారికి) అభివాదాలను తెలుపుతుంది. (XVI - 25) ఆదిలో గణపతే గృత్స చర్య చేయించేవాడు.

## గణపతి అంటే ఎవరు?

ఒక్కొక్క గణానికి ఒక గణపతి ఉంటాడు. ఆ గణానికి సంబంధించిన టోటెమ్ చిహ్నమే అతని లాంఛన మవుతుంది. (ఒక గణపతి వృషభధ్వజుడు మరొక గణపతి లాంఛనం ద్విజిహ్వక) ఆదిలో ఒక ప్రముఖ గణానికి హస్తి పవిత్ర చిహ్న మైంది. ఈ గణలాంఛనమే ఉత్తరోత్తరా ప్రాచుర్యం పొందింది. గణ జీవితావసరాలకు బొటా బొటిగా ఉత్పత్తి జరుగు తున్నంతకాలం టోటెమ్ చిహ్నానికి పూజలుండవు. గణపతి సమానులలో ప్రథముడు, జ్యేష్ఠుడు మాత్రమే. అయితే ఉత్పత్తి విధానాలలో అభివృద్ధి చెంది అవసరాలకు మించిన అదనపు ఉత్పత్తి సాధ్యమైనప్పుడే, నిలువ చేయగలిగినప్పుడే పరిపూరి కాయకష్ట ఫలితాన్ని కొద్దిమంది తమ బుద్ధి వైభవం చేసకుని జీవించగలుగుతారు. అప్పుడు గణపతిని ఎన్ను కొనడం అన్న ఆచారం మారిపోతుంది. గణనాయకత్వం వార

సత్వం కింద పరిణమిస్తుంది. టోటెమ్ చిహ్నానికి పూజలూ పురస్కారాలూ ప్రారంభమవుతాయి. గణచిహ్నం మానవా కృతిని దాల్చుతుంది. దైవంగా స్థిరపడుతుంది. అద్భుత శక్తులను సంతరించుకుంటుంది. మతం ఆవిర్భవిస్తుంది. గణపతులు పాలకులవుతారు. ఉత్పాదక శక్తులు విస్తృతమవు తున్న కొద్దీ పాలకుడికి రాజోపచర్యలు అధికమౌతాయి. అతడు దైవాంశ సంభూతుడవుతాడు. గణచిహ్నం రాజచిహ్న మవుతుంది పరిపాలిస్తున్న గణం ఇతర గణాలను వాటి పవిత్ర చిహ్నాలను తనలోవిలీనం చేసుకుటుంది. రాజచిహ్నం అన్ని గణాలకూ దైవమవుతుంది. ఉత్తరోత్తరా రాజ్యానికే దైవమవు తుంది.

## జనపదం అంటే ....

కౌటిల్యుడు తన అర్థశాస్త్రంలో వివిధ దేవతల గురించి చెప్పాడు. దేశ దేవత (13-2-15), నగర దేవత, రాజదేవత (2-4-15) అని వేరు వేరు దేవతలను పేర్కొన్నాడు. క్రీస్తు పూర్వం 32- - 185 మధ్య వర్థిల్లిన మౌర్యవంశం కాలంలో కౌటిల్యుడు జీవించాడు. అప్పుడే అర్థశాస్త్రం రచించాడు. అప్పటికి జనపదాలు ముఖ్యంగా పదహారు మహాజనపదాలు ఏర్పడ్డాయి. కొన్ని కొన్ని గణాలు స్థిర నివాసం ఏర్పరచుకున్న ప్రాంతాన్నే జనపదం అనేవారు. ఉదాహరణకు పాంచాల జనపదం. కోసల జనపదం. ఒక్కొక్క జనపదంలో ఎనిమిది వందల గ్రామాలు ఉంటాయి. ఒక్కొక్క గ్రామంలో నూటికి తక్కువ కాకుండా అయిదు వందలకు మించని కుటుంబాలు అన్యోన్యాశ్రయమై ఉంటాయి. ప్రతి గ్రామానికి ఒక దేవత ఉంటుంది. సర్వసాధారణంగా గ్రామదేవత ఆడదైవమే.

## మాతృస్వామ్యవ్యవస్థలో స్త్రీయే గణాధిపతి

వ్యవసాయమే ముఖ్యాధారమైన మాతృస్వామ్య వ్యవస్థలో గణానికి పెద్దదైన స్త్రీయే స్త్రీ దేవతల కొలుపులు జరపడంలో ప్రథమ గణాచారి. పశుపాలన ముఖ్యజీవనాధారమైన పితృ స్వామ్య వ్యవస్థలో గణపతి ఉన్నట్టే మాతృస్వామ్య వ్యవస్థలో 'వైనాయకి' అనే గజముఖి ఉంటుంది. (వైనాయకి విగ్రహాలు దక్షిణ దేశంలోని శుచీంద్రం కోవెలలోనూ, చిదంబరం ఆలయంలోనూ ఉన్నాయి. ఇటీవల కడలూరు దగ్గర మరొక వైనాయకి విగ్రహం బయటపడింది ఈ వైనాయకి కుడిచేతిలో పద్మం వుంది. పద్మం సంతానసిద్ధికి చిహ్నం). దేశంలోని కొన్ని ప్రాంతాలలోని గణేశ చతుర్థి వ్రతంలో మొదట గణపతి పూజతో ప్రారంభించినా రెండో రోజు నుంచీ ఆడదేవతనే పూజిస్తారు. ఆమె గౌరి. ఈమెకు విగ్రహం వుండదు తెలుగు వాళ్ళ 'పోలాల అమావాస్య' వ్రతంలో కంద మొక్కల కట్టను పూజినట్టు ఈ గౌరి కొన్ని మొక్కల గుత్తి మాత్రమే తెలుగు వాళ్ళ 'సౌభాగ్యగౌరి' వ్రతంలోని పాటలు లాగ దేశంలోని వివిధ ప్రాంతాలలో చేసే గణేశ చతుర్థి గౌరీ పూజలో 'కంటి కంటి ఏమి కంటి'? అనే అర్థం వచ్చే పాటలు ఆడవాళ్ళు, పిల్లలూ పాడుతారు. నృత్యాలు చేస్తారు. వ్యవసాయ దేవత అయిన ఈ గౌరిపంటకూ, కడుపు పంటకూ పూజనీయురాలు. 'లజ్జాగౌరి' ప్రతిమలు అత్యంత ప్రాచీనాలు. (తెలుగుప్రాంతాలలో కూడా ఇవి ఉండేవి). ఈ లజ్జాగౌరి నుండే గజలక్ష్మి రూపాంతరం చెందింది. (లజ్జా గౌరిపైన ప్రత్యేక వ్యాసం అవసరం)

## గణపత్య శాఖలు

ప్రప్రథమంగా గణపతి ఆరాధన ప్రారంభమై గణాపత్యం అనే మతం ఆవిర్భవించింది. ఆనందగిరి తన శంకర విజ యంలో చాలా గణాపత్య శాఖలను పేర్కొన్నాడు. వీటిలోని ఉచ్ఛిష్ట గణపతి ఉపాసకులు వామాచారులని ఆనందగిరి స్పష్టం చేశాడు. పంట వృద్ధికోసం, కడుపుపంట విస్తరణ కోసం వామాచారంలో 'మ్యాజిక్' చర్యలుంటాయి. అందుకే పాశాం కుశాలకు బదులు కొన్ని గణపతి విగ్రహాల చేతుల్లోని ఆయు ధాలుగా ఫలాలు కనబడతాయి. లక్ష్మీ గణపతి విగ్రహం చేతు లలో దానిమ్మపండు, పద్మం, జలపాత్ర, కల్పలత ఉంటాయి. మహా గణపతి విగ్రహం హస్తాలలో పద్మం, దాడిమపండు గుహలలోని ఒక చిత్రంలో గణపతి సప్తమాతృకల వెనుక ఉంటాడు. గణాపత్యంలో స్త్రీ పురుషులు సరిసమానులు. శాక్తంలో పురుషుడిది రెండో స్థానమే.

## తంత్రం అంటే....

శాక్తం తంత్ర ప్రధానమైన గుప్త విద్య. తంత్రం అన్న పదం 'తన్' అనే ధాతువు నుండి వచ్చింది. 'తన్' అంటే విస్తరించు, వ్యాపించు అని అర్థం. తంత్రం దేనిని విస్తరించాలనీ, వ్యాపింప చేయాలనీ అభిలషిస్తుంది అని ప్రశ్నించుకుంటే కుటుంబాన్నీ, కులాన్నీ అని నిస్సందేహంగా చెప్పవచ్చు. 'సంతానం', 'తనయ' అనే పదాలు కూడా 'తన్' అనే ధాతువు నుండే వచ్చాయి. శాక్తంలో పంచమకారాలుంటాయి. ఇవి అయిదు మాటలు. అన్నింటిలోనూ మొదటి అక్షరం 'మ' గుణింతం లోనివే. మద్యం, మాంసం, మత్స్యం, ముద్ర, మైథునం అనే అయిదిం టిని పంచమకారాలంటారు. (ముద్ర అంటే యోగముద్ర అని పొరపడగూడదు. వేయించిన తిండి గింజలను ముద్రలం టారు.). ఆదిమ గణ జీవితంలో ఆహార పానీయాలలో మత్స్య మాంసాలూ, మద్యం, ముద్ర అవసరమైనవే.సంతానోత్పత్తికి అయిదవ మకారం ఎప్పుడైనా తప్పని సరే. ఆద్య శాక్తానికి ఆద్య ప్రకృతి పరిజ్ఞానమే ప్రాతిపదిక.

## శాక్తంలో దైవపూజ లేదు

తొలిపాటి శాక్తంలో దైవ పూజలు లేవు. ప్రకృతి శక్తులను అభిలాషలకు అనువుగా మలచుకొందుకి మ్యాజిక్ చర్యలే ఉండేవి. గణయాగంలో మ్యాజిక్ అజ్ఞానంపైన ఆధారపడి, ఆవిర్భవిస్తుంది గాని అది కేవలం అజ్ఞానమనుకో కూడదు. అది కార్యాచరణకు మానసికంగా ప్రేరేపించే మార్గ చర్య. వ్యవసాయ పరిజ్ఞానం అంతంత మాత్రంగా ఉన్నప్పుడు ప్రకృతి పరిణా మాలకు, తమ శారీరక ధర్మాలకు గల పరస్పర సంబంధాలను ఊహించేపాటి చైతన్యం ప్రశంసనీయమైనదే. మూఢ విశ్వాసాలు కొనసాగుతున్నా హేతువాద దృక్పథంతో ఒక దర్శనాన్ని

రూపొందించు కొనడానికి పునాదులు ఈ దశలోనే పడ్డాయి. ఆ దర్శనం ఆదిమసాంఖ్యం.

## సాంఖ్యం–వేదప్రమాణాన్ని అగీకరించదు

బ్రహ్మ సూత్రాలు సాంఖ్యాన్ని 'ప్రధానవాదం' 'ప్రధాన కారణవాదం' అని పేర్కొంటాయి. సాంఖ్యంలో 'ప్రధానం' అన్నమాట ప్రకృతికి పర్యాయపదం. సాంఖ్యులు 'ప్రధానమే జగత్కారణ' అంటారు. ప్రధానం అచేతనమైనది. అయినా అది సత్త్వరజస్తమో గుణ రూపిని కనుక జగత్తుకు ఉపాదాన కారణమైంది. సాంఖ్యం వేదప్రామాణ్యాన్ని అంగీకరించదు. వేదాంతుల బ్రహ్మవాదాన్నిలేక, బ్రహ్మ ప్రధానవాదాన్ని తోసి రాజంటుంది. సాంఖ్యంలో ప్రకృతి మూల ప్రధానమైతే పురుషుడు అప్రధానుడు. పైగా సాంఖ్యంలో పురుష బహుత్వం ఉంది. ప్రకృతి ధర్మాలను గుర్తించినప్పుడే మానవులు ప్రకృతిని జయించడం సాధ్యమౌతుందని సాంఖ్యం తెలియచేస్తుంది. ప్రకృతిని జయించడానికి యోగం ఒక సాధనం.

బయట నున్న స్థూల జగత్తులాగే మానవ శరీరంలో ఒక సూక్ష్మ జగత్తు ఉంటుందని యోగాచారం వల్ల శరీరాన్ని స్వాధీనంలో ఉంచుకుని సిద్ధులను పొందవచ్చుననే విశ్వాసం వల్ల అష్టాంగ యోగం రూపొందింది. 1).యమము 2) నియమము 3) ఆసనము 4) ప్రాణాయామము 5) ప్రత్యాహారము 6) ధారణము 7)ధ్యానము 8) సమాధి అనే ఎనిమిది యోగంలోని అంగాలు వీటిలోని ఆసనాలు రోగ నివారణకు అవసరం 'ఆసనేన రజోహంతి' అంటారు. ఆసనాలు అభ్యసించడం వల్లరజోగుణం నశిస్తుంది. ప్రాణాయామం వల్ల ఉచ్ఛ్వాస నిశ్వాసాల గమనాగమనాలను నిరోధం చేయగలగడం సాధ్యమవుతోంది. ప్రత్యాహారం వల్ల విషయములలో సంచ రించే ఇంద్రియాలను బలాత్కారంగా మరలించి కోరిన విషయాలలో ప్రవేశపెట్టవచ్చు. ఇందువల్ల కర్మేంద్రియ జ్ఞానేంద్రియాలు సాధకులు స్వాధీనంలో ఉంటాయి.ధారణకు ఇది అవసరం. ధారణవల్ల మనోధైర్యం కలుగుతుంది. ధ్యానం వల్ల చైతన్యం ఉద్బుతమవుతుంది. సమాధి వల్ల మనస్సును వశపర్చుకోవచ్చు. యోగంలోని ఆసనాది ఆరు అంగాలను పాటించడానికి సాధకులకు యమనియమాలు ముఖ్యం.

## యోగంవల్ల మనోధైర్యం

ఆదిమ సమాజాలలో ప్రకృతిని జయించదలచుకున్న వారికి మనోధైర్యం ముఖ్యం. అదియోగం వల్ల సాధ్యమవుతుంది. జాతి అవసరాలకు కావలసిన వాటిని ఉత్పత్తి చేసుకుని సుఖజీవనం గడపడమే ఆదిమసమాజంలో మానవుల ధ్యేయం. ప్రకృతి ధర్మాలను అర్థం చేసుకొనడానికి హేతువాదం కావాలి. తార్కిక దృష్టి, తార్కిక చింతన అవసరం. దీనిని లోకాయత విధానం సాధించింది. కౌటిల్యుని కాలం (క్రీ.పూ.322 - 1853) లో సాంఖ్యం, యోగం, లోకాయత అనేవి మూడే ముఖ్యంగా ప్రాచుర్యం పొందాయి. ఇవి 'అన్వీక్షకి' అనే విద్యలోని అంగాలు .అని కౌటిల్యుడు చెప్పారు. తన అర్థ శాస్త్రంలోని మొదటి అధికరణంలోని రెండో అధ్యాయంలో తొలి ప్రకరణంలో విద్యా సముద్దేశమనీ, అందులో 'అన్వీక్షకే స్థాపన' అని నొక్కి చెప్పాడు. ఈ ప్రకరణం చివర అన్వీక్షకిని ఇలా ప్రస్తుతించాడు.

ప్రదీపః సర్వ విద్యా నా ముపాయః సర్వ కర్మాణాం
ఆశ్రయః సర్వ ధర్మాణాం శశ్వదాన్వీక్షకీమతా"
(1-2-12)

అన్వీక్షకీ మతం సర్వవిద్యలకూ దీపం లాంటిది. సర్వ కర్మలకూ ఉపాయం, సర్వ ధర్మాలకూ ఆశ్రమం అని సర్వదా భావిస్తారు. ఈ అన్వీక్షకి మతం వల్లనే వేదాలలో ఏది ధర్మమో, ఏది అధర్మమో, వార్తలో ఏది అర్థమో, ఏది అనర్థమో, దండనీతిలో ఏది నయమో, ఏది అనయమో. విద్య లన్నింటిలో ఏవి గుణములో ఏవి దోషాలో, హేతు వాదం చేత నిర్ణయించవచ్చు. అందుకే అన్వీక్షకీ లోకానికి ఉపకారం చేస్తోంది. వ్యవసాభ్యుదయాల్లో బుద్ధికి ధైర్యం కలిగిస్తూ మనోవాక్కాయ కర్మలకూ పటిష్టతను చేకూరుస్తోంది. అని కౌటిల్యుడు చెప్పాడు (1-2-11).

## కౌటిల్యుడు లోకాయతను ఆదర్శంగా తీసుకున్నాడా?

మానవుల బతుకు తెరువులను సుగమం చేసే లోకాయత మతాన్ని కౌటిల్యుడు ఆదర్శంగా తీసుకొనడంలో ఆశ్చర్యం లేదు. కౌటిల్యుని సిద్ధాంతాలు ఆ మతానికి చాలా దగ్గరగానే ఉంటాయి. 'అర్థ ఏవ ప్రధాన ఇతి కౌటిల్యః' (1-7-6) అని తన మతంలో అర్థమే ప్రధానమని చెప్పడమే కాక ' అర్థమూలౌహి ధర్మకామావితి, (1-7-7) అని ధర్మ కామాలు రెండింటికీ అర్థమే మూలమన్నాడు. అర్థం అంటే చిట్ట చివరి అధికరణంలో మొట్టమొదట ఇలా వివరించాడు. 'మనుష్యాణాం వృత్తి రర్థః మనుష్యవతీ భూమి రిత్యర్థః (15-1-1), మనుష్యులకు జీవనోపాధికి మూలము అర్థం లేదా మనుష్యులతో కూడిన భూమియే అర్థం అని చెప్పాడు. లోకాయతుల సిద్ధాంతాలకు కూడా విధానమే ప్రాతిపదిక. వాళ్ళకు వేదం ప్రామాణ్యం కాదు. కౌటిల్యుడు వేదాలను కూడా అంగీకరిస్తాడు కనుక ధర్మం అవసరమే అంటాడు. అయితే ఏది ధర్మం ఏది అధర్మం అన్న ప్రశ్నే వస్తే ఆర్థిక విధానాల వల్ల ధర్మాధర్మ నిర్ణయం జరుగుతుందని ధ్వనిస్తాడు. లోకాయతులు ధర్మాన్ని పూర్తిగా నిరాకరిస్తారు. వారికి అర్థకామాలే ముఖ్యం.

## లోకాయత సిద్ధాంతాలు

కౌటిల్యుడు అర్థ శాస్త్రాన్ని రచిస్తున్నాడు కనుక లోకాయతం సిద్ధాంతాలను ఉదాహరించలేదు. అలా చేసినవాడు ఆదిలో వాత్స్యాయనుడే. కామశాస్త్ర రచన అనవసరమనే వారి వాదాలూ, వాటిలోని యుక్తులూ చూపెట్టి వారి ఆక్షేపణలకు సమాధానాలు చెప్పాడు. ఆదిలో సాధారణాధికరణంలోనే నాస్తిక దర్శనాలో చెప్పే కారణాలను పేర్కొన్నాడు. లోకా

యత సిద్ధాంతాలను వివరించే ఆరు సూత్రాలను ఉదాహరించి వాటిని విశదీకరించాడు. వాటిని ఇక్కడ పరిశీలిద్దాం.

1). నధర్మాంశ్చరేత్ (1-2-25).

లోకాయతులు (వైదిక) ధర్మాలను ఆచరించకూడదంటారు. వాత్స్యాయనుడు గ్రంధాదినే 'ధర్మార్థకామేభ్యోనమః (1-1-1) అని ధర్మంకొరకు, అర్థం కొరకు,కామం కొరకు నమస్కరిస్తున్నాను అన్నాడు. తను పూజించే ధర్మాన్ని లోకాయతులుఆచరించకూడదంటారని ముందే ఆ సూత్రాన్ని ఉదాహరించాడు.

2). ఏ ష్యత్ఫలత్వాత్ (1-2-26).

లోకాయతుల సిద్ధాంతం ప్రకారం ధార్మలను ఎందుకు ఆచరించకూడదంటేఅవి ఏష్యతఫలం గలవి కనుక. అంటే వాటిఫలం ఇప్పుడుకాక ఎప్పుడో సిద్ధించేవి. వైదిక యజ్ఞ యాగాల వంటి ధర్మసాధక కార్యాలు ఇహలోకానికి సంబంధించినవి కావు. ఈ జన్మలో ఫలమిచ్చేవి కాక జన్మాంతరంలో ఫలమిచ్చేవికనుక ధర్మాలను ఆచరించడం నిరుపయోగం. ఎంత తెలివి తక్కువ వాడైనా ఇహ లోకంలోఫలవంతమైన సేద్యం మొదలైన వాటినేచేపట్టి ఫలం అనుభవిస్తాడు గాని పరలోకాన్ని ఆశించడని వ్యాఖ్యానం.

3) సాంశయినత్వాచ్చ (1-2-27).

కష్టపడి ఎలాగో యాగాదులు చేసినా స్వర్గఫలం వస్తుందో రాదో నిశ్చయంగా చెప్పలేం.సందేహస్పదమై ఏ పనికీ ఎవ్వడూ డబ్బు ముడుపుపెట్టడు. అందుచేత ధర్మాలు ఆచరించ కూడదు.

4) కోహ్య బాలిశో హస్తగతం పరగతంకుర్యాత్ (1-2-28)

స్వహస్తాలలో ఉన్నది ఏ తెలివి తక్కువ దద్దమ్మ పరహస్త గతం చేస్తాడు? తన చేతిలోని సొమ్ము ఇంకొకడి దగ్గర సురక్షితంగా ఉండదని ఎవ్వడూ ఎలా నమ్మడో అలాగే ఇహ లోక సౌఖ్యాన్ని వదులుకొని పరలోకం కోసం ఎదురు చూడడు.

5) వరమద్య కపోత శ్శ్వో మయూరాత్ (1-2-29).

రేపటి నెమలి కన్నా నేటి పావురమే దొడ్డగి. చచ్చిపోయాక ఒకవేళ దొరికే స్వర్గం కన్నా ఇప్పుడు బతికున్న భూలోకమే శ్రేష్టం. పక్షులనువేటాడి చంపి మాంసం తిందామనుకునే వాడికి ముందెప్పుడో దొరకబోయే నెమలికన్నా ఇవాళ చిక్కే పావురమే గొప్పదని లోకులు భావిస్తారు కదా?

6) వరం సాంశయికాన్నిష్కాద సాంశయికః కార్షాపణ ఇతి

లౌకయతికాః (1-2-30).

వస్తుందో రాదో తెలియని బంగారు నాణెంకన్నా కచ్చితంగా లభించే అల్పనాణెం నయం. 'ఇవాళ నా దగ్గర రూపాయి పావలా మాత్రమే వుంది. రేపు మాత్రం నాకు నూరు రూపాయలు వస్తాయి. అప్పుడో సవరను నీ కిస్తాను' అని ఎవరైనా అంటే నిక్కచ్చిగా తెలియని నిష్కం కన్నా అనుమానానికి తావులేని కార్షాపణాన్నే మిన్నగా లోకులు భావిస్తారు - ఇవిలోకాయతుల మాటలు.

## జయమంగళ టీక అంటే...

వాత్స్యాయనుడి కామసూత్రాలకు యశోధనుడు వ్యాఖ్యానం రాశాడు. దీనిని జయమంగళటీక అంటారు. లోక ప్రసిద్ధి గల దృష్టాంతరాలనే లోకాయతులు చూపించారని తన వ్యాఖ్యానంలో అడుగడుగునా విశదపరిచాడు.బార్హస్పత్యం, చార్వాకం, లోకాయత ఒక కుదుటిలోనివే. వీటి సిద్ధాంతాలు గ్రంథ రూపంలో ఎప్పుడూ లేవు. ప్రతి పక్షులూ వివిధ గ్రంధాలలో, వివిధ సందర్భాలలో ఉదాహరించిన వాక్యాలను బట్టే లోకాయత దర్శన స్వరూపం ఇలా ఉంటుందని తత్త్వ శాస్త్ర చరిత్రకారులు దానికి ఒక రూపాన్ని ఊహించారు.

ఆదిలో నిరీశ్వర దర్శనాలను, మతాలను కొన్నింటిని ఆస్తికులు స్వంతం చేసుకుని బలవంతంగా అందులో దేవుణ్ణి చొప్పించారు. అందుకే ప్రధాన కారణవాదమైన సాంఖ్యం ఉత్తరోత్తరాసేశ్వర సాంఖ్యమై అక్కడక్కడ స్వవచోవ్యాఘాతాలకు ఆస్కారమైంది. మనకు ప్రస్తుతం ఆరు ఆస్తిక దర్శనాలు. ఆరు నాస్తిక దర్శనాలు ఉన్నాయి.

## ఆస్తిక – నాస్తిక దర్శనాలు

| ఆస్తిక దర్శనాలు | నాస్తిక దర్శనాలు |
|---|---|
| 1. న్యాయము | 1. చార్వాకము |
| 2. వైశేషికము | 2. సౌతాంత్రికము |
| 3. వేదాంతము | 3. వైభాషికము |
| 4. మీమాంస | 4. యోగా చారము |
| 5. సాంఖ్యము | 5. మాధ్యమికము |
| 6. యోగము | 6. అర్హమతము. |

నాస్తిక దర్శనాలను ఆరు పేర్లతో పిలిచినా నిజానికి అవి మూడే. సౌతాంత్రికం, వైభాషికం,యోగాచారం, మాధ్యమికం అనేవి బౌద్ధ దర్శనంలోని విభేదాలు. బౌద్ధాన్ని సౌగత్యం అని కూడా పిలుస్తారు. అర్హమతమంటే జైనమన్నమాట. నాస్తిక దర్శనాలలో చార్వాకం,బౌద్ధం, జైనం -ఈ మూడే ఉన్నాయి. ఒక్క చార్వాకులలోనే విగ్రహారాధన ప్రవేశించ లేదు గాని కాలక్రమేణా బౌద్ధంలోనూ, జైనంలోనూ చొరబడింది. నాస్తిక దర్శనాలను అవలంబించి ఆరు మతాలు వర్ధిల్లాయి.1) శైవం, 2).వైష్ణవం 3)శాక్తం 4) గాణాపత్యం 5) సౌరం 6) కాపాలికం. వీటిలోని శాక్తం, గాణాపత్యాలు మొట్ట మొదట గణాచారానికి సంబంధించిన మ్యా.జిక్ మీదనే గాని దేవతారాధన పైన ఆధారపడలేదని ముందే గమనించాం. బ్రాహ్మణ్యం చేత చిక్కి ఈ మతాలు మారువేషం వేసుకున్నాయి. ప్రకృతిని మ్యాజిక్కుచేత మార్చవచ్చుననే భావం పోయి దైవాన్ని మంత్రం చేత మెప్పించవచ్చుననే విశ్వాసం ప్రబలింది. ఆ మంత్రాలు చేతిలో ఉన్నావాడు దైవ సమానుడయ్యాడు.

"దైవాధీనం జగత్సర్వం మంత్రాధీనం తుదైవతం
తన్మంత్రం బ్రాహ్మణాధీనం బ్రాహ్మణోమమ దేవతః"

– ' ఈ జగత్తు అంతా దైవాధీనం. ఆ దైవం మంత్రాధీనం. ఆ మంత్రం బ్రాహ్మణుల ఆధీనం కాబట్టే ఆ బ్రాహ్మణులే నాకు దైవం' అని దేవుడి చేతనే చెప్పించారు. ఇతర దర్శనా

లలోనూ మతాలలోనూ బ్రాహ్మణులు తమ చేయి పెట్టారు. గాని లోకాయుతా జోలికి పోలేదు. పురోహిత వర్గం బండారాన్ని బయటపెట్టే మతాన్ని మసిపూసి మారేడుకాయ చేయడం అసాధ్యం.

## విద్యారణ్యుల సర్వదర్శన సంగ్రహం

మాధవ విద్యారణ్యులు సర్వదర్శన సంగ్రహంలో లోకాయతుల గురించి విపులంగానే చెప్పారు. హరభద్ర సూరి 'షడ్దర్శన సముచ్చయం' అనే గ్రంధంలో చార్వాకమతం గురించి వివరించాడు. దీనికి భద్రసూరి టీక రాశాడు. అందులో ఆషాఢభూతులు అమాయకులను ఎలా వంచించి లోబరుచుకుంటారో చార్వాక మతానుసారం చెప్పాడు. పరలోకంలో సౌఖ్యాలు లభిస్తాయనే ఆశను చూపెట్టి వెర్రి ప్రజలను ఆకట్టుకుంటారు. "ఏది తినాలో ఏది తినకూడదో, ఎక్కడికి వెళ్ళాలో ఎక్కడికి వెళ్ళకూడదో, ఏది రోతో ఏది గ్రహించదగ్గదో తెలియని ధర్మ సంకటాల్లో పడేసి ధార్మికంగా ఒక పిచ్చిని పుట్టిస్తారు. స్వర్గం అన్నది ప్రత్యక్ష ప్రమాణం వల్ల తెలియదు. అందుచేత ఈ మోసగాళ్ళు అనుమాన ప్రమాణాన్ని గట్టిగా చూపెడతారు. పిచ్చి ప్రజలు నమ్మేస్తారు. కాబట్టి ప్రత్యక్షమే మూల ప్రమాణం" అని చార్వాకులు చెప్పారని మణి భద్రుడు 'సర్వదర్శన సముచ్చయం' టీకలో చెప్పాడు.

శ్రీ హర్షుడు తన 'నైషధీయ చరిత్ర' పదిహేడో సర్గలో 36వ శ్లోకం నుండి 83వ శ్లోకం దాకా 48 శ్లోకాలలో వివిధ నాస్తిక దర్శనాలు యుక్తులను క్రోడీకరించాడు. (వీటన్నిటి సారాన్ని శ్రీనాధుడు శృంగార నైషధం సప్తమాశ్వాసంలో 64వ నెంబరు వచనం నుండి 87వ నెంబరు పద్యం దాకా 24 గద్య పద్యాలలో అనువదించాడు).నాస్తికులు వేదం అప్రమాణమంటారు. స్వచ్ఛందమే ధర్మమంటారు. కామదేవుడే దైవమంటారు. మరణమే అపవర్గం కనుక దేహం దగ్ధమయ్యాక పాపంలో ఉండదంటారు. సౌఖ్య ప్రదాలయిన కార్యాలను యదేచ్ఛగా ఆచరించవచ్చని చెప్తారు. ఇవన్నీ హేతువాదానికి కట్టుబడ్డ సూక్తులే. అయితే ఈ స్వచ్ఛంద వర్తన వర్గ రహిత సమాజంలోనే సాధ్యమౌతుంది. వర్ణ, వర్గ భేదాలున్న సమాజంలో నాల్గవ జాతివారూ, హీనకులజులూ, పీడిత వర్గాలూ అస్వతంత్రులు. వారిని మతమౌఢ్యం శాసించి బానిసలుగానే ఉంచి వేస్తుంది.

## మత మౌఢ్యానికి మార్క్సిజమే విరుగుడు

తిని కూర్చునే పాలక వర్గాలకు తేరగా పనిచేసే శ్రామికులు ఎప్పుడే అవసరమే. అలా పాటు పడే వాళ్లను ఎప్పుడే దాస్యంలో ఉంచడానికి మతం ఒక పెద్ద సాధనం. "భావవాదం, మతం ఇహలోక కష్టాలను మరపించి, శ్రమ జీవులపై నల్లమందులా పనిచేసి వాళ్ళను చిర దాస్యంలో బానిసలుగా ఉంచి ధనిక ధూర్తుల దాసులను చేస్తాయి" అని శాస్త్రీయ సామ్యవాద మహోపాధ్యాయుడు కారల్‌మార్క్స్ చెప్పిన మాటలను ఆనాడే చార్వాకులు చెప్పడం గమనార్హమని మన దార్శనిక చరిత్రకారులు హెచ్చరిస్తున్నారు. (తెలుగు భాషా సమితి వారి విజ్ఞాన సర్వస్వం - ఏడవ సంపుటి - పుట 14)

మత మౌఢ్యానికి మార్క్సిజమే విరుగుడు.

"Magic rests on the principle that by creating the illusion that you control reality you can actually control it. In its initial stages it is simply mimetic. You want rain, so you perform a dance in which you mimic the gathering clouds, the thunerclap and the falling shower. You enact in fantasy the fulfilment of the desired reality. In its later stages the mimetic act may be accompanied by a command, an imperative 'Rain !' But it is a command, not a request. This principle of collective compulsion corresponds to a stage of society at which the community is still an undividing a weak but united front against the hostile world of nature."

*- The Beginnings — Devi Prasad Chattopadhyaya*

# భారతదేశంలో – మతం వైష్ణవం

–శ్రీ నండూరి రామకృష్ణమాచార్య

భారతదేశంలో మతం అనే ఈ చర్చావేదిక ఏర్పాటుచేసిన విశాలాంధ్ర కార్యకర్తలను మనసారా అభినందించుచున్నాను. ఇది అధ్యయన సదస్సు. మొట్టమొదట నేను విన్నవించవలసిన అంశం – నేను ఈ అధ్యయన సదస్సులో ఒక విద్యార్థిగా – జిజ్ఞాసువుగా పాల్గొంటున్నాను. కార్యకర్తలు నాకు యిచ్చిన శీర్షిక భారతదేశంలో మతం – వైష్ణవం. నేను ఇక్కడ నిలబడింది కేవలం ఒక మానవమాత్రుడుగా మాత్రమేగాని హిందూ మతానికిగాని ప్రతినిధిగాగాదు. వైష్ణవమతానికి వకీలుగా గాదు. హిందూమతంలో వైష్ణవసమాజంలో నా పుట్టుక యాదృచ్ఛికం. నా అభిప్రాయాలు నా వ్యక్తిగతమైనవేగాని ఏ సమాజానికి – ఏవ్యవస్థకు – ఏ మతానికి అనుబంధమైనవికావు.

## II

ఇక చెప్పవలసిన ఇంకో అంశం ఉంది.

కార్యకర్తలు అన్నమాట. "46 ఏళ్ల స్వతంత్ర భారత దేశంలోఎన్నడూలేని రీతిలో మతవిద్వేషం బుసలు కొట్టుతున్నది.

మతాభిమానం వేరు – మత విద్వేషంవేరు. మతోన్మాదం సమాజ శ్రేయస్సుకు విఘాతం. మత విధ్వంసం – మత యుద్ధాలవల్ల మానవాళికి జరిగిన హాని చరిత్ర ఘోషిస్తోంది.

నేడు మనదేశంలో పెచ్చరిల్లిన మతోన్మాదం – మనదేశ రాజ్యాంగ లక్ష్యాలకు లౌకిక ప్రజాస్వామ్య వ్యవస్థలకు తీవ్రమైన ముప్పుగా పరిణమించింది. మతాన్ని రాజకీయ స్వార్థానికి – "హిందూత్వ" శక్తులు ఉపయోగించుకుంటున్నాయి".

అర్థశతాబ్దిక్రితం – మతోన్మాదం భారతదేశంలో వికటాట్టహాస విలయతాండవం చేసింది. 6 లక్షలమంది ఘోర దురంత దారుణ హత్యలకు గురి అయ్యారు. ఒక కోటి 60 లక్షల మంది కాందిశీకులయ్యారు. ఇళ్ళు వాకిళ్ళు, ఆస్తిపాస్తులు, పుట్టిపెరిగిన ఊళ్ళు వదిలి ప్రజలు ప్రవాసులైనారు. స్వాతంత్ర్యావతరణకు పూర్వం అనగా 15-8-1947కు ముందు గాంధీ మహాత్ముడు – "నా శరీరాన్ని రెండు ముక్కలుచేసి ఆ మీదట భారతదేశాన్ని విభజించండి" అని ఎలుగెత్తి చాటారు.

హిందువులు వేరుజాతి – ముస్లిమ్‌లు వేరుజాతి. మత ప్రాతిపదికమైన పాకిస్తాన్ కావాలన్నాడు జిన్నా. అధిక సంఖ్యాకులు ముస్లిమ్‌లు – పాకిస్తాన్ కావాలన్నారు. వింతలలో వింత –పంజాబ్ – బెంగాల్ – సింధ్ మొదలైన రాష్ట్రాలలో ముస్లిమ్‌లు పాకిస్తాన్ కావాలని కోరుకొనటం అర్థంచేసుకోవచ్చు. దక్షిణ దేశంలోని ముస్లిమ్‌లు పాకిస్తాన్‌ను కోరటం విచిత్రం.

దేశంలో నలుమూలల హిందూ ముస్లిమ్ కొట్లాటలు చెలరేగాయి. నవకాళిలో హిందువులు – తరువాత బీహార్‌లో ముస్లిమ్‌లు మతోన్మాదానికి బలియైపోయారు వేలు లక్షలు మంది సింధు – పంజాబ్ రాష్ట్రాలలో.

ఏమైనా – ఈ సదస్సు ఏర్పాటు చేసినందుకు కార్యకర్తలకు నా హృదయపూర్వకమైన అభినందనలు. "హిందూత్వం" మతోన్మాదం గూర్చి – కార్యకర్తలు ఉపోద్ఘాతంలో ఉటంకించటానికి కారణం బహుశః బాబ్రీ మసీదును కూల్చటం కావచ్చు. అబుల్ కలామ్ ఆజాద్‌గారు 50 ఏండ్లక్రితం అన్నమాటః "ముస్లిమ్‌లు ప్రత్యేక హక్కులు కోరటం – మూర్ఖత్వం. దానిని హిందువులు వ్యతిరేకించటం అంతకంటే మూర్ఖత్వం".

శిథిలావస్థలో వున్న ఒక పురాతన కట్టడాన్ని కూల్చటం – కూల్చి తామేదో ఘనకార్యం చేశామని అనుకోటం హిందువుల మూర్ఖత్వం. ఎందుకూ పనికిరాని – గబ్బిలాలు కూడా ఉండటానికి వీలుకానంతగా పాడుపడిన జీర్ణమందిరం కూలిపోతే– తమ బ్రతుకులు – సంస్కృతి మతం పోయాయనుకోటం – ముస్లిమ్‌ల మరీ మూర్ఖత్వం. కూల్చిన బాబ్రీమసీదు ఉన్న చోట – రామాలయం కట్టాలనే ప్రయత్నం పిచ్చి ఊహ. అక్కడ పూర్వకాలంలో హిందూదేవాలయం వున్నట్లు ఋజువైతే – అక్కడ రామాలయం కట్టుకోటానికి తమకు అభ్యంతరంలేదని ముస్లిమ్ నాయకులు జనాబ్ షాబుద్దీన్‌గారి ప్రవచనం. ఆ నిర్ణయం చేయవలసింది అని కేంద్రప్రభుత్వం – సుప్రీంకోర్టును కోరింది. అందుచేత – మతాలు కావు కొట్లాడుకునేవి. మతస్థులు మాత్రమే. ఎందుచేత? ఈ విషయం మేధావులు పరిశోధించవలసిన విషయం – అధ్యయనం చేయవలసిన అంశం.

మధ్యయుగాలలో ప్రపంచ చరిత్ర అనుశీలిస్తే – చంద్రవంకకు – వంకరలేని స్వస్తికకు The war between the crescent and the cross – ప్రజలందరకూ అర్థమయ్యే భాషలో చెప్పాలంటే ముస్లిమ్‌లకు – క్రైస్తవులకు మధ్య జరిగిన యుద్ధాలు – మన నవీన యుగంలో ముస్లిమ్ దేశాలకు ముస్లిమ్ దేశాలకు మధ్య జరిగిన యుద్ధాలు – పాకిస్తాన్ – బంగ్లాదేశ్‌ల మధ్య జరిగిన పోరాటం ఏమనాలి? యూరోపు ఖండంలోని భిన్నజాతులు అందరూ క్రైస్తవులే. ఎందుకు ఒకరితో ఒకరు పోరాడారు? సామ్రాజ్యవాదం వలన ఏర్పడిన ఘర్షణలు అవి. మతాలమధ్య ఏర్పడిన విభేదాలు కావు.కంచం పొత్తూ – మంచం పొత్తూ మానవులందరకూ కలిపి ఏకేశ్వరోపాసన – ప్రతిపాదించినది ముస్లిమ్‌ల మతం ఇస్లామ్. భగవంతుడు విశ్వపిత అయితే ఇక మానవులందరు ఏకోదరులే. ఏకేశ్వరోపాసనకు–అవశ్యమైన అనుషంగిక సూత్రం–సర్వమా

నవ సౌభ్రాతృత్వం-సమత్వం. అయితే ఆ సూత్రాలు ముస్లిమ్ లకు మాత్రమే పరిమితమయ్యాయి మతస్థుల చేతలలో.

అందుచే - నిందింపవలసింది మతాలను కాదు. ఆయా మతస్థుల్ని మాత్రమే.

## III

ఈ సదస్సు - కార్యకర్తలు కొన్ని మార్గదర్శక రేఖలు - ఆలోచనామృతములు - సూచించారు. అవి ఇవి: మానవ సామాజిక చరిత్ర పరిణామ వికాసంలో మతం వహించిన పాత్ర ఏమిటి? మతం - మానవజీవితంపై యుగయుగాంతరాలలో నైసర్గిక ప్రభావం ప్రసరిస్తూనే వున్నది. మానవుడు "నేనెవడను - ఏవిధంగా ఈ భూమిపైకి అవతరించాను. పుట్టినట్టివాడు గిట్టక తప్పదుగదా- మరణానంతరం నేను ఏమవుతాను? ఈ విశ్వాన్ని ఎవరు సృష్టించారు? దేవుడు ఉన్నాడా? లేడా - అనే వివిధ వివిధ ప్రశ్నలు ఉదయించాయి. వివిధ సమాధానాలు - వివిధ మతాలు చెప్పాయి.

ఈ చర్చ అనవసరం అని ఎవరూ త్రోసివేయలేరు. మొట్టమొదట - మతం - నరునకూ నరుని సృష్టించిన సృష్టికర్తకు మధ్యగల అనుబంధం తెలిపేదిగా వెలసింది.

తదుపరి - నరునకు నరునకూ మధ్యగల అనుబంధం శాసించేదిగా మారింది.

తుట్టతుదకు - నరునకూ - అతని అంతరాత్మకు - మధ్యగల అనుబంధాన్ని-రూపొందించేదిగా తయారయింది.

దేహి దుడుకలేడు ఆహారమాత్రాన. మానవ సమాజంలో "మరణం"ఉన్నంతవరకు - "మతం"- వుంటుంది. మరణం - శరీరాన్ని - పంచభూతాలలో కలిపేస్తుంది.

"మరణము జీవయాత్రకు సమాప్తము కాదు"-అని మతం బోధిస్తూంది. మానవుడు నశ్వరమైన జీవితంలో శాశ్వతత్వాన్ని అమరత్వాన్ని ఆకాక్షించుతాడు హిందూ మతంలో మరణము జీవయాత్రకు సమాప్తముకాదు. ఆత్మ శాశ్వతం. ఆత్మను నీరు తడుపలేదు - నిప్పు కాల్చలేదు. ఆయుధాలు హింసింపలేవు. చినిగిపోయిన వస్త్రం వదిలిపెట్టి - మనిషి క్రొత్తదుస్తులు ధరించినట్లే - మరణంపేరిట మీద ఆత్మ పాత శరీరం వదలిపెట్టి కొత్త దేహం ధరిస్తుంది. ఇది నిజం కావచ్చు. కాకపోవచ్చు. మనిషికి గొప్ప మనశ్శాంతి చేకూర్చగలదు.

మరణమనిన ఏమి - ఉరిశిక్షయే గాక
 మతము లేనియెడల మానవులకు
మతము కూర్చగలదు అతిలోకమే శాంతి
 మరణ శయ్యమీద మానవులకు

## రెండవ మార్గదర్శక రేఖ

హేతువాదానికి సరిపోని సంప్రదాయాలలో - ప్రాతిపదికలలో మతం - ఎందుచేత మానవాళిని ఇంతమందిని తన గుప్పెటలో పెట్టగలుగుతోంది?

ఈ ప్రశ్నకు సమాధానం చెప్పటం కష్టం. ప్రపంచ చరిత్ర సమీక్షిస్తే - మతం మానవులపై వహించిన ప్రభావం - సుస్పష్టంగా కనిపిస్తోంది గద.

ఇంతవరకు శాస్త్ర హేతువాదముగాని
 కవితగాని లలిత కళలుగాని
మతముగాని - మార్పుల గతి తర్కమితిగాని
 కొలువలేదు మనిషి గుండె లోతు.

హేతువాదం - కొంతమేరకే పోగలదు - మానవుని అనుభూతిలో మానవ మనస్తత్వంలో "అనుభవైకవేద్యం" - అవాఙ్మనస గోచరం ఏదో వుందంటారు కొందరు వేదాంతులు. అది సామాన్య మానవులకు అందని ఆకాశం.

ఆస్తికులు - మహర్షుల్లో దేవుడు వున్నాడని - కొందరు తాము ఆ అనుభూతిని - హేతువాదానికి అతీతమైన అనుభూతిని పొందాము అంటున్నారు. ఇక్కడ - ఒకమాట చెప్పాలి. ఆరాధ్యులుగా నేను భావించే వారిలో - నాస్తికాగ్రేసరుడుగా సుప్రసిద్ధుడైన వాల్తేరూ - ఫ్రెంచి విప్లవ మానకు వేగుచుక్కగా అభిమతుడు అన్నమాట :

"If there is no God, it is necessary to invite him.

విశ్వశిల్పియైన - ఈశ్వరుండే లేక
 జగతి హితము ఎట్లు జరుగనేర్చు?
సృష్టికర్తనాకని సృష్టించుటే నీతి
 సంఘ సౌఖ్యమునకు - శాంతి కొరకు.

బహుశః పెక్కుమంది - మతగురువులు - ప్రవక్తలు "విశ్వకల్యాణం కోసమే" జగత్ శ్రేయస్సుకోసమే ఆస్తికులై దేవుణ్ణి సృష్టించారేమో.

మనిషిని భగవంతుడు తనకు ప్రతిబింబంగా సృష్టించాడని క్రైస్తవ మతం చెపుతోంది. Man is made in the image of God. హేతువాదులు ఎదురుప్రశ్న వేస్తున్నారు.

దేవుడు సృష్టించిన మనుజుల్లారా! నాకథ వినండి - అనటకంటె మానవుడు సృష్టించిన దేవుళ్లారా నా కథవినండి అనవచ్చును గదా. ఇది తెగని వివాదం.

## ఇక మూడవ మార్గదర్శక రేఖ

నేడు మత ఛాందసత్వం - ప్రాథమిక శ్రోత్రియత్వం వివిధ దేశాలలో తలయెత్తుతోంది.

నవీన విజ్ఞానశాస్త్రం - మతానికి ప్రత్యామ్నాయం చూపించలేకపోవటంవల్ల - హేతువాదం ప్రదర్శించే దురహంకారంవల్ల ప్రఖ్యాత విజ్ఞాన శాస్త్రవేత్త ఐన్‌స్టీన్ ప్రవచనం ఉదాహరణీయం:

మతము - విజ్ఞానశాస్త్ర గుంఫనము లేక
 గ్రుడ్డిదగును - సమ్యగ్ దృష్టి కోలుపోయి;
మహిత శాస్త్రవిజ్ఞానమ్ము - మతము లేక
కుంటిదగును చైతన్యమ్ము కోలుపోయి.

ప్రపంచం సాధించవలసింది- "మతానికి - విజ్ఞాన శాస్త్రానికి సమన్వయం.

## ఇక నాలుగో మార్గదర్శక రేఖ

మతానికి మానవతా దృష్టికలదుగదా.
ఎందుకు దానిని నొక్కి చెప్పరు?

ఇది చక్కని ప్రశ్న - మానవత్వమే - సమస్త మతాలకు కేంద్రగరిమి నాభి - ఆ విషయం చాటి చెప్పాలి. ఈ సదస్సు నిర్వహించటం దేనికోసం. అందుకే ఇటువంటి సదస్సులు శతాధికంగా నిర్వహింపబడాలి.

## ఇక ఐదవ మార్గదర్శక రేఖ

- మత సిద్ధాంతాలను ఆశయాలను మన్నిస్తూనే ఏవిధంగా మత ఛాందసత్వాన్ని ఎదుర్కోవాలి-

ఇక్కడ ఒక మాట చెప్పాలి. స్థూల దృష్టికి మత సిద్ధాంతాలు, ఆశయాలు భిన్నంగా కన్పింపవచ్చు.

అన్నిమతాలలోని అంతస్తత్వం ఒకటే - అని ప్రచారం ఎంత చేసినప్పటికీ - ఆయా మతస్థులు అంత సులువుగా నమ్మరు. కాని సహజీవనం - సహనం బోధించవచ్చు. అందు వలన కలిగే మేలు అందరకూ తెలుసు. ఆస్తికులైన వివేకానందునకు అమెరికాలో ఆతిథ్యం యిచ్చినవారు పరమ నాస్తికాగ్రేసరుడు రాబర్ట్ ఇంగ్‌నసోల్.

నిండియుండు - జగతి -ఖండసత్యాలలో
    పూర్ణసత్యమేది పుడమిలేదు
సంస్కృతి యననేల? సహజీవనము సుమ్మ
    శాంతిమీద ప్రేమ - సహనమైత్రి

భారతదేశంలో సూఫీయోగులు - సహజీవనాన్ని ప్రబోధించి సాధించటమేగాక - సామరస్య సంధాన కర్తలుగా జీవించారు. "విభజించి పాలించు" అనే బ్రిటిషు రాజనీతి - సహజీవనానికి విఘాతం కల్పించటానికి ముందు శతాబ్దుల తరబడే ఎందరో మహానుభావులు సామరస్య సంధాతలు ఉద్భవించారు. "ఈశ్వర అల్ల తేరేనామ్" అన్న కబీరుకు ముందే తిక్కన - హరిహరనాదోపాసన ప్రబోధించాడు.

శ్రీయన గౌరినాబగు చెల్వకు చిత్తము పల్లవింప బి
ద్రాయతమూర్తియై హరిహరంబగు రూపము దాల్చి విష్ణు రూ
పాయ నమశ్శివాయయను భక్తజనంబు గూర్చు వైదిక
ధ్యాయిత కిచ్చిమెచ్చు పరతత్త్వము గొల్చెద ఇష్టసిద్ధికిన్.

కబీరు అన్నాడు - "దేవుడు కాశీలో లేడు - కాబాలో లేడు. మసీదులో లేడు. మందిరంలో లేడు. నీ హృదయంలోనే వున్నాడు. నాభియందు కస్తూరిగల మృగం పచ్చగడ్డి కోసం పరుగెత్తుతోంది." సిక్కుమత స్థాపకుడు గురునానక్ - మూర్తీభవించిన మతసామరస్యం. ఆ మహనీయుని గూర్చిన కథ ఒకటి వుంది. హరిద్వార్‌లో ఆతడు గంగాజలాన్ని చేతితో దూరానికి విసురుతున్నాడు. ఎందుకని ఒక శ్రోత్రియుడు - తన పితరులకు తర్పణం గంగనీటిలో విడిచేవాడు అడిగాడట. నానక్ - పంజాబ్‌లోవున్న తన పంటపొలాలు కోసం అని సమాధానం చెప్పాడట. ఆ శ్రోత్రియ బ్రాహ్మడు నవ్వి ఈ గంగాజలం అంతదూరాన వున్న నీ పొలాలలోకెట్లా చేరుతుంది అని ఎగతాళిచేశాడట. నానక్ చెప్పిన సమాధానం - "స్వర్గలోకంలో అంతకంటే దూరంగావున్న నీ పితృదేవతలకు నీవు వదిలే జలాలు ఎట్లా చేరుతాయి! అని అడిగాడట. అక్బరు చక్రవర్తి - సర్వమత సార సంగ్రహం కోసం ప్రయత్నించి - దీన్ - ఇలాహి - స్థాపించాడు. ఆ మతం అక్బరు మానసిక పుత్రిక మాత్రమే. ఆ మతంలో ఎవరూ చేరలేరు. అక్బరే ఆ మతంలో చేరలేదు.

ప్రవక్తలు ఎందరో - భారతదేశంలో విశ్వమానవ సౌభ్రాత్రాన్ని బోధించారు. అందులో చాలామంది ముస్లిమ్‌యోధులు - నిజాముద్దీను చిష్టివంటివారు- బ్రహ్మంగారు హిందూమతంలో పుట్టిపెరిగారు. ఆయన శిష్యుడు దూదేకుల కులస్థుడు సిద్దయ్య. ఈ మధ్య - మనమధ్య వున్న వాగుప్త పంచాంగోకర్త గురువుగారు దేవాంగ కులస్థుడు. ఆయన గురువు మస్తాన్-పుట్టుకచే ముస్లిమ్. నేడుగూడ కడప మండలంలో ఒక మసీదు నుండి ప్రతి శ్రీరామనవమికి - రామాలయం వెల్లవేయటానికి - సున్నం బహూకరింప బడుతుంది.

## వైష్ణవం

వైష్ణవమతం గూడ - వైష్ణవమతంలోని అంతర్భాగాలు కూడా ఆవిధంగానే అవతరించాయి అని నా అభిప్రాయం.

వైష్ణవ మతప్రవక్త రామానుజాచార్యులు. అయితే ఆయన వైష్ణవ మత స్థాపకుడు కాడు. వైష్ణవం అంటే విష్ణు సారమ్యం బోధించే మతం. విష్ణువు సర్వవ్యాపకుడు.

ఈశావాస్యమిదమ్ సత్యం" తుల్కోంచ్ జగత్యాం జగత్. అందుచేత - మానవులందరూ వైష్ణవులే. సమానులు. గురువులు - రామానుజునకు పూర్వం వైష్ణవమత పన్నిద్దరు ఆచార్యులు ఆయా యుగాలలో వైష్ణవం బోధించారు. ఆ పండ్రెండుగురిలో ముగ్గురు పంచములు. ఇరువురు మాత్రమే బ్రాహ్మణకుల సంజాతులు.

ఇక ఆ వైష్ణవుడు ఎవ్వడూ అంటే - ఆ వైష్ణవ మతసారం ఏమిటి అంటే రామానుజాచార్యులవారి సందేశ నినాదం.

## "దాసోహం"

వైష్ణవుడు - దాసుడు, ఎవరికీ అందరమూ సాటి మానవులను - సాటి సమాజానికి, సమాజ సేవయే పరమార్థం - మానవసేవయే మాధవసేవ, వైష్ణవుడు ఎవరికీ యజమాని కారాదు. అతడు దాసుడు. భృత్యుడు. అచ్చమైన వైష్ణవుడు - తత్భృత్య - భృత్యస్య - భృత్యస్య భృత్యుః అయ్యంవార్లంగారి నట్టిల్లు సుప్రసిద్ధమైన సామెత. వైష్ణవోత్తముడైన అయ్యవార్లంగారికి సొంత ఆస్తి వుండరాదు. జగత్తు మిథ్యగాదు. ఈశ్వరుడు - సత్యం. ఆత్మ సత్యం. జగత్తు సత్యం. ఈశ్వరునకు - ఆత్మ + జగత్తూ శరీరప్రాయాలు. వైష్ణవం ఏకేశ్వరోపాసన - విధించింది. ఇస్లామ్‌లోని ఏకేశ్వరోపాసన - సర్వమానవ సహోదరత్వం - వైష్ణవంలో ప్రాముఖ్యం వహించాయి. రామానుజాచార్యుడు క్రీ.శ. 1000 సంవత్సర ప్రాంతంలో పుట్టి 1120 ప్రాంతంలో పరమపదించినట్లు చెప్పుతారు. అంటే - ఉత్తర హిందూదేశంలో - గజనీమహమ్మద్ దండయాత్రల కాలంలో రామానుజుడు పుట్టిపెరిగాడు.

ఈ మధ్యలో రామమోహనరాయల బ్రహ్మసమాజం = $\frac{\text{హిందూమతం + క్రైస్తవమతం}}{2}$ అనే వారున్నారు. ఆ విధంగా ఆలోచిస్తే -

వైష్ణవం = (ఇస్లాము + హిందూమతం) / 2 అనవచ్చు

రామానుజాచార్యులు - తన ముక్తికి - ఏకైకమార్గం భక్తి అని బోధించారు. అయితే ఇస్లామ్‌వలె - వైష్ణవం- ఆస్తికమతం. భగవంతుడు సమస్త కల్యాణ గుణసంపన్నుడు. మానవుడు - భక్తితో - శరణాగతి చేస్తేచాలు. భగవంతుడే అతని యోగ క్షేమం వహించి - ముక్తి ప్రసాదిస్తాడు.

భగవద్గీతలోని చరమశ్లోకం

సర్వధర్మాన్ పరిత్యజ్య మమేకం శరణం వ్రజ
సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మా శుచః

వైష్ణవమతంలో ప్రథమశ్లోకం - ప్రధాన శ్లోకం అయింది. తాత్త్వికంగా ఆలోచిస్తే - శ్రీ వైష్ణవానికి - బసవేశ్వరుని వీర శైవానికి పేరులో తప్ప భేదం లేదు. ఏకేశ్వరోపాసన - సర్వ మానవ సమానత్వం - సౌభ్రాత్రం రామానుజుడు సాత్వికంగా సామ్యంగా ప్రబోధిస్తే - బసవేశ్వరుడు వాటికి - ఘాటుగా ఘంటాపథంగా ప్రవచించాడు. దానికి కారణం అప్పటి ఉత్తర భారతంలో ఇస్లామ్ దండయాత్రలు అధికమయ్యాయి. గజనీమహమ్మద్ - దండయాత్రలలో ధన సంపాదనకు తృప్తిచెంది గజనీకి తరలిపోయాడు. తదుపరి గోరీ మహమ్మద్ భారతదేశంలో రాజ్యస్థాపన చేశాడు. బసవేశ్వరుని కాలంలో - వీరత్వం - అవసరమైంది.

అయితే - వైష్ణవులు - వీరశైవులు కొట్టుకున్నారు. కారణం మతసిద్ధాంతాలు కావు.

అర్ధపాత్ర శూన్యమంచు పల్కెనొకండు
కాదు సగము నీరు ఉన్నదనెను
వాద భేదమునను బద్ధులయ్యెను తలల్
రమ్య హాసలోల - రామకృష్ణ.

శ్రీవైష్ణవం - తదుపరి రెండు పాయలుగా తెంగళ్ కడగల్ కొడులుగా మారింది. భగవత్‌భక్తి అవసరం - అయితే భక్తి - మార్జా కిశోర న్యాయం మర్కట కిశోర్ న్యాయంగా రెండు భాగాలు అయిందా పిల్లి - తన పిల్లలను నోటితో కరచి కాపాడే విధంగా భగవంతుడు భక్తుల్ని కాపాడగలడు. ఇది తెంగల్ మతం - కాదు - కోతిపిల్ల - తల్లికోతి కడుపును పట్టుకునే విధంగా - భక్తుడు పరమేశ్వరుని ఆశ్రయించాలి. ఇది వడగళ్వారి మతం. ఇందులో భక్తుని ప్రయత్నం - పురుషకారం కొంత అవసరం. ఏతన్‌నంత ప్రోక్త వేదాంత దేశికుడు. - విద్యారణ్యస్వామికి సమకాలీనుడు. మాలిక్ కాఫరో వంటి ముస్లిమ్ సేనానులు - గుడిగోపురాలు కూలుస్తున్న కాలం అది. ప్రజలు తమ మతాన్ని ఆస్తిపాస్తులు కాపాడుకోటానికి - స్వప్రయత్నం అవసరమైంది. వేదాంత దేశమంటూ విద్యారణ్యస్వామివలె - పురుషకారం అవసరమని నొక్కి చెప్పి - "మర్కట కిశోర న్యాయా"న్ని ప్రబోధించాడు.

ప్రతి మతం - జగద్హితంగా అవతరించినట్టిదే. శ్రీవైష్ణవంలో సారం - సమాజసేవ.

శ్రీవైష్ణవుడు - అందరకూ భృత్యుడే.
పర దుఃఖానికి కన్నీరు కార్చే హృదయాళువు.

అయితే - ద్వాదశ ఊర్ధ్వ పుండ్రాలు ధరించేవాడే వైష్ణవోత్తముడు కాడుగదా."దాసోహం" అనే సిద్ధాంతం - ఆచరిస్తే ఇక సమాజంలో "పరపీడన పరాయణత్వమే" ఉండదు. మానవ జాతి చరిత్ర సమస్తం పరపీడన పరాయణత్వం కాక మరే ముంది? అన్నారు. మహాకవి శ్రీ శ్రీ.

రామానుజుడు - మానవజాతి చరిత్ర - పరపీడ పరాయణత్వం కాకుండా చూడాలనే - "దాసోహం"- మతం - వైష్ణవాన్ని పునరుద్ధరించి స్థాపించి ప్రచారం చేశాడు. రామానుజుడు అనుష్ఠానవేదాంతి. అయితే వైష్ణవులందరు రామానుజులు కారు. మతప్రవక్తలు అందరు మహానుభావులే. విశ్వశ్రేయస్కాములైన వారి బోధలకు కాలదోషం పట్టడం జరిగింది.

సత్యమెపుడు ఓడి సంగ్రామరంగాన
శత్రువులకు చిక్కి - చావలేదు
సంహరింపబడెను - సంరక్షకులచేత
భక్తితోడ యజ్ఞపశువువోలె.

అన్ని మతాలకు మానవ చరిత్రలో పట్టిన దుర్గతి వైష్ణవానికి కూడా పట్టింది.

శంకరాచార్యుని మిథ్యావాదంగూర్చి పరిహాసరసికులు కల్పించిన కట్టుకథ - మదపుటేనుగుకు భయపడి పారిపోయిన అద్వైతిని ఒకరు ప్రశ్నించారు - "జగన్మిథ్య అంటున్నావుగ.
"గజం మిథ్య కదా - ఎందుకు నీవు పారిపోయావు."
అద్వైతి సమాధానం - "పలాయనం మిథ్యా" అని.

రొమారోలా - సారస్వతంలో నోబెల్ బహుమతి గ్రహీత - మతంమీద ఆధ్యాత్మిక అనుభూతిమీద విశ్వాసంగలవాడూ - మతం అనుభవైకవేద్యం అని అంగీకరించినవాడు అన్నమాట.

మతము - మాట విడిచి - మానవత్వమటంచు
ప్రగతి యనుచు సామ్యవాద మనుచు
హేతువాద మనుచు - ఎన్నిపేరులు పెట్ట
మనుజసేవయైన - మతమె యగును
స్వార్థరహితమైన - సందేహమేయైన
చిత్తశుద్ధియున్న చింతయైన
త్యాగబుద్ధియున్న - నాస్తికత్వముగూడ
మనుజహితముగోర - మంచి మతమె

జవహరులాల్ నెహ్రూ - రొకే, రోలా ప్రవచనం అంగీకరించి - ఆ పద్ధతిలో తానుకూడా ఆతని సేనాసమాజంలో ఒక భటుడిగా చేరేందుకు అభ్యంతరం లేదని అన్నారు. లెనిన్ మహాశయుని గొప్ప కర్మయోగి అని అభినుతించేవారు వున్నారు. వారిలో నేన కూడ ఒకడను.

ప్రగతిశీలమైన - జగదేక మతమేది?
నిత్య నూత్నమైన నీతి యేది?
పరులకు పకలించు - కరుణార్ద్ర హృదయమే
పరమ ధర్మతత్త్వ గరిమనాభి.

నవ్యనాగరికత - విజ్ఞానశాస్త్రం మానవులు అందరినీ ఇరుగు పొరుగువారిని చేసింది. కాని సోదరులను చేయలేదు. ఆ

(మిగతా 45వ పేజీలో)

# ఇస్లాం మతం

–షేక్ హమీదుల్లా షరీఫ్

మానవుడు ఈనాడు ఆర్థిక, వైజ్ఞానిక, సాంకేతిక రంగాలలో అద్భుతమైన ప్రగతిని సాధించాడు. సుఖవంతమైన జీవితం కోసం అవసరమైన అత్యాధునికసాధన సంపత్తిని కూడ సమకూర్చుకున్నాడు. అయినప్పటికీ అతను శాంతికీ, సంతృప్తికీ నోచుకోలేకపోతున్నాడు. దీనికి కారణం మా దృష్టిలో అతడు తన సృష్టికర్తా విశ్వప్రభువూ అయిన దేవుణ్ణి,ఆయన పంపిన మార్గదర్శక సూత్రాలనూ తృణీకరించి భౌతిక, ప్రవాచ వ్యామోహంలో పడటమే. ఈ వ్యామోహం, వలన కలిగే స్వార్థప్రయత్నం మనుషులలోని మానవత్వాన్ని రోజుకు రోజు దిగజార్చి వేస్తోంది. తత్ఫలితంగా ప్రజల మధ్య పరస్పర సహాయ సహకారాలూ, విశ్వాస సానుభూతులూ, మైత్రీ మమకారాలూ క్షీణించిపోయాయి. సమాజంలో ఎక్కడ చూసినా అశాంతి అలజడులే కనిపిస్తున్నాయి.

## దైవ నియమావళి : ప్రకృతిలో ఇతర జీవాలు

పక్షులను చూడండి, అవి దైవ నిబంధనలకు అనుగుణంగా గాలిలో ఎలా ప్రశాంతంగా ఎగురుతున్నాయో! చేపలను గమనించండి, అవి దైవ నియమానుసారం నీటిలో ఎలా హాయిగా సంచరిస్తున్నాయో! దైవ శాసనాలకు విరుద్ధంగా పక్షులు నీటిలోనూ, చేపలు నీటి వెలుపలనూ నివసించటానికి ఏ మాత్రం ప్రయత్నించినా, అవి శాంతికి దూరమవుతాయి, వాటి ఉనికికి తీవ్ర ప్రమాదం ఏర్పడుతుంది. ఈ అల్ప ప్రాణులేగాక, ఆకాశంలోని అసంఖ్యాకమైన గ్రహాలూ, నక్ష త్రాలూ కూడ దైవ నియమావళిని శిరసావహిస్తూ, తమ తమ నిర్ణీత కక్ష్యలలో తిరుగుతున్నాయి. ఇలా సృష్టి వ్యవస్థ అంతా, అందులోని సకల చరాచర సృష్టి రాసులూ దేవుడు నిర్దేశించిన నియమావళికి కట్టుబడి పనిచేస్తూ ప్రశాంతంగా తమ మను గడను కొనసాగిస్తున్నాయి. ఈ నియమావళి పేరే ఇస్లాం.

## ఇస్లాం అంటే..

ఇస్లాం "సలమ" అనే అరబ్బీ ధాతువు నుండి పుట్టింది. "సలమ"అంటే సమర్పణ, విధేయత, శాంతి, శ్రేయస్సు, భద్రత అని అర్థం. కనుక ఇస్లాం అంటే శాంతి, సమర్పణ, విధేయత, భద్రత అని అర్థం. కనుక ఇస్లాం వాస్తవానికి గుణ వాచకం. దానికి ఒక వ్యక్తితోగాని, ఒక జాతితో గాని, ఒక దేశంతోగాని ఏ మాత్రం సంబంధం లేదు. మానవుడు తనసృష్టికర్తా, ప్రభువూ అయిన దేవునికి తనను పూర్తిగా నిర్నిబంధంగా సమర్పించు కుని, ఆయనకు విధేయుడై, జీవితానికి సంబంధించిన అన్ని రంగాలలో ఆయన ఆదేశాలను పాటిస్తూ జీవితం గడిపితే, అతనికి శాంతీ, సుఖమూ, భద్రతా లభిస్తాయి. కాబట్టి ఇస్లాం ప్రకారం జీవించే వ్యక్తినే 'ముస్లిం' అంటారు. ఆది మానవులైన ఆదమ్, హవ్వాలు ఏనాడైతే ఈ భూమండలంపై తమ పాదాలను మోపారో, ఆనాటి నుండే ఇస్లాం ప్రారంభ మయింది. అన్ని కాలాలలో, అన్ని ప్రాంతాలకూ వచ్చిన ఒక లక్షా ఎనభై వేల మంది దైవ ప్రవక్తలు కూడా ఇస్లాంనే ప్రచారం చేశారు. కాకపోతే, చివరి దైవ ప్రవక్త ముహమ్మద్ (సఅసమ్) కాలంలో ఇస్లాం పూర్తిగా, సంపూర్ణంగా అవతరించింది. ఇస్లాం కేవలం ఒక మతమేనా? కాదు. కాదు, అది ఒక సమగ్రమైన జీవిత విధానం కూడ. మానవ జీవితానికి సంబంధించిన రంగాలు ఎన్ని వున్నాయో, వాటన్నింటికీ సమానంగా, సంపూ ర్ణంగా పనికివచ్చే మార్గదర్శక సూత్రాలు అందులో వున్నాయి.

## ఇస్లాం మూల సిద్ధాంతాలు

ఇస్లాం ధర్మ సౌధానికి మూల స్తంభం దేవుని ఏకత్వం. (Unity of God)సమస్త జీవన రంగాలను సమన్వయపరచి, వాటిలో సమతూకాన్ని నెలకొల్పి, మనిషిని మానవత్వపు హద్దులలో ఉంచగల బలమైన కేంద్రీయ శక్తి దేవుని ఏకత్వమే. ఇస్లాం (మతం) ప్రకారం దేవుని దైవత్వం అవిభాజ్యమైనది, అఖండమైనది. అందువల్ల దేవుడు ఒక్కడే అనీ, ఆయన మాత్రమే నిత్యుడు అనీ విశ్వసించడంతో పాటు, ఆ దేవుడు మన అందరి సృష్టికర్త, స్వామి, ప్రభువు, పోషకుడు, యజమాని, సంరక్షకుడు, శాసన ప్రదాత అనీ, ఆయన అన్నీ చూస్తాడనీ, అన్నీ వింటాడనీ, అసలైన సర్వజ్ఞుడు ఆయన మాత్రమే అనీ కూడ విశ్వసించాలి. ఇటువంటి పరిపూర్ణమైన దైవత్వంగల దేవుణ్నే అరబ్బీ భాషలో "అల్లాహ్" అని అంటారు. అల్లాహ్ అనే శబ్దానికి వ్యుత్పత్తి లేదు, లింగమూ లేదు, వచనమూ లేదు. ఒక ఆకారానికి అది చిహ్నమూ కాదు.నిరాకారుడూ, అవాఙ్మానస గోచరుడూ, అనంతుడూ, అఖండుడూ, అద్వి తీయుడూ అయిన శుద్ధ దేవునికే ఇది చిహ్నము. అల్ + ఇలాహ్ అంటే అల్లాహ్, అంటే The Diety, ఆరాధ్యుడు, పూజకు, దాస్యానికీ, విధేయతకూ అర్హుడు అని అర్థం. అల్లాహ్ ఎల్లప్పుడూ ఉన్నాడు, ఎల్లప్పుడూ ఉంటాడు. ఆయన నిదుర పోడు, ఆయనకు కునుకూ రాదు. ఆయనకు తల్లిదండ్రులూ లేరు, భార్యపిల్లలూ లేరు. ఆయనకు ఆకలిదప్పులూ లేవు. ఆయన మానవ సహజమైన దౌర్బల్యాలకు అతీతుడు.

## పరలోకం

ఇస్లాం మౌలిక విశ్వాసాలలో దేవుని ఏకత్వం, ప్రవక్త దౌత్యం

తరువాత పరలోక విశ్వాసం అత్యంత ముఖ్యమైనది. ఈ ప్రపంచం ఒక పరీక్షా స్థలం. మానవుని సుదీర్ఘ ప్రయాణంలో ఇది ఒక మజిలీ మాత్రమే. ఈ జీవితం అశాశ్వతం, క్షణభంగురం. దివ్య ఖురాన్ ప్రకారం, "ఈ ప్రపంచ జీవితం కొన్నాళ్ళ విడిది మాత్రమే".

## మానవుడు దేవుని ఖలీఫా (ప్రతినిధి)

ఇస్లాం ధర్మ శాస్త్రం ప్రకారం, ఈ ప్రపంచానికి మానవుడు దేవుని ఖలీఫాగా అంటే దేవుని ప్రతినిధిగా వచ్చాడు. కనుక ప్రతి మానవుడూ దేవుని ప్రతినిధియే. ఇస్లాంకు మూల గ్రంథమైన దివ్య ఖురాన్ ఇలా అంటోంది -

"నేను భూలోకంలో ఒక ఖలీఫాను సృష్టించబోతున్నాను.
(దివ్య ఖురాన్ - 2-30)

"విశ్వంలో మానవుడికి మేము గౌరవ ప్రదమైన,
ఉన్నతమైన స్థానాన్ని ప్రసాదించాము"
(దివ్య ఖురాన్ - 17-70

"మానవులారా! మేము మిమ్మల్ని ఒకే స్త్రీ పురుషుల జంట ద్వారా సృష్టించాము. ఆతరువాత మిమ్మల్ని జాతులు గానూ, తెగలుగాను సృష్టించాము, మీరు ఒకరినొకరు గుర్తించుకునేందుకు. మీలో ఎక్కువ భయభక్తులు కలవాడే దేవుని దృష్టిలో గౌరవనీయుడు. నిశ్చయంగా దేవునికి అన్నీ తెలుసు. ఆయన సర్వజ్ఞుడు" (దివ్య ఖురాన్ - 49-13)

మానవులారా! మీరంతా ఆదమ్ సంతానమే. ఆదమ్ మట్టితో చెయ్యబడ్డాడు. ప్రళయంనాడు దేవుడు మీ వంశం గురించి, మీ గోత్రం గురించి అడగడు. మీలో భయభక్తులు గలవాడే గౌరవనీయుడు.

## మానవుడు బానిస కాడు!

మానవుడు ఎవరి బానిసా కాడు. మానవులందరూ దేవుని ఖలీఫాలే కాబట్టి, వారు అల్లాహ్‌కు మాత్రమే దాసులు, ఆయనకు మాత్రమే విధేయులు కావాలి. ఇతరులెవ్వరికీ కారాదు. బానిసత్వం, దాస్యం ఏ రకానికి చెందినదైనా సరే, సాంఘిక, రాజకీయ, ఆర్థిక బానిసత్వం, ఇస్లాం బోధనలకు దూరం. మహా ప్రవక్త (స) ఆగమన లక్ష్యం కూడ మానవ జాతిని బానిసత్వపు బంధాల నుండి, దానిపై మోపబడిన బరువు నుండి విముక్తి కలిగించటమే. కనుక మానవ స్వేచ్ఛను హరించే అధికారం, దానిని కుదించే హక్కు ఎవరికీ లేదు, ప్రభుత్వానికి కూడా లేదు.

## న్యాయం

మానవులందరూ ఒక్కటే, సమానులే అనే సిద్ధాంతం, సాంఘిక, ఆర్థిక న్యాయం లేకపోతే నిరర్థకమైపోతుంది. న్యాయంలేని సమాజాన్ని సత్సమాజం, ఇస్లామీ సమాజం అనలేము. న్యాయ సంస్థాపనం జరగకుండా ఒక ఆదర్శ ముస్లిం సమాజం ఉనికిలోకి రాదు. అన్ని రకాల అన్యాయాన్ని రూపుమాపటమే ఇస్లాం లక్ష్యం. అన్యాయం, అసమానత్వం, దోపిడి, అణచివేత, అక్రమాలు - ఇవి ఇతరుల హక్కులను భంగపరుస్తాయి. విధుల నిర్వహణను ఆటంకపరుస్తాయి. దీనిని ఖురాన్ "జులుమ్" అంటుంది. న్యాయ సంస్థాపనం కోసమే, అన్యాయ నిర్మూలనం కోసమే దైవ ప్రవక్తలు వచ్చారని దివ్య ఖురాన్ అంటోంది. న్యాయానికి సంబంధించిన ప్రస్తావన ఖురాన్‌లో నూరు సార్లు వచ్చింది. అద్ల్, ఖిస్త్, మీజాన్ అనే అరబ్బీ పదాలు న్యాయం కోసం వాడబడ్డాయి. అన్యాయాన్ని ఖురాను 200 సార్లు ఖండించింది. న్యాయాన్ని ఖురాను భయభక్తులతో పోల్చింది. న్యాయం లేకపోవటాన్ని మహా ప్రవక్త "గాఢాంధకారం"తో పోల్చారు. ఇస్లాం విద్వాంసులు ఇబ్నె తైమియా ఇలా అన్నారు. "న్యాయపాలనం చేసే" "అవిశ్వాస" (Unbelieving) రాజ్యాన్ని అల్లాహ్ సహిస్తాడు. కాని అన్యాయ పాలనం చేసే "విశ్వాస" (Believing) రాజ్యాన్ని సహించడు. అంటే ప్రపంచం న్యాయం, అవిశ్వాసాలతో మనగలుగుతుంది గాని, అన్యాయం "విశ్వాసాల"తో మనలేదు. ఇస్లాంకూ అన్యాయానికీ మధ్య సహజీవనం అసంభవం.

దివ్య ఖురాను ఇలా అంటోంది - "విశ్వాసులారా! న్యాయానికి సాక్షులుగా నిలబడండి. ఏ వర్గం వారితోనైనా మీకు విరోధం ఉంటే, దాని కారణంగా మీరు ఆవేశానికి లోనై న్యాయాన్ని వదలిపెట్టకండి. న్యాయం చెయ్యండి, ఇది మీకూ, మీ బంధువులకూ ఎంత వ్యతిరేకంగా వున్నా సరే. ఇది దైవ భక్తి పరాయణత్వానికి సన్నిహితం. అల్లాహ్‌కు భయపడుతూ మెలగండి, మీరు చేసేదంతా అల్లాహ్‌కు పూర్తిగా తెలుసు".

సోదర భావాన్ని, సహజీవనాన్ని ఇస్లాం ఇలా ప్రోత్సహిస్తుంది-

మంచికీ, దైవ భక్తికీ సంబంధించిన పనులను ఎవరు చేసినా, వారితో సహకరించండి. ఇతరులు పూజించే దేవుళ్ళను దూషించకండి. మతం విషయంలో బలవంతం చెయ్యటం కానీ, నిర్బంధం కానీ లేనేలేవు. మీ ధర్మం మీది, మా ధర్మం మాది. హింస ద్వారా పరధర్మాన్ని అణచటం రక్తపాతం కంటే కూడా అత్యంత తీవ్రమైనది.

## ఇస్లాంలో స్త్రీ

"అల్లాహ్ సూచనలలో ఇది కూడ ఒకటి. ఆయన మీ కోసం మీ నుండే మీ భార్యలను పుట్టించాడు. మీరు వారి ద్వారా మనశ్శాంతిని పొందటానికి మీ మధ్య ప్రేమనూ, కరుణనూ పెంపొందించాడు."

"భార్యాభర్తలు ఒకరికొకరు వస్త్రాల వంటివారు"

"పురుషులకు స్త్రీలపై ఉన్న హక్కులే స్త్రీలకూ పురుషులపై ఉన్నాయి".

"తల్లిపాదుల క్రింద స్వర్గం ఉంది".

"ఎన్నో పాపాలు చేసిన ఒక వ్యక్తి మహాప్రవక్త వద్దకు వచ్చాడు. తల్లి ఉంటే తల్లిని, లేకపోతే ఆమె సోదరిని సేవించు అని సలహా ఇచ్చారు." "మీలో తమ భార్యల పట్ల మంచిగా ప్రవర్తించే వారే ఉత్తములు."

రెండవ ఖలీఫా హజ్రత్ ఉమర్, "మేము స్త్రీలను హీనంగా చూసేవారము.కాని ఖురాను వచ్చిన తరువాత మేము ఆమెను మనిషిగా చూడటం ప్రారంభించాము" అని అన్నారు.

"స్త్రీకి తండ్రి ఆస్తిలో, తల్లి ఆస్తిలో, భర్త ఆస్తిలో, కుమారుల ఆస్తిలో, అన్నా తమ్ముళ్ళు, అక్కా చెల్లెళ్ళ ఆస్తిలో భాగం ఉంది".

పై ఖురాను వాక్యాలు, మహాప్రవక్త (స) గారి సూక్తుల ద్వారా తెలిసేది ఏమిటంటే, ఇస్లాం స్త్రీకి సమాజంలో అత్యున్నతమైన స్థానం ఇస్తోంది. మానవ జాతి మనుగడకు ఆమె మూలకందం. గృహ సామ్రాజ్యానికి ఆమె మహారాణి. ఇస్లాం వివాహ చట్టం ముఖ్యోద్దేశ్యం సమాజంలో నీతినీ, శీలాన్ని, పరిశుద్ధతనూ కాపాడటం, అక్రమ సంబంధాలు చట్టవ్యతిరేకమని ఇస్లాం గుర్తిస్తుంది. స్త్రీ పురుషులు ఉభయులూ తమ దాంపత్య సంబంధాన్ని ఒక Code of Lawsకు, ఒక నిబంధనావళికి అనుగుణంగా ఉంచమనీ, శీలాన్ని,పవిత్రతను పరిరక్షించే ఒక చట్టానికి లోబడి ఉండేలా చెయ్యమనీ ఇస్లాం శాసిస్తుంది. చట్టం లేకపోతే, ఒక కట్టుబాటు లేకపోతే సమాజంలో నీతిబాహ్యత, అశ్లీలతా ప్రబలిపోతాయి. అసంభవమైపోయినప్పుడూ, ఇల్లు నరకమైపోయినప్పుడూ, స్త్రీ పురుషులు భార్యాభర్తలుగా చలామణీ కావడం ఉభయతారకమా?

విడాకులనేది ప్రతి Family Lawలోనూ ఉన్నది. అనాదిగా ఉన్నది. అది దేవుడు చేసిన చట్టమైనా కావచ్చు లేదా మానవుడు చేసిన Law అయినా కావచ్చు. ఇస్లాంలో వివాహం ఒక Social Contract. ఉభయ పార్టీలకు ఇష్టమున్నంత కాలమూ అది కొనసాగుతుంది. వారిలో ఏ ఒక్కరికి ఇష్టం లేకపోయినా అది కొనసాగలేదు. ప్రేమానురాగాలు లేని వైవాహిక బంధం ఒక శవంలాంటిది. దాన్ని పూడ్చి వేయకపోతే, అది కుళ్లిపోతుంది. వాతావరణాన్ని కలుషితం చేస్తుంది. కనుక విడిపోవటం తప్ప, వివాహ బంధాన్ని తెంచటం తప్ప అపుడు మరొక ప్రత్యామ్నాయం లేదు. వేధింపులూ, హింసలూ, హత్యలూ, ఆత్మహత్యల వరకు సాగదీయటం కంటే, విడిపోవటం మేలు.

విడాకుల హక్కు భార్యభర్తలు ఉభయులకూ ఉన్నది. అది భర్త తరపు నుంచి అయితే "తలాఖ్" అనబడుతుంది. ఒకవేళ భార్య తరపు నుంచి అయితే, అది "ఖులా" అనబడుతుంది.

ఇస్లాం ధర్మశాస్త్రం ప్రకారం భర్త కుటుంబానికి 'Manager' లాంటివాడు. కుటుంబాన్ని పోషించే బాధ్యత అతని భుజస్కందాలపై ఉంది. చట్టరీత్యా భార్యపై కుటుంబపోషణ బాధ్యత ఎంత మాత్రం లేదు. ఆమె ఎంత ధనవంతురాలైనా సరే, ఆమె ఎంత సంపాదిస్తున్నా సరే, వంట వండే బాధ్యత కూడా ఆమెపై లేదు, బట్టలు ఉతికే బాధ్యత కూడ ఆమెపై లేదు.

ఈ నేపథ్యంలో భర్తకు భార్యపై ఆధిక్యం ఉంది. "Revocation of Marriage Bond" విషయంలో భర్తకు పైచేయి (upper hand) ఉంది. అంటే బాధ్యతలను బట్టి హక్కులు ఉన్నాయి.

వయస్సు వల్లగాని లేదా మరే ఇతర కారణం వల్లగానీ స్త్రీకి 'మెన్సస్' రాకపోతే, ఒకనెల కాలం ఒక 'తొహర్'గా భావించబడుతుంది. అడిగిన విడాకులివ్వకుండా భార్యలను హింసించటాన్ని ఖురాను ఖండిస్తుంది.

ఇస్లాం షరియత్ ప్రకారం విడాకులు ఇచ్చే హక్కు భర్తకు ఉంది. అదే విధంగా తాను ఇష్టపడని భర్త నుండి వేర్పాటునూ, విడాకులనూ కోరే హక్కు స్త్రీ కి కూడ వుంది. కాకపోతే ఆమె తన భర్త నుండి పొందిన మహర్‌నూ, ఇతర వస్తువులనూ తిరిగి అతనికి ఇవ్వవలసి ఉంటుంది. విడాకులు మాదిరిగానే 'ఖులా' కూడ అసహ్యకరమైనదే. భార్య కోరిక ప్రకారం ఒకవేళ భర్త విడాకులు ఇవ్వటానికి నిరాకరిస్తే, భార్య కోర్టుకు వెళ్ళవచ్చు.

రెండో ఖలీఫా హజ్రత్ ఉమర్‌గారిదర్బారుకు ఒక దంపతుల జంట వచ్చింది. భార్య 'ఖులా' కోరింది. సర్దుకోండి అని హజ్రత్ ఉమర్ సలహా ఇచ్చారు. కాని ఆమె వినలేదు. అపుడు హజ్రత్ ఉమర్, మూడు రోజులపాటు ఆమెను ఒంటరిగా ఒక గదిలో బంధించి ఉంచుము అని ఆజ్ఞాపించారు. నాలుగవ రోజు ఆమెను హజ్రత్ ఉమర్ వద్దకు తీసుకువచ్చారు. ఎలా ఉన్నారు అని ఆమెను అడుగగా, దేవునిపై ప్రమాణాలు చేసి ఆమె, "ఈ మూడు రాత్రులే నేను నా దాంపత్య జీవితంలో సుఖంగా, మనశ్శాంతితో గడిపిన రోజులు" అని అన్నారు. హజ్రత్ ఉమర్ హృదం ద్రవించింది. భర్తను పిలిచి విడాకులు ఇమ్మని ఆజ్ఞాపించారు. ఆమె చెవి రింగులు తీసుకుని".

ఇస్లాం ప్రకారం దేవుడు మానవుని సృష్టించి మంచి మార్గం ఏదో, చెడ్డ మార్గం ఏదో చూపించాడు. తనకు ఇష్టమైన మార్గాన్ని ఎన్నుకునే స్వేచ్ఛా స్వాతంత్ర్యాలను అతనికి ప్రసాదించాడు. స్వయంగా దేవుడే మానవుణ్ణి బలవంతంగా మంచి మార్గంపై నడిపించనప్పుడు, మానవులు తోటి మానవులను ఫలానా మార్గంపై నడవండి అని ఎలా బలవంతం చెయ్యగలుగుతారు. కనుక ఇస్లాం పరమత సహనాన్ని, మతసామరస్యాన్ని సౌభ్రాతృత్వాన్ని ప్రోత్సహిస్తుంది.

అందాలు జాలు వారే ఈ దేశం అందరి దేశం. ఒక నందన వనం. ఇక్కడ ఎన్నో మతాలు, ఎన్నో సంస్కృతులు, ఎన్నో సిద్ధాంతాలు ఉన్నాయి. అనాది నుండి ఇక్కడ భిన్నత్వంలో ఏకత్వం వర్ధిల్లుతూ వచ్చింది. మతాలు వేరైనా ఒకరినొకరు ప్రేమించుకుంటూ వస్తున్నారు. గౌరవించు కుంటూ వస్తున్నారు. పరమత సహనం వర్ధిల్లింది. మన లౌకిక వాదం మిశ్రమ సంస్కృతి నుండి ఉద్భవించింది. అది మన సమాజంలోని వైవిధ్యాన్ని ఆమోదిస్తుంది, ఆహ్వానిస్తుంది కూడ. భిన్నత్వాన్ని ఏకత్వానికి పునాదిగా భావిస్తుంది. ఈ దేశం ప్రపంచంలోని వివిధ మతాలకు రక్షణ కల్పించినందు వల్లనే ఐదువేల సంవత్సరాలుగా భారత వర్షంగా ప్రసిద్ధి చెందగలిగింది.

## మతతత్వం

మతంపై నడవటం మతతత్వం కాదు. అసలు మతతత్వం నకారాత్మక ధోరణికి ప్రతిరూపం. దీని మూలంగా ఒక వ్యక్తి

(మిగతా 45వ పేజీలో)

# సూఫీ తత్వం

- శ్రీ కె.ఎల్.మహేంద్ర

సూఫీతత్వం అరబ్ దేశాలలో స్పెయిన్, పర్షియాలలో పుట్టి ఆ తరువాత భారతదేశం వచ్చింది.

హజరత్ బయాజిద్ బాస్నామ్ ఇరాన్‌కు చెందిన తత్వవేత్త ఇలా అన్నాడు. "దేవునిలో ఐక్యమవ్వాలనే దయాంతః కరణలు కల్గివుండు తోటిమానవులపట్ల న్యాయంగా, ధర్మంగా ప్రవర్తించు". ఆయన పితామహుడు జో రాష్ట్రియన్ మతస్తుడు. బౌద్ధమతంవలన, వేదాంతంవలన ఆయనప్రభావితుడయ్యాడు. బస్తామ్ బుద్ధుని నిర్వాణతత్వాన్ని వేదాంతంలోని ఏకేశ్వర భావనను పోలిన "తానా" అనే తత్వాన్ని బోధించాడు.

జలాలుద్దీన్ రమి ఇలా ప్రభోధించాడు :

"జ్ఞానాన్ని ప్రేమించడంవల్లనే జీవితం అంటే ఏమిటో మనం తెలుసుకోవచ్చు. జ్ఞాన సిద్ధాంతానికి ఈ హిందూ, ముస్లిం, అరబ్, తురుష్కుల మధ్య అర్ధరహిత సంఘర్షణలకు సంబంధం ఏమిటి? ముస్లిం సనాతనవాదులు హిందువులను కాఫిర్‌లని అంటారు. ముస్లిం మతం ఖడ్గం వల్లనే వ్యాప్తి చెందింది అంటారు.

## ఇతర మతాలను గౌరవించే ఖురాన్

కాని మౌలానా రమి ఖురాన్ నుండి ఈ క్రింది అంశాన్ని ఉదహరించుతారు :

"మతం విషయాలలో ఎటువంటి నిర్బంధం, బలవంతం పనికిరాదు. నీకు నీ మత విశ్వాసం ఎటువంటిదో నాకు నా మత విశ్వాసం అటువంటిదే."

ఇతర మతాలపట్ల ఉండవలసిన గౌరవం గురించి ఖురాన్ ఇలా చెబుతుంది :

"మా మతం చెప్పిన దానిని మేము విశ్వశిస్తాం. అల్లాగే మీ మతం చెప్పినదానిని మీరు విశ్వసిస్తారు. మీ దేవుడు, మా దేవుడు ఒకటే. మీరు, మేము అందరూ ఆదేవదేవునికి బద్ధులమే."

ఖురాన్ ఇంకా ఇలా చెబుతున్నది :

"పవిత్ర ఖురాన్ నుండే ఈ సూక్తులను నీకు చెబుతున్నాను. ప్రాచీనరుషులు ఉల్లేఖనలన్నింటిలో ఇవే సూక్తులు ఉంటాయి."

"ప్రపంచంలో అన్ని జాతులవారికి దూతలు పంపించబడ్డారు. ఏ సమాజమూ బోధకుడు మార్గదర్శిలేకుండా వదలివేయబడలేదు."

మౌలానా రమి ఇలా ఉద్బోధించారు :

"నా అస్థిత్వం వేదాలలో ఉంది. హిందూదేవాలయాలలో ఉంది. పార్సీల జెండా నెస్తాలో ఉంది. ముస్లింల ఖురాన్‌లో ఉంది. క్రైస్తవ దేవదూతలలో ఉంది. పార్సీల "అస్థఖడ"లో ఉంది. ప్రేమ అనే భావనను మించి నాకు మరో దేవుడులేడు. సూపీతత్వ సారాంశం ఇదే."

ఉపనిషత్తులు ఏమని ప్రబోధించుతున్నాయి?

"ఆత్మ గురించి తెలుసుకుంటే జగత్ సర్వం తెలుసుకున్నట్లే. అహం బ్రహ్మస్మి" అన్న సూక్తికి సమానమైనదే సూఫీ తత్వంలో "అనుకహక్" అంటే "నేనే సత్యము" అన్న భావన.

మహమ్మదు ప్రవక్త ఇలా అన్నారు. "షారియత్ అన్నది నా ప్రవచనము. దారియాత్ అన్నది నాక్రియ, జ్ఞానం అన్నది నా రాజ్యము."

సూఫీలలో అత్యధికులు పండితులు కాని ఎక్కువ మంది తమ క్రియాకార్యకలాపాల ప్రతిష్టమీదనే ఆధారపడతారు.

గంతోతికి చెందిన షేక్ అబ్దుల్ ఖాదర్ ఇలా అంటారు. "భగవంతుని నమ్మినవారు - నమ్మనివారు, కాపిర్‌లు, విధేయులు, పాపాత్ములు, రుజువర్తనగతవారు, తప్పుదోవలో పడినవారు, ముస్లిములు, అగ్ని ఆరాధకులు అందరు సమానులే -అందరూ మానవులే, అందరూ ఒక తావళంలో పూసల వంటివారే."

నిజాముద్దీన్ అలూయి, హిందువులు విగ్రహారాధన చేయడం చూసి "ఎవరి మతం వారికి ఎవరి మార్గం వారికి, ఎవరి ఆరాధనాలయం వారికి ఉంటాయి" అనేవారు.

ఈ విధంగా ఎవరి మత విశ్వాసాన్ని వారు సంరక్షించుకుంటూ ఎదిటి మతం వారిపట్ల సహన భావం కల్గి ఉండటమే నిజమైన మతం. అటువంటి వారు అన్నిరకాల మత విశ్వాసాలపట్ల ప్రశంసాభావమే కల్గి ఉంటారు. ఏకేశ్వర భావమే మానవ సమాజాన్ని సమైక్య పరచే గొప్పశక్తి. దైవభక్తి గీతాలు. మార్మిక గేయాలు (ఖవాలి) జమాత్‌ఖానాలో సమిష్టి జీవనం అందరూ కలిసి ఒకే చోట నివసించడం, అందరూ నేలపై నిద్రించడం - ఇవి భావ సమైక్యతను తీసుకొని వస్తాయి.

డాక్టర్ రాధాకృష్ణ ఇలా వ్రాశారు : "సౌందర్యం, సామరస్యం, స్వేచ్ఛ, సముజ్వల ఆశయాలు - వీటి గురించి కవులు, సాధు పుంగవులు గాఢ భక్తి పారవశ్యంతో వ్రాసిన కవితాలు, కీర్తనలు - సమాజంపై అత్యంత బలమైన ప్రభావాన్ని కల్గిస్థాయి.

"సాధు సంపన్నులు సకల ప్రపంచానికి చెందిన ఆరాధ్యులు. వారు మన మనస్సులను, మేదస్సులను అజ్ఞానం నుండి మూఢనమ్మకాలనుండి పిడివాదం పెర వాదాల నుండి, కర్మాకాండలనుండి మనలను మరల్చి, నిరాడంబరత్వంతో

కూడిన మతంవైపు తీసుకొని పోగలరు."

## వేదాంతాన్ని పోలిన సూఫీ మతం

ఉర్దూ సూఫీ కవి మీర్ ఇలా వ్రాశారు :

"ఈ సకల జగత్తు కేవలం మాయ, మిధ్య ఇక్కడ ఏదీ శాశ్వతంకాదు. మన భావన ఒక్కటే శాశ్వతం, సత్యం" ఇది "మాయ" సిద్ధాంతానికి చేరువైన సిద్ధాంతం.

ప్రఖ్యాత అరబ్ కవి అన్వర్, మహమ్మదు ప్రవక్త జీవించి ఉన్న కాలం నాటి వాడు, ఆయన ఇలా అన్నాడు : "ఒక్క భగవంతుడు తప్ప మిగిలినదంతా పరివర్తన, అశాశ్వతం, అనిత్యం." ఇది వేదాంత భావనకు దగ్గరగా ఉన్నభావం.

గోరఖ్‌నాద్ యోగులతోను, వేదాంతులు తదితర హిందూ తత్వవేత్తలతో సూఫీలు చర్చలు జరుపుతూ ఉండేవారు.

సూఫీతత్వం, ఇస్లామ్ మార్మికవాద ప్రాతిపదికపై నిర్మాణ మైనప్పటికీ భారతదేశంలో ఉద్భవించిన భక్తి ఉద్యమ విశాల ప్రాతిపదిక మీదనే భారతీయ సూఫీ తత్వం జనించింది. ఇది భారతీయ ఉమ్మడి సంస్కృతికి చక్కని నిదర్శనం.

సింధీసూఫీ ఖాజీ ఖదమ్, తన కవితలలో ఇలా అన్నారు.

"నేను అజ్ఞానమనే గాఢ సుషుప్తిలో మునిగి ఉన్నాను. యోగీశ్వరులు వచ్చి నన్ను లేపారు. నామేధస్సును క్షాళన మొనర్చారు. కాలుష్యాన్ని వదలగొట్టారు. జీవన సారాన్ని బోధించారు."

## భక్తి ఉద్యమంపై ఇస్లాం ప్రభావం

ఇస్లామ్‌లోని బహుళ ప్రవక్తల ఆరాధన విధానం -భారతీయ భక్తి ఉద్యమంపై ఎంతో ప్రభావాన్ని కలుగ జేసింది.

షా అబ్దుల్ ఖాసిమ్ తన గీతికలో యిలా అన్నారు :

"నీటి కుండను ఆ మహిళ
తన శిరస్సుపై స్థిరంగా నిలుపుకుంది
ఆ కుండపై పక్షికూచుని
నీరుత్రాగుతుంది
అదేవిధంగా మన ప్రియతములు
మన మనస్సుపై అధివసించి ఉన్నారు."

భక్తి ప్రపత్తులలో, ధ్యానంలో, క్రియా కార్యకలాపాలలో ఎవరి భవితవ్యాన్ని వారు నిర్మించుకోవాలని ఆయన ప్రబోధించారు.

బుల్లెహోషా ఇలా ప్రబోధించారు :

"నీవు యోగివికాదలిస్తే
తామళం ధరిస్తేనే చాలదు
నుదుట తిలకం పెడితేనే చాలదు
ఆశ్రమం నలకొల్పితేనే చాలదు
పల్లెల్లో ప్రజలతో నిత్యం
నివసించు సంచరించు.

సింధీసూఫీలు సింధీ భాషలోనే తమ గీతాలు ఆలపించారు. నసిరుద్దీన్ రిషి ఒక కాశ్మీర్ సూఫీ. ఆయన కాశ్మీరీ భాషలోనే తమ గీతాలు రచించారు. ఈయన శైవ భక్తి ఉద్యమ యోగిని "లల్లా" సమకాలికుడు, ఆమె తాత్విక భావాలతో నసిరుద్దీన్ రిషి ప్రభావితుడయ్యాడు. ఈ ఉభయులు కాశ్మీరీ భాషాభివృద్ధికి ఎంతగానో తోడ్పడ్డారు. కాశ్మీర్ శాలువలు, నగిషీ పనులు, బటేదారిపనులకు వీరే ఆద్యులు.

పంజాబ్‌లో బాబాఫరీద్ మియాన్, మీర్ తదితరులు ప్రసిద్ధులైన సూఫీలు.

బాబాఫరద్, కబీర్, నామ్‌దేవ్, నానక్ మున్నగు తత్వవేత్తల ఉపదేశాలు గురు గ్రంథసాహెబ్‌లో చేర్చబడ్డాయి.

అమృత సర్‌లోని స్వర్ణదేవాలయానికి పునాది రాయి వేయవలసిందిగా సూఫీ తత్వవేత్త మియాన్ మీర్‌ను, గురు అర్జున్‌సింగ్ కోరారు. బాబా పరీద్ పంజాబీ భాషలో తన తత్వాలను వ్రాశారు. పంజాబీ భాష అభివృద్ధికి ఎంతగానో తోడ్పడ్డారు.

బాబాపరీద్ ఇలా ప్రవచించారు :

"రాచరిక ప్రభుత్వాలను, ధనవంతులను నీయింట్లోకి అడుగుపెట్టనీయకు వారు అడుగుపెట్టారా! అంత అరిష్ట దాయకమే!

ధనవంతుల దరిచేరవద్దని, బాబా పరీద్ తన అనుయాయులను హెచ్చరించారు.

ఒక సుల్తాన్, షకర్ గంజ్‌లో ఉన్న బాబా ఫరీద్‌కు చాలా ధనం పంపించారు. నాల్గు గ్రామాలను యినాముగా యిస్తా మన్నారు. దానికి బాబాపరీద్ యిలా సమాధానం యిచ్చారు: "ఈ ధనాన్ని నేను పేదవారికి, దీనితో అవసరమున్నవారికి యిస్తాను. ఈ గ్రామాలను ఎవరికి కావాలో వారికి దానం చేయండి." "ఈ రోజు ఏదిలభిస్తే దానితోనే సంతృప్తి చెందాలి. రేపటి సంగతి ఆలోచించకూడదు ఆందోళన కూడదు" అని ఆయన అన్నారు.

ఖాజా మొయినుద్దీన్ చిస్తి, అజ్మీర్‌లో వెలసిన గొప్ప సూఫీ. మక్కా వెళ్లలేని ముస్లిమ్‌లు అజ్మీర్ వెడతారు. చిస్తికి హిందూ అనుయాయులు, ముస్లిం అనుయాయులు కూడా ఉన్నారు. అంతేకాదు చిస్తిపేరు అనుబంధంగా కల్గిన బ్రాహ్మణులు - చీస్తి బ్రాహ్మణులు ఇక్కడ ఉన్నారు. ఈ బ్రాహ్మణులు" తమ మతం మార్చుకోకుండానే సూఫీతత్వాన్ని అవలంబించారు.

## హిందూ - ముస్లిమ్ సమైక్యతకు చిహ్నం

ఢిల్లీలోని సూఫీ ప్రముఖుడు ఖాజీ నిజాముద్దీన్ అహ్లాయాను, సుల్తాన్ ఒకసారి తన ఆస్థానానికి ఏవో పరిపాలనా సంబంధమైన విషయాలు మాట్లాడడానికి రమ్మని ఆహ్వానించాడు. కాని నిజాముద్దీన్ అందుకు తిరస్కరించాడు. సూఫీలు, ఆధ్యాత్మిక విషయాలకే అంకితమైన వారు తప్ప పరిపాలనా వ్యవహారాలతో వారికెట్టి నిమిత్తం లేదు" అని సమాధానం యిచ్చాడు. తనకు ఎటువంటి స్మారక చిహ్నామూ నిర్మించవద్దని ఆయన ప్రకటించారు. కాని మహమ్మద్ బీన్ తుగ్లక్ ఆయనకు గోరీ నిర్మించాడు. ఆయన ప్రియ శిష్యుడు అమీర్‌ఖుస్రో. ఈయన పగలు రాజాస్థానంలోను, రాత్రిళ్లు

ఖంఖాహ్ (దర్గా) గడిపేవాడు. సితార్‌ను తన సంగీతం ద్వారా వాడుకలోకి తెచ్చింది ఖుస్రోయే.

కుతుముద్దీన్ కాకి చిస్తీ, సిసినా (పీఠం) అనుయాయుడే. ఈయనే ఢిల్లీలో సూఫీ స్మారకార్థం - కుతుబ్ మినార్ నిర్మించాడు.

మహాత్మా గాంధీ అమరుడవడానికి ఒక వారంరోజులు ముందు ఈ దర్గాను సందర్శించారు.

విగ్రహారాధకులైన హిందువులను ఆక్షేపించుతున్నవారిని అమీర్ ఖుస్రో నిరసిస్తూ, అటువంటి హిందూ భక్తులనుండే అసలు భక్తి అంటే ఏమిటో నేర్చుకోవలసిందని అన్నారు.

భారతదేశాలలో సూఫీ మతానికి 16 సిసిలాలు (పీఠాలు) ఉన్నాయి. ఇందులో నాల్గు ప్రముఖమైనవి. ఈ నాల్గు చోట్ల అనేకమంది సూఫీ అనుయాయులున్నారు.

సూఫీ ప్రముఖులలో ఒకరైన హజరత్ హాజి ఇమందుల్లా మోహర్ 1857 ప్రథమ భారత స్వాతంత్రపోరాటంలో పాల్గొన్నారు. చిస్తీ సంప్రదాయక సూఫీలలో ప్రముఖులు నిజాముద్దీన్ హలూయా, షేక నిజాముద్దీన్ చిరాగీ, ఢిల్లీ ఖాజా జిస్వా దరాజ్ (గుల్బర్గా) హైద్రాబాద్‌కు చెందిన యూసఫ్ సాహెబ్, షరీఫ్ సాహెబ్‌గార్లు.

సూఫీ ఉద్యమం భారతదేశంలో ఆ మూల నుండి ఈ మూలకు వ్యాపించింది. గుజరాత్‌లో, బొంబాయి, బీహార్, గ్వాలియర్, అలహాబాద్ మున్నగు చోట్ల అనేక మంది సూఫీ ప్రముఖులు ఉండేవారు. దేవుడు ఒక్కడే - దేవుడు సర్వాంతర్యామి అని వీరందరూ ప్రభోదించారు.

ఉర్దూ కవులు హజరత్ మొహాని, ఇక్బల్, తమ కవితలలో ఇలా వ్రాశారు. "అవిశ్వాస పరులకు అవిశ్వాసమే అలంబనం. షేక్‌లకు ఇస్లామ్ అలంబన - మాకు అలంబనం ప్రేమ, సంతృప్తి, సామరస్యం, మాత్రమే"

## సూఫీ తత్వంలోని మూడు ప్రధాన సూత్రాలు

సూఫీ తత్వంలోని మూడు ప్రధాన సూత్రాలు ఇవి. 1) అందరిపట్ల ప్రేమ 2) ధైర్యంతో కూడిన విశ్వాసం 3) మానవాళికి సేవ.

భారతీయ సూఫీ తత్వవేత్తలు, రామాయణ, భారత, భాగవతాలను, ఉపనిషత్తులను పర్షియన్ భాషల్లోకి అనువదించారు. సూఫీలు, సూఫీ సాధుపుంగవులు తాము చెప్పింది తాము ఆలరించారుకనుకనే గొప్ప ప్రతిష్ట సంపాదించారు. ముల్లాలు ఇతర ముస్లిం మతాధిపతులవలెకాక వారు నిరాడంబర జీవితాలు గడిపారు.

షహ దర్గాకు చెందిన పీర్ బందిర్ తన నల్గురు కుమారులను 700 మంది శిష్యులను, గురుగోవిందసింగ్ ఆటవికతెగల అధిపతులకు వ్యతిరేకంగా జరిపిన పోరాటంలో ఆయన సహాయార్థం పంపిన విసయం గమనించదగింది. ఈ అటవీ తెగల నాయకులు బంగామి యుద్దసమయంలో ఔరంగజేబును సంతృప్తి పరచడానికి గురుగోవింద్ సింగ్‌పై దాడిచేశారు.

బులేషా ఇలా అన్నారు.

"బృందావనంలో గోవులు
శ్రీలంకలో జ్యోతికళికలు
మక్కాకు పోయే యాత్రీకులు"

అందరూ భగవంతుని స్వరూపాలే అంశంలోను దేవుడున్నాడు. తగవు లేల ?

నిరంకుశత్వానికి వ్యతిరేకంగా ఫరీద్‌ఫకీర్ సూఫీ ఇలా అన్నారు!

శివాసీలపై అధివసించి
పాలకులు అన్యాయాల్ని
ప్రజలపై రుద్దుతున్నారు.
కష్టించి పనిచేసేవారిని
హీనులుగా చూస్తున్నారు
తక్కువ కులస్తులుగా చూస్తున్నారు
వీరిరక్తాన్ని వారు పీలుస్తున్నారు
కట్టుబానిసలుగా ఉపయోగించుకుంటున్నారు.
దేవుని పట్ల ఈ పాలకులకు
భయ భక్తులు లేనేలేవు.
వృత్తిపనివారిపై పాలకులు
విపరీతంగా పన్నులు విధిస్తున్నారు
ఈ పాలకులు చివరికి
పోయేది నరకానికే !
అణగారిన అర్తుల శాపాలు
ఈ పాలకులను చివరకు
రూపుమాపుతాయి

అజీజ్‌మియా అన్న పేరుతో ప్రఖ్యాతి పొందిన హజరత్ షా మహమ్మద్ గాగి ఎన్నో సుందరమైన గజల్స్‌ను సృజించారు. తుమ్రీ, దుర్మీలను, హజిదార్రాలను "రజా" పేరుతో ప్రఖ్యాతికి తెచ్చారు. హిందూస్తానీ సంగీత సామ్రాట్టులు - ఉస్తాద్ అల్లావుద్దీన్ ఖాన్, ఉస్తాద్ మూషాక్ హుస్సేన్ ఖాన్, ఉస్తాద్ హాఫీజ్ అలిఖాన్, గురు అచలమ్ మరోరాజ్, మున్నగువారు అజీజ్ మీయాఅనుయాయులే గురు శంభుమహరాజ్, బేగమ్ అక్తార్, బీరాజ్, మహరింజ బాహాద్ లక్నల మున్నగువారు కూడా అజీజ్ మియా శిష్యకోటిలోనివారే.

## మహమ్మద్ ప్రవక్త అనుభవాలు - సూఫీతత్వం

మహమ్మద్ ప్రవక్త అనుభవాలనుండే సూఫీ తత్వం జనించింది. "ఉరుజీ"లో ఉన్నప్పుడు ఆయన దేవునితో మమేక స్థితిలో ఉన్న వ్యక్తి. అప్పుడు ఆయన ప్రవచనాలు సాక్షాత్తు దేవుని ప్రవచనాలుగా ఉండేవి. "న్యూజివ్" స్థితిలో ఉన్నప్పుడు ఆయన దేవదేవునితో విడివడి ఉన్నట్లుండేవాడు. అప్పుడు ఆయన చేసిన ప్రవచనాలు "హదిత్"తో పొందుపరచబడినాయి.

మహమ్మద్ ప్రవక్తపై ప్లేటో సిద్ధాంతాల ప్రభావం, వేదాంత

ప్రభావం (ఏకేశ్వర భావం) కూడా ఉండేవని చెప్పవచ్చు.
షా అబ్దుల్ లతీఫ్ ఇలా అంటారు.
"సర్వం భగవంతుని ముందు సమర్పించు.
ఆయనపైననే ఆధారపడి ఉండు
నీ సందేహాలు, ఆందోళనలు ఆయన తొలగించగలడు.
ఆయన తన కరుణ కటాక్షవీక్షణాలతో
నీకోర్కెలను సాఫల్యం మొనరించగలడు.
భగవద్గీతలో ఉన్న భావనజాలం కూడా అదే.

---

# వైష్ణవం

(38వ పేజీ తరువాయి)

పవిత్ర కర్తవ్యం మతం నిర్వహించగలదు.

నా ఈ అధ్యయనపత్రం - సమీక్షను సింహావలోకనప్రాయంగా చెప్పవలసినది ప్రహ్లాదుని మాటలు ఉదహరించుచున్న హిరణ్యకసిపునితో - ప్రహ్లాదుడు అంటాడు.

"లోకములన్నియున్ గడియలోన జయించితి నింద్రియా
నీకము చిత్తమున్ గెలువజాలను; నిన్ను నిబద్ధచేయు ఈ
భీకర శత్రులార్వుర ప్రభిన్నుల చేయుము. భూతకోటిలో
నీకు విరోధి కలడొకడు-నేర్పున చూడుము దానవేశ్వరా!

విజ్ఞానం - బాహ్యప్రకృతిని పంచభూతాలను జయిస్తుంది.
మతం - మానవుని ఆంతర ప్రకృతిపై విజయం సాధిస్తుంది.
ఆత్మ విజయమే విశ్వ విజయం.
ఆంతరంగికమైన - స్వచ్ఛందమైన క్రమశిక్షణ -
సహనమే - అనువైన సంస్కృతి + సంస్కృతి విజ్ఞానం
మతం. ఈ సదస్సు ధ్యేయం "సహనం" - సహజీవనం
కావాలని నా విన్నపం.

---

# ఇస్లాం

(41వ పేజీ తరువాయి)

వైఖరిలో, ఒక వర్గం వైఖరిలో ఇతరుల పట్ల వివక్ష చూపే నైజం పెంపొందుతుంది. తప్పు అయినా, ఒప్పు అయినా నావర్గమే ("My community right or wrong") అనే తత్వం దీనికి మూలం. "My notion right or wrong" అనే వైఖరి నుండి ఇది పుట్టింది. అందుచేత ఈ వ్యక్తుల, ఈ వర్గాల దృష్టిలో వ్యవహారం తమదైనా, ఇతరులదైనా తమ స్వలాభమే సత్యం, తమ స్వార్థమే ధర్మం, అదే సర్వం. ఇలా తమ వర్గం తప్ప, మరే ఇతర వర్గపు ఉనికినీ సహించకుండా, ఇతర వర్గాలతో సతతం పోరాడుతూ, వైరభావం కలిగి ఉండే ప్రతి సంస్థ, ప్రతి పార్టీ మతతత్వపుదే అవుతుంది. మతతత్వం - అది మైనారిటీ వర్గానికి చెందినా, మెజారిటీ వర్గానికి చెందినా, ఎట్టి పరిస్థితులలోనూ ఖండించదగినదే.

హిందూ ముస్లింల మధ్య నెలకొని ఉన్న అపనమ్మకానికీ, ఉద్రిక్తతకూ,ఒకరిని గురించి మరొకరు తెలుసుకోకపోవటం, సరిగ్గా అర్థం చేసుకోకపోవటం అనేది ఒక పెద్ద కారణం కావచ్చేమో గాని, అదే అసలు కారణం కాదు. అసలు కారణం వారి మనస్తత్వం, వారి ఆచరణా సరళి. ఉదాహరణకు, పాకిస్తాన్ ఏర్పడిన తరువాత భారతదేశంలో ముస్లింల ఉనికి అర్థం లేనిది కనుక వారు ఇక్కడ నుంచి వలస అయినా పోవాలి లేదా ఇక్కడి అధిక సంఖ్యాక వర్గంలో కలిసైనా పోవాలి అని ఒక వర్గం వారు అంటున్నారు. ఈ ఆలోచనా సరళి ఉన్నంత కాలం ఇక్కడ నెలకొన్న అపనమ్మకాల, అపోహల వాతావరణం దూరమయ్యే అవకాశమే లేదు.మనస్తత్వాల పరివర్తనకు పరస్పర సదవగాహన అవసరమనటంలో సందేహం లేదు. అయితే అసలు ఎల్లాగైనా చెడు చెయ్యాలనే తలంపే ప్రధానంగా ఉన్న చోట అవగాహనా పర్వతాలు ఉండి మాత్రం ఏం ప్రయోజనం? గాంధీజీ అన్నట్లు విభిన్న మతవర్గాల మధ్య కలతలను అంతమొందించటానికి, మతాల భిన్నత్వాన్నీ, సామాజిక న్యాయసూత్రాలన్నీ స్వీకరించటం తప్ప మార్గాంతరం లేదు.

మతం ఫాసిస్టు భావాలను రెచ్చగొట్టదు, అరాచకాన్ని ప్రోత్సహించదు. విద్వేషాన్ని శత్రుత్వాన్ని బోధించదు. మతం మమతానురాగాలను పెంపొందిస్తుంది. మృదు స్వభావాన్ని కలిగిస్తుంది. త్యాగబుద్ధిని, సహనాన్ని, పరోపకారాన్ని పెంచుతుంది.

# మతసంస్కరణోద్యమాలు

-ప్రొఫెసర్ వి.రామకృష్ణ

మానవజీవితంలో ప్రధాన భాగంగా మతం, అనాదినుంచీ పరిగణన పొందుతూ వచ్చింది. సామాజికావసరాలతో అవసరం లేకుండా, మతం పుట్టుక మానవుడి అజ్ఞానంతో, భయాందోళనలతో మొదలైంది. క్రమేపి ఇది సమాజంలో ప్రబలశక్తిగా, ముఖ్యంగా మానవులను తన అధీనంలో ఉంచుకునేట్లుగా రూపొందింది. ప్రజల మనోభావాలపై దాని కున్న పట్టునుగ్రహించి, తమ స్వప్రయోజనాలకు వాడుకో డానికి, సమాజంలోని కొన్ని వర్గాలు, పాలకవర్గం, పౌరోహిత వర్గం తయారయ్యాయి. మతంవీరికొక సిద్ధాంతపరమైన సాధనంగా తయారైంది. మతంతోపాటు దైవం, మరోజన్మ, పాప పుణ్యాలు, మోక్షం, ముక్తిలాంటి అనేక పారమార్థిక భావాలు తలెత్తాయి. వీటిచుట్టూ, మానవజీవితాన్ని, పుట్టుక నుంచీ మరణించేవరకు, నిర్దేశించే ఎన్నోరకాలైన పూజలు, పునస్కారాలు, క్రతువులు, తామరతంపరగా పెరిగాయి. మత సారాన్ని వాస్తవంలో అర్థం చేసుకోకపోయినా, అది అందించిన ఊరట, మనశ్శాంతి, రక్షణ, నిర్లిప్తతాభావాలు, ప్రజలకు కొంత ఉపశాంతిని, అప్పుడూ, ఇప్పుడూ కల్గిస్తున్న మాటవాస్తవం. ఇవి నిజం కావని, కేవలం తాత్కాలిక మానసిక శాంతిని మాత్రమే ప్రసాదిస్తాయని, ప్రజలకు తెలిసినా, దాన్ని గూర్చి పట్టించుకోకపోవడం మామూలైంది. మతాన్ని అనుసరిస్తూనే భౌతికజీవితాన్ని ప్రజలు విస్మరించలేదు. అదివారి మనుగడకు అవసరం కాబట్టి . ఒక్కొసారి, మానవుని భౌతిక జీవితంలో అభివృద్ధి లేనప్పుడు, దానికి కారణాలను మతం ద్వారా చెప్పించి ప్రజలచైతన్య శక్తిని దెబ్బకొట్టారు. భౌతిక పరిస్థితులు బాగా మెరుగైన సందర్భాల్లో కూడా ఆయా వర్గాలు, వాటిని కాపాడుకోటం కోసం, మతాన్ని ఆశ్రయించారు. మొత్తంమీద, మతం మానవుడి భౌతిక . మేధోపరమైన పెంపుదలకు తోడ్పడకపోగా, వాటిని నిరోధించేందుకే కృషి చేసింది.

## మత సంస్కరణల పరిధి

మతంలోని పెడధోరణులను అరికట్టి, సంస్కరించి, దాని సారాన్ని ప్రజలకు అందించాలన్నదే మత సంస్కర్తలు చేసిన కృషి ఇది ఉద్యమాల రూపంలో, ఒక్కొసారి కొత్త మతాల రూపంలో, లేక మతశాఖల రూపంలో వెల్లడైంది. ఈ ఉద్యమాలు మతరహితమైనవి కావు. మత వినాశనాన్ని కోరినవీకావు. మతం ఎలా, ఏ రూపంలో ఉండాలి? అన్నదే వీటి ముఖ్యోద్దేశం. క్రీ పూ.6 వ శతాబ్దం నాటి లోకాయత సిద్ధాంతాన్ని మినహాయిస్తే , మిగిలిన అన్నిసంస్కరణోద్య మాలు, మత పరిధిలో, మతానికి లోబడి , మతపరంగా జరిగినవే.

ఈ పత్రంలో నేను క్లుప్తంగా, చెప్పదలచుకొంది, ఆధునిక కాలంలో, ముఖ్యంగా, 19 వ శతాబ్దంలోని మత సంస్కరణోద్యమాలను గురించి మాత్రమే. ఇందులోను, కేవలం ఉద్యమాల పుట్టుకకు తోడ్పడిన చారిత్రక నేపథ్యాన్ని గూర్చి . వాటి స్వభావ ప్రభావాలగూర్చి చర్చిస్తాను.

19 వ శతాబ్దపు మత సంస్కరణోద్యమాలు, పాశ్చాత్య భావజాల ప్రభావంతో పుట్టాయనడం, చారిత్రకంగా సరిగాదు. ఇంతవరకు వాడుకలో నున్న ఈ సిద్ధాంతం, వలసపాలనను పరోక్షంగా సమర్థించే చరిత్రరచన కుట్రలో భాగం మాత్రమే. పాశ్చాత్య భావజాలంలోని ప్రజాస్వామ్య, ఉదార, శాస్త్రీయ భావాలు, ఐరోపా దేశాల్లో సంభవించిన పునరుజ్జీవన, మత సంస్కరణలు, భారత దేశంలోని మేధావుల ప్రభావితం చెయ్య లేదని చెప్పడం కూడా అచారిత్రకమే. అయితే, మేం చెప్పేది, ఈ మత సంస్కరణలు, పై ప్రభావం వల్ల మాత్రమే రాలేదంటున్నాం. సరైన శాస్త్రీయ విశ్లేషణ, మరో విధంగా ఉంటుంది. కారల్‌మార్క్స్ వివరించినట్లు , భారతదేశంలో బ్రిటిష్‌పాలన, చారిత్రకంగా రెండు కర్తవ్యాలను నెరవేర్చింది. ఒకటి, అన్నివిధాల వెనుకబడ్డ, కాలం చెల్లిన భారతీయ సమాజాన్ని రూపుమాప పూనుకోడం, రెండు, దాని స్థానంలో కొత్త సమాజ స్థాపనకు బీజం వెయ్యడం. విధ్వంసకర, పునరుజ్జీవనపాత్రలుగా కారల్ మార్క్స్ వీటిని వర్ణించాడు.

## నూతన సామాజిక వర్గాల పుట్టుక

పై విశ్లేషణలో మనం తెల్సుకోవాల్సిన ముఖ్యాంశమేమంటే, వలసపాలకులు, తమ ఆర్థిక, రాజకీయ , విద్యావైజ్ఞానిక పాలనాపర సంస్కరణలద్వారా, భారతీయ సమాజ చట్రంలో కొన్ని మౌలిక మార్పులను తెచ్చారు. వీటి పూర్తి వివరణ, ప్రస్తుతం ఇక్కడ అవసరమనుకున్నా, సాధ్యం కాదు. కాని వీటి ఫలితం మాత్రం గమనించాలి. నూతన సామాజిక వర్గాలు, శక్తులూ పుట్టుకొచ్చాయి. ఒకవైపు వలస పాలకుల ప్రయోజనాలు, మరోవైపు ఈ కొత్తవర్గాల ఆలోచనావిధానం . ఆకాంక్షలు భారతీయ సమాజంలో మత, సామాజిక, సాంస్కృతిక కదలికకు దోహదం చేశాయి. ఈ మార్పుకు ఆ తర్వాత రాసాగిన రాజకీయ చైతన్యానికీ, పాటుపడ్డ ముఖ్యవర్గం, మధ్య తరగతి. ఇందులోను ప్రధాన పాత్రవహించింది విద్యావంతులైన మేధావులు.

ముఖ్యమైన మత సంస్కరణలకు దారితీసిన మరో అంశం, భారతీయ సమాజంలో ,భాగంగా, క్రీస్తు పూర్వం నుంచీ, అనూచానంగా వస్తూఉన్న అసమ్మతి, నిరసన భావాలు. వాటిద్వారా వచ్చిన ఉద్యమాలు, ఏమానవసమాజమూ స్తబ్దుగా,

నిలవనీరులా ఉండదు. బాహిరంగా, అంతర్గతంగా ఎన్నో వత్తిళ్లకు, మార్పులకు, మానవ సమాజాలు గురౌతూ ఉంటాయి. ఈ సార్వజనీన, చలన సూత్రానికి భిన్నమైందిగా భారతీయ సమాజాన్ని వలస చరిత్రకారులు వర్ణించడం అసత్యమైనా విడ్డూరం మాత్రంకాదు. జైన, బౌద్ధమతోద్య మాల కాలంనుంచీ, మధ్యయుగాల్లోని భక్తి, సూఫీశాఖలు, అట్లే 18 వ శతాబ్దంలో దేశ మంతా అల్లుకు పోయిన వందలాది వివిధ మత శాఖలే దీనికి ఉదాహరణలు. "హిందూ" మతం కేవలంపై పై అంశాలకు - అంటే అర్థం లేని ఆడంబరాలకు, పూజలకు, పునస్కారాలకు, మూఢ నమ్మకాలకు, సాంఘిక దురాచారాలకు, ఆలవాలమై, దానిలోని అసలు దినుసును కోల్పోయి, వట్టి పిప్పిలా తయారైనప్పుడు, తమ అసమ్మతిని, నిరసనను బలంగా ప్రకటిస్తూ, వాటిని ప్రతిఘటించడానికి ముందుకొచ్చినవే ఈ సంస్కరణోద్యమాలు.

## పెట్టుబడిదారీ విధానానికి ముందు వుండే పరిస్థితులు

18 వ శతాబ్ది సాధారణంగా చీకటియుగంగా పరిగణిస్తూ వచ్చారు. భారతీయ సమాజం రాజకీయంగా అనైక్యతకు గురయిందని చెపుతాం. ఇదిపైకి నిజమేననిపించినా, యిందులో యిమిడివున్న యితరాంశాలను చూడవల్సివుంది. మొగలాయీ సామ్రాజ్య పతకం 1707 సంవత్సరంనుండి, అంటే ఔరంగ జేబు మరణం తో ఆరంభమయిందనీ, ఆతర్వాత దేశం నలుమూలల్లో స్వతంత్ర్యరాజ్యాలు ఏర్పడి, ఒక కేంద్రీయ రాజ్యాధికారం గతించిందని చరిత్రలో చెప్తాం. ఇది నిజమే. అయితే, మొగల్ సామ్రాజ్య పతనం ఔరంగజేబు జీవించి వున్నప్పుడే ఆరంభమైంది. కేంద్రీయ రాజ్యాధికారం నశిం చినా, అనేక స్థానిక స్వతంత్ర్య రాజ్యాలు - మైసూర్, బెంగాల్, హైదరాబాద్ మొదలగునవి ఏర్పడి, అన్య రంగాల్లోనూ అభివృద్ధి ని సాధించి, ఆదేశ ఆర్థిక పటిష్టతకు, సాంస్కృతిక వికాసానికి తోడ్పడ్డాయి. ఆర్థికంగా, పెట్టుబడిదారీ విధానానికి ముందుండే పరిస్థితులు Proto Capitaligst నెలకొన్నాయి. పాశ్చాత్యులు అభివృద్ధి చెందిన తమ శాస్త్రీయ, సాంకేతిక, సైనికబలగంతో వచ్చి, భారతీయ సహజ ఎదుగుదలను మధ్యం తరంగా తుంచివేయకుంటే, భారతదేశం , తనదైన సొంత తరహా లోనే ఆధునిక, పెట్టుబడిదారీ యుగంలోకి ప్రవేశించి వుండేది.

## మత సంస్కరణల చారిత్రక నేపథ్యం

రాజకీయార్థిక పరిస్థితులలా వుంటే, మత, సాంస్కృతిక పరిస్థితుల్లో భారతదేశం వెనుకబాటుతనాన్ని, ప్రదర్శించలేదు. సాంస్కృతికంగా, కొత్తగా ఏర్పడ్డ ప్రాంతీయ స్వతంత్ర రాజ్యాల్లో దేశీయ భాషలు, సాహిత్యం వికసించింది. పద్య వాఙ్మయంనుండి, గద్యానికి సాహిత్యం ప్రజాస్వామ్యీకరణ పొందింది. సృజనాత్మక సాహిత్యం, ప్రజలకు దగ్గరైన భాషలో వెలువడింది. సంగీతంలో, చిత్రలేఖనంలో ప్రాంతీయ పత్యేకతలతో, కొత్తరీతులు మొదలై, పౌరాణిక అంశాలను వదిలి, నిత్య జీవితంలో కన్పించే అంశాలు ప్రవేశించాయి. ముఖ్యంగా యీమార్పు చిత్రలేఖనంలో చూడగలం. మతపరంగా, అన్ని ప్రాంతాల్లో, అనేక సంప్రదాయ వ్యతిరేక శాఖలు ఏర్పడ్డాయి. హిందూమతంలోని దుస్సాంప్రదాయాలను, ఆచారాలను, పూజలను పునస్కారాలను తిరస్కరించి, 'గురు' సంప్ర దాయంలో యీ శాఖలు, మతాన్ని సరళంచేసి, ప్రజలను అందించాయి. సామాన్య ప్రజలు యీ శాఖల్లో అసంఖ్యాకంగా చేశారు. ప్రజా సాంస్కృతిలో భాగంగా యీ మతశాఖలు, ప్రజలు నిత్యం మాట్లాడుకొనే భాషలో, బోధనలను, , పాటలను, సాహిత్యాన్ని సృష్టించాయి. ఛాందసభావాలకు, మూఢనమ్మ కాలకు స్వస్తిచెప్పి, సామాన్యప్రజల్లో నెలకొన్న సాంఘిక దురాచారాలను రూపుమాప ప్రయత్నించాయి. ఈ శాఖల్లో, ముఖ్యంగా చెప్పుకోదగ్గవి, బెంగాల్లో కార్తభాజులు, స్పష్ట దాయకులు, బలరామీలు, సఖీభావకులు, రామవల్లభీలు, ఉత్తరప్రదేశ్లో సత్యనామీలు, అపాపంతులు, శివనారాయణులు మొదలగువారు. అలాగే రాజస్థాన్లో చరణదాసీలు, దాదూ పంతులు ఆంధ్రదేశంలో, యించుమించు యిదే కాలంలో వచ్చిన బ్రహ్మంగారు, వేమన, నాసరయ్య యీ కోవకు చెందిన వారే. బ్రాహ్మణేతరులు వీనికి నాయకులే కాక, వాటిల్లో సభ్యులందరూ దాదా పువారే బ్రాహ్మణ వ్యతిరేక భావం, అంటే హిందూ మతంగా చెలామణీ అవుతున్న బ్రాహ్మణత్వానికి భిన్నంగా వచ్చినవే యీ శాఖలు. వీటిల్లో బ్రాహ్మణేతర కులాలకు చెందిన వారందరూ వున్నారు. కులాన్ని వ్యతి రేకించి, సామాజిక న్యాయానికి, సాంఘిక ఔన్నత్యానికి పాటుపడ్డమే వీటి ముఖ్య ఆశయం. ఇవన్నీ స్వతంత్రంగా , సహజంగా భారతదేశ నేలనుండి పుట్టినవే. పాశ్చాత్యభావజాల ప్రభావం వీటిపై లేదు. పటిష్టమైన నిర్మాణ కౌశలం లేనందు వల్లా, వివరమైన, స్పష్టమైన సాంఘిక కార్యాచరణ లోపించి నందువల్లా శాశ్వత పరిస్థితుల్లో మార్పురాని కారణంగా, అవి నిద్రాణమై, బ్రాహ్మణత్వ వ్యవస్థలో క్రమేపీ లీనమై పోయాయి. అయినా వాటిప్రభావం సమాజంలో అడుగంట లేదు. అవి వెలిబుచ్చిన నిరసన, అసమ్మతి సమాజంలో రాజుకుంటూనే వుండింది. వాటి ప్రభావపు కొనసాగింపు, శూద్రులనబడే వారి సాంఘిక స్థాయి పెరుగుదలలో ఆధ్మా త్మికంగా దాదాపు బ్రాహ్మణుల స్థానానికి పెంచడం లోనూ కన్పిస్తుందా? గమనించాల్సిన ముఖ్య విషయం, మత ప్రాతి పదికపై చలామణీ అవుతున్న సాంఘిక వ్యత్యాసాలను యీ మతశాఖలు నిర్మూలించడానికి కృషి చేయడం.

## ఆనాటి మత, సాంఘిక ప్రభావాలు

19 వ శతాబ్ది మత సంస్కరణోద్యమాలను, పైన వివరించిన చారిత్రక నేపథ్యంలో పరిశీలించకుంటే, వాటి గూర్చి సరియైన అంచనా వేయటం సాధ్యం కాదు. బ్రహ్మసమాజ స్థాపకుడు, రామ్మోహన్ 18 వ శతాబ్దంలో పుట్టి, 19 వ శతాబ్దంలో తన కృషిని సాగించాడు. బహుభాషా కోవిదుడైన రామ్మోహన్, తన మొదటి ముఖ్యమైన గ్రంథాన్ని,

తుఫాతుల్ మురాహిద్దీన్‌ను పర్షియన్ భాషలో రాశాడు. ఇందులోనే ఏకేశ్వరోపాసన గూర్చి వివరించి, వేదాలుకానీ, మరేయితర మతగ్రంథాలుకానీ ఆపేరుషేయాలుకావనీ, హేతు వాద తర్కానికి నిలవని ఏదైనా గుడ్డిగా విశ్వసించనవసరం లేదనీ పేర్కొన్నాడు. రామ్మోహన్ హేతుబద్ద తాత్విక చింతనకు యిది పరాకాష్ట. ఆ తర్వాత సాంఘిక సంస్కరణలకు సంబంధించి 'సతి' కి వ్యతిరేకంగా పోరాటం సల్పినా, అవి ప్రధానంగా ఆచరణకు సంబంధించినవే. భావపరంగా, ఆ తార్వాత రామ్మోహన్‌లో మార్పు రాసాగి, , తీవ్రతను కోల్పోయింది. ఇక్కడ గమనించాల్సిన అంశం మొదటి దశలో రామ్మోహన్ పై, 18 వ శతాబ్దపు మత, సాంఘిక ప్రభావాలు ఎలావుండేవి? ఆయన పై ప్రసరించిన ప్రభావాలేమిటి? ఇస్లాం, క్రైస్తవ మతాలు రెండూ , ఉపనిషత్తులతోసహా, రామ్మోహన్ భావజాలాన్ని రూపుదిద్దుతాయనుకుంటే, 18 వ శతాబ్ది మత శాఖలమాటేమిటి? ఆ శతాబ్దిలో, ఒక బెంగాల్‌లోనే అలాంటి శాఖలు కొన్ని వందల సంఖ్యలో వున్నాయని తెలుస్తున్నది. రామ్మోహన్ వ్యక్తిత్వం, భావజాలం - రెంటినీ, ప్రోది చేయడంలో వాటి పాత్ర ఏమిటి? ఇవి యింకా సమాధానం దొరకని ప్రశ్నలు గానే చరిత్రలో వుండిపోతున్నాయి.

## సాంఘిక దురాచారాలకు మతపరమైన మద్దతు

19 వ శతాబ్ది మతోద్యమాలను, సాంఘిక సంస్కరణోద్య మాలకు విడదీయరాని లంకెవుంది. సాంఘిక దురాచారాలన్నింటికీ, ఏదో ఒక మతపరమైన సమర్థన వుంది. భారతీయ సమాజంలో, మతం, సమాజం, రెండూ విడదీయరానంతగా పెనవేసుకొని పోయాయి. అందువల్ల, సంస్కరణలు చేపట్టాలంటే, వాటిని ప్రజల్లో వ్యాపింప చేయాలంటే, ఆచరణలో అమలు పరచాలంటే, మతాన్ని సంస్కరించారు. దురాచారాలకున్న మత సమర్థనను నిగ్గు తేల్చాలి. నిజా, నిజాలు తేల్చి చెప్పాలి. ఈ దృష్టితోనే, ప్రధానంగా , మత సంస్కరణను చేపట్టారు. రామ్మోహన్ యీ విషయాన్ని స్పష్టంగా చెప్పాడు. హిందూమతాన్ని తుదముట్టించడం, తన అభిమతంకాదనీ, దాన్ని సంస్కరించడమే ధ్యేయమన్నాడు. ఉపనిషత్తుల్లోని జ్ఞానం, ఆస్తికత లను అంగీకరించాడు.

మతం సార్వజనీనమని, అన్నిమతాల్లోనూ సత్యమున్నదనీ, అన్ని మతాలు సమానమనీ, విగ్రహారాధన పనికిరాదనీ, ఏకేశ్వరోపాసన ఒక్కటే మార్గమని, అందరూ సంస్కర్తలు చెప్పారు. హేతుబద్ధత, జ్ఞానానికి గీటురాయని, మానవ జీవితానికి చుక్కాని వంటిదని వక్కాణించారు. హిందూమత శాస్త్రాలను, పురాణాలను, స్మృతులను పునఃపరిశీలించి, వాటికి సరియైన భాష్యం చెప్పి, తమ సాంఘిక సంస్కరణలకు సిద్ధాంత ప్రతిపత్తి కలిగించారు. విద్యాసాగర్, వీరేశలింగం యిరువురూ వితంతు వివాహాలను సమర్థించి, ఉద్యమాలను చేపట్టింది యీ పాతిప్రదికపైనే. సూత్రప్రాయంగా నైనా కులాన్ని ఖండించి , సర్వమానవసౌభ్రాతృత్వాన్ని బోధించారు. ఈ సందర్భంలో జ్యోతిబాపూలే హిందూమతాన్ని పూర్తిగా నిరసించాడు. బహుదేవతారాధన, విగ్రహారాధన లను ఖండించి , పరిశుద్ధ ఆస్తికత్వాన్ని ప్రబోధించారు. ఒకవైపు మారుతున్న సాంఘిక పరిస్థితులు, మరోవైపు పాశ్చాత్య ఉదారవాద ప్రభావం యీ రెంటి ఆధారంగా తమ కార్యకలాపాలను కొనసాగించినా, హిందూమతతత్వనుండి పూర్తిగా వేరుపడలేకపోయారు. ఇవే, వారి భావజాలంలోని ధన, రుణాంశాలు.

## విద్యావంతులకే పరిమితమైన సంస్కరణలు

ఈ కాలపు మత సంస్కరణోద్యమాలు విద్యావంతులకే ప్రధానంగా పట్టణ ప్రాంతాలకే పరిమిత మయ్యాయి. వాటి సామాజిక పునాది ఇరుకైనది. ఎప్పుడో బెంగాల్, లాంటి రాష్ట్రాల్లో మాత్రం చిన్న, చిన్న పట్టణాలకు యిది వ్యాపించి వుండవచ్చు. మిగతారాష్ట్రాల్లో అది కూడా లేదు. దీనికి, సమాజంలో విద్య పరిమితంగా వ్యాప్తిచెందడం కారణం కావచ్చు. ఉదా , ఈ ఉద్యమాలు- బ్రహ్మసమాజం, ప్రార్థనా సమాజ్, కొన్ని అంశాల్లో, ఆర్యసమాజ్ - పెంపొందించిన స్థాయి, విద్యతోపరంగా, పండితప్రాయంగా వుండి సామాన్యుల అవగాహన స్థాయికి అందకపోవడం కావచ్చు. మరోకారణం, యీ ఉద్యమాలు చేపట్టిన సంస్కరణలు, సామాన్య ప్రజానీకానికి అసందర్భమైనవి. ఉన్నత కులాల్లో వుండిన అనేక దురాచారాలు వీరిలో లేవు. ఇక, మతాన్ని మామూలు ప్రజలు తమ సంస్కృతిలో భాగంగానే చూశారు. అభివృద్ధి చెందిన సాంస్కృతీకరణమైన మతభావాలు, పద్ధతులు వారికి పట్టనేలేదు.

మతోద్యమాల ప్రభావం, సమాజంలో, సంఖ్యాపరంగా చూస్తే ఎంతో పరిమితమైందనే చెప్పాలి. అయినా, ఆ ఉద్యమాలు కలిగించిన చైతన్యం ఎక్కువనే చెప్పాలి. ప్రాజ్ఞభావాలు వ్యాపింపచేయడంలో, సమాజాన్ని, సంస్కరించి మెరుగుపరచాలన్న ఆసక్తిని పెంచడంలోనూ, యివి అన్ని కులాలకు చెందిన విద్యావంతులను ఆకర్షించి, ఆకట్టు కొన్నాయి. ఆ తర్వాతికాలంలో, కుల సంఘాలు ఏర్పడి, తమ్మతాము సంస్కరించుకోడంలో , వీటి ప్రభావం స్పష్టంగా కన్పిస్తుంది. అలాగే, రాజకీయ చైతన్యాన్ని కలిగించడంలో, ప్రస్తుత శతాబ్దంలో తలెత్తిన వామపక్ష రాజకీయాలకు, ఒక సిద్ధాంత నేపథ్యంగా పనిచేశాయి. సమాజ పరంగా చూస్తే, మత సంస్కరణలు, పాతకాలపు ఛాందసభావాలను, మూఢ నమ్మకాలను ప్రజల మనస్సులనుండి పారదోలడాన్కి కృషిచేశాయి. వైవిధ్యంలోను, తీవ్రతలోను, యీ ఉద్యమాల పరిధికొద్దిదయినా, సాంఘికాచారాల అధికారాన్ని సడలింప చేశాయి. గుణాత్మకంగా చూసినపుడు యివి తక్కువ విజయాలేమీ కావు.

## మతపునరుద్ధరణ ఉద్యమాలు

పందొమ్మిదో శతాబ్దివరకు, మత పునరుద్ధరణ వాదం

తలెత్తిందిఆర్యసమాజ స్వభావంలో యిది ముందునుంచే వుంది. 'వేదాల్లోనే అన్నీ వున్నాయిష' అని గురజాడ అన్నది ఈయ అర్థంలోనే. 'శుద్ధి' కార్యక్రమం, మతాంతరీకరణ తర్వాత, వారిని తిరిగి హిందూమతంలో చేర్చుకోడం, యిందులో భాగమే. దక్షిణ భారతంలో దివ్యజ్ఞాన సమాజం యీపునరుద్ధరణోద్యమాన్ని చేపట్టింది. హిందూమతాన్ని, దాని పవిత్రగ్రంథాలను నిర్విమర్శతో కీర్తించడం, మత, సాంఘిక పురోగతి, జాతీయ పద్ధతుల్లో జరగాలనీ, అది హిందూ నాగరకతా భావంలో నే వుండాలని చెప్పింది. అంతేకాక, భారతదేశాన్ని, ప్రాచీన కాలపు పరిపాలనలోకి తీసుకెళ్ళాలనీ, మనధర్మశాస్త్రాన్ని, దాన్ననుసరించి వచ్చిన అనేక అప్రధాన ధర్మశాస్త్రాలను తు.చ.తప్పకుండా పాటించాలని, ప్రకటించింది. అదేధోరణి, ఆంధ్రదేశంలో, 1910 తర్వాత స్పష్టంగా కన్పించింది. ఒకనాటి సంస్కర్త , 'గుంటూరు వీరేశలింగం' గా పేరొందిన ఉన్నవ లక్ష్మీనారాయణ, దీనికి ఉదాహరణ. ఈ పునరుద్ధరణావాదం, అటుమత సంస్కరణలను, ఇటు, సంఘసంస్కరణలను రెంటినీ దెబ్బతీసింది.

19వ శతాబ్ది మతసంస్కర్తలు, మతాన్ని సాధనంగా సాంఘిక సంస్కరణలు తేవాలనుకొన్నారు. వాళ్ళు మతరహితులు లేదా మతవ్యతిరేకులు కాదు. పూజలు, పునస్కారాలు, పై ఆడంబరాలులేని మతం వాళ్ళ ఆశయం. విశ్వజనీన మతాన్ని అభిలషించారు. మతాలన్నీ ఒకటేనన్న భావాన్ని విశ్వసించి, మతసహనాన్ని ప్రోదిచేశారు. కాగా, పునరుద్ధరణవాదులు, సాంఘిక సంస్కరణలను దెబ్బతీయడానికి, మత విషయాల్లో పెంపొందుతున్న వుదారవాద భావాలకు గండి కొట్టడానికి పూనుకొన్నారు.

మత సంస్కరణోద్యమాలు వాస్తవంలో మత పునాదులను కదిలించలేకపోయాయి. ఆధునిక దృష్టితో చూసి దాన్ని అర్థం చేసుకోడంలో, హేతువాద దృక్పథాన్ని అవలంబించారు. సమాజంలో వున్న , అనేక సంప్రదాయ వ్యతిరేక మతశాఖలతో కలిసి, మత సంస్కరణకు పూనుకొని వుంటే, యీ ఉద్యమాలకు ప్రజాస్వభావం నచ్చేది. అగ్రకుల, మేధోపరమైన, పాండిత్యవాసనలు విడనాడి, మరింత సమరశీలతను, పొందేవి. హిందూమతం లోని బ్రాహ్మణాధిక్యతను ఎదుర్కొనేవి. ఇందులో భాగంగా, కులతత్వ నిరసనకు బలం చేకూరేది. మతాన్ని నిర్వచించడం లోనూ, కొత్త వ్యాఖ్యానాన్ని అందివ్వడంలోనూ , సామాజిక ప్రయోజనాలకు మతాన్ని మలచుకోడంలోనూ, ఎంతగానో వెసులుబాటువుండేది. ఆ మతశాఖలను పట్టించుకోకపోవడంలో, వాటితో కలిసి కృషి చేయకపోవడంలోనే, యీ ఉద్యమవిశిష్టస్వభావం, పరిమితులూ మన కర్థమవుతాయి.

మత సంస్కరణోద్యమాలు హిందూమతగ్రంథాలకు కొత్త అర్థాన్నిచ్చి, సామాజిక అవసరాలకు వుపయోగించుకొనే ప్రయత్నం చేశారు. ఈ పునర్విపరణ విశాల మత పరిధుల్లో జరిగినా, సామాజిక మార్పుకు దోహదం చేసింది. 19 వ శతాబ్దాంతానికి పుట్టుకొచ్చినా పునరుద్ధరణవాదం, యీ ధోరణిని తిరగదోడి, మతగ్రంథాలను యథాతథంగానే తీసుకోవాలనీ , వాటి అర్థ వివరణలో, లేక ఆచరణలో ఎలాంటి మార్పులు తెకూడదని, గట్టిగా ప్రచారం చేసింది. మత సంస్కరణ విషయంలో ఇది తిరోగమ్యం. ఈనాటి హిందూత్వవాదులు, పెనరుద్ధరణ వాదులకంటె మరింత వెనక్కువెళ్ళి, మతమేలికత్వానిప్రోది చేస్తున్నారు. వీరికి మత పరమైన శాస్త్రగ్రంథాలకంటె ఇతిహాసాలే ముఖ్యం. ప్రజాకర్షణకు వీటిని వాడుకోడం తేలికకాబట్టి. వీరికి పూర్వపు శాస్త్రాలు, స్మృతులు, పురాణాలు అంతముఖ్యంకాదు. హిందూమతాన్ని ఏకశిలా సదృశంగా చేసి, ఒకేదేవుడు, ఒకేమతగ్రంథం , ఒకే మతం అన్న ఆశయంతో కృషి చేస్తున్నారు.

"సూర్యాగ్ని సముద్రాది మహోత్కృష్ట పదార్థ మూలమున భగవన్మహిమలను దెలిసికొని యారాధించిన మనవారు కొంత కాలమునకు ఈశ్వరుని విడిచిన తోడనే బహుదేవకుములను గొలువ నారంభించి, మనవారంత కంతకా తదేవతల సంఖ్య నధికపరచుచూ వచ్చి ముప్పది మూడు .. దేవతలను కల్పించి తమను కొలిచెడు జనుల సంఖ్య కంటే కొలువబడెడు దేవతల సంఖ్యనే యెక్కువ జేసినారు"

—కందుకూరి వీరేశలింగం
విగ్రహారాధనము గురించి

# అద్వైతతత్త్వం నుండి విముక్తి పథం దిశగా స్వామి వివేకానంద, యోగి వేమన

– డాక్టర్ ఎమ్ పట్టాభిరామిరెడ్డి

ఇటీవలి సంవత్సరాలలో దక్షిణ అమెరికాల్లోని గ్రామీణ రైతాంగం నిరంకుశ భూస్వామ్య వర్గాలపై విమోచన ధ్యేయంతో కొనసాగించిన పోరాట నేపథ్యంలో నుండి విమోచన సిద్ధాంతం అచ్చటి కాథలిక్ పాదరీలు, మత గురువులు సన్యాసినుల వర్గాలలో బహుళ ప్రచారాన్నందుతుంది. దేశంలో వైజ్ఞానిక, సాంకేతిక రంగాలలోని పురోగతి తత్పర్యవసానంగా ఎంతో సంపద వుత్పత్తి జరుగుతున్నప్పటికీ రైతాంగ దుర్భర స్థితిగతులు క్రైస్తవ మతవర్గాలు మరియు మేధావులను ఆలోచింపజేశాయి. ఐశ్వర్యాల మధ్యలో నెలకొన్న కటిక పేదరికం సమస్యపై వారు దృష్టిని కేంద్రీకరించనారంభించారు. స్వేచ్ఛకోసం, సమానత్వంకోసం, సౌభ్రాత్వంకోసం నిరంకుశత్వానికి వ్యతిరేకంగానూ వారు తాము తలపెట్టిన పోరాటానికి చేదోడుగా దక్షిణ అమెరికాలోని కాథలిక్ పాదరీలు మార్క్సిస్టు తదితర వామపక్ష గెరిల్లా దళాలతో చేయి కలుపవలసి వచ్చింది. అంతదాకా ఎందుకు? మన కేరళలో సైతం కాథలిక్ మేధావి వర్గాలలో సామాజిక సేవావాంఛ తుఫానులా విజృంభించింది. వారు తమ మత సిద్ధాంతాన్ని మార్క్సిస్టు దృక్కోణం నుండి వ్యాఖ్యానించడం ప్రారంభించారు. వారిలో కొందరు జాలర్ల జీవన స్థితిని మెరుగుపరచుటకై వారిని సంఘటిత పరచుట గూడా జరిగింది. వారుచేస్తూ యున్న సేవా కార్యక్రమాలకు వలసిన ఉత్తేజాన్ని బైబిల్ సూక్తులందిస్తాయి. సువార్త బైబిల్ (పేజి : 699) లోని కొన్ని ప్రవచనాలిలా వున్నాయి.

## బైబిల్ ప్రవచనాలు

1. *పేదల ఆకలి చల్లార్చేందుకు బీడు భూములు సమృద్ధిగా పంటనిస్తాయి. కాని, అన్యాయవర్తనులు వాటిని సాగు కానివ్వరు.*
2. *ధనికులకెప్పుడూ క్రొత్త క్రొత్త స్నేహితులు ఏర్పడుతుంటారు. పేదవారేమో వారికున్న కొద్దిపాటి స్నేహితున్నే నిలువుకోలేరు.*
3. *ఓ మంచివాడు పేదవారి హక్కులనుగూడా గుర్తిస్తాడు. కాని దుర్మార్గులు అటువంటి అవగాహనను కల్గియుండలేరు.*
4. *ఈ భూసామ్రాజ్యము సౌజన్యవంతులది. ఒక ధనికుడు స్వర్గ సామ్రాజ్యంలో ప్రవేశించడంకన్నా సూది రంధ్రంలోనుండి ఒక ఒంటె దూరడం చాలా సులువు.*

జాన్ బాల్ ఇంగ్లండులోని ఒక క్రైస్తవ మతాచార్యుడు. ఎంతో పేదవాడు. ఫ్యూడల్ ప్రభువులానాడు కౌల్‌దారీలపై సాగిస్తూ యుండిన పీడనను, దోపిడిని నిరశించేవాడు. 1381లో అచ్చట తలెత్తిన రైతాంగ తిరుగుబాటు సమయంలో వారి విముక్తి కొరకు డిమాండ్ చేయటం జరిగింది. ఆనాడతని నాయకత్వంలో వేలాదిగా పేదలు లండన్ నగరాన్ని చుట్టుముట్టి వీధులలో పదసంచలనం జేస్తూ మతగురువులను సంహరించారు. చర్చిలను కూలగొట్టారు. అతనిని, తిరుగుబాటుకు నాయకత్వం వహించిన వాట్ టయర్‌ను భూస్వాముల అనుచరులు చంపేశారు. అలా ఆనాటి తిరుగుబాటు అణచివేయబడ్డది. ఏసుక్రీస్తు మూలప్రబోధాలచే ప్రభావితుడైన థామస్ ముంజెర్ జర్మన్ రైతాంగాన్ని ముున్ముందుకు నడిపించారు. జర్మనీలో 1525లో సంభవించిన రైతాంగ తిరుగుబాటు ఫ్యూడల్ సమాజపు పునాదులనే కదలించివేసింది. ప్రొటెస్టెంట్ సంస్కరణోద్యమం తర్వాత పలుతెగలకు చెందిన అనాబాప్టిస్టులు ఆస్థుల పంపిణీతోపాటు ఫ్యూడల్ బానిస విధానపు రద్దుకై డిమాండ్ చేశారు. నిరుపేదల బాధల ఉపశమనానికై సొసైటీ ఆఫ జీసస్, ఇగ్నేషియస్ లయోలా అనుచరులు ప్రపంచమంతా పర్యటించారు. విద్యావేత్తలుగా డాక్టర్లుగా మత ప్రబోధకులుగా వారు తమ జీవితాలను సార్థకం జేసుకున్నారు. ఈ పరంపరలో మదర్ థెరిస్సా మనకంటికగుపిస్తూన్న ఒక సాక్ష్యం. ఇంగ్లండులో 1640, 1688 సంవత్సరాలు బ్రిటిష్ సమాజంలో తిరుగుబాటు జరిగిన కాలాలు. అప్పుడు లైఫ్‌బర్న్, విన్‌స్టాన్లీల నేతృత్వంలో లెవలర్లు డిగ్గర్ల్ క్రైస్తవ సమానత్వ సిద్ధాంతాన్ని ప్రచారంజేస్తూ సమిష్టి వ్యవసాయం అమలుతోపాటు భూముల ఆస్తుల పునర్ పంపిణీద్వారా వ్యవసాయక పరిస్థితుల సంస్కరణకై ప్రయత్నించుట జరిగింది. అలాంటి ప్రయత్నాలన్నీ విఫలం కాబడ్డప్పటికీ, వాటిచే రగుల్చబడ్డ విప్లవ సాంప్రదాయం నేటి సామ్యవాద మేధావులను ఉత్తేజపరచటయూ ఉంది. నాటి పోపుపై తిరుగుబాటుకు పిలుపునిస్తూ మార్టిన్ లూథర్ రాజులను ప్రజలనుద్దేశించి ప్రసంగిస్తూ ఉటంకించిన బైబిల్‌లోని భాగాలు :

"నేను ఒక ఖడ్గాన్ని అందించుటకు వచ్చాను, కాని శాంతిని ప్రసాదించుటకు గాదని క్రీస్తు ప్రవచింపలేదా? నిశ్చయపూర్వకంగా క్రీస్తు ఏమని ఆదేశిస్తున్నాడు? మీరు దేవుని సేవకులు గాదలచినచో వివరంగా చెప్పవలసిన ఎడల దైవ సందేశానికి

ఎదురొడ్డు దుష్టచింతనులను పారద్రోలి వారిని నాశనము చేయుటకుగాను నా శత్రువులను ఇచటికీడ్చు కొచ్చినా సమక్షంలో సంహరించండి.

*— లూకా 19 : 27*

ఇదే సారాంశాన్ని థామస్ ముంజెర్‌కూడా తన మతోప న్యాసాలలో స్పృశిస్తూ తిరుగుబాటు ఆగత్యాన్ని గూర్చి దైవ సామ్రాజ్య స్థాపనయొక్క తక్షణావసరాన్ని గూర్చి ఆదిమ క్రైస్తవ ప్రబోధాలతో విభేదిస్తూ యుండిన వ్యవస్థలరద్దు గూర్చి డిమాండ్ చేశాడు.

(వర్గ తారతమ్యాలు, వ్యక్తిగత ఆస్థులు లేనటువంటి సమాజం మరియు సమాజంలోని సభ్యులకంటె భిన్నమై, సర్వస్వతంత్రమైన రాజ్యవ్యవస్థ మాత్రమే ముంజెర్ దృష్టిలో 'దైవసామ్రాజ్యము' అను నిర్వచనానికి అర్థము)

*(ఫ్రెడరిక్ ఏంగిల్స్‌యొక్క 'జర్మనీలో రైతాంగయుద్ధం' నుండి)*

## పేదరికంపై వేమన యోచన

పేదరికపు సమస్యపై యోగి వేమనగూడా సుదీర్ఘంగా ఆలో చించినాడు. ధనిక భూస్వాములు పేదల యెడల చూపించే నిరపేక్ష భావాన్ని గమనించిన వాడై వారి ధోరణి ఎడల దర్మబద్ధమై ఆగ్రహంతో ఇలా చురక లంటించాడు.

*ద్రోహబుద్ధినైన, దొంగరికమునైన ..... దానమిచ్చు వాడెదాయలేడు.*
*హింసాతత్త్వాన్ని నిరశిస్తూ .... హత్య సేయగూడదవి ఎందులకునన్న ..... పాసగమేలు*
*జేసిపొమ్మనుటే చాలు .... అని సమాజాన్ని హెచ్చరించాడు.*

సాఫీ అయిన పరిస్థితులలో శాంతియుతంగా జనించే మార్పుల వైపే వేమన మొగ్గు జూపాడు. అయితే కరువు కాటకాలు, ఆకలి చావులు, దుర్భిక్షం తదితర ఉత్పాతాలు ఐశ్వర్యవంతుల సంపదపై పేదలకన్ను పడేలా జేస్తాయి.

## సన్యాసుల తిరుగుబాటు

భారతదేశంలో 18వ శతాబ్ది చివర సంవత్సరాలలో చెల రేగిన సన్యాసుల తిరుగుబాటుకు అద్వైత తత్త్వావలంబకులు ప్రేరణనందించారు. అప్పట్లో వ్యావసాయిక వర్గాలవారైన ఫరాజీలు, వహబీలుగూడా తిరుగుబాట్లు జరిపారు. వారి వారి మతబోధకుల నాయకత్వంలో పై తెగలవారు విజృంభించడం గమనార్హం. బ్రిటిష్‌వారివలస విధానాల్ని అణచివేతనూ ప్రతిఘటించడంలో భాగంగావారు విదేశీ పరిపాలకులతో హోరాహోరీ పోరాటాలు జరుపడంతోబాటు విస్తృతమైన గెరిల్లా చర్యలను నిర్వహించడం జరిగింది. పలు విధాలైన పోరాట దళాలు వారి వారి మత ప్రబోధాలనుండే ఉత్తేజం పొందడం జరిగింది.

భారతీయ సాధువులు తత్త్వవేత్తలలో మహోన్నతుడైన యోగి వేమన 17వ శతాబ్దపు తెలుగునాట జనించాడు. సమ కాలీన సమాజాన్ని ఆవరించిన చిమ్మచీకట్లను పారద్రోలగల్గిన కాంతికిరణంలా ఆయన అవతరించిన సంగతి మనకు తెలుసు. పేదల ఎడల ఆర్ద్రతనూ భోగలాలసత ఎడల, ధనికుల ఎడల వ్యతిరేకతనూ వెలిబుచ్చిన మొట్టమొదటి సన్యాసి బహుశా యోగి వేమన మాత్రమే అయివుండవచ్చు. బహువిస్తృతమైన సంస్కరణలను ప్రాభావితం జేయు నుద్దేశ్యంతో ఆయన ధనికుల తమ కుమార్తెలను పేదలకిచ్చి వివాహం జేయాలని గూడా సూచించడం జరిగింది. నాటి నిరంకుశ ప్రభువుల దమనకాండను గర్హించడం మాత్రమేగాక, బాధిత ప్రజలను కాపాడలేని వారిలో గల పిరికిపందల కొందరిని తూర్పారబడ్తూ అవహేళన చేశాడు. సంపద యావత్తూ కార్మికుల సృష్టి మాత్రమేననియు సామాజిక వనరులు ఏ ఒక్కని స్వంతం కాదన్న అవగాహన ఆయనకు వుండేడిది. వర్గ, కుల ఆధిపత్య రహితమైన సమాజాన్ని ఊహించాడు. కరువుకాటకాలలో సైతం సంకుచితంగానూ, దాతృత్వహీనంగానూ ప్రవర్తిస్తూ యుండిన ధనికవర్గాన్ని చూసిన ఆయన పేదలు విరగబడి ధనికుల సంపదను వశం చేసుకుని తమ మధ్య పంపిణీ జరుపుకోవడాన్ని నిస్సంకోచంగా బలపర్చాడు. ఇలాంటి సాదృశాలు భారతదేశం లోని విమోచనోద్యమానికి యోగివేమన ఆద్యుడన్న విష యాన్ని ధృవీకరిస్తున్నాయి.

ఆయన విశ్వసించిన అద్వైతతత్త్వం ఆయనను సర్వ మానవులను సమ్యక్‌దృష్టితో చూడగల ఒక ఆదర్శవాదం వైపు నడిపించుకొని వెళ్లింది.

విమోచనోద్యమ సిద్ధాంతాన్ని నిర్మించు ప్రక్రియలో వేమన పద్యాలు అనేకం ఆధునిక సంస్కర్తలకు బాగా ఉపక రించాయి. వాటిలో మచ్చుకు కొన్ని :

## స్వామి వివేకానంద ఉజ్వల సందేశం

కాలచక్రగమనంలో రెండు వందల సంవత్సరాలు దొర్లుకు పోయాయి. మరొక ప్రముఖ అద్వైతతత్త్వవేత్త రంగాన్నలంకరిం చాడు. తన భావాలలో అదే రకమైన తాత్త్విక ధోరణి పొందు పరుకున్నాడు. ఆయన మరెవ్వరోకాదు. స్వామీ వివేకానందగా కొనియాడబడ్డ బంగాళీయుడైన నరేంద్ర నాథ్‌దత్తా. తన సరళమైన శైలిలో మన పూర్వీకులు ధార్మికతకూ, మానవ సౌభ్రాత్వానికి ఎలా ద్రోహం చేశారో విశ్లేషించాడు.

ఆయన మాటల్లో చెప్పాలంటే :

"ఆకలి, అజ్ఞానంతో మిలియన్లకొద్ది ప్రజలు మ్రగ్గుతూ యుండగా వారి చలవ వలన విద్యావంతుడై వారి యెడల కనీస బాధ్యతను నిర్వర్తించని ప్రతివ్యక్తినీ (విద్యావంతుడిని) నేను ద్రోహిగానే పరిగణిస్తాను."

"మిలియన్ల సంఖ్యలోని ప్రజలు పశువుల కంటె ఏ విధం గాను మెరుగుగా లేనప్పుడు వారిని పిండి పిప్పిజేసి రాబట్టిన సంపదలతో కులుకుతూ ఆ నిర్భాగ్యులకు రవంత ఉపశమనం కల్గించని వ్యక్తులను ద్రోహులనే పిలుస్తాను."

"భారతీయ రైతులూ చెప్పులుకుట్టేవారూ, వీధు లూడ్చేవారు ఇంకా ఇతరత్రా తక్కువ వర్గాల వృత్తిపనివారు నీకంటే బాగా పనిజేయగల స్థితినుండి స్వయంపోషకత్వాన్ని

కల్గియున్నారు. ఏ దేశంలోనైనా వారు తమ జాతికి వెన్నుముక లాంటి వాళ్లు. (వి.కె.ఆర్.వి. రావుగారి వ్యాసం 'వివేకానంద ఫర్ ట్వంటీ ఫస్ట్ సెంచరీ" - 15-02-1986 నాటి మెయిన్ స్ట్రీమ్‌నుండి) ఆయన తన ఉపన్యాసాలలో ఒక్కచోట ఇలా అంటాడు.

"మీలోని ప్రతి ఒక్కరిని ఒక్కొక్క నాస్తికునిగా చూడటానికే ఇష్టపడతాను. అభూత కల్పనలతో బుర్ర చెడుగొట్టుకునే వానికంటె నాస్తికుడే చైతన్యవంతంగా వుండగల్గుతాడు. చైతన్యం కల్గినవ్యక్తిద్వారా కొద్దిపాటి సత్ఫలితమైనా లభిస్తుంది. కాల్పనికతసోకి పతనావస్థకు జేరినవాని నుండి ఏమీ ఆశించలేము."

అస్పృశ్యులై, దూరంగా వుంచబడుతూ, కనీసం పరామర్శకు సైతం నోచుకోని విధంగా పరియ కులస్థులు (మలబారు ప్రాంతంవారు) చూడబడేవైఖరి పవిత్ర గ్రంధాలనుండి సూక్తులను వల్లె వేయడంద్వారా మాత్రమే సమర్ధనీయము గాదన్న విషయాన్ని ప్రగాఢమైన బాధతో ఆయన గమనించడం జరిగింది. అలా చీటికి మాటికి స్మృతుల నుండీ తదితర పవిత్ర గ్రంధాలనుండి సేకరించిన వాక్యాల చాటున తలదాచుకోవడం దక్షిణ భారతంలోని ఆనాటి సనాతన బ్రాహ్మణీకానికి పరిపాటే. ఛండాలునికూడా బ్రాహ్మణుని స్థాయికి జేర్చాలని ఆయన అభిలషించాడు. కాని, అతడెలా బ్రాహ్మణుని స్థాయికి రప్పించగలడో వివరాలలోనికి పోయి విశ్లేషించలేదా యన

## తత్వచింతనకు ఆధునిక దృక్కోణం

ఛండాలుడు తరతరాలుగా బానిసీడుగా చూడబడ్డాడు. ఆస్థులు, వనరులను పొందలేకపోయాడు. వనరులన్నీ అగ్రవర్ణాలవారి గుత్తాధిపత్యంక్రిందనే ఉండడం జరిగింది. సామాజిక స్థాయి ఆర్థిక కారణాలతో ముడిపడి యుండడం మూలాన ఆర్థికలేమితోనున్న ఆతడికి ఆ జన్మబానిసత్వమే దక్కింది. ఆర్థిక శక్తిపైగల తమ గుత్తాధిపత్యాన్ని యధాతధంగా నిలుపుకోవడానికి అగ్రవర్ణాలవారు కుల వ్యవస్థను సృష్టించడం జరిగింది. అలా చేయడంద్వారా ఆనాటి పని విభజనను వంశపారంపర్యంగా వ్యవస్థీకృతం జేస్తూ మార్పులకతీతంగా ఆ వ్యవస్థను దుర్భేద్యంగా వుంచడం జరిగింది. పవిత్ర గ్రంధాల నుండి సూక్తులనుదహరించడం, కొండొకచో వాటికి కువ్యాఖ్యానాలు జేయడంద్వారా కులవ్యవస్థ ఘనీభవించింది. ఈ విషవలయం మన గ్రామాలలోని వివిధ కులాలు వర్గాలమధ్య భయోత్పాతాన్ని రెచ్చగొడుతు వస్తూయుంది. మన రాజ్యాంగం అందరికి సమానత్వాన్ని ప్రకటించింది. రాజ్యాంగంలోని ఆ ప్రకటనపట్ల గ్రామాలలోని కులీనుల కెంత గౌరవభావముందో ఇటీవలి పదిరికుప్పం, కారంచేడు సంఘటనలు సాక్షీభూతాలుగా నిలిచివున్నాయి. బెల్చి నుండి కారంచేడువరకు అగుపించే దేమిటి? భారత ప్రజాస్వామ్యంలోని చీకటి కోణాలే. ఉన్నత వర్గాలవారు తరతరాలుగా తమక్రిందివారిని తరతరాలుగా పీడించారు. రాజ్యాంగపు ఛత్రంక్రిందనుండి తమ దోపిడీని ఇంకా కొనసాగించాలనుకుంటున్నారు. ఇలాంటి ఉన్నత వర్గాలను గూర్చి ఒకానొక తత్త్వవేత్త వారిని ద్రోహులుగా పిలవడంలో అతిశయోక్తిగాని ఆశ్చర్యంగానీ ఏమీలేవు.

మన అద్వైత తత్త్వవేత్త అత్యంత ఆధునిక దృక్కోణం నుండి వెలుబుచ్చిన భావాలు స్వామివివేకానందను భారతీయులలోని గొప్ప పురోగామిగా మార్చాయి.

"నేను ఒక సామ్యవాదిని. సామ్యవాదం ఒక నిర్దుష్టమైనదని నేననను. పేదలు పస్తులతో మాడేకన్నా అర్థాకలితో కొనసాగడం మేలుగదా! ఎన్నో పద్ధతులను గమనించాం మనం. ఈ ప్రయత్నం మాత్రం ఎందుకు జేయగూడదు?"

భౌతికవాదం యొక్క దుష్ఫలితాలపై ఆయన వ్యాఖ్యానం "సంపద, అధికారం పనీపాటాలేని కొద్దిమంది చేతులలోనే వుంది. వారుగా పనిజేయరు. కోట్లాది మానవుల శ్రమను తమ కనుకూలంగా మార్చుకోగలరు. ఈ శక్తితోవారు ప్రపంచాన్ని రక్తంలో ముంచెత్తగలరు. పశ్చిమ దేశాలు ఇతరుల రక్తం పిండుకునే ధనిక వర్గం పిడికిట్లోనూ - ప్రాగ్దేశాలు మతవాదుల పిడికిళ్లలోనూ నుగ్గునుగ్గు అవుతూ వున్నాయి.'

శాస్త్రీయ సామ్యవాదాన్ని క్రమబద్దంగా అధ్యయనం జేయనప్పటికి అమెరికన్ పెట్టుబడిదారీ విధానం భ్రమలు వదలిన స్వామీజీ ఆ విధానం భవిష్యత్ మానవ నాగరికత పురోగతికి ఎటువంటి స్ఫూర్తినివ్వలేదని తేల్చివేశాడు.

"డాక్టర్ రాధాకృష్ణ నుడివినట్లు గాంధీజీ మతం హేతుబద్దమైనది. నైతికమైనది. తన బుద్ధికి సరియైనదని తోచని విశ్వాసాన్ని గాని, తన అంతః కరణకు సమ్మతం కాని కర్మను గాని ఆయన పాటించలేదు "

**-రాజగోపాలాచారి**

# మతము – జాతీయోద్యమము

– శ్రీ పరకాల పట్టాభిరామారావు

మతం వేరు – మత మౌఢ్యం, మతఛాందసత్వం, మతోన్మాదం వేరు. మతం మతమౌఢ్యంగాను, మత ఛాందసత్వంగాను మతోన్మాదంగాను మారితే అది సమాజానికి, దేశానికి తీరని ముప్పుగా పరిణమిస్తుంది. దేశాభివృద్ధి అడుగంటి పోయి అధోగతిపాలవుతుంది.

ఒకనాడు ప్రపంచానికి జ్ఞాన బిక్ష పెట్టిన, గొప్ప విజ్ఞానం, చరిత్ర, సంస్కృతిగల భారతదేశం అసలు అస్వతంత్ర దేశంగా బానిసదేశంగా ఎందుకు? అధోగతి పాలైంది? అన్నది ప్రశ్న.

ఈ ప్రశ్నకు నాడు నేడు కూడా సరియైన సమాధానం, మనం చెప్పుకున్న నాడు కాని, మన దేశానికి సంభవించే విపత్తులు తొలగి పోవు. మనం పురోగమించలేము సరికదా అధోగతి పాలయ్యే ప్రమాదాలు వచ్చి పడతాయి. వచ్చిపడ్డాయి.

భారతదేశం ఒకనాడు శాస్త్రీయ విజ్ఞానంలో, కళలు, సంస్కృతి విషయంలో అగ్రస్థానంలో ఉండటానికి కారణం ప్రకృతిని ఆరాధించడంతోనే కాక, ప్రకృతి రహస్యాలను అర్థం చేసుకొని హేతువాద దృష్టిని శాస్త్రీయ, సాంకేతిక పరిజ్ఞానాన్ని పెంపొందించుకొని, ఆర్థిక సాంఘిక, రంగాలలో అభివృద్ధి చెందడమే.

## అజ్ఞానపుటంధ యుగం – మధ్య యుగం

కాని ఆ తరువాత మధ్య యుగాల నాటికి భారతదేశం కుల, మత ఛాందసత్వాలలో, మూఢ నమ్మకాలతో, మూఢాచారాలలో సాంఘిక దురాచారాలతో కూరుకొని పోయి అంధకార బంధురమైన అజ్ఞాన యుగంలోపడి పోయింది. శ్రమ విభజనకోసం ఏర్పడిన కులం ఘనీభవించి అగ్రకుల నిరంకుశత్వంగా మారికుల హెచ్చుతగ్గులతో, అంటరానితనంతో బ్రాహ్మణ పురోహితవర్గాలు తప్ప ఎవరూ విద్యా, విజ్ఞానాలు పొందకూడదనే విధి నిషేదాలతో, సమాజంలో సగభాగంగా ఉన్నస్త్రీల అధోగతితో, వారిపై అమానుషమైన సతీసహగమనం వంటి దురాచారాలతో కుళ్లిపోయింది. అలాగే మతం వెర్రితలలు వేసి మంత్రతంత్రాలు, మహిమలు, క్షుద్ర దేమ తాంధన, నరబలులు, జంతుబలులు, తాంత్రిక మాంత్రిక శాక్తేయ, కాపాలిక తదితర పరమ జుగుప్సాకర మత భావనలతో అట్టడుగుకు దిగజారిపోయింది.

ఈ కులమత ఛాందసత్వాల అజ్ఞానపు అంధయుగం గురించి, ఒక నాటి భారతదేశ ఔన్నత్వం అడుగంటి అస్వంత్ర భారతదేశంగా ఎందుకు ఎలా మారిందీ పండిట్ నెహ్రూతన "డిస్కవరీ ఆఫ్ ఇండియా" గ్రంథంలో ఇలా ప్రతిభావంతంగా వివరించాడు.

"హేతువాద దృష్టితో అధ్యయనం, అన్వేషణ, ఒకనాడు ఎంతగానో ప్రదర్శించిన స్థితినుండి, శాస్త్రీయ విజ్ఞానం ఎంతగానో అభివృద్ధి చెందిన స్థితినుండి దిగజారిపోయి హేతువాద రహిత దృష్టితో, అంధత్వంతో గతాన్ని గుడ్డిగా అనుసరిస్తూ కూచోవడంతో భారతీయ జీవనం కదలిక లేని ప్రవాహంలా నిలవ నీరులా తయారైంది. గతంలోనే జీవించడం, పాత యుగం నాటిభావాల బరువు క్రింద నలిగి, కృంగి, కృశించి పోవడం, ఒకరకమైన మగతతో, అచేతనావస్థలో, పడిపోవడం జరిగింది. ఇందువలననే ప్రపంచంలోని మిగిలిన ప్రాంతాలు ముందుకు పోతూనే భారతదేశం స్థబ్దతతో, కరడుగట్టిన స్థితిలో, క్రియాశూన్య స్థితిలో భౌతిక, ఆత్మక పతనావస్థలో అధోగతిపాలైంది. ...

"... వికసించుతున్న భారతీయ ఆర్థిక విధానం క్రీస్తుశకం మొదటి శతాబ్దం తరువాత కుంబించుకుపోసాగింది. దీనికి కారణం భారతీయ సామాజిక వ్యవస్థలో ఏర్పడిన కుల వ్యవస్థ, కుల కట్టుబాట్లు మొదలైనవీ, మత ఛాందసత్వమూ అభివృద్ధిని, సృజనాత్మక కృషిని ఆటంకపరిచాయి. సంకుచితమైన సాంఘిక హద్దులు, అడ్డుగోడలు ఏర్పాడ్డాయి. అగ్రకులాలు, క్రించి కులాలను నీచంగా చూడటం వారికి చదువు, సంధ్యలు లేకుండా చేయడం... ఇవన్నీ భారతీయ సమాజం అంతర్గతంగా దిగజారి బీటలు వారడానికి దారితీసింది... ప్రజలలో శక్తి సామర్థ్యాలను నైపుణ్యాన్ని దెబ్బతీసింది. ఆ విధంగా దాని వినాశనానికి బీజాలు దానిలోనే ఉండటంతో, భారతదేశంలో అంతర్గతంగా స్వేచ్ఛాస్వాతంత్ర్యాలు చొరవ నశించాయి."

"....మతాలన్నీ మూఢనమ్మకాలలో అంధవిశ్వాసాలలో గాఢంగా పెనవేసుకుపోయాయి. జీవిత సమస్యలపట్ల మతం ప్రదర్శించే దృష్టి – శాస్త్రీయ విజ్ఞాన దృష్టికాదు. మహిమలు, మానవాతీత శక్తులు విమర్శనా పూర్వకంగాని తెలివితక్కువ ధోరణుల తో కూడి ఉన్నాయి."

–"డిస్కవరీ ఆఫ్ ఇండియా"లో నెహ్రూ

## భారత జాతీయోద్యమం
## జాతీయ పునరుజ్జీవనోద్యమం

అజ్ఞానాంధకారంలో మత మౌఢ్యంతో కూరుకుపోయిన భారతదేశాన్ని వెలుగులోకి తీసుకొని రావడానికి రెండు మహత్తర ఉద్యమాలు తోడ్పడ్డాయి. అవి భారత జాతీయోద్యమము. దానికి నాందిగా ప్రభావించిన జాతీయ పునరుజ్జీవనోద్యమము.

రాజారామమోహన్‌రాయ్ మొదలు మన వీరేశలింగం వరకు కుల, మత ఛాందసత్వాలకు, సాంఘిక దురాచారాలకు వ్యతిరేకంగా బ్రహ్మాండమైన సాంఘిక సంస్కరణోద్యమాలు నడిపారు. మతం పేరుతో ప్రబలిపోయిన అనేక సాంఘిక దురాచారాలు – సతీసహగమనం అతిబాల్య వివాహాలు, నిర్బంధ

వైద్యం. క్షుద్ర దేవతారాధన మున్నగు వాటికి వ్యతిరేకంగా పోరాడి జాతీయ పునరుజ్జీవనకు పునాదులు వేశారు.

అంతకు ముందు భక్తి ఉద్యమ రూపంలో కబీర్, తులసి దాస్, నామదేవ్, సూరదాస్ మొదలు మన వేమనవరకు కుల మత ఛాందసత్వాలపై పోరాడారు. "భగవంతుడు ఒక్కడే, అతని దృష్టిలో అందరూ సమానులే కుల హెచ్చు తగ్గులు లేవు. ఇన్ని కర్మకాండలు బాహ్యాడంబరాలు అనవసరం. భక్తి తోనే భగవంతుని చేరవచ్చు". అని వీరు బోధించారు. మధ్య యుగాలనాటి కులమత ఛాందసత్వాలకు వ్యతిరేకంగా క్రింది కులాల తత్వవేత్తలు, భక్తి ఉద్యమరూపంలో జరిపిన ఈ తిరుగు బాటుతోనే భారత జాతీయ పునరుజ్జీవనోద్యమం ప్రారంభ మైనదని కొందరు చరిత్రకారులు చెబుతున్నారు.

## దైవభక్తి – దేశభక్తి

మతము, మతానుష్టానము, భక్తి, భజనలు పూజలు, పున స్కారాలు జపాలు, తపాలు ఇవే మానవ జీవితంలో పరమపద సోపాలని అంతవరకు నమ్మినదేశ ప్రజలను దేశభక్తి వైపు మాతృ దేశాన్ని పరదాస్య విమోచన పరరమ పవిత్ర కర్తవ్యంవైపు, జాతీ యాభిమానం, జాతీయ చైతన్యం వైపు, భారత జాతీయ స్వాతంత్ర్యోద్యమం మరలించింది.

మతము, మతానుష్టానము దైవభక్తి, పూజలు, పున స్కారాలు స్థానంలోకి "వందేమాతరం" "భారత మాతకు జై!" "స్వరాజ్యం నా జన్మహక్కు" "బానిసవై జీవించే కంటే స్వాతంత్ర్య వీరుడవై మరణించు"; "దేశమును ప్రేమించు మన్నా, మంచి అన్నది పెంచుమన్నా" మున్నగు నినాదాలు, మేలు కొలుపులు, సుప్రభాతాలు అయ్యాయి.

మత విశ్వాసాల పరిధి నుండి మహత్యాల మాయా జాలం నుండి వైయుక్తిక ముక్తి, మోక్షం, కైవల్యం మొ" ఆలోచనా సరళి నుండి, సమిష్టి భావన, సమిష్టి కృషి, సమిష్టి పోరాటం సామాజిక, ఆర్థిక, రాజకీయ విముక్తి గావించి ఆలోచించే సువిశాల, సమున్నత సార్వజనీన, చైతన్య స్థాయి వచ్చింది.

యజ్ఞాలు,యాగాలు, వ్రతాలు స్థానంలో స్వాతంత్ర్య పోరా డటమే ఒక మహాయజ్ఞంగా వ్రతంగా, దీక్షగా ముందుకు వచ్చింది. సమాజ పురోగతికి, దేశ పురోగతికి జాతీయ సమైక్య తకు కులతత్వం, మతమౌఢ్యం, జాతి విభేదాలు ప్రతిబంధ కాలని ప్రజలు గుర్తించే స్థితి వచ్చింది.

కర్మ సిద్ధాంతం, పూర్వ జన్మ సుకృతం, పూర్వజన్మ పాపం అనుకుంటూ ముక్కుమూసుకొని జపాలు తపాలు చేస్తూ, నోములు, వ్రతాలు చేస్తూ కూచున్నందువలననే దేశం లో క్రియాశీలత చచ్చి, అకర్మణ్యత్వం హెచ్చి దేశం పరదాస్య పాలైంది. మంత్రాలకు చింతకాయలు రాలవు. కేవలం దైవ భక్తితో, భజనలతో కడుపు నిండదు. కరవు కాటకాలు కేవలం దైవభక్తితో, భజనలతో పోవు అన్న భావం ప్రజలలో వచ్చింది.

దాస్యంతో మ్రగ్గుతున్న జాతి, స్వాతంత్ర్యంకోసం పోరా డటంమే, దేశ దాస్య విమోచనకు ప్రాణాలతోసహా సర్వస్వం అర్పించడమే నిజమైన కర్మసిద్ధాంతం అని జాతీయోద్యమ నాయకులు కర్మసిద్ధాంతాలనికి నూతననిర్వచనం యిచ్చారు.

## స్వామి వివేకానంద

భారత జాతీయ పునరుజ్జీవన మూల పురుషులలో ఒకరైన స్వామి వివేకానంద మత మౌఢ్యానికి వ్యతిరేకంగా తీవ్రమైన పోరాటం చేశారు. 1898 చికాగో ప్రపంచమతాల పార్లమెంటు ఉపన్యాసంలో, "భారతదేశానికి కొల్లబోయినంత మతం ఉంది తిండేలేదు. ఆకలితో మ్రగ్గుతున్న ప్రజల మొహాన "మతం" కొడతామని బయలుదేరడం వారిని అవమానించడమే" నన్నారు."

"మతం పేరుతో జరిగే మహిమలు, మహత్యాలు అన్నవి కల్పితాలు ఇంద్రజాలిక విద్యలు, సమ్మోహన విద్యలు హిందూ మతం వీటిమీద ఆధారపడి లేదు. ఈ మంత్రాలు, తంత్రాలు మూర్మిక విద్యలు మనలను నాశనంచేశాయి. ఇవి మనిషిని బలహీనపరచే విషయాలు మూఢనమ్మకాల గురించి జాగ్రత్తగా ఉండాలి. మీరందరూ నాస్తిక వాదులైపోయినా సరే నాకు యిష్టమే. మూఢ నమ్మకాలు గల మూఢులవడం కంటే అదే మంచిది. ఎందుకంటే నాస్తికవాది సజీవంగా ఉంటాడు . కాని మూఢ నమ్మకాలకు లోనైతే నీ మెదడు మెతక బడిపోతుంది. జీవం నశిస్తుంది."

"మంత్ర తంత్రాలు వదలండి! ఉపనిషత్తుల అధ్యయనానికి మరలండి. ఉపనిషత్తుల్లో అత్యంత జాజ్వల్య మాన తాత్విక సంపద ఉంది".

"వేదాంతం అంటే జీవితానికి దూరంగా పారిపోవడం కాదు. అది సజీవంగా దైనిందిన జీవితంలో భాగంగా, నైతిక ప్రమా ణాలను పెంచేదిగా ఉండాలి. వేదాంతం అంటే మానవత మాన వునిలో అంతర్లీనంగా ఉండే దైవత్వం మేళవింపు. శుష్క వేదాం తం స్థానంలో నిర్దిష్ట నైతిక విధానాలు, గందరగోళమైన యోగ సిద్ధాంతం స్థానంలో శాస్త్రీయ దృక్పథంగల ఆచరణా త్మకమైన మనస్తత్వం పెంపొందించాలి."

"భారతదేశం తనలో తాను ముడుచుకుపోయి. యితర దేశాల్లో ఏమి జరుగుతూందో తెలుసుకోకుండా నూతిలో కప్పవలె ఉండిపోయింది. నిర్జీవమైన మృతదేహంతో(మమ్మీల) సమానమైన నాగరికతలోకి దిగజారిపోయింది. 'కులం అన్నది ఒకనాడడ అవసరం, వాంఛనీయం అయినప్పటికీ ఆ తరు వాత అది ఒక బ్రహ్మ రాక్షసి రూపం ధరించి అందుకు విరుద్ధ ఫలితాన్ని యిచ్చింది. సామాన్య ప్రజానీకాన్ని అణగద్రొక్కింది. అసలు సాంఘిక వ్యవస్థ కాలాన్ని బట్టి మారుతూ ఉండాలి. దీనికి మతానికి సంబంధం ఉండకూడదు" అని స్వామి వివే కానంద భారత ప్రజలను మేల్కొలిపారు.

## రాజకీయ సామాజిక సమస్యలలో మత ప్రమేయం తప్పు

స్వామి వివేకానంద, "రాజకీయ, సామాజిక సమస్యలలో మత ప్రమేయం శుద్ధతప్పు" అని స్పష్టం చేశారు. ఆయన ఇలా అన్నారు:

"మతం వేరు. తత్వ శాస్త్రంవేరు మతం వైయక్తికమైనది. తత్వశాస్త్రం విశ్వజనీనమైనది. ఎవరి వ్యక్తిగత విశ్వాసాలు. మత విశ్వాసాలు వారివి. వాటిని సమాజం మీద రుద్దడానికి ప్రయత్నించకూడదు. మత విశ్వాసాలను బట్టి సంఘాన్ని శాసించకూడదు. అలాగే రాజకీయాలకు మత ప్రమేయం ఉండకూడదు."

"ఆత్మకు లింగబేధం లేదు కులబేధం లేదు. మత బేధంలేదు.

"మతం చేసిన ఘోరతప్పిదం ఏమంటే సాంఘిక విషయాలలో జోక్యం చేసుకోవడం, సాంఘిక నియమాలను జారీ చేసే హక్కు మతానికి లేదు ఓ మతమా? నీ హద్దుల్లో నీవు ఉండు! అప్పుడంతా చక్కగా ఉంటుంది.... విద్యకు మతానికి కూడా సంబంధం ఉండకూడదు విద్య దేశ భక్తిని పెంచేదిగా ఉండాలి.

"తిండి పెట్టలేని దేవుడి మీద నాకు నమ్మకం లేదు. ఇక్కడ తిండి పెట్టకుండా ఎక్కడో స్వర్గంలో సౌఖ్యం యిస్తాడనే దేవుడిమీద నాకు నమ్మకంలేదు."

"భారతదేశాన్ని ఉద్ధరించాలి పేద ప్రజలకు కడుపునిండా తిండి పెట్టాలి విద్యను వ్యాపింపజేయాలి ఈ మతాధిపతుల పురోహిత వర్గాల బెడదను దేశానికి వదిలించాలి" అని వివేకానంద ఉద్బోధించారు.

కష్ట జీవుల ద్వారానే నవభారత దేశం ఉద్భవిస్తుందని స్వామి వివేకానంద ఘంటా పథంగా చెప్పారు. భవిష్యత్తులో వచ్చేది శూద్ర (శ్రామిక) రాజ్యమేనని భవిష్యత్ భారతదేశ స్వరూపంగురించి వందసంవత్సరాలక్రితమే ఆయన చెప్పారు.

## తిలక్ "గీతా రహస్యం"

బ్రిటిష్ సామ్రాజ్యవాదులు లోకమాన్య బాలగంగాధర తిలక్‌ను 1808లో రాజద్రోహనేరం క్రింద 6 సంవత్సరాలు శిక్షవేసి బర్మాలోని మాండలే జెలుకు ప్రవాసం పంపారు. ఈ జెలులోనే తిలక్ మహాశయుడు ప్రసిద్ధమైన "గీతా రహస్యం" గ్రంథాన్ని రచించారు.

శంకరుని అద్వైత సిద్ధాంతం, రామానుజుని విశిష్టా ద్వైత సిద్ధాంతం జ్ఞాన యోగానికి, భక్తి యోగానికి ప్రాధాన్యతను యిచ్చి, కర్మయోగాన్ని విడిచిపెట్టాయనీ, అందువలన అకర్మణ్యత్వం, క్రియాశూన్యత దేశంలో పెరిగిపోయి అధోగతి పాలైందనితిలక్ మహాశయుడు ఉద్ఘోషించారు. తన "గీతా రహస్య" ద్వారా కర్మయోగానికి గల ప్రాధాన్యత పునరుద్ధరించారు.

వేదాంతపరంగా అంతవరకు "స్వరాజ్యము" అంటే ఆత్మ మోక్ష ప్రాప్తి అని వాడుకలో ఉన్న అర్థాన్ని తిలక్ మహాశయుడు దేశ స్వరాజ్యానికి అన్వయించి ప్రస్తుత ఇహలోక స్వరాజ్యాన్ని సంపాదించడమే ప్రధాన కర్తవ్యమని అదే స్వధర్మమనీ, అదే "కర్మయోగపరమార్థమని చెప్పి అంతవరకు ఉన్న భారతీయ తాత్విక చింతనలో అపూర్వమైన నూతన దృక్పథం, అవగాహన కల్గించారు.

అంతకాదు ఈ ప్రపంచం అంతా మిథ్య, మాయ అన్న శంకరుని మాయా సిద్ధాంతాన్ని కూడా తిలక్ గట్టిగా ఎదుర్కొని "శరీరం మిధ్య అని చెప్పి మనం అన్నం తినడం మాని వేస్తామా? శరీరం మిధ్య అని చెప్పి ఆత్మహత్య చేసుకుంటామా? అని సూటి ప్రశ్న వేశారు.

జ్ఞానయోగం, భక్తి యోగాలు ప్రజలలో నిర్వ్యాపారత్వాన్ని సోమరితనాన్ని పెంచాయనీ ఆయన నిరసించారు. అలాగే కర్మ సిద్ధాంతాన్ని - నుదుటి వ్రాతగా భావించే "ఖర్మ సిద్ధాంతం"గా మార్చడాన్ని కూడా తిలక్ మహాశయుడు ఖండించాడు. "దాత వ్రాసిన వ్రాత" చేతనే మన మిట్టి దుస్థితికి వచ్చినామని తలచుటతప్పు. ప్రతీ విషయము బ్రహ్మ వ్రాతయేనని మనము తలచుటకు మన చిరకాల రాజకీయ దాస్యమే కారణం" అని ఆయన పేర్కొన్నారు.

"కర్మయోగమును మన వారు వదలిన కొలది, దేశ సౌభాగ్యము కూడా నానాటికి క్షీణించమొదలిడెను. ఎప్పుడు ..... .... భారతీయులు కర్మవియోగమునెడ శ్రద్ధ వహించక, దీనిని వదిలి వేసిరో, ఆ దినము నుండియే భాగభోగ్యములును, సంపల్లక్ష్మియు మన భారత భూమిని విడిపోవనారంభించెను" అని తిలక్ హెచ్చరించారు.

## గణపతి పూజకు నూతన స్వరూపం

"జాతీయాభిమానం ఉండుట మానవుని ప్రథమ విధి. తరువాత మతాభిమానము రెండవది" అని దైవభక్తి, మత విశ్వాసాలు - దేశభక్తి జాతీయాభిమానాల తరువాతనే అని ఆయన ప్రబోధించారు.

బ్రిటిష్ ప్రభుత్వానికి వ్యతిరేకంగా ప్రజలను సమీకరించడానికి, ప్రభుత్వ నిర్బంధ విధానాన్ని, సి.ఐ.డి.ల బెడదలను తట్టుకోడానికి బహిరంగ వేదికలుగా ఆయన ఆనాటి పరిస్థితులలో గణపతి పూజలను, శివాజీ ఉత్సవాలను సార్వజనిక ఉత్సవాలుగా మార్చారు. ఈ ఉత్సవాల సందర్భంలో ఆయన దేశభక్తి గీతాలను ప్రచారంలో పెట్టారు. ఈ ఉత్సవాలకు ముస్లిములను కూడా ఆహ్వానించి హరిజనులను కూడా ఈ ఉత్సవాలలో పాల్గొనేటట్లు చేశాడు.

గణపతి ఉత్సవాలను శివాజీ ఉత్సవాలను, సంకుచిత హిందూ మత తత్వంతోకాక జాతీయ దృక్పథంతో, జాతీయ చైతన్యాన్ని దేశభక్తిని రగుల్కొల్పడానికి సాధనాలుగా తిలక్ చేసుకొన్నారు.

## గాంధీజీ

తిలక్ కంటే గాంధీజీ మరింతగా మత మౌఢ్యం నుండి ప్రజలను మరల్చి కర్మవీరులుగా, కార్యశూరులుగా చేశారు. మూఢ భక్తిని,కుల, మత ఛాందసభావాలను ఎదుర్కొన్నారు. హిందూ ముస్లిమ్ విభేదాలను ఎదుర్కొని ప్రజలందరిని సమైక్యంచేసి స్వాతంత్ర్యోద్యమంలోకి నడిపంచారు.

అస్పృశ్యత భారతదేశానికి ఒక శాపం- ఒక కళంకం అని ఎలుగెత్తి చాటారు. హిందూ ముస్లిం ఐక్యత కోసం చివరి వరకు పోరాడారు. ఆ పోరాటంలోనే చివరకు ఆర్.ఎస్.ఎస్. మతోన్మాది పిస్తోలు గుండుకు ఆహుతి అయి మరణించారు.

ఆయన దేవునియందు మతం యందు పరిపూర్ణ విశ్వాసం ఉన్నవాడు. శుద్ధ ఆస్తికవాది. అయితే ఆయనదేవుడు "ఆకలిగొన్న వారికి అన్నం రూపంలో ప్రత్యక్షం" కావాలి. ప్రజల ఆకలిని తీర్చి, దారిద్ర్యాన్ని తొలగించి వారు మానవ మాత్రులుగా జీవించేటట్లు చేయగల్గినవాడే గాంధీజీ దృష్టిలో నిజమైన దేవుడు. ఆ విధంగా చేసేదే నిజమైన మతం.

ఈవిధంగా దేవుణ్ణి, మతాన్ని ప్రజల జీవిత సమస్యలతో, దేశ ఆర్థిక సామాజిక సమస్యలతో జోడించి వ్యూహించిన వాస్తవికవాది. తాత్విక వేత్త గాంధీజీ. ముక్తి మోక్షం పేరుతో ముక్కు మూసుకొని కూర్చోవడం గాక, దేశ స్వేచ్ఛా, స్వాతంత్ర్యాలకోసం పోరాడాలన్నదే ఆయన మతం, ఆయన తత్వం.

బాలగంగాధర తిలక్ వలెనే గాంధీజీ, దేశ ప్రజలలో శతాబ్దాల తరబడి వ్యాపించిపోయిన అజ్ఞానాన్ని, మూఢ నమ్మకాలను మూఢ భక్తిని, మత ఛాందసత్వాన్ని "కర్మ సిద్ధాంతం"తోవ్యాపించిన అకర్మణ్యత్వాన్ని తొలగించడానికి మహోన్నత పోరాటం చేశారు.

దేవుని పేరుతో, మతం పేరుతో జరిగే రక రకాల ఆడంబరాలను, మూఢాచారాలను, దుబరా దుర్వ్యయాలను ఆయన నిరసించారు.

వ్రతాలు, నోములు చేస్తూ స్త్రీలు వంటయింటి బానిసలు కారాదనీ స్త్రీ, పురుషునికి దాసి కాదనీ స్త్రీలు జాతీయోద్యమంలోకి పురుషులతోపాటు అన్ని రంగాలలోకి రావాలని ఉద్బోధించారు. తొలిసారిగా భారతనారీలోకాన్ని స్వాతంత్ర్య సమరంలోకి తీసుకువచ్చారు. బాల్య వివాహాలు నిర్బంధ వైధవ్యం వరకట్నాలు మున్నగు సాంఘిక దురాచారాలను తీవ్రంగా వ్యతిరేకించారు.

అన్ని మతాలను ఆయన పరిశీలించారు.

సంకుచిత మతాభిమానాన్ని మతోన్మాదాన్ని ఆయన ఖండించారు. అన్ని మతాలు సమానమైనవేనని, అందరు దేవుళ్ళు, ప్రవక్తలు సమానంగా పూజనీయులేననీ, పరమత ద్వేషం ఉంచకూడదని ఆయనప్రబోధించారు. తన ప్రార్థనా సమావేశాలలో ఎల్లప్పుడూ పాడించే "రఘుపతి రాఘవ రాజారాం - పతిత పావన సీతారామ్ " అన్న చరణాలకు "ఈశ్వర అల్లా తేరే నామ్" అన్న చరణాన్ని కూడా చేర్చి పాడించేవారు. ప్రార్థనా సమావేశాలలో అన్ని మత ప్రార్థనలను జరిపించేవారు. హిందూ ముస్లిం మత సమైక్య సాధనకు ఖిలాఫత్ ఉద్యమాన్ని, స్వాతంత్ర్యోద్యమానికి జోడించారు. మహమ్మదాలీ షౌకతాలీ సోదరులు - తాను కలిసి సభా వేదికలపై ఒకే గ్లాసులో మంచి నీరు త్రాగి హిందూ ముస్లిమ్ బేధాభావాన్ని పోగొట్టడానికి ప్రత్యక్ష ప్రదర్శనలు చేశారు.

కాషాయ బట్టలు కట్టుకొన్న వారిని తన ఆశ్రమానికి రావద్దన్నారు. "తిండికిలేని జాతికి మతం ఏమిటి? అన్నార్తులైన ప్రజాకోటికి ఉపకరించే ప్రతీదీ నా కంటికి అందంగా కనబడుతుంది అన్నారు గాంధీజీ.

## పండిట్ నెహ్రూ

భారత జాతీయోద్యమ అగ్ర నాయకులలో ఒకరైన పండిట్ నెహ్రూ, మతం పేరుతో ప్రజలలో వ్యాపింపజేయబడిన మూఢనమ్మకాలను, మూఢ భక్తిని, కర్మ సిద్ధాంతాన్ని విడనాడవలసిందిగా ప్రభోధించారు. హిందూ, బౌద్ధ, జైన, క్రైస్తవ మతాలను ఆయన హేతువాద శాస్త్రీయ విమర్శనా దృష్టితో, ప్రగతి శీల దృష్టితో పరిశీలించి విమర్శించారు.

"మతం నేడు అనుసరించబడుతున్న తీరు చూస్తే ఈ మతాలన్నీ మూఢ నమ్మకాలతో అంధ విశ్వాసాలతో, గాఢంగా పెనవేసుకుపోయాయి. జీవిత సమస్యల పట్ల మతం ప్రదర్శించే దృష్టి శాస్త్రీయ విజ్ఞాన దృష్టికాదు. మహిమలు, మానవతీత శక్తులు, విమర్శనా పూర్వకంకాని తెలివి తక్కువ ధోరణులతో కూడి ఉన్నాయి. మతం 'మార్మిక వాదంతో అది భౌతిక వాదంతో విలీనమైపోయింది" అని ఆయన అన్నారు.

గాంధీజీ హత్యానంతరం 1948 ఫిబ్రవరిలో నెహ్రూ ఇలా హెచ్చరించారు:

"మతతత్వం - ప్రజాస్వామ్యానికి పూర్తిగా విరుద్ధమైంది. మత తత్వాన్ని జాతీయ జీవనం నుండి పూర్తిగా నిర్మూలించి వేయాలి. ఈ మత తత్వం నాజీ పద్ధతులపైన, ఫాసిస్టు పద్ధతుల పైన ఆధారపడుతోంది. రాజకీయ రంగంలో మత తత్వం ప్రవేశిస్తే ఎక్కడికి దారితీస్తుందో చూశాం. మతాన్ని రాజకీయాలకు గుదిగుచ్చితే మత తత్వం ఏ విధంగా తలెత్తిందో రెచ్చగొట్టబడిందో ఇది ఎంత ప్రమాదకరమైన కలయికగా పరిణమించిందో చూశాం."

మత సంస్థలకు రాజకీయ కార్యకాలాపాలకు ఎటువంటి సంబంధం ఉండరాదని నిర్దేశించుతూ (1948 ఏప్రిల్ 4న) పార్లమెంటు ఒక తీర్మానాన్ని ఆమోదించింది. ఈ సందర్భంలో నెహ్రూ మాట్లాడుతూ "రాజకీయాలు - మతం కలిస్తే మతతత్వ రాజకీయాలు ఏర్పడతాయి. ఇది చాలా విపత్కర పరిణామం. దీనిని రూపుమాపాలి. మతాన్ని రాజకీయాలకు జోడిస్తే దేశానికి మెజారిటీ వర్గానికే గాక, ఈ మత తత్వంవల్ల ప్రయోజనం పొందాలని చూసే మైనారిటీ వర్గానికి కూడా హానికరంగా పరిణమిస్తుంది." అని నెహ్రూ చాటారు.

# లౌకిక రాజ్యాంగం అంటే...

లౌకిక ప్రజాస్వామ్య రాజ్యాంగం గురించి నెహ్రూ ఇలా నిర్వచించారు:

లౌకిక రాజ్యాంగం అంటే ప్రజలు మతాన్ని వదలి పెట్టాలని కాదు. లౌకిక రాజ్యాంగం అంటే దేశంలోని అన్ని మతాలను ప్రభుత్వం రక్షిస్తుంది అయితే ఏ మతానికి వ్యతిరేకంగా ఏ మతాన్ని సమర్ధించదు. పక్షపాతం చూపదు. అంతేకాదు ప్రభుత్వం ఏ మతాన్ని అవలంబించదు. అధికార మతం అంటూ ఏదీ ఉండదు.

"లౌకిక రాజ్యాంగం మినహా మరే యితర రాజ్యాంగాన్ని తలపెట్టినా మళ్లీ శతాబ్దాల వెనక్కుపోవడం తప్ప వేరుకాదు. భారతదేశం మత తత్వం వల్ల ఎంతో నష్టపోయింది. భారత దేశంలో మత తత్వం, మతోన్మాదం వ్యాపిస్తే మళ్లీ దేశం వెనక్కుపోతుంది."

## భగత్‌సింగ్

భారత స్వాతంత్ర్య సమర మహాయోధులలో ఒకరు భారత విప్లవ వీరులలో అగ్రగణ్యుడైన భగత్ సింగ్ సమాజంలో మతం యొక్క పాత్రను, శాస్త్రీయ దృష్టితో, మార్క్సిస్టు దృష్టితో పరిశీలించారు. మతం గురించిన మూఢ నమ్మకాలను తుత్తునియలు చేశారు."తాను హేతువాది నాస్తికవాది మార్క్సిస్టు వాది" అని స్పష్టంగా ప్రకటించుకొన్నారు. భగవంతుడనేవాడు ఈ ప్రపంచాన్ని, ఈ సమాజాన్నినడిపిస్తున్నాడని తాను నమ్మడంలేదని ఆయన ఖండితంగా ప్రకటించాడు. మానవజాతి భవితవ్యాన్ని, మానవ జాతే నిర్ణయించుకోగలదని,మతం పేరుతో భగవంతుని పేరుతో దోపిడీ వర్గాలు, నూతన సమాజాన్ని నిర్మించడానికి అడ్డుకొడుతున్నాయనీ భగత్‌సింగ్ స్పష్టం చేశారు. దారిద్ర్యం, దైన్యం, నిరక్షరాస్యత, అజ్ఞానం దైవ లిఖితం కాదని, అవి పూర్వజన్మ పుణ్యాపాప ఫలితాలు కావనీ, దోపిడీ విధానాన్ని రద్దుచేస్తే మానవ జీవిత సమస్యలను పరిష్కరించవచ్చుననీ భగత్‌సింగ్ స్పష్టం చేశారు.

తొలి విప్లవకారులు మతాల నుండి ఉత్తేజం పొందారనీ అయితే వారు మతోన్మాదులు, మూఢ భక్తిపరులు కాదని, వారివి మత్మోనాద రాజకీయాలు కానేకావని భగత్ సింగ్ తెలియజేశారు.

మతం నెరవేర్చిన సామాజిక పాత్ర గావించి భగత్‌సింగ్ చాలా శాస్త్రీయమైన దృక్పథాన్ని యిలా వెల్లడించారు.

"మతం అన్నది ఆదిమ మానవుల అశక్తత వల్లనే సృష్టించబడింది. తన చుట్టూ ఉన్న సమాజ వాతావరణాన్ని పూర్తిగా అవగాహన చేసుకొని తన జీవితాన్ని తన అదుపులో వుంచుకోవడంలో విఫలమైనప్పుడే దేవుడు మానవునికి ఒక ఉపయోగకరమైన సాధనంగా అయ్యాడు. దేవుడనే మిధ్య అత్యంత ప్రాచీనయుగంలో కూడా సమాజానికి ఉపయోగపడింది.

"అంతేకాదు. మనిషి యిబ్బందుల్లో ఉన్నప్పుడు దేవుడనే భావంఅతనికి మనశ్శాంతి కలుగజేసి, సహాయకారిగా ఉంటుంది. ఒక వ్యక్తి తన జీవితాన్ని ధైర్యంగా ఎదుర్కొనేందుకు దేవుడు, మతము అవసరమైన స్తోమతునిస్తాయి. అనేక క్లిష్ట పరిస్థితులను ధైర్యంగా ఎదుర్కొనడానికి అవసరమైన ప్రోత్సాహాన్ని యిచ్చేందుకు దేవుణ్ణి వూహాలోకి తీసుకురావడం జరిగింది అలాగే ప్రమాదాలు ఎదురైనప్పుడు సాహసంతో వాటిని అధిగమించడానికి భోగాలు కల్గినప్పుడు మానవుడు అతిగా ప్రవర్తించకుండా అదుపులో పెట్టేందుకు కూడా దైవత్వం అనేది ఉపయోగపడుతుంది. దేవుడనే భావంలో వ్యక్తికి ఎంతగానో వూరట లభించుతుంది. ఈ విధంగా నిరాశ, నిస్పృహల్లో ఉన్న వారికి, నిస్సహాయులకు, విద్రోహాలకు గురైన వారికి, దేవుడు ఒక తండ్రిగా, తల్లిగా, సోదరి, సోదరుడు, మిత్రుడు, సహాయకారిగా ఉపయోగపడతాడు. దేవుని మీద "నమ్మకం" అనేది కష్టాలను కొంతవరకు మరిచిపోయేలా చేయగలదు. ఒక విధంగా సంతోషాన్ని కూడా కలగజేయగలదు. దేవునిపైగల నమ్మకంతో మానవుడు ఎంతో ఓదార్పును, ఆత్మ స్థైర్యాన్ని పొందగలడు". అని భగత్‌సింగ్ అన్నారు.

## జాతీయోద్యమం నిర్వర్తించిన చారిత్రక పాత్ర

ఈ విధంగా భారత జాతీయోద్యమం, భారత పునరుజ్జీవనోద్యమాలు -భారత ప్రజల మత భావనలలో, తాత్విక చింతనలో అపూర్వమైన మార్పు తీసుకొని వచ్చాయి. మతం మత ఛాందసత్వంగా మారి, ప్రజలు మూఢ భక్తితో, మూఢ నమ్మకాలతో, జాతి, మత, కుల తత్వాలతో అకర్మణ్యులు, అచేతనులు, అయిపోయిన స్థితిలో స్వామి వివేకానంద, రాజా రామమోహనరాయ్ మొదలు వీరేశలింగం వరకు, బాల గంగాధర తిలక్ మొదలు భగత్ సింగ్ వరకు భారత ప్రజలను దేశ భక్తి వైపు జాతీయ పునరుజ్జీవన, జాతీయ స్వాతంత్ర్య సమరంవైపు తీసుకురాగల్గారు. వారి కృషిలో వారి ఆలోచనలలో అనేక పరిమితులుండవచ్చు. కాని వారి కృషిని ఆనాటి చారిత్రిక పరిస్థితులలో ఆనాటి ఉద్యమాల పరిమితులలో అంచనా వేసి చూచినప్పుడు, వారు ఆనాడు ఎంత అభివృద్ధి నిరోధక శక్తులతో పోరాడవలసి వచ్చిందో చూసినప్పుడే వారి చేసిన కృషిని సరిగా అంచనా వేయగల్గుతాము.

మతం - మత మౌఢ్యంగా మత ఛాందసత్వంగా మారి సమాజాన్నిదేశాన్ని పురోగమించకుండా చేస్తున్నప్పుడు సాంఘిక దురాచారాలతో కృంగి కృశించి పోతున్నప్పుడు జాతీయోద్యమం జాతీయ పునరుజ్జీవనోద్యమాలు తమ చారిత్రక పాత్రను నిర్వహించాయని నిస్సంశయంగా చెప్పవచ్చు.

ఈనాటి దృష్టితో చేస్తే, ఈ రెండు మహత్తర ఉద్యమాలు, వాటికి నాయకత్వం వహించినవారు ఇంకా ఎంతో చేసి ఉండవలసిందని మనకు అనిపించవచ్చు. ఆ దృష్ట్యా చూస్తే మనం నేటి మన కర్తవ్యాన్ని ఎంతవరకు నెరవేర్చాం? నెరవేర్చగల్గుతున్నాం? అన్న ప్రశ్న కూడా ఎదురవుతుంది.

# మతఛాందసత్వం : మహిళలు

– శ్రీమతి మల్లాది సుబ్బమ్మ

మతం అంటే ఏమిటి? ఈనాటి రూఢ్యర్థాన్ని గమనిస్తే దేవుని ఉనికిలో విశ్వాసం వుండి. దేవుని పూజా విధానాన్నిగాని, ప్రార్థనా రీతినిగాని నిర్దేశించేది మతం. సర్వాంతర్యామిగా సర్వశక్తిమంతుడుగా సర్వలక్షణ సమన్వితుడుగా చెప్పబడే ఆ పరమేశ్వరునికీ, వ్యక్తికీ వుండే సంబంధాన్ని నిర్ణయించేది మతం. తోటి మానవుణ్ణి కష్టనష్టాల పాలుచేయకుండా, మానవుని హుందాతనాన్ని వ్యక్తిత్వాన్ని వమ్ముచేయకుండా చేసుకునే పూజాపద్ధతిని, ప్రార్థనా తీరును ఎవరూ కాదనరు. ఆ విషయంలో ప్రతి వ్యక్తికీ స్వేచ్ఛ వుంది. ఆ స్వేచ్ఛను ఏ రాజకీయపార్టీ, రాజకీయ వ్యవస్థ, రాజ్యాంగం కాదనటంలేదు. పైగా ప్రతి వ్యక్తికీ మతస్వేచ్ఛను స్పష్టంగా ప్రకటించాయి పెక్కు అభ్యుదయ దేశాల రాజ్యాంగాలు. పలు మతాలవారు ఒకే దేశంలో మనుగడ సాగించవలసివుండటంతో యిలాంటి చర్య తప్పనిసరి అయింది. ఇది ఒకరకంగా మంచిదే; అభిలషణీయమే.

## మతఛాందసం

మతాల ఉనికిని అంగీకరించినంతమాత్రాన మత ఛాందసత్వాన్ని ఆమోదించాలనడం, దానిని పవిత్రమయినదిగా భావించడం సరికాదు. ఇటీవల అమెరికా సంయుక్త రాష్ట్రాలలో పెచ్చుపెరిగిన మత ఛాందసత్వం వల్ల సుమారు రెండు వందల మంది స్త్రీ పురుషులు ఆత్మాహుతి చేసుకోవడం జరిగింది. ముస్లిం దేశమైన అల్జీరియాలోనే మత ఛాందసవాదుల చర్యలు ఘోరంగా తయారవటంతో వారి సంఘాలను ప్రభుత్వం చట్టబద్ధం కావని ప్రకటించింది. ఈజిప్టులోనూ అదే స్థితి నెలకొనివుంది. యిరోపాలో, మధ్య ఆసియాలో ముస్లిం మత ఛాందసవాదులను చూచి భయపడుతున్నాయి సభ్యదేశాలు. మత ఛాందసవాదం తమ మతంవారినే నష్టపరుస్తున్నది అనే వాదనను కొందరు మే ధావులు లేవనెత్తారు. పరమత ద్వేషాన్ని మత ఛాందసాన్ని వేరు వేరు అని భావించ మొదలు పెట్టారు. ఈ విభజన ఆధార రహితం: అసమంజసం. మతఛాందసం కొన్ని సమాజాలలో అణిగిమణిగి వుంటుంది. నిరపాయంగా కన్పిస్తుంది. మరికొన్ని సమాజాలలో విజృంభించి విలయ తాండవం చేస్తుంది. పరిస్థితుల సానుకూల్యతనుబట్టి దాని రూపాలు నిర్ణయింపబడుతున్నాయి. అంతేకాని రెండు రూపాలలోను గుణాత్మకమైన తేడా లేనేలేదు.

## మత ఛాందసత్వాన్ని స్త్రీలు ఆమోదిస్తున్నారా ?

మత ఛాందసత్వం మతస్థులలోని పురుషులకంటే స్త్రీలకు ఎక్కువ నష్టాన్ని కలుగజేస్తున్నది. మరి దానిని స్త్రీలు నిరసించలేదా, తొలగత్రోయలేదా అనే ప్రశ్నలు ఉదయిస్తాయి. బానిస బ్రతుకు సాగించే వ్యక్తికి స్వేచ్ఛ స్వరూపం తెలియదు. బానిసత్వాన్ని గ్రహించడానికే చాలా కాలం పడ్తుంది. బానిసత్వమే మంచి సామాజిక వ్యవస్థ లక్షణమని తలపోసి దానిని ఆమోదించి అనుసరిస్తారు బానిసలు. స్త్రీల విషయంలోనూ అలాగే జరిగింది. తమను స్వేచ్ఛాస్వాతంత్ర్యాలకు దూరం చేసిన మత ప్రమాణాలు, అవతారమూర్తుల ఆదేశాలు, ప్రవక్తల బోధలు, మతాచార వ్యవహారాలు అన్నీ తమ మేలుకొరకే ఏర్పాటు చేయబడినవని వారు విశ్వసించారు. ఇప్పటికీ స్త్రీలలో ఎక్కువమంది యిలా నమ్ముతున్నారు. స్త్రీజన శ్రేయస్సును, సంక్షేమాన్ని కాంక్షించే పురుషుల హెచ్చరికలను, జాగృతి చైతన్యంగల స్త్రీల మేల్కొల్పులను, మతఛాందసత్వానికి బలి అయి బాధలుపడ్డ తమ మతానికే చెందిన సాటిస్త్రీల ఉద్బోధలను వారు పెడచెవిన పెడ్తున్నారు; అంతటితో ఆగక స్వేచ్ఛాస్వాతంత్ర్యాలు స్త్రీల జన్మహక్కని ప్రకటించేవారిని వ్యతిరేకిస్తున్నారు. అంటే తమకు తామే తమ సంకెళ్లను గట్టిచేసుకుంటారన్నమాట. ఇది శోచనీయస్థితి.

"మతం మత్తుమందు లాంటిది" అన్నాడు మార్క్స్. అలాంటి మతశక్తుల కౌగిళ్లలో బిగింపబడ్డ ఒకానొక అభూత కల్పనే భారత మహిళల సంస్కృతి. హిందూ సంస్కృతికి మూలం వేదాలు, ఉపనిషత్తులు, స్మృతులు, పురాణాలు, ధర్మశాస్త్రాలు, ఇతిహాసాలు. ముస్లిం సాంప్రదాయాలకు మూలం షరియత్ చట్టం. దానికి నాంది ఖుర్‌ఆన్. క్రైస్తవ మతానికి బైబిల్ శిరోధార్యం. ఈ మూడు మతాలు స్త్రీలపట్ల అనేక విధినిషేధాలు విధించాయి. వారికి బాధ్యతలేతప్ప హక్కులు, అధికారాలు కాగడాలేసి గాలించినా దొరకవు. ఏ దేశంలోనూ, ఏ మతంలోనూ, ఏనాడూ ఏ స్త్రీ సమానహోదాకాని తాహతుకాని అనుభవించినట్లు ఆధారాలు లేవు. వేదాలు చదివినా, నాటి వ్యవస్థ చూచినా, స్త్రీకి ప్రత్యేక విశిష్టత వున్నట్లు కన్పించదు. అసలు వేద ప్రవచన చేసిన ఋషులలో స్త్రీలు ఒకరిదరు తప్ప లేనేలేరు. పైగా స్త్రీలు వేదం చదువరాదనే ఆంక్షలు కూడా వచ్చాయి. స్త్రీ అంటే ఆటబొమ్మని, ఒక బానిస అని, భర్తకు శుశ్రూష చెయ్యటమే ఆమె విధి అని మతవాదుల మస్తిష్కాలనిండా చెరగని ముద్రగా నిలిచిపోయాయి. మత దృష్టిలో "సమాజం" అంటే పురుషులేనని, వారి అవసరాలను

తీర్చే యంత్రం మాత్రమే స్త్రీ అని తేల్చారు. మతం స్త్రీ స్థానాన్ని పురుషుడి పాదాల చెంతనే వుంచింది. శైశవం దాటగానే మెల్లిగా మాట్లాడాలని, తలెత్తుకొని తిరుగరాదని, నిటారుగా నిలబడరాదని శాసించింది. భర్త ఆజ్ఞలను శిరసావహించాలని, అత్త, మామలకు అణిగిమణిగి వుండాలని, స్త్రీకి ఇల్లే స్వర్గమని, భర్తే పరమ దైవమనే విధి నిషేధాలు మన పురాణాల్లో ధర్మశాస్త్రాల్లో దర్శనమిస్తాయి. స్త్రీ ఆజన్మాంతం ఎలా జీవించాలో కుమారశతకం లాంటివి రాయించి వివరంగా బోధించారు మతస్తులు. హిందూమతం, ఇస్లాం, క్రైస్తవం ముఖ్యమైన మతాలు. మనుధర్మశాస్త్రం, ఖుర్‌ఆన్, బైబిలు వాటి మత గ్రంథాలు అవి స్త్రీని చాలా నీచాతినీచంగా చిత్రించాయి.

## స్త్రీ నరకానికి సింహద్వారమట !

స్త్రీలు నరకానికి సింహద్వారంవంటి వారన్నాడు శంకరాచార్యుడు. ఆడది పాపగర్భంనుండి జన్మించిందంటుంది భగవద్గీత. ఆడదానికి ఆజన్మాంత సంరక్షకత్వం ప్రతిపాదించింది మనుస్మృతి. స్త్రీని బానిసత్వానికి చిహ్నంగా ఆటబొమ్మగా మార్చేశాయి ధర్మశాస్త్రాలు. అంతేకాదు భర్త క్రూరుడైనా, కొట్టినా, చంపినా, భర్తనే ప్రత్యక్ష దైవంలా పూజించాలని నిర్వచించింది హిందూమతం. ఇస్లాం స్త్రీలను, జంతువులతో పోల్చింది. స్త్రీని పొలంగా పేర్కొంటూ దానిపై సర్వాధికారాలు దున్నేవాడిదేనంటూ ఖుర్‌ఆన్‌లో వ్రాసివుంది. స్త్రీని పాపాలకు మూలకారణమైన "ఈవ్"గా ప్రతిపాదించింది క్రైస్తవం. "నీకు విధేయత చూపుతాన"ని పెళ్లినాటి ప్రమాణాల్లో సైతం స్త్రీచే ప్రమాణం చేయిస్తుంది. పురుషుని ముందు సృష్టించి, అతని సంతోషంకోసమే స్త్రీని దేవుడు సృష్టించాడని ప్రచారం చేస్తోంది బైబిలు. అసలు పురుష పతనానికి కారణంకూడా "ఈవ్" ఆడదేనని ఈసడిస్తుంది. మతసంస్కర్తల్లో ముఖ్యుడైన బుద్ధుడు సైతం స్త్రీలకు భిక్షుణిలుగా ప్రవేశార్హత లేదన్నారు. పెంపుడుతల్లి గౌతమి బుద్ధునితో సర్వసంగ పరిత్యాగం చేయగలమని, తమకు మోక్షార్హత కావాలని వాదించిన తర్వాతే ఆ అవకాశమిచ్చాడు. స్త్రీలకు. బౌద్ధ సన్యాసినులుగా ఇలా అన్ని మతాలు స్త్రీని అణగద్రొక్కాయి. స్త్రీ అంటే పురుషుని భోగ్య వస్తువని, పిల్లల్నికని వంశాన్ని వృద్ధిచేయటానికి ఆమె సృష్టింపబడ్డదని మతగ్రంథాలన్నీ ధృవీకరించాయి.

## మత ప్రవక్తలంతా పురుషులే!

అసలు మత ప్రవక్తలంతా పురుషులే. శాసనకర్తలు, ధర్మశాస్త్రకారులు సైతం పురుషులే కనుక వారి ఆధిపత్యాన్ని పెంచుకున్నారు. అలా ప్రచారం చేసుకున్నారు. స్త్రీలు తమ లొంగుబాటును చూపటమే పాతివ్రత్యమంటూ, అదే భారతీయ సంస్కృతి అంటూ ఆడవారికి బ్రహ్మాండమయిన బ్రెయిన్ వాష్ చేయబడ్డది. అదే తరతరాల భారతమహిళా సంస్కృతిగా స్త్రీల నరనరాన నాటుకుపోయింది. పురుషుణ్ణే కేంద్రంగా వుంచి ఆరాధించాలి. ఆమె అతని ఆస్తిగా, వస్తువుగా చలామణి కావాలి. ఇలాంటి ఈ సమాజపు సంప్రదాయానికి, సంస్కృతికి విరుద్ధమైన ఆలోచన ఆమె చెయ్యలేకపోతోంది. కనుకనే ఆధునిక భావాలు, శాస్త్రీయ దృక్పథం ఆమెలో మృగ్యమయ్యాయి. స్త్రీ కూడా మనిషేనని, ఆమెకు స్వేచ్ఛ, సమానత్వం, వ్యక్తిత్వం వుండాలని ఏ మతమూ బోధించనేలేదు. అందువల్లనే పురాణయుగంనాటి పాతివ్రత్యాన్ని నోములు, వ్రతాలు, పూజలులాంటి మతపరమైన క్రతువులను స్త్రీలింకా పాటిస్తున్నారు. పురుషాధిక్యతను తలదాలుస్తున్నారు. చాలామంది స్త్రీలు ఏదో ఒక మతంలో నమ్మిక కలిగుంటారు. వారి కాలమంతా ప్రార్థనలకు, బాబాల సూక్తులకు, పురాణ శ్రవణాలకు వినియోగిస్తారు. ఇంకా పాతివ్రత్యం పేరుతో భర్త ఎంత దుర్మార్గుడయినా, దుష్టుడయినా తను ధన, మాన ప్రాణాలు అర్పిస్తున్నారు. అలా స్త్రీ జీవితమంతా మూఢాచారాల ముసుగులో మిళితమయి వుంటుంది. చెట్టుకూ, పుట్టకూ, పోలేరమ్మకూ మొక్కడం, జాతరలు చెయ్యటం, మొక్కుబడులు చెల్లించడం, కొండకెళ్లి జుట్టుతీయించుకోవటం, బిడ్డలకోసం ప్రదక్షిణాలు చెయ్యడంలాంటి ఆచారాలు సవాలక్ష వున్నాయి. రోగికి వైద్యం చేయించరుకానీ చస్తే వేలకువేలు ఖర్చుపెట్టి దినవారాలు చేస్తారు. ఈనాటికీ వైధవ్యం పేరుతో జుట్టు, గాజులు, సూత్రం తీయక తప్పటంలేదు. ఇంకా మహిమలు, బాబాలు, మంత్రతంత్రాల నమ్మిక స్త్రీలలో మిక్కుటంగా వుంది. ఈ తరతరాల దాస్యభావనకు మత ప్రభావమే నాంది అనేది పచ్చి నిజం.

## భారత రాజ్యాంగం ఆచరణ పూజ్యం !

స్వేచ్ఛ సమానత్వం, సౌభ్రాతృత్వం అనే ఉత్తేజపూరితమైన ఫ్రెంచి ప్రకటన మానవహక్కులకు పునాదిరాళ్లు. మానవులు అంటే స్త్రీ పురుషులిద్దరూ కనుక మానవ హక్కులు స్త్రీలకు కూడా చెందాలి అనేది తథ్యం. ఆ వారసత్వ పంథాలో ఉద్యమించినదే 1950లో లిఖించిన మన భారత రాజ్యాంగం. అందులో ఆర్టికల్ 14లో స్త్రీ పురుష వివక్ష లేదని వ్రాసుకున్నాం. కాని ఆచరణలో అది మనకు నూరామడల దూరంలో వుంది. కారణం రాజ్యాంగం చట్టాలు కరుడుకట్టిన మన సనాతన భావాలను మార్చలేవు. వేదకాలం (2500 - 1500 బి.సి) అంటే నాలుగువేల ఏళ్లనుండి మతం మహిళమీద స్వైరవిహారం చేసింది. ఆమె జీవితాన్ని అగోగతిపాలు చేసింది. ఆమె మానసిక ప్రవృత్తులను అణచివేసింది. ఋగ్వేదకాలంలో స్త్రీ పురుష తేడాలు పెద్దగా లేవని ఆల్టేకర్, కపాడియా, ఇంద్రలాంటి పరిశోధకులు వెలిబుచ్చారు కాని "ఓ దేవా నాకు కుమారుణ్ణి ప్రసాదించుము" అనే ప్రార్థనతో స్త్రీ పతనానికి అక్కడే ప్రాతిపదికలు పడ్డాయి. అధర్వణ వేదంలో ఆడపిల్ల పుట్టరాదనే భావం బాగా ప్రబలి వ్రతాలు, ప్రార్థనలు కూడా చేశారు. కన్యల స్థితి ఘోరరూపం దాల్చింది. పున్నామ నరక విముక్తికోసం పుత్రుడు కావాలన్నారు. ఋగ్వేదంలో మతంలోను, సాంస్కృతిక రంగంలోనూ భాగస్వామియైన స్త్రీ అధర్వణవేదం చివర - బ్రాహ్మణాలకు ముందు నియోగపద్ధతిలో పిల్లవాణ్ణి కనడమేకాక ఆమె కేవలం పిల్లల తల్లిగా

మిగిలిపోయింది. క్రమేపి ఆడపిల్ల పుట్టుక దురదృష్టమయింది. కడకు విధవా వివాహాలు నిషేధమయ్యాయి.

## స్త్రీలకు అన్యాయం చేసిన దుష్టమేధావి మనువు

హిందూ మత సిద్ధాంతానికి మూలపురుషుడు మనువు. వర్ణాశ్రమ ధర్మాలను ప్రవచించింది, పెంచింది, పోషించింది కూడా ఆయనే. మనువు మహా మేధావి. కాని స్త్రీల యెడ, శూద్రులయెడ దయ, కనికరం, మానవత్వం లేని మహాదుష్ట మేధావి అన్నా తప్పులేదు. క్రీ.పూ. 2వ శతాబ్దంలో ఆచారంలోవున్న సిద్ధాంతాలను, సంప్రదాయాలను క్రోడీకరించి వాటి విలువలను పెంచి సూత్రీకరించటంలో తన చాకచక్యాన్ని, తన సొంత అభిప్రాయాలను మిళితం చేసి వాటికి ప్రజాదరణ తేగలిగిన మహా పురుషుడు అని ఆయన్ని ప్రస్తుతించవచ్చు. హిందూ ధర్మశాస్త్రానికి శాశ్వతత్వం కలిగించగలిగిన ఒక ప్రవక్త అని శ్లాఘించవచ్చు. ఆయన చెప్పినవి, వ్రాసినవి స్త్రీలు తమంత తాముగా ఆచరించేటట్లు చేయగలిగిన మహా ప్రతిభాశాలి. తక్కువ కులాల్లో పుట్టినవారిని, స్త్రీలను ఒక గాట కట్టేసి వారికొరకు కఠిన నియమాలను సూత్రీకరించాడు.

## క్రైస్తవంలో స్త్రీల దైన్యస్థితి

స్త్రీ చేసిన తప్పిదంవల్లనే ఈ ప్రపంచంలోని చెడంతా పుట్టిందని బైబిలు నిర్వచించింది. కనుకనే క్రైస్తవ మతస్తులు స్త్రీలను వేటాడిన కథలు చెబితే తీరేవికావు. ఇక క్రైస్తవమత చరిత్ర పరిశీలిస్తే స్త్రీల దైన్యావస్థ వర్ణనాతీతం. 558 ఎ.డి.లో 59 మంది బిషప్పులు మేకన్ (MACON) లో అసలు స్త్రీకి "ఆత్మ" వున్నదా? అని చర్చించి చివరికి అతికొద్ది మెజారిటీతో వున్నదని ఒప్పుకున్నారట. అలాగే గ్రీకు చర్చిలో చాలాకాలం తరువాతకాని స్త్రీని వ్యక్తిత్వమున్న మనిషిగానే గుర్తించలేదని చరిత్రలో వుంది. రష్యాలో జనాభాలెక్కలు వ్రాసేటప్పుడు పురుషులను మాత్రమే లెక్కతీసుకున్నారు కాని స్త్రీలను చేర్చనేలేదు. 1854లో ఫిలడల్ఫియాలో స్త్రీల హక్కుల మహాసభలో (ఉమెన్స్ రైట్సు కన్‌వెన్షన్) "స్త్రీలకు ఆత్మలున్నాయని రుజువు చెయ్యాలి" అని సవాల్‌చేస్తూ కొందరు ఆరుస్తూ సభలో అల్లరిచేసి సభను చెల్లాచెదరు చేశారు. ఇంగ్లండులో, అమెరికాలో స్త్రీలను పశువులలాగా అయిదు డాలర్లనుండి అయిదువేల డాలర్లవరకూ అమ్మకం జరిగింది. అలాగే కోపర్నికస్ సిద్ధాంతాన్ని గణితశాస్త్రరీత్యా సమర్థించిన కెప్లరును కన్నందుకు ఆయన తల్లి ఒక కర్ణపిశాచి అయివుంటుందని మతస్తులు ఆమెను బందీచేశారు. ఇలా కర్ణపిశాచులనే మిషతో క్రైస్తవమతం షుమారు కొన్నివేల మంది స్త్రీలను పొట్టన పెట్టుకున్నట్లు చరిత్రకారులు అంచనాకట్టారు. ఇంకా మతేతరుల కన్యలను మండుతున్న పీఠాలపై కూర్చోపెట్టినట్లు దాఖలాలున్నాయి. ఇలాంటి అత్యాచారాలు స్త్రీలపై 5,6 శతాబ్దాలలో జరిపినట్లు చరిత్ర రుజువు చేస్తోంది. బైబిలు స్త్రీని గురించి ఎలా ఆలోచించిందో తెలియాలంటే బైబిలు చదవాలి. ప్రతిచోటా ఆమెను పురుషుని ఆస్తిగా పరిగణించడం జరిగింది. ఏ క్షణానైనా కోపంవస్తే త్యాగపత్రంరాసి ఇస్తాడు భర్త. అప్పుడామె అతని పిల్లలతల్లి - ఇల్లులేనిది, కుటుంబంలేనిది అవుతుంది.

క్రైస్తవమతంలో స్త్రీల గురించి వివిధ అభిప్రాయాలు, నిర్వచనాలు వివరిస్తుంటే హృదయవిదారకంగా వుంటాయి. "నేను పెళ్లాడదలిస్తే రాతిలోంచి విధేయతకల స్త్రీని సృష్టిస్తా. ఎందుకంటే స్త్రీలలో విధేయత వుంటుందనే ఆశ నాకులేదు". అన్నాడు ప్రొటెస్టెంటు మతనిర్మాత సెయింట్ లూథర్. అలాగే ఆగష్టుకామ్ "స్త్రీత్వం అంటే కొనసాగుతూన్న శైశవమే" (బుద్ధి పెరగదని భావం) అన్నాడు. క్రైస్తవ భర్తకు భార్య సాంగత్యాన్ని కోరేహక్కు ఎప్పుడుపడితే అప్పుడున్నదన్నాడు ఒక క్రైస్తవ మతాచార్యుడు బైబిలు పాతనిబంధన పది ఆజ్ఞలలో (Ten Commandments) స్త్రీలను పరిచారికలతో, పెంపుడు జంతువులతో సమానంగా నిర్దేశించారు. స్త్రీని పురుషుడి ఆస్తిగా - ఎద్దులు, గాడిదలు, ఇల్లు, పొలంతో సమానమని చెప్పాడు. పురుషుని పతనానికి కారణం స్త్రీ. "ప్రపంచంలోకి ఆమె వల్లనే పాపం ప్రవేశించింది" ఆమె అపరిశుద్ధ కనుక దూరంగా వుంచుము అని బోధచేశాడు పాల్. ఇంకా హెూదా గురించి చెప్పాలంటే తండ్రి తన కుమార్తెను దాసిగా అమ్మవచ్చును. "ఒకడు తన కుమార్తెను దాసిగా అమ్మిన యెడల దాసులైన పురుషులు వెళ్లిపోవునట్లు అది వెళ్లిపోకూడదు". (నిర్గమ 21 : 7) "ఆమె భర్త ఆమెను దాసిగా తన రుణదాతలకు అమ్మవచ్చును" నా అప్పుల వారిలో ఎవరికి మిమ్ములను అమ్మివేసితిని; "(యెషయా 50 : 1) "నీవు హెబ్రీయుడైన దాసుని కొనిన యెడల వాడు ఆరు సంవత్సరములు దాసుడై వుండి యేడవ సంవత్సరమున ఏమియు ఇయ్యకయే నిన్ను విడిచి స్వతంత్రుడగును." (నిర్గమ 21 : 1) "పురుషునికి ఆరు సంవత్సరములకు విముక్తి. స్త్రీకి దాస్యం నుండి విముక్తి లేనేలేదు". ఇది క్రైస్తవం స్త్రీకి (తొలినాటి క్రైస్తవం) ప్రసాదించిన వరం.

## ముస్లిం స్త్రీల అసమాన హెూదా

జనాభాలో సగంమందిగా వున్న స్త్రీలు దైన్యంలో, నైచ్యంలో మునిగివుంటే సమాజ ప్రగతి అనేదానికి అర్థంలేదు. కనుక విశేషవ్యాప్తి, ప్రాచుర్యం కలిగిన ఇస్లాం మతాన్ని అనుసరించేవారిలో స్త్రీల స్థితి ఎలా ఉన్నదనేది విచారణీయాంశం అయింది. అంతేగాక భారతదేశంలో నూటికి పదకొండుమంది ముస్లింలు వున్నారు. అంటే మతదృష్ట్యా అల్పసంఖ్యాక వర్గంలో అగ్రశ్రేణిలో వున్నారన్నమాట. అలాంటి భారత ముస్లింలలో స్త్రీల స్థితి ఎలా వుందో గమనించటం, మహిళోద్యమ కార్యకర్తలకే కాక మానవ సంక్షేమాన్ని ఆకాంక్షించే వారందరికీ అవశ్యకర్తవ్యం. ముందుగా ముస్లిం స్త్రీల వేర్పాటు విధానపు క్రమానుగత పరిణామాన్ని గురించి తెలుసుకోవటం ఆవశ్యకర్తవ్యం. ఇంటిలో వేర్పాటు స్త్రీలు నివశించేభాగం, పురుషులు నివసించేభాగం వేరుగా వుంటాయి. గృహంలోకూడా

స్త్రీ తన పురుష బంధుగులు మామ, బావ, మరిది, కుమారుడు, అన్న, తమ్ముడు మొదలయిన వారి యెదుట నడయాడే తీరులో తేడాలు గమనార్హాలు. ఇల్లుదాటి ఆమె వెళ్లవలసివస్తే వెళ్లతగిన ప్రదేశాలు వేరుగా వుంటాయి. ఇల్లుదాటి ఆమె వెడలినప్పుడు ఆమె వేషధారణ, ఆమెకు తోడు అనివార్యం అయింది. పరపురుషులు తన పురుష బంధువులకోసం వచ్చినపుడు ఆమె కాని, వచ్చినవారుకాని సంచరింపవలసిన పద్ధతి - తలుపు చాటునుండి సమాధానం చెప్పటం వగైరాలు. ఆమె చేపట్టదగు వృత్తులు - నర్సింగు, టైపింగు, టీచింగు, గృహాలంకరణ, హోమ్‌సైన్స్ లాంటివి కొన్ని మాత్రమే. ఆమె అంతస్తు, హోదా, పురుషుని హోదాతో పోలిస్తే చాలా తేడాలుంటాయి. ఇలా ఎన్నో మరెన్నో చెప్పవచ్చు.

## సిక్కుల ధర్మశాస్త్రం

సిక్కులు తాము వేరే ఒక మతానికి చెందివున్నాం కనుక తమకు మతపరమైన శాసనం (PERSONAL LAW) కావాలని అలజడి చేస్తున్నారు. దాన్ని న్యాయసంబంధమైన మంత్రిత్వశాఖచేత పరిశీలింపచేస్తానని ఆనాటి ప్రధానమంత్రి హామీ యిచ్చారు. ఈ చిత్తుశాసనం చట్టరూపమైతే సిక్కు స్త్రీల గతి ఇరాన్, పాకిస్తాన్ స్త్రీలస్థితికన్నా ఘోరంగా మారుతుంది. ఇలా వారిని అన్యాయం చేసేకన్నా వారిని పుట్ట గానే హతమార్చటం న్యాయమేమో అనే అభిప్రాయాలుకూడా వచ్చాయి. కనుక సిక్కు స్త్రీలు, ముఖ్యంగా భారతస్త్రీలు ఆఖరికి అకాలీపార్టీ వారు చిత్తుశాసనంలోని లోపాలను ప్రజల దృష్టికి తెచ్చి వివరిస్తే చిత్తుశాసనంలోని ముఖ్య లక్షణాలు అర్థమవు తాయి. అందులో బహుభార్యాత్వం వారసత్వలోపాలు, విడా కులు, భరణంలాంటివేకాక "చదరండాజీ" లేక "క్రేవా" (ఆచా రం ప్రకారం ఆమెకు వైధవ్యంవవస్తే మామగారి తతిమ్మా కుమారులలో, ఒకని భార్యగా జీవించవచ్చును)లాంటి తిరోగ మన భావాలు అనేకం ఆ చిత్తులో దర్శనమిస్తాయి. ఆ చిత్తుశా సనాలు చట్టరూపం దాలిస్తే సిక్కు స్త్రీలు మధ్యయుగాలనాటి పరిస్థితికి పూర్తిగా నెట్టబడతారు. కనుక వాటిని సమీక్షిద్దాం.

సిక్కుమతం మాత్రమే స్త్రీలకు సమానహోదా ఇచ్చిందని తమ దృక్కోణం నుండి డా॥ అత్తార్‌సింగు అభిప్రాయం వెలిబుచ్చాడు. అకాలీల మతనాయకుడు గుర్‌నామ్‌సింగ్‌తీర్ స్త్రీల శ్రేయస్సును తాము విస్మరించటంలేదంటూ తన సిద్ధాం తాలనిలా సూత్రీకరించాడు. కాని వాస్తవం ఇందుకు విరుద్ధంగా వుంది. సిక్కు స్త్రీలు పురుషులపై ఆధారపడి బ్రతకాలని, నీతివంతులుగా జీవించాలని, ఆమె నీతిని న్యాయస్థానాలు కాక పంచాయతీ నిర్ణయిస్తుందని, ఏ ఒక్కరి సమ్మతి మీదనోకాక ఉభయుల సమ్మతిమీదనే విడాకులు కోరవచ్చని, అదైనా రెండు సం॥లు జరగాలని, భర్త కోరికలు మన్నించాలని, ప్రశ్నిం చేహక్కు ఆమెకు లేదని ఇలాంటి వన్నీ పురుషాధిపత్యాన్ని సూచిస్తున్నాయి. ఈ సూచనలలో స్త్రీ పురోభివృద్ధిని, స్త్రీ స్వేచ్ఛాసమానత్వాల్ని, ఆమె వ్యక్తిత్వాన్ని కాంక్షించేవి దరిదాపు శూన్యం. కనుక గణనీయమైన మార్పులొస్తున్న నేటి ఆధునిక వ్యవస్థకు అనుగుణంగా స్త్రీ పరమైన దృక్పధంలో మార్పులు, చేర్పులు అనివార్యం కాక తప్పదు.

## బౌద్ధ, జైన మతాలలో స్త్రీ

హిందూ, ముస్లిం, క్రైస్తవ, పార్శీ మతాలకన్నా జైనం, బౌద్ధం స్త్రీల యెడ కరుణ, దయ, సానుభూతి ప్రకటించాయి. కాని బుద్ధుడు సైతం మొదట్లో స్త్రీలకు సన్యాసార్హత నిరాకరించాడు. స్త్రీలు తమకూ మోక్షాన్ని ప్రసాదించమని కోరి నప్పుడు స్త్రీల ప్రవేశంవుండే వెయ్యేళ్లు మనగలిగిన బౌద్ధ మతం 500 ఏళ్లకంటే జీవించలేదని ఆనందుడు బుద్ధునితో వాదించాడు. బుద్ధుడు కొన్ని నియమాలు స్త్రీలకొరకు ప్రకటిం చాడు. స్త్రీలను ఎంతో అవసరమైతే తప్ప చూడవద్దని, వారితో మాట్లాడరాదని, వారితో చర్చలకు దిగవద్దని, మరీ తప్పకపోతే మహా జాగ్రత్తగా మెలగమని బోధించాడు. స్త్రీల రాకపోకలతో దుఃఖాన్ని కాని ఆనందాన్నికాని పొందని ధీరుడే అసలైన జ్ఞాని అని కూడా అన్నాడు బుద్ధుడు. స్త్రీలు పురుషులతో సరాసరి మాట్లాడరాదని మధ్యవర్తులద్వారా తమ సమస్యలుకాని, అవస రాలుకాని తెలియజేయాలని ప్రవచించాడు తనను ఆకర్షిం చేవాడుంటే, తనకు అవకాశం దొరికితే తన విషయాన్ని రహస్యంగా వుంచబడితే స్త్రీ కూడా తప్పు చెయ్యటానికి వెనుకాడదు అన్నాడు "మిళిందపాన"లో. "ఆడవారి హృద యాలు చాలా లోతైనవని, వారి ప్రవర్తన తెలుసుకోలేమని, ఎంతో చాకచక్యంగల దొంగలవంటి వారని, వారు అబద్ధాన్ని దాచగలరని, నిజాలను చెప్పరని, అందువల్ల వారి ఇష్టా ఇష్టాలను లక్ష్యపెట్టవద్దని "మిళిందపాన" లో స్త్రీలను గురించి చెప్పాడు. స్త్రీలను ఏడువర్గాలుగా విభజించి అందులో నాలుగు రకాల వారిని మోక్షార్హులని సూచించాడు. వారు - తల్లి, చెల్లి, మిత్రుని వంటివారు, బానిసలైనవారు. ఇక మిగిలిన మూడురకాలు అనగా చండాలిని, చోరగత్తె, ఉంపుడుగత్తె వీరు మోక్షానికి అనర్హులని వివరించాడు. ఏది ఏమయినా బౌద్ధంలో స్త్రీకి అంతో ఇంతో ఆదరణ, గౌరవం, సానుభూతి దక్కాయి. ఆ తరువాత అద్వైత మత స్థాపకుడైన ఆదిశంకరాచార్యులు హిందూమత స్థాపకులు; ఆ మత రక్షకులు లాంటి వారివల్ల స్త్రీ పతనం ఇంకా పూర్తిగా పడిపోయింది.

భారతదేశంలో బౌద్ధులు, జైనులుకూడా క్రీస్తు పూర్వం 6వ శతాబ్దానికి చెందినవారే. అందులో జైనుల్లో రెండు తెగల వారున్నారు. శ్వేతాంబరులు, దిగంబరులు. స్త్రీలు దిగంబరంగా వుండాలనేది దిగంబర శాఖవారు. అయితే తెల్లని వస్త్రాలు వేసుకోవచ్చని శ్వేతాంబరులు ధృవీకరించారు. అలాగే స్త్రీ మోక్షానికి అనర్హురాలని దిగంబరులు సూత్రీకరిస్తే మోక్షా నికి అర్హురాలని శ్వేతాంబరులు వాదించారు. క్రీ.పూ.5వ శతా బ్దపు ప్రాంతంలో జైనుల్లో కొందరు పిల్లలనూ, తల్లులను వదిలేసి సన్యాసుల్లో కలిసిపొయ్యేవారు. అక్కడక్కడా ఆడవారు సైతం సన్యాసత్వం స్వీకరించినట్లు ఆధారాలున్నాయి. కాని జైనసన్యాసిని జైన సన్యాసికంటే తక్కువ అనే విషయాన్ని శ్వేతాంబర, దిగంబరులిద్దరూ అంగీకరించేవారు. హిందూస్త్రీకి వేదాధ్యయనం నిషేధమయినట్లే జైన శ్వేతాంబర మూల

గ్రంథం "అంగ" మహిళలు పఠించరాదని నిషేధించారు జైనులు. జైనస్త్రీల్లో వేశ్యలు వుండేవారని వారిని జైన సన్యాసులు లోబరుచుకునేవారని "వ్యవహారభాస" గ్రంథంలో వ్రాశారు. రాజులకు హెచ్చుస్థాయిలో భార్యలుండేవారు. ఆ రాణులంతా పరదాలో వుండేవారు. స్త్రీలకు కాళ్లు, చేతులు నరికినా ఆమెను నమ్మవద్దని, వాళ్లను చూచినా, తాకినా నిగ్రహంపోతుందని, వాళ్లు నిజాయితీలేనివాళ్లు కనుక దూరంగా వుంచాలని జైనమతస్తులు శాసించారు. జైనస్త్రీల హృదయాలు లోతేనవని వారు దేవతలను కూడా మోసగిస్తారని "జె.సి.జైన్" వ్రాశాడు. స్త్రీలు అబద్ధాలాడటమేకాక వాటిని నమ్మిస్తారు. ఏడుస్తారు; ఏడిపిస్తారనీ మాటల్లో, చూపుల్లో లావణ్యం, హృదయంలో క్రూరత్వం గలవారని కూడా జైన్ జె.పి.చెప్పాడు. ఏదిఏమైనా జైన, బౌద్ధ మతాలు కూడా స్త్రీని చులకనగానే చూశారనేదానికి నిదర్శనాలు చాలా వున్నాయి.

ప్రతి మతానికి మత ప్రవక్తలు వుంటారు. వారు చెప్పిందంతా వేదమే. వారు రాసిందంతా మతస్తులు తు.చ. తప్పకుండా ఆచరించాల. వారు రాసినవన్నీ పవిత్ర మత గ్రంథాల పేరుతో తరతరాలవారిపై ప్రభావం చూపిస్తాయి. ఆ గ్రంథాల్లో భగవద్గీత, బైబిల్, ఖురాన్ ముఖ్యమైనవని. ఈ గ్రంథ రచయితలంతా పురుషులేకాని వేదాలు అపౌరుషేయాలు అంటారు. ఖురాన్ దైవవాణి అంటారు. ఆయా మతాలవారికి ఆయా మతధర్మాలు శిరోధార్యాలు. వాటికోసం అవసరమైతే మానవత్వాన్నే మట్టుపెడతారు.మత విద్వేషంతో మతయుద్ధాలు లెక్కకు మిక్కుటంగా జరిగాయి. ఇక స్త్రీల విషయంలో మతం స్వైర విహారం చేస్తుంది. ఈ రూపంలో మతం మానవ ప్రగతికి అడ్డుగోడ. కనుక మత మౌఢ్యని ర్మూలన మన సాంస్కృతిక పునర్వికాసంలో భాగం కావాలి.

## మూడు మతాల స్త్రీలు సమైక్య ఆందోళన చేయాలి

మత ప్రాతిపదిక ఆదారంతో ధర్మశాస్త్రాల ఆధారంతో మన చట్టాలన్నీ 1935లో రూపొందించారు. . హిందూ ముస్లిం క్రైస్తవ మతాలకు వారి వారి మతాల కనుగుణంగా మతధర్మ శాసనాలు (పర్సనల్ లా) తయారయింది. మూడు మతాల స్త్రీలు కలిసి తమ హక్కుల కోసం కాని, తమ మనుగడకోసంగాని ఐక్యతతో పోరాడే పరిస్థితి ఏనాటికీ లేకుండా విడదీసే చట్టాలు మనకున్నాయి. దీని ఫలితంగా స్త్రీలలో బలహీనత, నిర్వీర్యత, వేర్పాటుదోరణులు ప్రబలంగా వున్నాయి. ఒక మతం స్త్రీకి అన్యాయం జరిగితే మరో మతం స్త్రీలు ఆదుకోవటానికి రారు. ఒకవేళ వచ్చినా నీకేం సంబంధం నోరు మూసుకుని పడివుండు అని అణచివేస్తారు పురుషులు. అందువల్లే 1954లో హిందూ కోడ్ బిల్లును, 1986లో ముస్లిం స్త్రీల మనోవర్తి తీర్పును సనాతన హిందూ, ముస్లింలంతా కలిసి సవాల్‌చేసి నిరశించారు. అంతేకాదు 1954లో ప్రవేశపెట్టబోతున్న హిందూకోడ్ బిల్లును హిందూ స్త్రీలే వ్యతిరేకించారు. అలాగే షాబానో కేసులో (125 సి.ఆర్.పి.) ముస్లిం స్త్రీలు ముందుకొచ్చి పోరాడలేకపోయారు. మాకు భరణం వద్దు, మా మత సంరక్షణే కావాలి అన్నారు. ఈ అనైక్యత అంతా రాజ్యాంగం 44వ అధికరణం ప్రకారం భారతీయులందరికీ వర్తించే ఒకే ఒక వ్యవహార సంహిత (కామన్ సివిల్ కోడ్)ను మైనారిటీ వర్గాల, హక్కుల పరిరక్షణకు తాము బద్ధకంకణంగా వుంటువ్నా మనే ప్రభుత్వ అనాలోచితమే. అంతేకాదు మూడు మతాల వారికి ముఖ్యమైన వివాహం, విడాకులు, దత్తత, వారస త్వం, సంరక్షకత్వం, మనోవర్తి, హోదా, దాంపత్య జీవితం లాంటివి 1935 నుండి వేరువేరుగా వున్నాయి. ఇంకా కలిసివుండే విధానం చూపుమేరలో లేకపోవటానికి కారణం మత దురహంకారమే.

## వైదిక సంస్కృతిలో ఘోరదురాచారాలు

వైదిక సంస్కృతి పేరుతో స్త్రీపైవిధించిన ఆంక్షలు, విధినిషేదాలు వర్ణనాతీతంగా వున్నాయి. 16వ శతాబ్దంలో 6 ఏళ్ల అమ్మాయికి నృత్యాలునేర్పి ఎడమ భుజాన శంఖము, కుడి భుజాన చక్రం వెండి ఖడ్డీలు అగ్నిలో కాల్చి వాటితో ముద్రలు వేసి దేవునికి నాట్యం చేసే దేవదాసీలుగా అర్పించటం మత సంప్రదాయాలలో చాలా ముఖ్యం. పిల్లలులేనివారు మొదటి ఆడపిల్ల కలిగితే ఆపిల్లను దేవునికి (బలి) అర్పిస్తానని మ్రొక్కుకునేవారు.

1856లో సతీసహగమన నిషేధ చట్టం వచ్చినా 1826లో విధవా పునర్వివాహ చట్టం వచ్చినా వాటిని నిషేధించింది మతమే. నిన్నమొన్నటి దాకా బాల్య వివాహాలను స్థిరీకరం చేసిందికూడా మతమే. స్త్రీలను విద్యకు దూరం చేసింది. ఆస్తి హక్కు లేకుండా చేసింది, బహుభార్యాత్వాన్ని ఆమోదించింది కూడా మతస్తులే. ఇంటిపని, పిల్లల్ని పెంచటం ఆమె ముఖ్య కర్తవ్యమని మతాలన్ని ఘోషించాయి. స్త్రీ ఆజన్మాంత బానిసత్వానికి ప్రాతిపదికలు మతావిర్భావంలోనే పుట్టాయి. పితృస్వామ్యంతో పాటు వ్యభిచారవృత్తి కూడా ఉనికిలోకి తెచ్చింది.

## మత ఛాందసత్వాన్ని స్త్రీలు ఎలా ఎదుర్కోవాలి?

ముమ్మందుగా మతఛాందసత్వం స్త్రీలను ఎలా అష్టకష్టాల పాలు చేసిందో స్త్రీలు గ్రహించాలి. అధిక సంఖ్యాక స్త్రీలు ఆ అంశాన్ని గుర్తించేలా అభ్యుదయగాములు, జాగృతి, చైతన్యం కల స్త్రీలు ప్రయత్నించాలి. అజ్ఞానంతో, అవిద్యతో కొట్టుమిట్లాడే సామాన్య స్త్రీలకు యీ విషయంగా సాయపడాలి.

ఈ సందర్భంగా ప్రత్యేకంగా ఒక విషయాన్ని నొక్కి చెప్పవలసివుంది. ముస్లింలు అల్ప సంఖ్యాకులు కనుక శ్రద్ధ, జాలి, కరుణ, వారిపై వుండాలనే భావాన్నిప్రజలు కాస్త పక్కకు నెట్టాలి. ముస్లిం స్త్రీలు ముస్లిం ఛాందస భావాన్ని అంటిపెట్టుకొని వున్నంతకాలం, ముసల్మాను ప్రజలు తమ మత తత్వాన్ని పోషిస్తున్నంతకాలం హిందూమత తత్వాన్ని, హిందూమత ఛాందసత్వాన్ని ఎదుర్కోవడం సాధ్యం కాదనే నిర్ణయానికి ముస్లిం స్త్రీ పురుషులు రావాలి. ఇక్కడ ముస్లిం స్త్రీల బాధ్యత ఎక్కువగా వుంది. ఒకనాడు అంటే క్రీ. శ. 7వ శతాబ్దంలో ముస్లిం సమాజం ఆనాటి హిందూ సమాజంకన్నా అభ్యుదయకరంగా వుంది. ముస్లిం స్త్రీల స్థితి హిందూ స్త్రీల

పరిస్థితికన్నా వేయిరెట్లు మెరుగుగా వుంది. ఈనాడు పరిస్థితి తారుమారయింది. పాశ్చాత్య సంస్కృతీ పరిచయం వల్ల హిందూ సమాజం లాభించింది. వారి శాసనాలను మార్చుకుంది. హిందూ స్త్రీల స్థితి ముస్లిం స్త్రీల స్థితికన్నా చాలా బాగున్నది. ముస్లిం సమాజపు ధర్మసూత్రాలు 1939 తర్వాత మార్పు కాలేదు. కనుక హిందూ స్త్రీల కన్నా వెను కబడి వున్నారు. అందువల్లనే ముస్లింలకు వర్తించే అభ్యుదయకర ధర్మసూత్రాలను అధిక సంఖ్యాక ముస్లిం స్త్రీలు వ్యతిరేకిస్తున్నారు. ముస్లిం మత చాంధసతత్వాన్ని బలపరుస్తున్నారు. ఈ పరిస్థితి మారాలి. మార్చటానికి దేశంలోని ప్రగతిశీలురు, ముస్లిం సమాజంలోని విద్యావంతులయిన స్త్రీలు కార్యాచరణకు ఉపక్రమించాలి.

కేవలం ప్రబోధం, సాహిత్యం, ఉపన్యాసాలద్వారా మత ఛాందసత్వాన్ని ఎదుర్కోలేము; రూపుమాపలేము. సామాజిక ఆచరణలో మత చాందసం స్త్రీలను ఎలా కించపరుస్తున్నదో, ఎలా అవమానపరుస్తున్నదో, ఎలా వెతల పాలు చేస్తున్నదో దానికి లోనయిన స్త్రీలకు తెలియజెప్పాలి. వారికి తమ దైన్యస్థితిని గురించి స్పృహ కల్గించాలి. అపుడు వారు తాము మనుష్యులమేనని, తామూ స్వేచ్ఛా స్వాతంత్ర్యాలకు హక్కుదారులమేనని ఆలోచిస్తారు. దాంతో మత చాందసత్వంపై వారు తిరగబడతారు. అందరి మతాలను ముఖ్యంగా అల్ప సంఖ్యాకుల మత, సంస్కృతిని రక్షించాలనే అభిప్రాయంతో మత సమాజాల చెడు తీరుతెన్నులను సమర్థించడం అనుచితం. అలా చేస్తే స్త్రీలకు అన్యాయం చేసినట్లవుతుంది. జమీందారీ విధానం, పెట్టుబడిదారీ పద్ధతి, పురుషాధిపత్యం, మతఛాందసం స్త్రీలకు ప్రధాన శత్రువులు. పురుషాధిపత్యాన్ని మత ఛాందస తత్వం సమర్థిస్తున్నది; బలపరుస్తున్నది. అంతేకాదు జమీందారీ విధానానికి, పెట్టుబడిదారీ పద్ధతి కూడా మత ఛాందసతత్వం అండదండలను అందిస్తున్నది. కనుక మత ఛాందసతత్వాన్ని ప్రప్రధాన శత్రువుగా పరిగణించి స్త్రీలు పోరాడవలసిన ఆగత్యం వుంది. మత ధర్మశాసనాలను ఉనికిని వ్యతిరేకించవలసిన అవసరం వుంది. స్త్రీల హోదా కమిటీ నివేదిక దేశాన్ని, ప్రజలను అందులో ముఖ్యంగా స్త్రీలను యీ అంశంపై ఇరువది ఏండ్ల నాడే హెచ్చరించిందని మరచిపోరాదు.

మత ఛాందసత్వాన్ని సమర్థించే స్త్రీలు అధిక సంఖ్యలో ఉన్నంతకాలం వారు తమ పరిస్థితిని బాగు చేసుకోలేకపోవడమే కాక సమాజ పురోగతికి అడ్డుపడతారు. మత ఛాందస కబంధ హస్తాల నుండి స్త్రీలు ఎంత త్వరగా బయటపడితే అంత త్వరగా దేశం అభ్యుదయ పథాన పయనిస్తుంది.

## శిశు మరణాలు

| సం॥రం | మగ శిశువుల మరణాలు | ఆడ శిశువుల మరణాలు |
|---|---|---|
| 1970 | 52 | 55 |
| 1971 | 49 | 55 |
| 1972 | 53 | 62 |
| 1973 | 49 | 56 |
| 1974 | 47 | 53 |
| 1975 | 52 | 58 |
| 1976 | 50 | 52 |
| 1977 | 48 | 55 |
| 1978 | 45 | 52 |

– ఉమన్ అండ్ వయొలెన్స్

# ముస్లిం మత ఛాందసత్వం - స్త్రీలు

- శ్రీ మహబూబ్ ఆదం

ముస్లింలు ఇస్లాం మతానుయాయులు. ఈ మత స్థాపకులు మహమ్మద్‌గారు. అరేబియా ఎడారిలోని మక్కా నగరంలో క్రీ.శ. 570లో జన్మించారు. క్రీ.శ. 633లో మరణించారు. ఖురాన్ ఈ మతానికి ప్రమాణ గ్రంథం. ముస్లిం జీవిత విధానాన్ని షరియత్ శాసించుతుంది. జీవితంలో ఎదుర్కొనే సమస్యల పరిష్కారానికి మార్గం మహమ్మద్ ప్రవక్తగారి అనుభవాలు, సూక్తులు, పరిష్కారానికి మార్గాలు. ఇవే హదీస్‌లుగా పేరుగాంచినవి.

ఇస్లాం మతం స్త్రీకి అత్యంత గౌరవ మిచ్చింది. "తల్లి పాదాల వద్ద స్వర్గం వున్నది" ఇస్లాంలోని ఈ భావం భారతదేశంలో అనాదిగా వస్తున్న "మాతృదేవోభవ" అనే భావనతో సమానమైనది. సహధర్మచారిణిగా స్త్రీ ఇస్లాంలో గౌరవించబడింది. తన జీవిత భాగస్వామి అయిన హజరత్ ఖతీజాగారికి మహమ్మద్ ప్రవక్త అత్యంత గౌరవం ఇచ్చారు. Guide Friend and Philosoperగా ఆమెకు ఆనాటి చరిత్రలో ప్రాముఖ్యత వున్నది.

ఇంటి ఆడపడుచుగా మాత్రమే కాక ఇల్లాలుగా కూడా మహమ్మద్ ప్రవక్తగారి కుమార్తె హజరత్ ఫాతిమాకు ఇస్లాం చరిత్రలో ప్రత్యేక స్థానం వుంది. ఫాతిమాగారి నడత, సౌశీల్యం తన తండ్రిగారైన మహమ్మద్ ప్రవక్తగారి అత్యంత గౌరవ, ప్రేమాతిశయాలకూ, భర్తగారైన హజరత్ అలీగారి ప్రేమానురాగాలకు చరిత్రనే సృష్టించాయి. మహిళలకు గౌరవ స్థానాన్నిస్తూ ఇస్లామిక్ వాఙ్మయంలో కొన్ని ఘట్టాలు మనం పేర్కొనవచ్చును.

## సాంఘిక జీవనంలో ముస్లిం స్త్రీ పాత్రలేదు

కాని సాంఘిక జీవనంలో, ఇస్లామిక్ పురోగతిలోను స్త్రీకి పాత్ర చాలా తక్కువ. ఇస్లాం జన్మ తీసుకున్న "హెజాజ్" (అరేబియా దేశం)లో 1500 సంవత్సరాలకు పూర్వం స్త్రీకి గౌరవం లేదు. ఒక స్త్రీ కొరకు అనేకమంది పురుషులు కత్తులతో పోరాటాలు చేసుకునేవారు. స్త్రీ శిశువు పుట్టగానే భూస్థాపితం చేసేవారు. ప్రజలు కొన్ని తెగలుగా విడబడి జీవితాలు గడిపేవారు. తెగల మధ్య వైరుధ్యాలు కొట్లాటలు వుండేవి. ఈ యుద్ధాలలో ఓడిపోయిన తెగ సభ్యులు బానిసలయ్యేవారు. అందుకే తెగ నాయకులు ఓడిపోయిన తెగలోని స్త్రీలను భార్యలుగా స్వీకరించడం జరిగేది. బహుభార్యాత్వం సర్వసాధారణమైపోయింది.

అరేబియా దేశం చాలా బీద దేశం. ఎడారి, కొండలు, గుట్టలు, వర్షం వుండదు. నదులు లేవు. పంట చాలావరకు శూన్యం. ఒయాసిస్సుల వద్ద పంట అరుదాగావున్నా, పచ్చిక బీళ్ళలోని పశుపోషణ ప్రజల జీవనాధారం. అవకాశమున్న ఆ కొద్ది వ్యాపారం కూడా కారవాన్ల మీద ఆధారపడటం, ఈ కారవాన్ సముదాయాలు తరచు దొంగల దోపిడీలకు గురి కావలసి రావడం ఆనాటి పరిస్థితులలో ముఖ్యాంశాలు. ఈ పరిస్థితులు కారణంగా పురుషాధిక్య సాంఘిక వ్యవస్థ నిర్మింపబడింది. క్రీ.శ. 570లో మహమ్మద్ ప్రవక్తగారు జన్మించే నాటికి సాంఘిక వ్యవస్థ అది.

మహమ్మద్ ప్రవక్తగారు 63 సంవత్సరాలు జీవించారు. అష్టకష్టాలతో కూడివున్న ఆయనదొక విప్లవకర జీవితం. మున్నూట 65 రోజులు కాబాలో 365 విగ్రహాలను పూజించడం, తత్సంబంధమైన ఎడతెగని మత తగాదాల స్థానంలో ఏకేశ్వరోపాసన, ఆ ఇస్లాం వెనుక బలీయమైన సుసంఘటితమైన సంఘ నిర్మాణాన్ని ఆయన చేయగలిగారు. సంఘజీవనం స్త్రీ, పురుష సంబంధాలలో చైతన్యవంతమైన మార్పులు వచ్చినవి. మహమ్మద్ ప్రవక్తగారు తన భార్యలకు ఇచ్చిన గౌరవం కొనియాడదగినదిగా వున్నది. ఆయన తన అనుయాయులు నలుగురు భార్యలకంటే మించి చేసుకోకూడదని ఆంక్ష పెట్టినారు. ఒకరికి మించి చేసుకోవలసి వుంటే చూపెట్టవలసిన కారణాలు నిర్దేశింపబడినాయి. 1500 సంవత్సరాలకు పూర్వం ఈ మార్పులు సంఘంలో మహిళలకు చెప్పుకోదగిన గౌరవ స్థానాన్ని ప్రసాదించినవి. స్త్రీకి పునర్వివాహ హక్కు ఇవ్వబడింది.

## పితృస్వామి వ్యవస్థ : పురుషాధిక్యత

మహమ్మద్ ప్రవక్తగారి జీవితంలోనే రాజకీయ పాలన చేపట్టవలసి వచ్చింది. ఆ తర్వాత నలుగురు ఖలీఫాలు దాదాపు 50 సంవత్సరాలు పరిపాలించారు. ఇస్లాం వ్యాప్తిచెంది రాజకీయ పాలన కూడా చేపట్టాల్సి వచ్చింది. మతము, రాజకీయ ప్రాబల్యము ఈ రెండింటి రక్షణకై యుద్ధాలు కూడా చేపట్టాల్సి వచ్చింది. పురుషాధిక్యతతో నడుస్తున్న సంఘంలో ఆ ఆధిక్యత మరింత ఎక్కువైంది. పితృస్వామిక వ్యవస్థగా పరిణామం చెందింది.

ఇస్లాం పరిపాలన మదీనా నుంచి ధమస్కు నగరానికి, ఒక వంద సంవత్సరాల తరువాత బాగ్దాద్ నగరానికి తరలిపోవడం, ఇస్లామిక్ స్వర్ణయుగంగా పేర్కొనబడిన 500 సంవత్సరాలు బాగ్దాద్ పరిపాలన - ఇవన్నీ చారిత్రాత్మక ఘట్టాలు. ఇలా నడి

చిన దాదాపు 1000 సంవత్సరాల ముస్లింల చరిత్రలో స్త్రీలు ప్రముఖ స్థానాలు చేపట్టిన ఉపమానాలు ఏమీ కనిపించవు. భారతదేశంలో కూడా ముస్లిం పరిపాలకుల పరిపాలన చారిత్రాత్మకమైనదే. ఇక్కడ కూడా ఒకరిద్దరు స్త్రీలు మాత్రం పరిపాలకుల స్థాయికి ఎదగగలిగారు. కాబట్టి స్థూలంగా పరిశీలించినపుడు ముస్లిం సమాజంలో మగవాడిదే పెత్తనం. దాదాపుగా పురుషాధిక్య సమాజం.

స్వాతంత్ర్యేచ్ఛ, హక్కులు, సమానత- ఇవి ఆధునిక యుగ లక్షణాలు. కోరికలు, ఆశయాలు ఆయా దేశ కాల పరిస్థితులనుబట్టి ఆశయ సాధనకు పరిమితులు కనబడుతున్నవి.

గత చరిత్ర కొంత వరకు తడుముకున్నాం. దీనిమీదను సంబంధిత ఇతర కారణాల వలననూ ఈనాటి పరిస్థితులు మనం ఎదుర్కొంటున్నాం. భారతదేశంలో ఏఇతర స్త్రీలకు లేనట్టి సాంఘికకష్టాలు, అవరోధాలు ముస్లింస్త్రీలకు వున్నాయి. బహుభార్యాత్వం, విడాకులు, గోషా-పర్దాలు వగైరా వగైరా. ఆధునిక యుగంలో మహిళా లోకం వీటిని నిరశించడం సహజం.

బహుభార్యాత్వం 1500 సంవత్సరాలకు పూర్వం ఇస్లాం మత స్థాపన జరిగినపుడు ఆనాటి సాంఘిక పరిస్థితుల దృష్ట్యా, స్త్రీ పురుష సంబంధాలకు కట్టుబాట్లు ఏర్పాటు చేయబడ్డాయి. ఏ పురుషుడు కూడా నలుగురు భార్యలను మించి వివాహం చేసుకోరాదు. అవసరమైతేనే రెండో భార్య, మూడో భార్య, మరొక వివాహం చేసుకోవడానికి భార్యయొక్క అనుమతి వుండాలి. అనుమతి ఇవ్వడానికి తగిన కారణాలు కూడా వుండాలి.

ముఖ్యంగా మనదేశంలో ఈ సమస్యను పూర్తి రాజకీయం చేశాం. ఎక్కువ భార్యలు కలవాడు ఎక్కువ బిడ్డలుకంటాడు. అలా ఈ దేశంలో ముస్లింల జనాభా పెరిగిపోతుంది. ముస్లిం ప్రజల ప్రాబల్యం పెరిగిపోతుంది.ఇది అనుమానం, భయంతో కూడిన వాదం. "దేవుడు బిడ్డలను ఇస్తున్నాడు. తిరస్కరించడం పాపం." ఈ వాదన ముస్లింలలో వున్నది. ఈ సమస్యను, జనాభా పెరుగుదలను అరికట్టడం, ప్రజల జీవనస్థాయిని పెంచే ఆర్థిక వ్యవస్థ స్థాపనకు దేశ ప్రజలను సమాయత్తం చేయడమను జాతీయ పునర్నిర్మాణ ఉద్యమం పెడదారికి ఈడ్చబడింది. సమస్య పరిష్కారమూ కావాలి. స్త్రీ అభ్యుదయానికివిఘాతము కలుగకూడదు. ఇది ఈనాటి మన కర్తవ్యం.

## తలాఖ్-తెస్తున్నతంటా !

విడాకుల సమస్య మరీ హాస్యాస్పదంగా పరిణమించింది. నేటి యుగ ధర్మంగా స్త్రీ, పురుషులకు కావలసిన స్వేచ్ఛ, స్వాతంత్ర్యాలు దృష్ట్యా "తలాఖ్" సమస్యను లేవనెత్తగానే "Islam in Danger" అనే వివాదాల ద్వారా ముస్లిం పెద్దలు తమ వ్యతిరేకతను ప్రకటిస్తున్నారు. తలాఖ్ ద్వారా భార్యాభర్తలు విడిపోతారు. అవసరమైతే విడిపోవలసిందే. అబల అయిన స్త్రీకి అన్యాయం జరగకూడదు. బలవంతపు సంసారాలు సంఘాన్ని నిర్వీర్యం చేయగలవు. కాని భారతదేశంలో ముస్లిం స్త్రీలు నేడనుసరింపబడుతున్న 'తలాఖ్' పద్ధతి వలన ఇతర స్త్రీలకు లేని బాధలకు గురిఅవుతున్నారు. మార్పు రావాలి. ఎలా?

## ముస్లింస్త్రీల పురోగతికి ప్రతిబంధకాలు

పౌరసత్వ హక్కులు, సమాన హక్కులు, భారత రాజ్యాంగం స్త్రీ లందరికీ ప్రసాదించింది. కాని మితిమీరిన గోషా పద్ధతి, అవకతవకల 'తలాఖ్' ఆచరణ, నిరక్షరాస్యతలు ముస్లిం స్త్రీల పురోగమనానికి ప్రతిబంధకాలుగా వున్నవి. ఉద్యోగాలలో ముస్లిం స్త్రీలున్నారు. కాని నూటికి కోటికీ ఒకరు కనబడతారు. ఉమ్మడి మద్రాస్ రాష్ట్రంలో ఒక ముస్లిం స్త్రీ గొంతు శ్రావ్యంగా శాసనసభలో వినేవాళ్లం. అదెప్పుడో 30 సంవత్సరాలనాడు. దాదాపు 10 కోట్లుగా వున్న ముస్లిం స్త్రీల వాణి పంచాయతీలు మొదలు పార్లమెంటు దాకా ఎందుకు వినిపించకూడదు? విద్వద్గోష్టులకు ముస్లిం స్త్రీలు ఎందుకు దూరంగా వుండాలి? పరిపాలన, వ్యాపార రంగాలలో ముస్లిం స్త్రీలు సముచిత పాత్రను బాహాటంగా ఎందుకు నిర్వర్తించడంలేదు? మనదేశ పురోగమనానికి ముస్లిం మాతృమూర్తులు తమ బిడ్డలను తీర్చిదిద్దడంలో, దేశభక్తులుగా, భావిభారత పౌరులుగా రూపొందించటానికి ఎందుకు పూనుకోవడంలేదు? ఈ సమాజ రుగ్మతలు తొలగడానికి ముస్లిం సంఘంలో ఒక ఉద్యమ నిర్మాణం అవసరం. పురుషులలో దృక్పథ మార్పు తీసుకురావాలి. ముస్లిం స్త్రీలలో సమాజ చైతన్యం తీసుకురావాలి. ఇందుకు ముస్లిం యువకులు పూనుకోవాలి భారత స్రవంతిలో పురోగామి శక్తిగా ముస్లిం యువకులు ముందుకు రావాలి.

ముస్లిం సంఘ పురోభివృద్ధి శ్రేయస్సుతోపాటు, భారతదేశంలో జాతీయ ఐక్యతకు, మత సామరస్య భావన, సాధనకు ఈ జనజాగరణ కార్యక్రమం దేశ ప్రజలందరూ సమైక్యతతో చేపట్టవలసి వున్నది.

భగవద్భక్తి, విశ్వాసాలతోపాటు సాంఘిక న్యాయ సాధన కూడా ఇస్లాం మతం ముస్లింలకు ప్రాథమిక సూత్రాలలో నిర్దేశించినది. 1. దయ (కనికరం, ప్రేమ) 2. సహనం 3. స్త్రీలకు సమానత 4. ధనాన్ని (న్యాయంగా) సమానంగా పంచిపెట్టడం (చాలవరకు ఆర్థిక సమానత) 5. విద్య (విజ్ఞాన సముపార్జనకై గట్టి కృషి) ఈ ఆశయాలు సాధించడమే భారత ముస్లిం యువకుల ఈనాటి కర్తవ్యం.

# "మత ఛాందసత్వం – స్త్రీల హక్కులపై మత ప్రభావం

– డాక్టరు ఆచంట హేమలతాదేవి

మతం జీవన విధానాలకు ప్రతీక. వివిధ మతాల ద్వారా ప్రభోదించబడే ధర్మాచరణ, సమాజ శ్రేయస్సు దృష్ట్యా, నైతిక విలువల పరిరక్షణకు అనుసరించదగినదే అయినా, ఈ ధర్మ ప్రబోధం, మత ఛాందసుల చేతుల్లో పెడత్రోవలు పట్టింది. వీరు మతపరమైన ఆచారాలను, పురాతన సాంప్రదాయాలను వెలికితెచ్చి, మారుతున్న మారబోతున్న సమాజాన్ని క్రూరంగా అణచివేసి వెనుకకు నడిపిస్తారు. ప్రజల్ని తమ ఆకర్షణ శక్తిలో ప్రభావితం చేయగల మతపరమైన నాయకులు పురాణేతిహాసాలు ఆధారంగా మతాన్ని పునరుద్ధరించాలని ప్రయత్నం అహర్నిశలు జరుపుతునే ఉంటారు. వీరి సాంప్రదాయ పునరుద్ధరణలో క్రమంగా రాజకీయాలు చోటు చేసుకున్నప్పుడు అవి ఉత్పాతానికి దారి తీస్తున్నాయి. అన్ని రంగాలలో •మత ఛాందసుల ప్రభావాన్ని అర్థం చేసుకుని దానిని శాస్త్రపరంగా, శాసనపరంగా ఎదుర్కొని తగిన మార్పులు చేసినపుడే ప్రజా సంక్షేమానికి దారితీస్తుంది. మానవాళి లక్ష్యం మానవతా సమాజ నిర్మాణం. స్వామి వివేకానంద చెప్పినట్లు ఏ దేశమైనా మోక్షం పొందాలంటే ఆదేశపు స్త్రీలపై ఆధారపడి ఉంటుందన్న విషయం నిర్వివాదాంశం. స్త్రీలు సమాజంలో సగభాగమైనా, మతమౌఢ్యం ద్వారా, వారు అణగద్రొక్కబడ్డారు.

## భర్తకి పూజారిణి!

స్త్రీని ఒక దేవతగా వేదకాలం నుండీ గుర్తించడం ద్వారా ఆమె సమాజం మధ్యలోనే వేరు చేయబడింది. జ్ఞానమార్గం ద్వారా, భక్తి మార్గం ద్వారా ఆమె మోక్షం సంపాదించవచ్చునని అంగీకరిస్తూనే ఆమెను భర్తకి పూజారిణిగా మాత్రమే మార్చిందీ సంఘం. ఆమె తన హక్కులను కోరకుండా, అహర్నిశలు భర్తే దైవంగా కొలిచే పతివ్రతగా మిగిలిపోయింది. మన సంస్కృతిలో, భర్తకోసం, తన బిడ్డల కోసం, తన బంధువర్గం కోసం అనుక్షణం సేవలు చేసే యంత్రంగా మారింది. 'ఆదర్శ గృహిణి', 'సతీమ తిలకం', 'మహా పతివ్రత', 'త్యాగమూర్తి' వంటి పదజాలపు వలలో ఆమె చిక్కుకుని పోయింది. మన ధర్మ శాస్త్రాలు స్త్రీకి కర్మ సిద్ధాంతం బోధిస్తూ, ఆమెను, తనకు జరిగే అన్యాయాలకు, అక్రమాలకు స్పందించకుండా చేసిందీ సమాజం. మత బోధలవల్ల నేర్చుకున్న మూఢ నమ్మకాలకు లోనై, పూజలు, నోములు, వ్రతాలు అంటూ సాంప్రదాయాలకు దాసురాలైంది స్త్రీ. భర్త వ్యసనపరుడైనా, కుటుంబ బాధ్యతలు నిర్వహించినా, లేకపోయినా అతడే తనలోకమని, ఇల్లే ఇల్లాలికి స్వర్గమని, ఇంటి గుట్టు రట్టు కాకుండా, భర్త, అత్తవారు పెట్టే వేధింపులకు తలఒగ్గి అధఃపాతాళానికి అణచివేయబడింది ఆడది. వైవాహిక బంధం ద్వారా తన తనువు, మనస్సు కూడా అర్పణ చేసి, భర్త మరణిస్తే అతడితో పాటు తననిండు జీవితం బుగ్గిపాలు చేసుకోడానికి సిద్ధపడిందంటే, అందుకు దోహదం చేసిన మతఛాందసత్వమే కారణం. జీవన పోరాటంలో సమాన భాగస్వాములుగా ఉండవలసిన భార్యాభర్తలు, భార్యను తన ఆస్తిగా భావించడం, ఆమెకు ఆర్థిక స్వాతంత్ర్యం లేకుండా చేసి, బానిసత్వానికి గురిచేయడం మతమౌఢ్యానికి పరాకాష్ఠ. ఒకొక్క మతం ఒకొక్క రకంగా, స్త్రీని మానవులలో ద్వితీయ శ్రేణికి చెందేటట్లు చేసింది. ఆమె న్యాయపరమైన తన హక్కులను గుర్తించకుండా, తాను పురుషునితో సమానమన్న భావం జాగృతం కాకుండా చేసిందీ మత ఛాందసత్వం.

## స్త్రీల హక్కులపై ప్రభుత్వ పాత్ర

ప్రభుత్వం కూడా పురాతనమైన మతపరమైన ఆచారాలను, సాంప్రదాయాలను అమలు పరచడంలో కొంత వరకు దోహదం చేసింది. శాసనాలు రూపొందించడంలో ఎప్పటి నుండో ఉన్న ఆచారాలను యదావిధిగా అంగీకరించి అమలు పరుస్తోంది. ముఖ్యంగా వివాహచట్టం, హిందూ వారసత్వ చట్టం, ఆస్తి హక్కుల చట్టాలు, ముస్లిముల శాసనాలు మున్నగు వాటిలో మతపరమైన ఆచారాలు 'పర్సనల్ లా' రూపంలో అమలు చేయడుతున్నాయి. ఎన్నో మతాలు, వాటిలో వైవిధ్యాలున్న మనదేశంలో ఏకీకృతమైన సివిల్ కోడ్ అమలు పర్చకపోవడం, నాయకుల మతఛాందసత్వానికి, తిరోగమన ధోరణికి నిదర్శనం. రాజకీయాలలోకి చొప్పించుకు పోయిన మతం, దాని ప్రభావం రోజురోజుకి అభ్యుదయాన్ని కాలరాస్తోంది. మన రాజ్యాంగంలో 51A (E), 14, 15, ప్రకరణాలు, స్త్రీల గౌరవం భంగపరచే విధంగా ప్రవర్తించరాదని, చట్టం ముందు అందరూ సమానులే అని తెలియపరచినా, స్త్రీని అన్ని రంగాలలో ద్వితీయ శ్రేణికి అణగద్రొక్కాలనే ప్రయత్నం జరిగిందన్నది సుస్పష్టం. ఉదాహరణకు ముస్లిం వివాహ చట్టంలో బహుభార్యత్వం, తలాక్ మున్నగునవి శాసనపరంగా అంగీకరించబడి అమలు జరుగుతున్నాయి. హిందువుల,

క్రిస్టియన్‌ల చట్టాలలో కూడా స్త్రీల అసమానతలు తొలగించే ప్రయత్నం జరగలేదన్నది నిర్వివాదాంశం.

## బహుభార్యత్వ చట్టం

1949లో మదరాసు రాష్ట్రంలో, 1946లో బొంబాయి రాష్ట్రంలో హిందువులలో బహుభార్యత్వం నిషేధించబడినపుడు, భర్తలు తమ హక్కులు కోల్పోతున్నామంటూ కోర్టులకెళ్ళారు. 1955లో బహుభార్యత్వం హిందూవివాహ చట్టంద్వారా నిషేధింపబడినా, ఇప్పటికీ మన సమాజంలో పుత్రుడు పుట్టకపోతే భర్త పునర్వివాహానికి అంగీకరించే పతివ్రతలెందరో ఉన్నారు.1957లో ఉత్తరప్రదేశ్ ప్రభుత్వంలో పనిచేసిన ఒక ప్రభుత్వోద్యోగి తన భార్య ఒక ఆడపిల్లని ప్రసవించిన తర్వాత తిరిగి గర్భందాల్చడానికి అనర్హురాలైనపుడు, రెండవ వివాహం చేసుకుని పుత్రుని కనడానికి అనుమతించమని, సివిల్ సర్వీస్ రూల్సును ప్రశ్నిస్తూ కోర్టు కెళ్ళినప్పుడు, రాజ్యాంగంలో 25వ ప్రకరణం తనకు మతస్వాతంత్ర్యపు హక్కునిచ్చింది కనుక, హిందూ మతంలో పుత్రుడు పున్నామనరకం నుంచి రక్షిస్తాడని భావించగా, అలహాబాద్ హైకోర్టు అతడికి వ్యతిరేకంగా తీర్పు నిచ్చింది. (RamPrasad V State of U.P. 1959, Allhabad). 1949 కన్నా పూర్వం ముస్లిం 'పర్సనల్ లా' ప్రకారం ఏ ముస్లిం స్త్రీ అయినా తన భర్త నాలుగు వివాహాలు దాకా చేసుకున్నప్పుడు, తన సవతులతో కలసి జీవించవలసి వచ్చేది. ఆమె వేరుపడతానంటే ఆమెకి ఇచ్చే మనోవర్తి 'Dower' కోల్పోవలసి వచ్చేది. ఈ మధ్యనే ముస్లిం మతానికి చెందిన భార్యభర్తల మధ్య వైషమ్యాలు తలెత్తి, ఆ కోపంలో భర్త భార్యకు మూడుసార్లు 'తలాఖ్' అన్నాడు. నిజానికి వారిద్దరికీ విడాకులిచ్చుకునే ఆలోచనే లేకపోవడంతో 'షారియత్' చట్టం క్రింద ముగ్గురు ముస్లిం జమైత్ ముఫ్తీలు పవిత్ర ఖురాను గ్రంథం నుంచి ఉటంకిస్తూ, మూడుసార్లు ఒకేసారి తలాఖ్ అన్నపుడు అది 'తలాఖ్' కాదని తెలిపారు. ఒక్కొక్క 'తలాఖ్' పదం మధ్య నెలరోజులు గడువుండాలని, విడాకులు ఇద్దరు సాక్షుల ముందర ఇవ్వాలని నిర్ణయించడం స్త్రీకి జరుగుతున్న అన్యాయానికి కొంచెం గుర్తింపు ఇచ్చినట్లయిఇంది. 'ఫత్వా ఇచ్చిన నిర్ణయాన్ని మా 'Personal Law Board' మద్దతు ఇస్తే, మూడు 'తలాఖ్' మాటలతో నష్టపోయిన వందలాది కుటుంబాలు మౌల్వీలను చెప్పులతో కొడతారు. పద్నాలుగు వందల సంవత్సరాల పురాతన పద్ధతిని అంత తేలిగ్గా మార్చగలమా?' అని అబ్దుస్ సత్తార్ యూసఫ్ షేక్ - ఆ బోర్డు కార్యదర్శి పలకడం మతఛాందసత్వం ఎంత వేళ్ళూనికి పోయిందో అర్థమవుతుంది. ఈ చిన్న 'తలాఖ్' పదం ముస్లిం స్త్రీల జీవితాన్ని నరకంగా మార్చింది. వైవాహిక చట్టాలలో ఉన్న లోపాలవలననే ఏ స్త్రీ అయినా తనపరిస్థితిని మెరుగుపరచు కోలేకపోతోందన్నది నగ్నసత్యం. మత ఛాందస భావాలని తొలగించడానికి జాతీయ భావాన్ని పెంపొందించాలి. విద్యా వంతులు, మేధావులు అందుకు కృషి చేయాలి. అందుకు స్త్రీలకు విద్య, ఆర్థిక స్వాతంత్ర్యం సమాన ఆస్తి హక్కు ఇవ్వడం అవసరం. చట్టాలు మతమౌఢ్యాన్ని నిషేధించకపోగా, వాటిని శాసనపరంగా గుర్తించడంద్వారా మూఢాచారాలు వర్ధిల్లేటట్లు చేశాయి. ఈ శాసనాలలోని తిరోగమన ధోరణి సమాజంలో సంస్కరణకు అడ్డుగోడలయ్యాయి. స్త్రీని ఆస్తిగా అనుభవించా లని, నా భార్యను నా యిష్టమొచ్చినట్లు చేసుకుంటాను నీవెవరు? అడగడానికి? అనే పురుషాహంకారం ఇంకా కొనసాగు తున్న దృష్టాంతాలు అక్కడక్కడ కనపడుతూనే ఉంటాయి. స్త్రీని ఒక వ్యక్తిగా గుర్తించక ఆమె హక్కులను కాలరాచాయి మతపరమైన ఆచారాలు. రేప్ కేసులలో కనీసం 7 సంవత్సరాల దాకా శిక్షించడానికి వీలుండగా ఈ మధ్యనే సుప్రీంకోర్టు ఒక కేసులో యువకుడైన నిందితుడు అనుభవించిన వేదనకు జాలిపడుతూ శిక్షాకాలాన్ని తగ్గించడం చూస్తే న్యాయస్థానాలు కూడా తిరోగమన ధోరణిలో ఉన్నాయనిపిస్తోంది.

## మనోవర్తి చట్టాలు

హిందూ వివాహ చట్టంలో సెక్షను 25 వలన భార్యభర్తలకు విడాకులు జారీ చేయకుండా, మనోవర్తి ఇవ్వడానికి అధికారం లేదన్నది మన సుప్రీంకోర్టు చట్టాలు స్పష్టంగా లేకపోవడంతో ఈ విషయంపై హైకోర్టులలో తర్జనభర్జనలు జరిగాయి. ఆంధ్రప్రదేశ్, బొంబాయి, పంజాబు, హర్యానా హైకోర్టులు - విడాకులు మంజూరు చేయకపోయినా కనీసం మనోవర్తి ఇవ్వవచ్చునన్నాయి. ఇంతకుముందు ఇప్పుడు చాంద్ ధావన్ కేసులో 11-6-1993న సుప్రీంకోర్టు మనోవర్తి కూడా ఇవ్వరాదని తీర్పు చెప్పి అభాగ్య స్త్రీలకు అన్యాయం చేసింది. అత్యున్నత న్యాయస్థానాలవల్ల అవమానం, అన్యాయం జరిగితే ఈ సమాజంలో స్త్రీకి ఎవరు దిక్కు? సెక్షను 25 హిందూ వివాహ చట్టం సవరించాలి. కోర్టు విడాకులు మంజూరు చేసినా చేయపోయినా, భార్యను భర్త వదలి వేసినందుకు, లేక భార్య వేరే ఉండవలసి వచ్చినది కనుక ఆమెకు కోర్టు తప్పక మనోవర్తి ఇవ్వాలని సవరణ తీసుకురావడం ప్రభుత్వ తక్షణ కర్తవ్యం. మనోవర్తి సొమ్ము 500 రు॥ల పరిమితిని కూడా తొలగించాలి. భర్త ఆదాయాన్నిబట్టి నిర్ణయించాలి. అలాగే క్రిస్టియన్ వివాహ చట్టం 1872, విడాకుల చట్టం 1869లలో మార్పులు తీసుకురావాలని ప్రయత్నాలు జరిగినపుడు వారి మతంలోని ఒక వర్గంవారు అందుకు అంగీకరించలేదు.

ఇక ముస్లిముల ప్రసక్తి వస్తే షాబానో కేసులో ఆమె 72వ యేట భర్త విడాకులిచ్చినపుడు, కోర్టు నెలకి 180 రూపాయల మనోవర్తి ఇవ్వాలని తీర్పు చెప్పినపుడు, మతఛాందసులు అందుకు హాహాకారాలు చేయడం, ప్రభుత్వం లొంగిపోయి చట్టాన్ని మార్చడం అందరికీ తెలిసిన విషయమే. స్త్రీ పురుషుల కందరకు సమాన హక్కులంటూ రాజ్యాంగం తెలియజెప్పినా, అన్ని మతాలవారికి ఒకేరకమైన చట్టాలు లేకపోవడం దేశప్రజ లలో విభజనలకు వేర్పాటు ధోరణికి దారితీసింది

## స్త్రీల ఆస్తి హక్కు

అదే విధంగా ఆస్తి హక్కు పురుషుడికి పుట్టుకతోనే రాగా,

ఆడపిల్లలకు మాత్రం చాలా కాలం ఆస్తిపై ఎటువంటి అధికారాలు లేవు. పేరులోనే ఉంది 'ఆడ - పిల్ల' అని. సమిష్టి వారసత్వపు హక్కు పుట్టుకతోనే పురుషుడికి రాగా, స్త్రీలకు మొదటిసారి 1937 ఏప్రిల్ 14వ తేదీ నుండి వచ్చింది. ఈ చట్టం ప్రకారం భర్త చనిపోతే భార్యకు, అంతకు ముందే వితంతువు అయిన కోడలుకు లేక మనుమని భార్యకు పూర్వీకుల ఆస్తిలో కొన్ని షరతులపై, మగవారితో సమానంగా వాటాలు వేయవచ్చునన్నారు. వారు కేవలం ఆస్తిని అనుభవించడానికే గాని, విక్రయించడానికి, యితరత్రా ఖర్చు పెట్టడానికి అధికారం లేకుండా తిరిగి మగవారికే సంక్రమించేటట్లు తీరని అన్యాయం జరిగింది స్త్రీలకు. 17-6-1956 హిందూ వారసత్వ చట్టం ద్వారా స్త్రీలకు 14వ సెక్షను ప్రకారం సంపూర్ణమైన ఆస్తి హక్కు వచ్చినా, వీలునామా వలన గాని, బహుమతి రూపంలో గాని, కోర్టు తీర్పువలనగాని లభించిన పరిస్థితులలో సంపూర్ణమైన హక్కులు లేకుండా చేయబడింది. ఆ పరిమితులు లేని సందర్భంలో ఆమె ఆస్తిని తనకిష్టమైన రీతిలో వినియోగించవచ్చునని 1974లో సుప్రీంకోర్టు శ్రీమతి ధన్‌కౌర్ కేసులో తీర్పు చెప్పింది. మన ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలో 1988-13వ చట్టం ప్రకారం హిందూ వారసత్వ చట్టం సవరణ చేయడం ద్వారా అవిభక్త హిందూ కుటుంబంలోని ఆస్తిపై 5-9-1985 నాటికి పెండ్లికాని కుమార్తెలకు, మగపిల్లలవలె పుట్టుకతోనే ఉండే హక్కులన్నీ సంక్రమించడం నిజంగా ఒక సంచలనాత్మక మార్పు.

ఇంక క్రిస్టియన్‌ల మాటకి వస్తే తిరువాన్కూరు క్రిస్టియన్ వారసత్వ చట్టం కుమార్తెకు, కుమారుడికిచ్చిన వాటాలో నాల్గవ భాగం లేక 5000/- రూపాయిలు మించకుండా ఆస్తి హక్కు ఉండేది. 1951 నుంచి ఆ చట్టాలు నిషేధింపబడినాయి. 1986లో సుప్రీంకోర్టు ఇచ్చిన రూలింగ్ ప్రకారం 1956 హిందూ వారసత్వ చట్టం వారికి కూడా వర్తిస్తుందని తెలియపరిచింది. ముస్లిం స్త్రీల ఆస్తి హక్కు వారి 'పర్సనల్ లా' ప్రకారం భర్త ఆస్తిలో 1/8 వంతు, పిల్లలు లేనట్లయితే 1/4వ వంతు మాత్రం వస్తుంది. అన్నదమ్ములుంటే వారు పొందే వాటాలో సగం భాగం, కుమారుడి ఆస్తిలో 1/3 వంతు, అతడికి పిల్లలుంటే 1/6వ వంతు, అమ్మమ్మకు కూడా 1/6వ వంతు ఇవ్వాలి. ఈ విధంగా స్త్రీలకు ఆస్తి హక్కులలో సమానవాటా ఇవ్వకపోవడం, ఇచ్చిన సందర్భాలలో కూడా వారికి అన్యాయం చేయడం మామూలైపోయింది మన దేశంలో.

"ఆర్థిక స్వాతంత్ర్యం లేకపోవడం స్త్రీ కన్నీటికి గాధలకు హేతువు" అని శ్రీ గురజాడ ఏనాడో అన్నారు మానవతా దృక్పథంతో రాజ్యాంగ కర్తలు ఎన్నో లిఖితపూర్వకమైన అంశాలు పొందుపరచినా, మహిళపై వివక్షత, అసమానత నానాటికి పెరుగుతున్నాయేగాని తరగటం లేదు. జస్టిస్ వి.ఆర్. కృష్ణయ్యర్ మాటల్లో చెప్పాలంటే 'మనదేశంలో స్త్రీల వికాసం కోసం తగినన్ని చట్టాలున్నాయనుకోడం పొరపాటు. మనకు తగినన్ని చట్టాలు లేవు. వాటిని గట్టిగా అమలుపరిచే చిత్తశుద్ధి లేదు. ఉన్న చట్టాలన్నీ లొసుగులమయం. వాటిని స్త్రీలకనుగుణంగా వర్తింపజేయాలంటే తలప్రాణం తోకకి వస్తుంది".

ముస్లిం పర్సనల్ లా బోర్డు అధికారి ఉద్దేశంలో "మా స్త్రీలు మా మత విధానంతో చాలా సంతోషంగా ఉన్నారు. ఇస్లాము ఇచ్చిన హక్కులు ఏ మతము ఇవ్వనంది. విడాకులు పొందిన ముస్లిము స్త్రీ భర్తని మనోవర్తి కూడా అడగనక్కరలేదు. ఆమెకు కుటుంబ ఆస్తి వారసత్వంగా వస్తుంది. మా వక్ఫ్ బోర్డులు ధనంతో నిండివున్నాయి. కాని ఏ విడాకులు పొందిన స్త్రీ కూడా మనోవర్తి ఇవ్వమని కోరలేదు". ఏ మతంలో స్త్రీ అయినా తన హక్కులను గుర్తించి, సాధించాలనుకుంటే తప్ప బానిసత్వము నుండి విముక్తి పొందదు అన్నది ఋజువైంది. ఆమె వ్యక్తిగా గుర్తింపబడాలి గాని ప్రత్యేక జాతిగా కాదు.

## గర్భస్థ ఆడ శిశుహత్యలు

కొంతమంది హిందూస్త్రీలకు ఉన్న 'పరదా' లేక మేలి ముసుగు, ముస్లిం స్త్రీలలో 'బురఖా' పద్ధతులు ఇంకా కొనసాగుతూనే ఉన్నాయి. రాజకీయాలలో అడుగిడిన మతమౌఢ్యం. ఈ మధ్యనే బానిస శృంఖలాలనుండి బయటపడుతున్న స్త్రీజాతిని తిరిగి ఇంట్లోని నాలుగు గోడలమధ్య బంధించాలని చూస్తోంది. కుటుంబసంబంధమైన నేరాలు జరగడానికి స్త్రీలేకారణమని, అత్తవారింట్లో వారు పూర్వీకులవలె సర్దుకుపోలేక పోవడమే అందుకు కారణమని ఒక మతతత్త్వపార్టీ మహిళా సభ్యులు అనడం చూస్తే మనం తిరోగమిస్తున్నామేమోననిపిస్తోంది శ్రీమతి రూప్ కన్వర్ సతీసహగమనం బలవంతంగా చేయబడడమే కాకుండా, ఆ ప్రదేశంలో అందమైన మందిరం కట్టించాలనడం మత మౌఢ్యానికి నిదర్శనం పుత్రుడు పుడితేనే పున్నామనరకం నుంచి ఉద్ధరిస్తాడని భావించే మతతత్త్వవాదులు, అల్ట్రా సౌండ్ ద్వారా ఆడపిల్ల పుట్టబోతోందని తెలుసుకున్నపుడు 'Medical Termination of Pregnancy' (M.T.P) చట్టం అడ్డంగా పెట్టుకుని, గర్భవిచ్ఛేదం చేయించుకుంటున్న తల్లుల వెనుక మూఢాచారాల ప్రభావం కనిపిస్తూనే ఉంది. వరకట్నం అనేది మతపరమైన అంశం. అటువంటిది అది తన విశ్వరూపంతో ఎంతో మంది స్త్రీల వినాశనానికి హేతువవుతోంది. వరకట్న నిషేధచట్టం అమలులోకి వచ్చినా, సమాజం మొత్తం మారితేనేగాని సంస్కరణరాదు. తల్లి ఒడిలో నుండే కుమార్తెను, కుమారుడిని పెంచడంలో బేధభావం చూపిస్తారు తల్లితండ్రులు. ఇంటి పనులు చేయడంలో, భోజనం విషయంలో, విద్యాబుద్ధులు చెప్పించడంలో, ఆఖరికి చికిత్సలు చేయించడంలో కూడా వివక్షకు గురిఅవుతోంది స్త్రీ.

## సంస్కరణకు సూచనలు :

*1. జనాభాలో సగం భాగంవున్న స్త్రీల సమగ్ర వికాసానికి అందరి కృషి అవసరం. మహిళల హక్కులు కూడా మానవ*

**(మిగతా 77వ పేజీలో)**

# హిందూమతం – దళితులు

–శ్రీ బొజ్జాతారకం

హిందూమతం, దళితులు అనేవి రెండూ పరస్పర విరుద్ధమైన శబ్దాలు. హిందూమతం దళితులదికాదు. దళితులు హిందూమతంలో లేరు. తనవారుకాని దళితులను, హిందూ మతం కొన్ని ప్రయోజనాలకోసం స్వంతం చేసుకోవటానికి ప్రయత్నిస్తున్నది. అదేవిధంగా తనదికాని మతాధిక్యతపై దళితులు పోరాటం చేస్తున్నారు.

హిందూమతం, దళితులు అనేవి రెండూ విరుద్ధమైన అర్థాలు అని ఎందుకు అన్నానంటే హిందూమతం ఆవిర్భవించిన నాటినుంచి అవి దళితులకు దూరంగా పెట్టింది. దళితులకు హిందూమతంలో ఎప్పుడూ ఆదరణ లేదు. ఈ రెండింటి వైరుధ్యాన్ని చర్చించుకొనేముందు అసలు 'హిందూ మతం" అంటే ఏమిటి? "దళితులు" అంటే ఎవరో తెలుసుకోవలసి ఉంటుంది.

## హిందూమతం అంటే ఏమిటి?

అసలు "మతం" అంటే ఏమిటి. సాధారణంగా మతానికి చెప్పుకొనే అర్థంలో 'హిందూమతం" అంటే ఏమిటి అని ప్రశ్న వేసుకుంటే "హిందూ మతానికి సరైన అర్థం కాని నిర్వచనం కాని దొరకదు. అదేవిధంగా "హిందువులు" అంటే ఎవరోకూడా సరైన నిర్వచనం దొరకదు. క్రైస్తవులను "మీరు క్రైస్తవులు ఎలా అయ్యారు అని అడిగితే వారు చాలా సులువుగా సమాధానం చెబుతారని, ముస్లిములను మీరు ముస్లిములు ఎలా అయ్యారని అడిగితే వారు కూడా చాల సులువుగా సమాధానం చెబుతారని అదేవిధంగా బౌద్ధులు , జైనులు, సిక్కులు , పార్శీలు చాల సులువుగా సమాధానం చెబుతారని, హిందువులను అదేప్రశ్న అడిగితే వారు సమాధానం చెప్పలేరని డాక్టర్ అంబేద్కర్ ఒక చోట అన్నారు. అది నిజమే. చట్టపరంగా నిర్వచించవలసిన సమయంలో కూడా "హిందువు"కు సరైన నిర్వచనం లేదు. "హిందువు" అంటే క్రైస్తవుడు కానివాడు, ముస్లిమ్ కానివాడు..." అనే నిర్వచనం దొరుకుతుంది. అంటే అదికాని వాడు ఇది కానివాడు హిందువుడు అని నిర్వచనం. హిందువులం అని చెప్పుకొనే వాళ్ళు భగవంతునికి కూడా ఇదే నిర్వచనం ఇస్తారు, "నేతి, నేతి" అంటూ . అంటే అదికానిది ఇదికానిది. ఏది చెప్పినా అదికాదు అని అంటారు. "హిందువు" కూడా అదే నిర్వచనం చెప్పుకున్నారు.

## హిందువుల దేవుడు ఎవరు? .

ఫలానా దేవుణ్ణి పూజించేవారు హిందువులా అంటే అదీకాదు, అన్నిదేవతల్నీ పూజించేవారు హిందువులా అంటే అదీకాదు, ఎందుకంటే అసలు ఏ దేవతనీ పూజించని వారు కూడా హిందువుల లెక్కలోనికే వస్తారు. పోనీ, ఫలానా గ్రంథాన్ని అనుసరించే వాళ్ళు హిందువులని చెప్పుకుందామంటే ఏ ఒక్క గ్రంథమూ హిందువు అని చెప్పుకొనే వాళ్ళకు ఆరాధ్యమూ అనుసరణీయంగా లేదు. పోనీ, ఏదో ఒక దేవతని పూజించే వాళ్లని హిందువులని పిలుద్దామంటే వారిలో రాయినీ రప్పనీ ఆఖరికి పామునీ, పక్షినీ, జంతువుల్ని కూడా పూజించే వాళ్ళున్నారు. ఆఖరికి ఏ అర్థానికీ అందకుండా, ఏ నిర్వచనానికీ లొంగకుండా ఉండేవారిని "హిందువులు" అని పిలవాల్సి వస్తుంది.

## భారతదేశంలోని వారందరూ హిందువులా?

భారతదేశంలో ఉన్నవారినందరిని హిందువులు అని అనలేము. ఎందుకంటే ఇతర మతస్థులు చాలమంది ఉన్నారు. అసలు "హిందూ" అనేపదం హిందువులు అనుకుంటున్న వారు పవిత్రంగా భావించే ఏ గ్రంథంలోనూ లేదు. వారు ఆరాధ్యంగా బావించే ఏ మతగురువూ ఆ నామకరణ వారికి చెయ్యలేదు. ఎవరిపేరును అనుసరించికూడా ఇది రాలేదు. సింధునదిప్రవహించే ప్రాంతంలో నివసించేవారిని "సింధువులు" అనేవారని, "సింధూ" పదాన్ని పలకలేని విదేశీయులు దానినే "హిందూ" అని వ్యవహరించేవారని, ఆవిధంగా "హిందూ" అనేపదం వాడుకలోకి వచ్చిందన్న సంగతి అందరికీ తెలిసిందే. అప్పుడు హిందువులు అనుకున్నవారు సింధునదేకాదు, గంగకు అవతల, ఇవతల, ఇంకా క్రిందికి గోదావరి, కావేరిక్రింద ఉన్న ప్రాంతంలోనూ ఉన్నారు. అసలు సింధునది ఇపుడు భారతదేశంలో లేనేలేదు. వాటిని పక్కకు పెట్టి వాడుకలో ఉన్న అర్థంలో ఇపుడు హిందువులు అనుకుంటున్న వారినే హిందువులుగా ఈ వ్యాసం కోసం వ్యవహరిస్తాను.

## దళితులంటే ఎవరు?

"దళితులు" అంటే ఎవరో కూడా నిర్వచించుకోవాలి . సాధారణంగా దళితులు అనేమాట షెడ్యూల్డు కులాలుగా వ్యవహారంలో ఉన్నవారని అనుకుంటారు. ఆ ప్రజలకు రకరకాలపేర్లు వస్తూఉన్నాయి. మొదట "అంతే వాసులుగా"ను తర్వాత చండాలురుగా ఆ తర్వాత పంచములుగా నిమ్నజాతులుగా, ప్రస్తుతం వారి జనులుగా షెడ్యూల్డు కులాలుగా వీరిని పిలుస్తున్నారు. ఇప్పుడు వారినే దళితులుఅని అంటున్నారు. అన్నిదశలలోనూ వీరు అంటరాని వారుగానే ఉండిపోయారు. ఈ వ్యాసం కోసం ఈ అర్థాన్నే పరిమితం చేస్తాను. ఎందుకంటే 'దళితులు' అనేపదానికి నాతోసహా వేరే అర్థాన్నిచ్చేవారు చాలమంది ఉన్నారు. 'సామాజికంగా, ఆర్థికంగా, రాజకీయంగా అణచివేతకు గురవుతున్నవారు 'దళితు

లని' మేం చెప్పుకొనే అర్థం . దీనిక్రింద ప్రస్తుతం ఎస్.సి. ఎస్.టి., బి.సి.లు చాలవరకూ వస్తారు.

## ఈ సమాజాన్ని నిర్దేశించుతున్నది– కులవ్యవస్థ

భారత దేశంలోని ప్రజలను మతపరంగా గుర్తించటం కంటే కులపరంగా గురించటం చాలతేలిక, స్పష్టంగా కూడా దొరుకుతుంది. ఎందుకంటే ఈ సమాజాన్ని కులవ్యవస్థ నిర్దేశిస్తున్నది. ఈ కులవ్యవస్థ మొదట్లో వర్ణవ్యవస్థగా ఏర్పడి స్థిరపడినపుడు ప్రధానంగా ప్రజలను నాలుగుభాగాలుచేశారు - "బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్ర" అని . ఈ నాలుగుభాగాల లోనూ దళితులు లేరు. వారు వర్ణబాహ్యులు. వర్ణవ్యవస్థకు వెలుపల ఉంచారు వీరిని. అంటే హిందువులలో వీరు లేనట్టే కదా! నాలుగు భాగాలలోనూ వీరిని చేర్చుకోలేదు, ఉంచుకోలేదుకాబట్టే వీరిని అయిదోవారిగా పంచములుగా పిలిచారు. అంటే వారి వ్యవస్థలో వారి సముదాయంలో లేనట్టే కదా! వర్ణవ్యవస్థ ప్రాతిపదికగా పరిగణించినపుడు దళితులు, హిందువులు కారని తెలుతుంది. వ్యవస్థ ఏర్పాటు లోనుంచి వెలుపల ఉంచటమేకాకుండా వాస్తవంగానూ వెలుపలే ఉంచారు. వీరి నివాసం కూడా ఊరికి అవతలనే పెట్టారు. వీరితో వ్యవహరించే తీరులో కూడా స్పష్టమైన తేడా పెట్టారు. హిందువులు దళితులను మొదట్లో అయితే చూడకూడదు ఆ తర్వాత తర్వాత ముట్టకోకూడదు ని ఆంక్షలు పెట్టారు. ఈ నిషేధాలను అతిక్రమించిన వారికి కఠిన మైన శిక్షలు విధించారు. దళితులు చదువుకోకూడదు. ఆస్తి సంపాదించకూడదు, శుభ్రమైన తిండి తినకూడదు. శుభ్రమైన బట్టకట్టుకోకూడదు. శుభ్రమైన ప్రదేశంలో నివసించకూడదు. అనే నిషేధాలు కూడా జారీ చేశారు. ఆహార విహారాలలో ప్రధానమైన తేడా చూపారు. దీనినిబట్టి వీరిద్దరూ వేరువేరని స్పష్టమవుతున్నది. హిందువులు-దళితులు ప్రధానంగా కలిసి జీవించటానికి వీలులేనపుడు, కలిసి ప్రయాణం చేయటానికి వీలులేనపుడు, కలిసి భోజనం చేయటానికి వీలులేనపుడు ఆఖరికి కలిసి మంచినీళ్ళు తాగటానికి కూడా వీలులేనపుడు వారిద్దరూ ఒకరు కాదని, వేరు వేరని చెప్పటానికి వేరే నిదర్శనం అవసరం లేదు.

## ఏ యితర మతాలలోను లేని ఘోరస్థితి

ఏ మతంలో కూడా ఆ మతస్థులలో కొంతమందిని చూడకూడదు, ముట్టుకోకూడదు, వారిని తమ దేవుని దగ్గరకు రానీయకూడదనే ఆంక్షలు ఉండవు. ఎవరిపైన అయినా అటువంటి ఆంక్షలు పెడితే వారు అదేమతానికి చెందిన వారు కాక పోవటమే అవుతుంది. మతం పేరుమీద దాడులు జరుగుతుంటాయి. కాని ఒకే మతంలో ఉన్నవారిపై మతం పేర దాడులు జరగవు. వ్యత్యాసాలు అన్ని చోట్లా వుంటాయి. కాని మతం వచ్చే సరికి దేవుడు వచ్చేసరికి ఒకే మతం వారి మధ్య వ్యత్యాసాలు ఉండవు. కాని హిందువులు, దళితులమధ్య మతం పేరుమీద, దేవుని పేరుమీద వ్యత్యాసం చూపటం జరుగుతున్నది. కాబట్టి హిందువులు -దళితులు ఒకటి కాదని తేలుతున్నది. ఒక మతస్థునికి ఒక దేవాలయం ఉంటే, ఆ మతస్థులందరికీ ఆ దేవాలయంలో ప్రవేశం ఉంటుంది. వేరే మతస్థులకు ప్రవేశార్హత లేకపోవచ్చుకాని ఒకే మతస్థులకు ప్రవేశాన్ని నిరాకరించటం జరగదు. అదేవిధంగా ఒకే మతస్థులకు పూజ చేసే హక్కును లేకుండా చేయటం జరుగదు. పూజారి ఒకే మతంలోని వ్యక్తికి "ఆరాధన చేయిస్తాను, మరొక వ్యక్తికి చేయించను" అని అనటానికి వీలులేదు. అంతే కాకుండా 'మోక్షం' అనేదానిని విశ్వసించే మతస్థులలో మోక్షానికి ఒకేమతంలో ఉన్నవారు కొందరు మాత్రమే అర్హులు, మిగిలిన వారికి మోక్షార్హత లేదు. అని చెప్పటానికి వీల్లేదు.

## వేరు వేరు దేవుళ్ళు!

ఒకమతంలోని అందరికీ మోక్షార్హత ఉంటుంది. దళితులకు మోక్షార్హత లేదు, వారు దైవసాన్నిధ్యం కూడా చేరలేదు. ఎవరో ఎక్కడో ఒకటి, అరా ఉదాహరణకోసం, భక్తివైశిష్ట్యాన్నిక స్థాపించటం కోసం దళితునికి కూడా దైవ సాన్నిధ్యం దొరుకుతుందని ఎవరైనా చెప్పచ్చు . అది ఆ మత ప్రాశస్త్యాన్ని చెప్పుకోవటానికే తప్ప ప్రధాన భాగమైన జనానికి మాత్రం మోక్షార్హత లేకుండా చేశారు. ఇదికూడా హిందూ మతంలో నుంచి దళితులు భిన్నమైన వారని చెప్పటానికి మరో నిదర్శనం. మోక్షార్హత , భగవత్సాన్నిధ్యం అనేవి ఒకవేళ ఉంటే, అవి వ్యక్తిఅర్హతను బట్టి ఉంటాయికాని, ఒక ప్రజాసముదాయం సముదాయమేవాటికి అనర్హంఅవదు. మతం, దేవుడు, పూజా విధానం, మోక్షం, దైవసాన్నిధ్యం ప్రాతిపదికగా తీసుకుంటే హిందువులకు - దళితులకు చాలా ప్రధానమైన తేడా కనిపిస్తుంది. హిందువుల దేవుళ్ళు వేరు.దళితుల దేవుళ్ళు వేరు.

వీరి మధ్య మరో ముఖ్యమైనతేడా కనిపిస్తుంది. మతం అంటే సాధారణ అర్థంలో ఒక దేవుడు, ఆయన చెప్పిన విధానంగా నడుచుకోవటం, ఆయన పట్ల విశ్వాసం ఉంచుకోవటం గా కనిపిస్తుంది. వీటి దృష్టితో చూస్తే దళితులకు అసలు "దేవుడు" అనే భావమేలేదు! మరోవిధంగా చెప్పాలంటే దళితులకు అసలు దేవుడేలేడు. దేవుడంటేనే వారికి తెలియదు. ఇప్పుడు ఎవరైనా దళితులు ఏ దేవుణ్ణయినా పూజిస్తున్నారంటే అది బ్రాహ్మణీకరణ, బ్రాహ్మణ అనుకరణ తప్ప మరొకటి కాదు. "సంస్కృతీకరణ"ప్రభావం తప్ప మరొకటి కాదు. దళితులు కూడా వెంకటేశ్వరుని మొక్కు కోవటం, సత్యన్నారాయణ వ్రతాలు చేయించటం లాంటివి ఆ సంస్కృతీ కరణ ప్రభావాలే.

## దళితులకు దేవుళ్ళులేరు–దేవతలే!

దళితులు దేవుణ్ణి ఎరుగరు. అని ఎందుకు అన్నానంటే వారు ఎప్పుడైనా ఎవరినైనా మొక్కుకున్నారంటే అవి దేవతలనే కాని దేవుళ్లనుకాదు. ఎవరిని మొక్కుకున్నా ఒక "అమ్మ" గా మొక్కుకుని దణ్ణం పెట్టుకున్నారు తప్ప మరొకటి కాదు. తమకు అందని శక్తి ఏదో ఉందని నమ్మి అది తమ

అమ్మకంటే గొప్పది. అని అనుకొని "పెద్దమ్మ"గా దణ్ణం పెట్టుకున్నారు తప్ప సాధారణ అర్థంలో దేవుడు, దైవం అని మాత్రంకాదు. మరొక దృష్టిలో కూడా వారు "అమ్మను" మొక్కు కున్నారు. అదేమంటే ఒకరకమైన భయంతో, తమకు అర్థంకానిది, తమకు అందనిది, తమకు చేతకాని రోగం ఏదయినా వారికి తగిలినపుడు దానిని ఏదోశక్తిగా భావించి "అమ్మా! మమ్మల్ని విడిచివెళ్ళిపో! నీకు కోడినో, గొర్రెనో కోసి అన్నం పెడతాను" అని వేడుకొనేవారు. మశూచికం, కలరా, ప్లేగు, పొంగు లాంటి అంటువ్యాధులు ఆకస్మాత్తుగా వ్యాపించినపుడు దానికి మైసమ్మఅనో, పోచమ్మఅనో, మొక్కుకున్నారు. ఆ కలరాగాని, మశూచికంగాని, పొంగుగాని తగ్గిపోయిందంటే మళ్ళీ ఆమైసమ్మ పోచమ్మ, ఎల్లమ్మ, మల్లమ్మల జోలికిపోయేవారు కాదు. ఆ ఊసేవారికి ఉండేది కాదు. మొకుకొనే విధానం కూడా వేరుగా ఉండేది. వేపాకుతో కొట్టుకుంటూ 'పోతావాలేదా!' అని తరిమి తరిమి కొట్టిన విధానం కూడా ఉండేది. ఏడాదికోసారి, గుర్తువచ్చి నపుడు, పంటలు పండినపుడు ఆ ఊరి పొలిమేర ఉన్న ఒకరాయిని ఎంచుకొని దానికి పూజ చేసేవారు. అక్కడ ఒక కోడిని కోసి, గొర్రెను కోసి ఆ మాంసం వండుకుని అందరూ పంచుకు తినేవారు. మళ్ళీ ఏడాది తిరిగి వచ్చేవరకూ ఆ మైసమ్మ , పోచమ్మ గుర్తు ఉండేది కాదు ఎవరికీ.

అదేవిధంగా వర్షం వచ్చినా, వరద వచ్చినా దానికో పేరుపెట్టి దణ్ణంపెట్టుకొనేవారు. అది తగ్గిపోగానే మళ్లీదాని మాటే తీసేవారు కాదు తమకు లొంగని దాని నేదో ఒక శక్తిగా భావించేవారు అంతే. అదికూడా 'అమ్మ" భావన తోనే. దళితులు ఎప్పుడూ మన దేవుడిని పూజించలేదు. వారికి మగదేవుడు అనే వాదం ఒకటి ఉన్నది కాని అదికూడా తర్వాతి కాలంలో వచ్చిన ప్రభావమే అని నా ఉద్దేశ్యం అందుకనే ఆ తర్వాత శివుణ్ణి 'అర్థనారీశ్వరుడిగా' చేశారు. అందులో దళితుల "అమ్మ" పూజ కలిపిఉంది.

ఈ మొక్కుకోవటాలుగాని, వేడుకోవటాలుగాని తమ జీవితాలలో ఒక ముఖ్యమైన ఘట్టానికి ముడిపెట్టి చేసుకొనేవారు ఇంతకు ముందు చెప్పినట్టు కలరా వచ్చినపుడు, మశూచి వ్యాపించినపుడు ఆ ప్రమాదం నుంచి తప్పించుకోవటానికి మొక్కుకున్నట్టుగా ఒక వేడుక సమయంలో మాత్రమే "అమ్మ" దగ్గర సంబరం చేసుకున్న సంఘటనలు కూడా ఉన్నాయి. వర్షాలు బాగా కురిసినపుడు పంటలు బాగా పండినపుడు ఆయా సందర్భాలలో ఒక పెద్ద జాతర జరుగుతుండేది. అదికూడా ఇంచుమించు ఏడాదికోసారి ఆ సంఘటన అయిపోయిన తర్వాత మళ్ళీ ఏడాది వరకూ "అమ్మ"ను గుర్తు చేసుకోవటం కూడా ఉండేదికాదు. ఒక అవసరానికి ఈ మొక్కుకోవటాలు వేడుకోవటాలు జరుగుతుండేవి. పూజకోసం దేవుడి లా కాకుండా ఒక అవసరం కోసం వారు ఆ వేడుకోవటాలు చేస్తుండేవారు. నిత్య ఆరాధన లాంటివి దళితుల జీవితాలలో లేదు.

## దళితులకు పూజారిలేదు

అదేవిధంగా దళితులకు "గుడి", "పూజారి" అనే వ్యవస్థ తెలియదు దళితులు కొలిచే ఏ దేవతకు గాని గుడి ఉండేది కాదు. ఒక గాయినో రప్పనో కొలిచిన దళితులకు ఆ రాయి, రప్ప అవసరం మళ్ళీ ఏడాదికి మాత్రమే వచ్చేది. కాబట్టి దానికి ఒక ఆశ్రయం, నీడ కల్పించవలసిన అవసరం వారికి కనిపించలేదు. ఈ వేడుకోవటాన్ని వారు ఒక వ్యవస్థగా రూపొందించదలుచుకోలేదు. రూపొందలేదుకూడా.

హిందువుల దేవతలకు గాని దేవుళ్ళకు గాని ప్రతివానికీ ఒకగుడి ఉంటుంది. ఆ గుడిలో ఒక "పూజారి" ఉండడు దేవునికి, భక్తునికి మధ్య ఈ పూజారి మధ్యవర్తిగా వ్యవహరిస్తాడు. పూజారి లేనిదే ఏ భక్తుడూ గాని తిన్నగా దేవునితో చెప్పుకోవటం గాని దేవునికి పూజ చేయటంగాని కుదరదు. పూజారి చేయవలసినదే పూజలన్నీ. దైవానుగ్రహం కోసం భక్తుల తరపున పూజారి ప్రార్థనలు చేస్తాడు, మంత్రాలు జపిస్తాడు. ఆ మంత్రాల అర్థం భక్తులకు తెలియదు.అసలు ఆ భాషకూడా వారికి తెలియదు. భక్తులకు అర్థంకాని భాషలో వారి భావాలను బాధలను భగవంతునికి పూజారి విన్నవిస్తాడు. దళితులకు అటువంటి అవస్థ ఏమీ లేదు. వారు తిన్నగా దేవత దగ్గరకు వెళ్ళి, "మాకు ఇది కావాలి, చేసిపెట్టు, నీకు కోడినో, గొర్రెనో కోసి ఇస్తాను" అని అంటారు. మధ్యవర్తి ప్రమేయం లేదక్కడ. మొత్తం హిందూమతం అంతా ఈ "మధ్యవర్తి" మీదనే ఆధార పడింది. మనిషి పుట్టుకనుంచి చావువరకూ, చావు తర్వాత జరిగే కర్మకాండ, ఆ తర్వాత శ్రార్ధకర్మలు అన్నీ కూడా ఈ "మధ్యవర్తి" లేకుండా జరగవు హిందువుడు జన్మకు ముందు కూడా ఈ మధ్యవర్తి ప్రమేయంఉన్నది. తాను తల్లిదండ్రులకు పుట్టబోతున్నాడో వారిద్దరూ కలిసే సమయంకూడా ఈ మధ్యవర్తి నిర్ణయిస్తాడు మొత్తం హిందువుల జీవన విధానంలో ఈ మధ్యవర్తి పాత్ర చాలా ప్రముఖంగా ఉంటుంది. దళితుల జీవితాలలో ఈ "మధ్యవర్తి" ఉండడు. ఇది చాల ముఖ్యమైన తేడా.

అదేవిధంగా "గుడి" వ్యవస్థ ఇంతకు ముందే చెప్పినట్టుగా దళితులకు గుళ్ళులేవు. గుడి లేకుండా హిందూమతం లేదు. అదేవిధంగా పూజారిలేకుండా హిందూ మతమూ లేదు. ప్రపంచంలో ఒక బౌద్ధం తప్ప మిగిలిన అన్ని మతాలకూ గుడి వుంటుంది. అందుకనే దళితులు ఒకప్పటి బౌద్ధులు అనే వాదనకు కూడా ఇది కొంత ఆధారమవుతుంది.

ప్రాపంచిక విషయాలు, భౌతిక విషయాలు వచ్చేసరికి హిందువులకు దళితులకు మరో ముఖ్యమైన తేడా కనిపిస్తుంది. అదేమంటే హిందువులు చేసే పనులు కొన్ని పనులు ప్రత్యేకంగా కేటాయించారు. రాజ్యాంగం రాసుకున్న తర్వాత , అంటరాని తనాన్ని నిర్మూలించటం కోసం చట్టం చేసిన తర్వాత ఈ నిషేధం ఖచ్చితంగా అమలులోలేకుండా ఉన్నది కాని దానికి ముందు చాల ఖచ్చితంగా ఇది అమలులో ఉండేది. ఒకేమతంలో ఉన్న ప్రజలకు కొన్ని పనులు నిషేధం కావటం

అనేది ఉండదు. అలాగే కొన్నిపనులు ప్రత్యేకంగా కొందరికే కేటాయించటం అనేది జరగదు. ఇవి సామాజిక పరమైన కట్టుబాట్లు, నిషేధాలు అని కొట్టిపారవేయటానికి వీల్లేదు. ఎందుకంటే .వీటి వెనుక మతపరమైన ఆంక్షలు, ఆమోద ముద్రలు ఉన్నాయి. కాబట్టి మతమే ఈ రకమైన ఏర్పాట్లు చేసినట్లు స్పష్టమవుతున్నది. ఒకవ్యక్తి అభీష్టాలను, యోగ్యతలను, ఆసక్తిని మతం నిర్ణయించదు. ఒక వ్యక్తి ఆహారాన్ని . నివాసాన్ని మతం నిర్దేశించదు. అలా చేసిందంటే నిషేధానికి గురవుతున్న వ్యక్తులను ఆమతంలో వారిగా చూడటం లేదనేది కూడా స్పష్టమవుతున్నది. వీటి అన్నిటిబట్టి చూస్తే హిందువులు, దళితులు వేరు వేరనేది రుజువవుతున్నది.

పైన చెప్పిన ఆధారాలను చూసినపుడు కొందరికి అనిపించవచ్చు. కులవ్యవస్థ మూలంగా వచ్చిన తేడాలను మతానికి అన్వయించి హిందువులు దళితులు వేరువేరని చెబుతున్నానేమో అని కొందరు అనుకోవచ్చు. హిందూ మతంలో కులవ్యవస్థ అత్యంత ప్రధానమైనది. హిందూ మతంలో నుంచి కులాన్ని తీసేస్తే మిగిలేది చాలతక్కువ. ఆ మిగిలిన దాంట్లో కూడా హిందువులకు దళితులకు తేడా ఉన్నదని పైన చూపించటం జరిగింది. దేవుడు, గుడి, పూజారి, పూజ, ఆచార వ్యవహారాలు ఇవన్నీ పరిశీలించినపుడు కూడా వీరిద్దరి మధ్య ఈ తేడా చాలా స్పష్టంగా కనిపిస్తుంది.

## అయితే–దళితులు ఎవరు?

దళితులు హిందువులు కానపుడు మరి వారెవరో చెప్పవలసిన అవసరం ఉన్నది. దళితులు ఈ దేశ మూలవాసులు, ఆదివాసులు ఈ ప్రాంతానికి హిమాలయాలు అవతలనుంచి, వాటి పక్కల నుంచి ఇతరులు రాకముందు నుంచి ఇక్కడ కనిపిస్తున్న తెగలే నేటి దళితులు. వీరికి ఒక గొప్ప చరిత్ర నాగరికత, సంస్కృతి ఉన్నది. ఈ దేశాన్ని ఆక్రమించుకున్నవారు వాటి నన్నింటినీ నాశనం చేసి, ఉన్నవాటిని లభ్యంకాకుండా చేసి ఆ ఔన్నత్యపు ఆనవాళ్లను కనబడకుండా చేశారు. మిగిలిన ఆధారాలలో హరప్పా, మొహంజోదారోలు ముఖ్యమైనవి. బయటివాళ్లు బలమైన ఆయుధాలతో , ఎత్తుగడలతో రావటం మూలంగా ఈ దేశవాసులను ఓడించడం లొంగదీసుకోవటం సులువుగా జరిగిపోయింది. అక్కడ నుంచి వారు తెచ్చుకున్న సంప్రదాయాలను ఇక్కడి వాటితో కలుపుకొని ఒక కొత్త విధానం ఏర్పరిచారు. ఆ విధానాన్ని అంగీకరించని వారిని దానికి అవతలుంచారు. వారు తిరిగి నాగరిక జీవనాన్ని కొనసాగించుకోకుండా నిషేధాలు విధించారు. ఈ నిషేధాలకు గురయిన వారే దళితులు.

మరొక బలమైన ఆధారం ఏమంటే బ్రాహ్మణ వాదానికి, బౌద్ధానికి మధ్య యుద్ధం జరుగుతున్న సందర్భంలో బ్రాహ్మణవాదాన్ని అంగీకరింరచక బౌద్ధం లోనే ఉండటానికి నిశ్చయించుకున్న వారే నేటి దళితులు అనేది మరొక వాదన ఏమంటే గోమాంసం తినటం మానటానికి అంగీకరించని వారే దళితులని ఒకప్పుడు బ్రాహ్మణులతో సహా అందరూ ఆవుమాంసం తినేవారు. బౌద్ధాన్ని ఓడించటానికి బ్రాహ్మణులు చేసిన ప్రయత్నాలను ఆ వుమాంసం తినటం మానివేయటం ఒక ఎత్తుగడ. ఆదశలో కొందరు దానికి అంగీకరించలేదు. వారే నేటి దళితులు ఈ వాదనలన్నీ రుజువు చేస్తున్నది ఏమంటే దళజతులు హిందువులలో భాగం కాదని, దళితుల జీవన విధానం , వారినమ్మకాలు పరిశీలిస్తే వీరు ఒకప్పటి బౌద్ధులు.

## "అవమానకరమైన పదం హరిజనులు!"

దళితులు అనే మాటకు చారిత్రక ఆధారాలను చూపటం తోపాటు మరొక ప్రత్యేకమైన ఆధారంకూడా చూపటం అవసరం అని భావిస్తున్నాను. నిమ్నజాతులకు, హరిజనులకు పర్యాయపదంగా దళితులు అనేమాట వాడటం జరిగింది. అని ఇంతకు ముందు చెప్పాను. అయితే ఇది పర్యాయపదం కాదు. హరిజనులు, దళితులు అనే రెండు మాటలకు మధ్య చాల ప్రధాన మైన తేడా ఉన్నది. 'హరిజనులు' అనే మాటరాక ముందు 'పంచములు' అనే మాట వాడుకలో ఉండేది. వీరికి గాంధీజీ పెట్టిన పేరు 'హరిజనులు' . గాంధీజీ తర్వాత వాడుకలోకి ఈ పదం వచ్చింది. హరిజనులు అంటే దేవుని బిడ్డలు, తండ్రిఎవరో తెలియక దేవదాసిలకు పుట్టిన వారిని 'హరిజనుడు' అనే వారు గుజరాత్‌లో. ఈ పదాన్ని గాంధీజీ తీసుకొని పంచములకు పెట్టారు. వారిపట్ల గాంధీజీకి ఉన్న అభిమానం అలాంటిది. అయితే ఈ పదాన్ని డాక్టర్ అంబేద్కర్ అంగీకరించలేదు. డాక్టర్ అంబేద్కర్ అనుయాయులు అంగీకరించలేదు. దీనిని ఒక అవమానంగా భావిస్తారు వారు బ్రాహ్మణ వాదంలో కులవ్యవస్థలో పంచములకు మానవ మర్యాద , సాంఘిక సమానత్వం లేకపోవటం వలన ఆ రెండింటి కోసంబ్రాహ్మణవాదం కులవ్యవస్థపైన ప్రతిఘటించి పోరాటం చేస్తున్నవారే దళితులు. ఈనాడు దళితులు అనేమాటప్రతిఘటనకు పర్యాయపదం అయింది. పోరాడే పంచముడు నేటి దళితుడు. అగ్రకులాల ఆధిపత్యాన్ని అంగీకరించి వారు అందించే సహాయాన్ని అందుకొనే వారు హరిజనులుగా మిగిలిపోయారు. డాక్టర్ అంబేద్కర్ తర్వాత సదుపాయాలకోసం కాకుండా మానవ మర్యాదకోసం పోరాటం చేయటం మొదలయింది. డాక్టర్ అంబేద్కర్ జీవితమంతా మానవ హక్కుల కోసం చేసిన పోరాటమే. ఆ సంప్రదాయాన్ని కొనసాగిస్తున్న పంచములు లేదా షెడ్యూల్డ్ కులాలు / తెగలవారు దళితులుగా వ్యవహారంలోకి వచ్చారు. అందుకనే దళితులు అనేది ఈనాడు పోరాటానికి పర్యాయపదం అయింది.

## దళితులు– హిందువులా? కాదు కాదు!

అయితే బ్రాహ్మణవాద రాజకీయ పార్టీలు తమ రాజకీయ ప్రయోజనాల కోసం దళితులు కూడా హిందువులే అనే వాదన ప్రచారంలోకి పెట్టారు. "మనమంతా హిందువులంబంధువులం – గంగసింధు బిందువులం" అని పాటలు కూడా మొదలు

(మిగతా 77వ పేజీలో)

# భారతదేశంలో 'కులం–మతం'

– డా॥ ఎస్వీ. సత్యనారాయణ

### డిసెంబరు 6వ తేదీ

'కులం పునాదుల మీద ఒక జాతిని నిర్మించలేం. ఒక నీతిని నిర్మించలేం. చాతుర్వర్ణ వ్యవస్థలాంటి నీచ, నికృష్టమైన భ్రష్టవ్యవస్థ ఒక్క భారతదేశంలో తప్ప ప్రపంచంలోని ఏ యితర దేశంలోనూ కానరాదు. అన్ని దేశాల్లోనూ శ్రమ విభజన మాత్రమే కనబడుతుంది, కానీ మన దేశంలో మాత్రం శ్రామి కుల విభజన తరతరాలుగా కొనసాగుతున్నది' అనే చారిత్రక వాస్తవాన్ని తెలియజేసిన సాంఘిక విప్లవకారుడు డా॥ బి.ఆర్. అంబేద్కర్ దళిత ప్రజలందరూ ఆ మహనీయుని బోధన లను, ఆతని జీవితానుభవాలను ఆయన స్మరించుకునేరోజు వర్థంతి.

మరో వైపు..... అయోధ్యలో గత సంవత్సరం మతోన్మాద దుర హంకార శక్తులు బాబ్రీ మసీదును కూలగొట్టడం ద్వారా ఈ దేశ తరతరాల సాంస్కృతిక వారసత్వాన్నీ, లౌకిక ప్రజాస్వామికవిలువల్నీ ధ్వంసంచేసి ఏడాది కాలం పూర్తయిన రోజు.

ఈ విధంగా భారతదేశ సాంఘిక, ఆర్థిక, రాజకీయ రంగాలను ప్రభావితం చేస్తున్న 'కులం', 'మతం' అన్న అంశాలను నిశితంగా పరిశీలించాల్సి వుంది. వీటి పునాదులను అధ్యయనం చేయాల్సి వుంది.

నిజానికి 'కులం'; 'మతం' అనేవి రెండూ రెండు ప్రత్యేకమైన ఇన్స్టిట్యూషన్స్. అయినప్పటికీ ఈ రెండింటికి మన దేశంలో విడదీయరాని అవినాభావ సంబంధ ముంది. శతాబ్దాలుగా ఇవి ఒకదానిపైకటి ప్రభావం చూపుతూనే వున్నాయి. ఒకదాన్ని ఒకటి ఇన్ఫ్లూయెన్స్ చేస్తూనే వున్నాయి. ఈ దేశంలో 'కులం' పునాదుల మీద 'మతం' నెలకొన్నది. పైన నెలకొన్న 'మతం' రూపాంతరం చెందినా, 'కులం' మాత్రం పదిలంగానే వుంటున్నది.

భారతదేశంలో 'కులం', 'మతం' సమస్యను అధ్యయనం చేయడానికి ముందు.... ఇక్కడ నెలకొని వున్న సామాజిక వ్యవస్థను అర్థం చేసుకోవడం ముఖ్యం. ప్రపంచంలోని అనేక యితర దేశాలలో లాగాఒక వ్యవస్థను పూర్తిగా బలహీన పరుస్తూ, క్రమంగా అంతకన్నా అభివృద్ధికరమైన వ్యవస్థలోకి పయనించడం యిక్కడ జరుగలేదు. ఉన్నవ్యవస్థతో క్రమంగా రాజీపడుతూనే ఆ చట్రంలోనే కొత్త వ్యవస్థ రూపొందింది. ఫలితంగా కొన్ని స్వల్పమైన మార్పులతో "సామాజిక వ్యవస్థ" కొనసాగుతున్నది.

### కుల–భూస్వామ్య–పెట్టుబడిదారీ మిశ్రమ వ్యవస్థ

మనదేశ సమాజ వాస్తవికతను జాగ్రత్తగా గమనిస్తే.... ఇది "కుల-భూస్వామ్య-పెట్టుబడిదారీ సంక్లిష్ట మిశ్రమ సామాజిక వ్యవస్థ"గా అర్థమవుతుంది. దీనిలో మొదటిది "వర్ణ" లేదా 'కుల' వ్యవస్థ. ఇది దాదాపు 4000 సంవత్సరాల నుండి కొనసాగుతున్నది. వేదాలు, ఉపనిషత్తులు, పురాణాలు, ప్రబంధాలు దాదాపుగా ఈ వర్ణ వ్యవస్థను సమర్థించినట్టివే. చాతుర్వర్ణ వ్యవస్థను ప్రతిపాదించిన ఈ సామాజిక వ్యవస్థ బ్రాహ్మణులను ప్రథమ స్థానంలో; శూద్రులను అధమ స్థానంలో; క్షత్రియ, వైశ్యులను మధ్యమ స్థానంలో నిలిపింది. కాలక్రమంలో శూద్రులలోని అట్టడుగు తెగలవారిని పంచములుగా, అస్పృశ్యులుగా, అవర్ణులుగా పరిగణించింది. కాలం గడుస్తున్న కొద్దీ ఈ శూద్రులు-అస్పృశ్యులుగా, అనేక ఉపకులాలుగా విభజింపబడి దాదాపు ఆరువేల కూలాలుగా విడిపోయారు. వీటిలో ఒకదానికంటే వేరొకటి, ఆ వేరొక దాని కంటే మరొకటి తక్కువ కులంగానూ, అథోస్థానంలోనూ నిలపడం వలన తీవ్రమైన అసమానతలకు, నిలువునా చీలికలకు దారి తీసింది. నిచ్చెనమెట్ల వంటి కుల సామాజిక వ్యవస్థ రూపొందింది.

వేలాది సంవత్సరాలుగా పాలనాధికారం, విద్య, విజ్ఞానం, ఉత్పత్తి శక్తులపై యాజమాన్యం, సకల కళలపై "పట్టు", పై రెండు వర్ణాల గుత్తసొత్తుగా మారాయి. వర్తక, వాణిజ్యాలు వైశ్యుల పరమయ్యాయి. వెట్టిచాకిరి, దాస్యం, శారీక శ్రమ, నీచ వృత్తులుగా పరిగణింపబడుతున్న వృత్తులు చేయడం, సమాజ అవసరాలను తీర్చడానికి ఉపయోగపడడం శూద్రుల జీవిత విధానమయ్యింది.

తరతరాలుగా ఈ దేశంలోని శూద్రులు అజ్ఞానాంధకారంలో, అమాయకత్వంలో, నిత్యదారిద్ర్యంలో, అవమాన తిరస్కారాలతో పశువులకన్నా హీనంగా జీవించారు.

రాజ్యాధికారం, ఆర్థిక ఆధిపత్యం, సాంస్కృతిక వికాసం కలిగిన అగ్రవర్ణాలు, శూద్రుల్లో... వర్ణ వ్యవస్థను కాపాడే మతవిశ్వాసాలను, మూఢ నమ్మకాలను, కర్మ సిద్ధాంతాలను, పూర్వజన్మ-పునర్జన్మ భావాలను, స్వర్గ-నరకాలను ప్రచారం చేసి పబ్బం గడుపుకున్నారు. భగవద్గీతలు, మనుస్మృతులు సమాజంలో అశాస్త్రీయమైన, అహేతుకమైన భావజాలాన్ని వ్యాపింపజేశాయి.

బానిస సమాజ వ్యవస్థలో నెలకొన్న "వర్ణవ్యవస్థ' చట్రం లోనే ఈ దేశంలో 'భూస్వామ్యవ్యవస్థ' రూపుదిద్దుకున్నది. రాజులు బ్రాహ్మణులకు, యుద్ధ వీరులకు, కవిపండితులకు, రెవిన్యూ అధికారులకు విశాలమైన భూభాగాలను, అగ్రహారాలను దానం చేయడం ద్వారా క్రమంగా "భూస్వామ్య వ్యవస్థ" రూపొందింది. మహమ్మదీయ పరిపాలకుల కాలంలో సర్వే, రెవిన్యూ సెటిల్‌మెంట్ల ద్వారానూ; ఆ తరువాత బ్రిటిష్ వలస పాలకుల కాలంలో జమీందారీ వ్యవసాయ పద్ధతిని చట్టబద్ధం చేయడం ద్వారానూ 'భూస్వామ్య సామాజిక ఆర్థిక వ్యవస్థ' విస్తరించింది. చేతివృత్తులు వృద్ధి చెందాయి.

## పైకి ఎగబ్రాకిన కొన్ని శూద్రకులాలు

మనదేశాన్ని మహమ్మదీయ, బ్రిటిష్ వలస పాలకులు పరిపాలిస్తున్న కాలంలో బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్యులతో పాటు శూద్రుల్లోని కొన్ని 'పై కులాలు' గ్రామీణ రెవిన్యూ అధికారులుగా, సైనికాధికారులుగా బాధ్యతలు నిర్వహించి ఆర్థికంగానూ, సామాజికంగానూ పై మూడు వర్ణాలస్థాయికి ఎదగడం ప్రారంభించాయి. అధికారయంత్రాంగంలో ఏదో ఒక మేరకు భాగం పంచుకోవడం ద్వారా విద్య, వైజ్ఞానిక రంగాల్లో కూడా ప్రవేశించ గలిగాయి. శూద్రుల్లోని 'అట్టడుగు కులాలవారు' ముఖ్యంగా అస్పృశ్యులు వ్యవసాయ కూలీలుగా, వెట్టిచాకిరీ చేసేవారుగా మాత్రమే, నీచ వృత్తులు చేసేవారుగానే కొనసాగారు. రైత్వారీ ప్రాంతాల్లో ఆధిపత్యంలో వున్న రైతాంగ వర్గానికి చెందిన శూద్రులు కొందరు క్రమక్రమంగా భూస్వాములుగా ఎదిగి, అగ్రవర్ణాలతో సారూప్యం చెందారు.

బ్రిటిష్ వలస పాలకుల కాలంలో "పెట్టుబడిదారీ ఆర్థిక వ్యవస్థ' ప్రారంభమయినా, ఇది "కుల-భూస్వామ్య సామాజిక వ్యవస్థ" చట్రంలోనే అభివృద్ధి చెందింది. వర్తక, వాణిజ్యాలు, పారిశ్రామికీకరణల వలన కొన్ని కొత్తవర్గాలు సమాజంలో ప్రారంభమైనప్పటికీ ఉన్నత వర్ణాల నుండే ప్రధానంగా 'పెట్టుబడిదారీ వర్గం' రూపొందింది. శరీర కష్టంపై ఆధారపడిన శూద్రులు, దళితులు, అస్పృశ్యులు ఒక వైపు గ్రామాల్లో వ్యవసాయ కూలీలుగానూ, మరో వైపు నగరాల్లో పేద కార్మికులుగానూ రూపాంతరం చెందారు.

దేశానికి స్వాతంత్ర్యం లభించిన తర్వాత కూడా యిక్కడి సామాజిక వ్యవస్థలో మౌలికమైన మార్పులు సంభవించలేదు. జాతీయ బూర్జువా వర్గం అధికారాన్ని హస్తగతం చేసుకోవడం ద్వారా కొన్ని సంస్కరణలు మాత్రమే ప్రవేశపెట్టగలిగింది, కానీ సమూలమైన మార్పుల కోసం చిత్తశుద్ధితో పాటుపడే ప్రయత్నం చేయడం లేదు.

భారత రాజ్యాంగంలో సమానత్వం-సౌభ్రాతృత్వం-సామ్యవాదం - లౌకికతత్వం మొదలైన అందమైన పదాలను ఎన్నింటిని పొందుపరుచుకున్నా, పాలకవర్గాలు తమ స్వార్థ ప్రయోజనాలను పదిలపరచుకోవడం కోసం శ్రామికులను, పేదతులను కుల ప్రాతిపదికపై నిరంతరం విడదీస్తూనే వున్నారు; మత ప్రాతిపదికపై ఒకపద్ధతి ప్రకారం కొట్లాడిస్తూనే వున్నారు.

## కులం-మతం-రాజకీయ ప్రయోజనాలు

వర్ణాలు (రంగులు) కలిసిపోయినా ఈ దేశంలో యింకా విచిత్రంగా "వర్ణవ్యవస్థ" ఊపిరి పీల్చుకుంటూనే వుంది. కులాలకు ఆయువు పట్టువంటి వృత్తులు సర్వజనీనమైనా 'కులం' సమసిపోకుండా 'కులవ్యవస్థ' వర్ధిల్లుతూనే వుంది. చట్టబద్ధ భూస్వామ్య వ్యవస్థ రద్దయి, భూస్వామ్య ఉత్పత్తి సంబంధాల్లో పెనుమార్పులు సంభవించినా 'భూస్వామ్య సామాజిక వ్యవస్థ', దాని తాలూకు భావజాలం, దాని రుగ్మతలన్నీ కొనసాగుతూనే వున్నాయి.

పారిశ్రామికీకరణ, విద్యావకాశాల పెరుగుదల, ప్రజాస్వామ్య వాతావరణం వంటి అభ్యుదయకరమైన పరిణామాలు సంభవిస్తూ...'కులం' అస్తిత్వాన్ని కోల్పోవలసిన పరిస్థితులు నెలకొన్నప్పటికీ, 'కులం' నశించకుండా, యింకా పునరుద్ధరింపబడుతూనే వుంది. కుల సంఘాలు, కుల పత్రికలు, కుల భవనాలు, కుల హాస్టళ్ళు, చివరికి కుల విద్యాలయాలు, కుల కళాశాలలు, మత కళాశాలలు రోజురోజుకూ అధికమౌతున్నాయి. కమర్షియల్ బూర్జువాశక్తులకు, నూతన ధనిక స్వాములకు, అధికార రాజకీయ నాయకులకు వీటి అవసరం ఉన్నందున; వారి ఆర్థిక, హార్థిక సహాయ సహకారాలతో కుల నిర్మాణ సంఘాలు విస్తరిస్తున్నాయి. విద్యార్థి సంఘాల ఎన్నికలు మొదలుకొని విశ్వవిద్యాలయాల ఉపాధ్యక్షుల నియామకం దాకా; గ్రామ పంచాయితీ ఎన్నికలు మొదలుకొని రాష్ట్రపతి అభ్యర్థిత్వం దాకా.... నేడు "కులం" ప్రధానమైన భూమికను నిర్వహిస్తున్నది. ఇది మనకు ఇష్టమున్నా, కష్టమున్నా 'జీవిత వాస్తవికత'గా కళ్లముందున్నది.

## 'కులం' - 'మతం' పరస్పర ప్రభావాలు

కుల వ్యవస్థపై తిరుగుబాటుగా వచ్చిన బౌద్ధం, జైనం, శైవం, వైష్ణవం వంటి మతోద్యమాలు ఈ దేశంలో 'కులం' మూలాలను నిర్మూలించలేకపోయాయి. కాలక్రమంలో అవి మరిన్ని కొత్త కులాల ఆవిర్భావానికి దారితీశాయి.

ప్రపంచ చరిత్రలో క్రీ.పూ. 6వ శతాబ్దానికి ఒక విశిష్టమైన స్థానముంది. ప్రపంచ వ్యాప్తంగా అనేక దేశాల్లో ఆనాడు అస్తిత్వంలో వున్న మతవ్యవస్థల మీద, విశ్వాసాల మీద, ఆచార వ్యవహారాల మీద నమ్మకం సన్నగిల్లింది. నూతన తాత్వికాన్వేషణ ప్రారంభమయింది. గ్రీకు ద్వీపాల్లో, ఇరాన్‌లో, చైనాలో కొత్త సిద్ధాంతాలు బయలుదేరాయి. ఈ ఆధ్యాత్మిక సంచలనం ప్రతిధ్వనులుగా భారతదేశంలో బౌద్ధం, జైనం వికసించాయి. ఆనాటి సామాజిక వ్యవస్థను నిరసిస్తూ, యజ్ఞయాగాదులతో కూడిన మతంపైన, బ్రాహ్మణాధిక్యత పైన వ్యతిరేకత విజృంభించింది. ఈ నిరసనోద్యమాగ్ని నుండి నూతన చైతన్యం రగిలించినవారు క్షత్రియులైన గౌతమ బుద్ధుడు, మహావీరుడు. బుద్ధుడు తన ఆదర్శాలను ప్రచారం చేసే నాటికి యిక్కడ 62 మత తెగలు వుండేవని 'పాలీ

గ్రంథాలు" తెలుపుతున్నాయి. మహావీరుడి కాలంలో 363 మత తెగలుండేవని జైనగ్రంథాలవల్ల తెలుస్తున్నది.

క్రీ.పూ. 6వ శతాబ్దం నాటి సనాతన వైదిక మతంలో వ్యాపించిన కర్మకాండలు, మంత్రతంత్రాలు, జంతుబలులు, బ్రాహ్మణాధిక్యత, సంస్కృత భాషాధిపత్యం, చాతుర్వర్ణ వ్యవస్థ సృష్టించిన సాంఘిక అసమానత్వం మొదలైన వాటి మీద నిరసనగా బౌద్ధం, జైనం ప్రారంభమయ్యాయి. సాంఘిక సమా నత్వ సిద్ధాంతానికీ, సత్యాహింసలకు, ప్రజల భాషల ఆదరణకు యివి ప్రాధాన్యతనిచ్చాయి. యథేచ్ఛగా మత ప్రచారం జరు పుకునే వెసులుబాటు, ప్రజలను ఆకర్షించగలిగే మార్గనిర్దేశం వున్నందు వలన ఇవి ఆనాడు దేశ, విదేశాల్లో విశేషంగా వ్యాప్తిచెందాయి.

## బుద్ధుణ్ణి "అవతారం"గా మార్చిన హిందూమతం

బౌద్ధ, జైన మతాలు ఆనాటి రాజుల, ప్రజల ఆదరా భిమానాలను సంపాదించినప్పటికీ; వైదిక మతాన్నీ, అది సమర్థించే వర్ణ వ్యవస్థనూ ఇవి రూపుమాపలేక పోయాయి. హూణుల దండయాత్రలు, అరబ్బుల దండయాత్రల వలన బౌద్ధ, జైన మతాలు దెబ్బతిన్నాయి. ఈ దేశంలోకి ప్రవేశిం చిన హూణులు, శకులు వైదిక మతంలోకి ప్రవేశించి, దాని పునరుద్ధరణకు తోడ్పడ్డారు. క్రమంగా వైదిక మతంపై తిరు గుబాటు లేవదీసిన బుద్ధుడ్ని కూడా దశావతారాల్లో ఒక అవతారంగా "కో ఆప్ట్" చేసుకోవడం ద్వారా బౌద్ధమతాన్ని నిర్వీర్యపరిచి వైదికం వ్యాపించింది.

అలాగే కుల వ్యవస్థకు వ్యతిరేకంగా శైవం, వైష్ణవం, వీర శైవం, వీరవైష్ణవం కృషి చేసినప్పటికీ 'హరిహరాద్వైత' సిద్ధాంతం ద్వారా వైదికమతం వైష్ణవాన్నీ, శైవాన్నీ సమన్వయపరిచి 'కులవ్యవస్థ'ను కాపాడుకున్నది. కొన్ని కొత్తకులాలను కూడా సృష్టించింది.

మధ్యయుగాలలో కులవ్యతిరేక ఉద్యమం 'భక్తిఉద్యమం'గా కొనసాగింది. రామానుజుడు, కబీర్, జ్ఞానేశ్వర్, నామ్‌దేవ్, గోర కుంభార్, చోఖమేళా, ఏక్‌నాథ్, తుకారాం, బసవేశ్వరుడు, వేమన, పోతులూరి వీరబ్రహ్మం, సిద్దయ్య, నానక్, నారాయణ్‌గురూ మొదలైనవారు 'భక్తితాత్విక దృక్పథం' ద్వారా కులతత్వాన్ని నిరసించారు. కుహనా పూజల్ని చీల్చిచెండాడారు. అయినా కులంపై కప్పిన మేలిముసుగు వంటి "మతం" - ఈ తిరు గుబాటుదార్లను మహాయోగులనీ, సాక్షాత్ అవతార పురుషులనీ, మహాభక్తులనీ, దైవాంశసంభూతులనీ కీర్తించి తన గర్భంలో కలుపుకున్నది. వీరు ప్రశ్నించిన "కులం" అస్తిత్వం జోలికి పోకుండా, వీరు ప్రబోధించిన భక్తితత్వాన్ని మాత్రం ఆకాశానికెత్తింది. కబీర్‌ను భక్తకబీర్‌గా, వేమనను యోగివేమనగా, వీరబ్రహ్మంను శ్రీమద్విరాట్ పోతులూరి వీరబ్రహ్మేం ద్రస్వామిగా అభివర్ణించింది. నానక్‌ను గురునానక్‌గా ప్రశం సించి మరో కొత్త మతావిర్భావానికి ప్రాణం పోసింది. తదనం తర కాలంలో వీరి అనుచరులు ప్రతిఘటన మార్గాన్ని వదిలి భక్తిప్రపత్తుల ప్రతిష్ఠంభనకు లోనయ్యారు.

మనదేశాన్ని గ్రీకులూ, పారశీకులూ, పార్థియనులూ, హూణులూ, కుషాణులూ జయించారు. మహమ్మదీయ సుల్తా నులు వందలాది సంవత్సరాలపాటు పాలించారు. బ్రిటిష్ వలస పాలకులు శతాబ్దాలపాటు పరిపాలించారు. వీరిలో ఏ ఒక్కరూ యిక్కడి 'కులం' పునాదుల్ని కదిలించ లేకపోయారు.

ఆయా మతాలు యిక్కడి నిమ్నవర్ణాలను ఆకర్షించి, కొం దరిని తమలో కలుపుకున్నప్పటికీ....వారికి మతాన్ని యివ్వగ లిగాయేకానీ, వారి కులాన్ని రూపుమాపలేక పోయాం.

నిజానికి ఇస్లాం, క్రైస్తవ మతాల్లో శాఖా భేదాలున్నాయే తప్ప కులభేదాలు లేవు. ప్రపంచంలోని యితర దేశాల్లో మహమ్మ దీయులకు, క్రైస్తవులకు 'కులం' అంటే ఏమిటో తెలియదు.

ఈ రెండు మతాలు తమ మతస్తుల మధ్య సాంఘిక సమా నత్వాన్ని ప్రబోధించాయి. కానీ భారతదేశంలో మాత్రం ఈ రెండుమతాలను కూడా 'కులం' ప్రభావితం చేయగలిగింది.

## ముస్లిమ్‌లలో 26 కులాలు

భారత మహమ్మదీయుల్లో మొత్తం 26 కులాలున్నాయనీ, వీటిని కేంద్ర ప్రభుత్వం గుర్తించిందనీ ప్రొఫెసర్ యాసిన్ పేర్కొన్నారు. ఈ 26 కులాల్లో 20 కులాలు గౌరవనీయమైన వృత్తులుగా పరిగణింపబడుతున్న వృత్తులు చేపట్టినవి. అష్రాఫ్, షేక్, సయ్యద్, మొగల్, పఠాన్ మొదలైనవి పై వృత్తులు చేపట్టిన ఉన్నత కులాలు. ఇక మిగిలిన ఆరు కులాల వారు చేనేత, చాకలి వృత్తి, మంగలి వృత్తి, పాకీ పనులు కొనసాగి స్తున్న వారు. వీరిని "కమీన్"లంటారు. మహమ్మదీయుల్లో వీరు శూద్రుల వంటివారు. వీరిలో జులాహాలు (సాలెవారు), నాయీలు (మంగలివారు), దోబీలు (చాకలివారు) వున్నారు. వీరిలో ఒకకులానికీ, మరో కులానికీ మధ్య 'మంచంపొత్తు' లేదు.

## క్రైస్తవులలో కులాలు

అదే విధంగా ఈ దేశంలో 'కుల వ్యవస్థ'పై నిరసనగా, కుల విముక్తి సాధనగా ప్రారంభమైన క్రైస్తవ మతాన్ని కూడా 'కులం' ఆక్రమించగలిగింది. ఫలితంగా కమ్మ క్రైస్తవులు, రెడ్డి క్రైస్త వులు, దళిత క్రైస్తవులు ఆవిర్భవించారు. ఆచార, వ్యవహారాల్లో దైనందిన జీవన విధానాల్లో తమ ప్రత్యేకతలను వీరు నిలు పుకుంటూనే వున్నారు. ఈ దుస్థితిని గమనించిన మహాకవి జాషువా.....

"కులదమ్మా వ్రణ మంటరాని తన మాక్షర్ణింపు మీ యిండియా

పొలమందుం గల మాల,మాదిగలకున్ భూతేశుడే కాదు,

కృష్ణులు, కృష్ణున్నిరసించుదైవములు, క్రీస్తుల్ మస్తుగా బుట్టినన్,

కలుపన్నేరరు రెండు జాతులను వక్కాణింప సిగ్గయ్యెడిన్"

అంటూ వాపోయారు.

కుల విభేదాలను నిరసిస్తూ, నిమ్నవర్గాల ఉద్ధరణ కోసం మహారాష్ట్రలో మొదటిసారిగా "జ్యోతీరావు పూలే" (1827-1890) తిరుగుబాటుకు పిలుపునిచ్చారు. 'సత్యశోధక్ సమాజ్

అనే సంస్థను స్థాపించి, అనేక గ్రంథాలు రచించి దళిత చైతన్యానికి విశేషమైన కృషి చేశారు.

ఆ తరువాత మహారాష్ట్ర, ఉత్తరభారతం, కేరళ, తమిళనాడు, కర్నాటక, ఆంధ్రప్రాంతాల్లో సాంఘిక అసమానతలకూ, కుల వివక్షతకూ వ్యతిరేకంగా విభిన్న పద్ధతుల్లో ఆందోళనలు జరిగాయి.

డా॥ బి.ఆర్. అంబేద్కర్ కుల నిర్మూలన కోసం, దళితుల సర్వతోముఖవికాసం కోసం బహుముఖాలుగా కృషి చేశారు. దళితులకు రాజ్యాంగపరమైన రక్షణలు, రిజర్వేషన్లు, రిజర్వ్‌డ్ నియోజకవర్గాలను సాధించగలిగారు.

బ్రహ్మ సమాజం, ఆర్య సమాజం, దివ్యజ్ఞాన సమాజం, జాతిభేద నిర్మూలక మండలులు, కుల నిర్మూలన సంఘాలు "కులవ్యవస్థ"ను నిరసించినప్పటికీ, 'కులాన్ని' నిర్మూలించలేక పోయాయి.

భారత సంస్కృతిని నిర్వీర్యపరుస్తున్న వ్రణం 'కులం'. వైదిక ఆలోచనాధార జాతికి విధించిన ప్రత్యక్ష శాపం 'కులం'. 'అత్యంత నిర్దాక్షిణ్యమైన అణచివేతకు ఉపయోగపడే బ్రహ్మాండమైన సంస్థ (A gigantic system of cold blooded repression) కులం, అన్నాడు రవీంద్ర నాథ్ ఠాగోర్.

తపస్సు చేసుకుంటున్న శూద్ర శంబూకుడిని రాముని కత్తికి బలిచేసింది 'కులం'. శూద్రుడు (సూతుడు) అనే కారణంతో కర్ణుడ్ని అవమానాల పాల్జేసింది 'కులం'. ఏకలవ్యుని బొటన వేలును ద్రోణాచార్యుని కుట్రకు కానుకగా కోయించింది 'కులం'. రొమ్ముకు ముంత, వీపుకు తాటాకూ వేలాడదీసి ఇటీవలి కాలందాకా పంచముల్ని అవమానించింది 'కులం'.

ఇవ్వాళ భారతదేశంలో నెలకొని వున్నది ఒక విచిత్రమైన కుల - మతాల సంక్లిష్ట సంస్కృతి. ఇప్పుడు "హిందూ మతం"గా పిలువబడుతున్న 'మతం' ఏమిటి??? - ఇది కొన్ని మతాల వికృత విచిత్ర సమ్మేళనం. ఇందులో శైవం, వైష్ణవం, శాక్తేయం, బౌద్ధం, జైనం మొదలైన అనేక విభిన్నమతాలు చిత్రాతిచిత్రంగా కలగలిసి వున్నాయి. ద్వైతం, అద్వైతం, విశిష్టాద్వైతం-అన్నీ ఒక చోట చేరాయి. వేద ప్రామాణికతను అంగీకరించే మతాలూ, వేదప్రామాణికతను నిరాకరించే మతాలూ కలిసి 33 కోట్ల దేవతల మూకుమ్మడి అనుయాయుల సంయుక్త వేదికగా రూపొందిన సంకరమతం హిందూ మతం. పుట్టుక మొదలు కొని చావుదాకా కర్మకాండలూ, పాపపుణ్యాలు, స్వర్గ నరకాలూ, మూఢాచారాలూ, పూజా పునస్కారాలూ ఈ మతానికి పట్టుగొమ్మలు.

## ప్రగతిశీల శక్తుల ముందున్న ప్రస్తుత కర్తవ్యాలు

ప్రగతిశీల శక్తులు ఈ దేశ చరిత్రను కుల దృక్కోణంతో కాక, కుల నిర్మూలన దృక్పథంతో తిరగరాయాల్సిన అవసరం వుంది. ఆయా మతాలు ఆవిర్భవించిన కాలం నాడు నిర్వర్తించిన అభ్యుదయకరమైన పాత్రతో పాటు, అనంతర కాలంలో నిర్వహించిన విధ్వంసకర ప్రగతి నిరోధక పాత్రను జాగ్రత్తగా అంచనా కట్టాల్సి వుంది. సాహిత్యంలోనూ, సకల సామాజిక చైతన్య రూపాల్లోనూ 'సాంస్కృతిక విప్లవం' తేవాల్సిన సమయం ఆసన్నమయ్యింది. అంతిమంగా ఏదో ఒక కుల ప్రయోజనాలనో, కొన్నికులాల సమాఖ్య ప్రయోజనాలనో, ఒక మత ప్రయోజనాలనో కాకుండా, ఈ దేశంలోని మెజారిటీ ప్రజలైన పీడిత తాడితుల ప్రయోజనాలను పరిరక్షించే చైతన్యం సృష్టించాల్సిన చారిత్రక సన్నివేశం మన ముందున్నది-మనం ఎవరి పక్షం? మన పోరాటాల దిశ ఏది?

వర్ణపోరాటమా? మత పోరాటమా?? వర్గపోరాటమా???

వర్ణాలను విస్మరించే వర్గపోరాటమా?

వర్గ స్పృహలేని వర్ణపోరాటమా??

ఇవీ మన ముందున్న తక్షణ సమస్యలు. కొందరు వర్ణ పోరాటమే తక్షణ కర్తవ్య మంటున్నారు. మరి కొందరు వర్గ పోరాటంద్వారానే 'కులం'నిర్మూలింపబడుతుందంటు న్నారు.

ప్రస్తుత సామాజిక పరిస్థితుల్లో ఈ రెండు ధోరణులూ సమస్యను పూర్తిగా పరిష్కరించలేవు. పాక్షిక ప్రయోజనాన్ని మాత్రమే సాధించగలుగుతాయి.

## వర్ణం-వర్గం-రెంటికి వ్యతిరేకంగా ఉమ్మడి పోరాటం

కులం అస్తిత్వాన్ని గుర్తించని వర్గదృష్టి అంధప్రాయం.

వర్గదృష్టిలేని కులచైతన్యం వంధ్యప్రాయం.

సామాజిక న్యాయం, లౌకిక విలువల పరిరక్షణ, సమసమాజ నిర్మాణం - అనేవి నేడు మనముందున్న తక్షణ లక్ష్యాలు. వీటిని సాధించడానికి వర్గ పోరాటంలో భాగంగా మతాతీతకుల నిర్మూలన పోరాటాన్ని కొనసాగించాల్సిన ఆవశ్యకత వుంది.

సామాజిక ఉద్యమకారులు పుట్టిన కులాన్నో, మతాన్నో బట్టి కాక వారి దార్శనిక నిబద్ధత, ఓరియంటేషన్ గీటురాయి కావాలి.

కుల పోరాటాలు కులాల విస్తృతికీ, కుల దురహంకారానికీ, అన్యకుల ద్వేషానికీ తోడ్పడతాయి.

మత ఘర్షణలు మతోన్మాద విజృంభణకూ, మత దురహంకారానికీ, అన్యమత ద్వేషాగ్నికీ ఆజ్యం పోస్తాయి.

మతాతీత కుల నిర్మూలన పోరాటాలు ప్రజాస్వామికీకరణకూ, ప్రగతిశీల ఉద్యమానికీ ఉపయోగపడతాయి.

దళితులు పీడిత వర్గ ఉద్యమ స్రవంతికి దూరం కావడం దళిత ఉద్యమానికే హానికరం. ప్రగతిశీల పీడిత వర్గ ఉద్యమాలు దళితులను విస్మరించడం వామపక్ష ఉద్యమ ప్రగతికి నష్టదాయకం.మార్క్సిజం-లెనినిజంలోని మౌలికాంశాలనూ, డా॥ బి.ఆర్. అంబేద్కర్ ఆలోచనా విధానంలోని అభ్యుదయానుకూల భావజాలన్నీ సమన్వయం చేసి సాంఘిక విప్లవాన్ని, ఆర్థిక పోరాటాలనూ ద్విముఖ పోరాటంగా నిర్వహించడం ద్వారా ఈ దేశ రాజకీయాధికారాన్ని శ్రమజీవులు సాధించాల్సి వుంది.

'మద్‌హబ్ నహీఁ సిఖాతా ఆపస్ మెఁ బైర్ రఖ్‌నా' అన్న ఇక్బాల్ గీతపాదం నిన్నటి నానుడిగా మిగిలిపోయింది.

'మద్‌హబ్ హీ సిఖాతా ఆపస్ మెఁ బైర్ రఖ్‌నా' అనేది నేటి చారిత్రక వాస్తవమై నిలబడింది.

'కులం', 'మతం' అనే ఇన్‌స్టిట్యూషన్స్ రెండూ ఈ దేశంలో వేలాది సంవత్సరాలుగా అన్యకుల ద్వేషాన్నీ, అన్యమత విద్వేషాన్నీ పురికొల్పుతున్నాయి.

ఒక కులాన్ని విభేదించి మరో కులం పుట్టిన్నాడే; ఒక మతాన్ని విభేదించి మరో మతం రూపుకట్టిన్నాడే విద్వేషానికి బీజాలు పడ్డాయి.

కుల స్పృహ - కులాభిమానం - కుల దురభిమానం - అనేవి ఒక దాని కొనసాగింపు మరొకటి మాత్రమే - ఇవి క్రమక్రమంగా ముదిరి అనివార్యంగా అన్యకుల ద్వేషాన్ని ప్రేరేపిస్తాయి.

అలాగే....

మత స్పృహ - మతాభిమానం - మత దురభిమానం ముదిరి అన్యమత ద్వేషాన్ని ఉసికొల్పుతుంది.

వీటికి వ్యతిరేకంగా కుల నిర్మూలన స్పృహ, మతతత్వ నిర్మూలన స్పృహను విస్తృత ప్రజా ఉద్యమాల ద్వారా జాగృతం చేయాల్సి వుంది. సాంఘిక, ఆర్థిక, రాజకీయ దోపిడీకి గురవుతున్న పీడిత ప్రజల సమైక్య పోరాటాలను నిరంతరం నిర్వహించడం ద్వారా, సమరశీల ఉద్యమ చైతన్యాన్ని రేకెత్తించడం ద్వారా మాత్రమే ఇది సాధ్యమవుతుంది.

---

# స్త్రీల హక్కులపై మత ప్రభావం

**(68వ పేజీ తరువాయి)**

హక్కులన్న భావనలో మతమౌఢ్యానికి, పురాతన భావాలకు స్వస్తిచెప్పి స్త్రీ వికాసానికి పెద్దలందరూ సహకరించాలి.

2. అన్ని మతాలు సామాజిక స్పృహతో ఏనాడో చేసిన తమ 'పర్సనల్ లా' మారుతున్న పరిస్థితులకు అనుగుణంగా మార్చినపుడే సమగ్రాభివృద్ధి సాధ్యపడుతుంది.
3. "నస్త్రీ స్వాతంత్ర్య మర్హతి" అని ఏనాడో మనువు చెప్పిన ధర్మం ఈనాడు వర్తించనట్లే, ఖురానులో స్త్రీ పురుషుడి ప్రధానమైననిధి' - 'ఏ పురుషుడైతే తన భార్యను సమంజసంగా, సగౌరవంగా చూస్తాడో అతడే పూజ నీయుడు' అని 'తన అవసాన సమయంలో నమాజు చేయడంతోపాటు ముస్లిం తన స్త్రీలను మరువరాదని,' తెలిపిన ఏ మతంలోనైనా మంచి విషయాలు సరిగా అవగాహన చేసుకొని అమలుపరచాలి. మతం చెప్పిన మంచి విషయాలు, నైతిక ప్రవర్తన ఆమోదయోగ్యం. అలాగే దానిని అడ్డంగా పెట్టుకుని ప్రజ్వరిల్లచేస్తున్న ఛాందస భావాలు రూపుమాపడం తక్షణ కర్తవ్యం.
4. ప్రభుత్వంకూడా తనవంతు బాధ్యతగా చట్టాలలోని లోపాలను తొలగించి, కుటుంబ విషయాలలో, వ్యక్తిగత చట్టాలలో కల్పించుకోనవసరం లేదన్న భావం విడనాడినపుడే స్త్రీ వ్యక్తిగా, తన హక్కులను పదిలపరచుకుని, సమాజానికి ఇతోధిక సేవచేసే శక్తిగా రూపొందుతుంది. లౌకికవాదం, మత సామరస్యంతో జాతీయ భావాన్ని పెంపొందించాలి.
5. సంఘంలో జీర్ణించుకుపోయిన మతంను పూర్తిగా తుడిచి పెట్టకపోయినా దానినుండి ఆవిర్భవించిన పరిశోధనను శాస్త్రపరంగా, శాసనపరంగా ప్రజలందరి సంక్షేమానికి వినియోగించిననాడు, ఛాందసత్వానికి తావుండదు.
6. స్త్రీలకు విద్యద్వారా వికాసమొస్తుంది విద్య, ఆర్థిక స్వాతంత్ర్యంద్వారా వారి హక్కులను వారు గుర్తించి, ఛాందస భావాల ప్రాంతిపదికగా ఏర్పడిన చట్టాలను తొలగింపచేసి, నిస్సంకోచంగా తమ హక్కులకై పోరాడిననాడు సమాజం అభివృద్ధి చెందుతుంది.

---

# హిందూ మతం దళితులు

**(72వ పేజీ తరువాయి)**

పెట్టారు. అందరూ హిందువులయితే గంగసింధు బిందువు లయితే మరి పంచములని పిలిచిన వారిని తమ నీళ్ళు ముట్టుకోనీయరేమి? వారు ముట్టుకుంటే నే నీళ్ళు ఎందుకు మైలపడి పోతాయి? చెరువులోనో, బావిలోనో నీళ్ళు తాగారని వారిని ఎందుకు చంపుతున్నారు? అందరూ గంగసింధు బిందువు లే అయితే పంచమగంగ ఎందుకు మైలది అవు తుంది? బ్రాహ్మణ గంగ ఎందుకు పవిత్ర మైనదవుతుంది? నీళ్ళదగ్గర రక్తపాతం ఎందుకు అవుతుంది? మొదట్లో అందరూ హిందువులే అనుకున్నా మధ్యలో విడిపోయిన లేదా బయటకు నెట్టివేసిన వారిని తమలోకి తీసుకోవటానికి నిజమైన ప్రయత్నాలు ఎందుకు జరగటంలేదు? ఆ ప్రయత్నమే గనుక జరిగితే కోట్లాదిప్రజలు ఈనాటికీ ఊరికి అవతల, పూరి గుడిసెల్లో, కట్టుకోవటానికి బట్టలేక తినటానికి తిండిలేక, చేసుకోవటానికి పనిలేక, విద్యలేక అజ్ఞానంతో అంధకారంలో ఎందుకు మగ్గిపోతున్నారు! అందరూ నిజంగా ఒకటే అయితే కేవలం కులం పేరుమీద ఈ గృహదహనాలు, మానభంగాలు మూకుమ్మడి హత్యలు ఎందుకు జరుగుతాయి?

వీటిఅన్నిటికి సమాధానం ఒకటే కనిపిస్తుంది. హిందువులు, దళితులు ఒకటికాదని వేరువేరని! హిందూమతంపై దళితులు పోరాటం చేస్తున్నారని.

# మతము-రాజకీయాలు

జీవి పరిణామం, మానవ సమాజ పరిణామం కోటాను కోట్ల సంవత్సరాలు సాగింది. మానవుడు ఆటవిక దశలో వున్నపుడు-మతాలులేవు. కులాలులేవు. జాతులులేవు. జంతువుల వలెనే మానవుడు జీవించాడు. ప్రకృతి అంతా తనకు అతీతమైన విషయంకనుక ప్రకృతిని మానవాతీత విషయంగా ఆరాధించాడు. ప్రసన్నం చేసుకోడానికి ప్రయత్నించాడు. అదే మతంగా రూపొందింది. ఆ విధంగా మానవ సమాజం వివిధ పరిణామ దశల్లో వివిధ దేశాల్లో వివిధ మతాలు, జాతులు పుట్టాయి. ఎవరి మతానికి వారి వారి దేవుళ్ళు, దేవతలు పుట్టుకొచ్చారు.

ఇన్ని మతాలు, ఇన్ని జాతులు సహజీవనం చేస్తేనే మానవ సమాజం అభివృద్ధి చెందింది. ఆటవిక యుగంలోంచి నేడు అణుయుగంలోకి వచ్చింది.

అతి ప్రాచీన నాగరికత గల భారతదేశంలో అనేక మతాలు పుట్టాయి. హిందూ మతం, బౌద్ధం, జైనం, అందులో శాఖోప శాఖలు వైష్ణవం, శైవం, శాక్తేయం, ఇత్యాది ఇస్లాం, క్రైస్తవ, పార్శీ మతాలు బయటనుండి వచ్చాయి. బౌద్ధంలాంటి భారతీయ మతాలు బైటికి వెళ్ళాయి.

ఎవరి మతం వారిది, ఎవరి దేవుళ్ళు వారి వారు. కలిసి జీవించారు. కలహాలు పడ్డారు. కాని భారతీయ చరిత్రలో సంస్కృతిలో సహజీవనం, సహనం, సామరస్యం, శాంతియుత స్వభావాలే ఎక్కువ.

## ప్రథమ భారత స్వాతంత్ర్య పోరాటం

1857లో ప్రథమ భారత స్వాతంత్ర్య పోరాటం జరిగింది. హిందూ, ముస్లింల సిపాయిలు కలిసి తిరుగుబాటు చేశారు. కలిసి చిట్టచివరి మొగలాయి వంశస్థుడు బహదూర్‌షాను ఢిల్లీ సింహాసనం ఎక్కించారు. ప్రథమ స్వాతంత్ర్య పోరాటం వీగిపోయింది.

ఆధునిక భారత జాతీయోద్యమాన్ని మతాలవారు, అన్ని జాతుల వారు, అన్ని కులాలవారు కలిసి నడిపారు. హెచ్చు, తగ్గులువుండవచ్చు. కాని అందరూ కలిస్తేనే అది బృహత్తర జాతీయ ఉద్యమం అయింది.

చిట్టచివర నావికులు తిరుగుబాటుచేశారు. అన్ని మతాల వారు అందులో వున్నారు. కాంగ్రెస్, ముస్లింలీగ్, కమ్యూనిస్టు జెండాలు ఎగురవేశారు. అజాద్ హింద్ ఫౌజ్‌లో అన్ని మతాల వారు, అన్ని కులాలవారు వున్నారు.

బ్రిటన్ వారు తమ విభజించి పాలించే నీతిలో హిందూ ముస్లిం విభేదాలు పెంచారు. అట్టడుగు కులాలవారిని అంటరానివారిని రెచ్చగొట్ట చూశారు. కమ్యూనల్ ఎవార్డులన్నాడు. విభజించి పాలించే నీతిలో చిట్ట చివరకు దేశాన్ని విభజించారు. గత్యంతరం లేక తెల్ల జెండా ఎత్తారు.

దేశ విభజన సమయంలో మతం, మత విద్వేషంగా మారింది. మత మారణ హోమంతో రక్తం ప్రవహించింది

స్వతంత్ర భారతదేశం ముందుకు సాగింది. అభివృద్ధి పొందుతూ ముందుకు సాగడంతో మళ్ళీ మత విభేదాలు, కుల విభేదాలు వచ్చాయి.

భారతరాజ్యాంగం మత ప్రమేయంలేని, మతాతీత రాజ్యాంగంగా ఏర్పడింది. కాని అభివృద్ధిలో అసమానతలు హెచ్చు తగ్గులు మళ్ళీ కుల, మత ప్రాంతీయ విభేదాలకు దారి తీశాయి.

గత నాల్గయిదేళ్ళుగా మళ్ళీ మత మారణ కాండలు, రక్తపాతం సంభవించాయి.

జాతీయోద్యమంలో గాంధీజీ-ఈశ్వర్, అల్లా తేరేనామ్ అన్నాడు. నెహ్రూ, సుభాష్ బోస్, చంద్రశేఖర్, అజాద్, భగత్‌సింగ్, కుల, మత విభేదాలు లేకుండా భారత ప్రజలను అందరిని ఐక్యం చేయడానికే పాటుపడ్డారు.

భారత జాతీయోద్యమం సమయంలో దేశభక్తి వెల్లి విరిసింది. జైళ్ళకు వెళ్ళినపుడు ఎవరు ఏకులం, ఏ జాతి, ఏ మతం ఎవరికీ స్ఫురణకు రాలేదు. ఆ రోజున త్యాగం, నిస్వార్థ ప్రజాసేవ, దేశభక్తికి గీటురాయి.

భారత జాతీయోద్యమంలో రూపొందిన సెక్యులర్‌భావం లౌకిక ప్రజాస్వామ్య రాజ్యాంగ చట్టంగా అవతరించింది. మతానికి రాజ్యాంగం అతీతమైనది. ఎవరి మత విశ్వాసాలను వారు కలిగి వుండవచ్చు. కాని ప్రభుత్వానికి ఒక మతం అంటూ ఏదీ లేదు. State Religion లేదు. రాజ్యాంగ లక్ష్యాలు యావత్తు భారతదేశ ప్రజల లక్ష్యాలు.

## లౌకిక విధానాన్ని దిగజార్చారు

కాని ఈ secularism అన్నది. ఆ తరువాత క్రమంగా నీరు కార్చబడింది. నెహ్రూ అనంతరం State కు Religion కు సంబంధం పెరిగి పోయింది. ప్రభుత్వ ప్రచార సాధనాలన్నీ మతప్రమేయం పెట్టుకోనారంభించాయి. ముందు హిందూ మతం తరువాత ఇస్లాం, క్రైస్తవ ఇతర అన్ని మతాలతో ప్రభుత్వ ప్రచార సాధనాలు ప్రమేయం పెట్టుకోనారంభించాయి. ప్రచారం మొదలు పెట్టాయి.

గాంధీజీ హత్య భారతదేశ చరిత్రలోనే అత్యంత విషాదకర ఘట్టం. హిందూ మతోన్మాదం జాతి పితను హతమార్చింది.

ఆ తరువాత కొంతకాలం సర్దుమణిగినా మళ్ళీ మతం-రాజకీయ రంగంలోకి జొరబడింది. మళ్ళీ హిందూ-ముస్లిం

కొట్లాటలు ప్రారంభ మయ్యాయి. సిక్కు మతం పేరుతో పంజాబ్ ఉగ్రవాదం చిచ్చు రగిలించింది.

రామజన్మభూమి-బాబ్రీ మసీదు వివాదంతో దేశంలో మళ్ళీ భారత స్వాతంత్ర్య అవతరణ కాలంనాటి మత వైషమ్యాలు, మత కలహాలు విషాద ఘట్టాలు పునరావృతం అయ్యాయి.

ఏ మతమూ ఇతర మతాలను నాశనం చేయమని చెప్పదు. ఇతర మతస్తులను చంపమని చెప్పదు. కాని పంజాబ్‌లో సిక్కు మతోన్మాదులు ఉత్తర భారతంలో బి.జె.పి. పరివారం హత్యాకాండలకు దిగారు.

వివేకానందుడు చికాగో ప్రపంచ మతాల పార్లమెంటులో చెప్పినటువంటిది భారతదేశ మత సమానత్వ భావానికి ప్రతిబింబం. అన్ని మతాలు మంచివే. అన్ని మతాలు నిజమైనవే అని ఆయన ఉద్బోధించారు.

" We believe not only in Universal Toleration But we accept all religion as true" అని ఆయన ప్రకటించారు.

అంతేకాదు మతంపేరుతో మత ఛాందసత్వం, మత దురభిమానం, మత విద్వేషం పనికి రాదన్నారు.

" Secterianism gives bigotry, and its. Terrible descendent Fanatecism have long possessed this beautiful Earth. They have filled the earth with violence, drenched it often, with human blood, destroyed civilizatios and sent whole nations to despair "అని ప్రకటించారు.

మతాలలో మంచితో పాటు- చెడు ప్రవేశించింది. హిందూ మతంలో అస్పృశ్యత, కులాల హెచ్చుతగ్గులు, స్త్రీల పట్ల వివక్షత మూఢనమ్మకాలు పెచ్చరిల్లాయి.

అతి బాల్య వివాహాలు, నిర్బంధ వైధవ్యం, సతీ సహగమనం అన్నీ మత ధర్మాలు, సంప్రదాయాల పేరిటే అమలు జరిపారు. మనుస్మృతిలో చెప్పిన ధర్మాలు- సమాజాభివృద్ధికి ఆటంకాలు. అందులో నస్త్రీ, స్వాతంత్ర్య మర్హతి అన్నారు.

దేవదాసీ విధానం మతం పేరుతోనే కొనసాగింది.

ఇలా ఎన్నైనా చెప్పవచ్చు.

మతం-సామాజిక రంగంలో ప్రవేశిస్తే అన్నీ చెడుగులే. అలాగే సాంస్కృతిక రంగంలో ప్రవేశిస్తే అరిష్ట దాయకమే.

నేడు అజారుద్దీన్, ముస్లిం గనుక క్రికెట్ కెప్టెన్‌గా వుండ కూడదు అంటే ఎలా?

బిస్మిల్లాఖాన్, ఇంకా అనేక మంది మహా సంగీతవిద్వాంసులు ముస్లింలు. పలువురు శిల్పులు, ప్రఖ్యాత చిత్రకారులు ముస్లింలు. వీరందరినీ బహిష్కరించుదామా?

ఆర్.ఎస్.ఎస్. నాయకుడు గోల్వాల్కర్ రచించిన "Bunch of thoughts" లో అన్నీ మతతత్వ, మత దురహంకార అభివృద్ధి నిరోధక భావాలే.

అలాగే ఇపుడు హిందూత్వ పేరుతో బి.జె.పి. పరివారం భారతీయ సంస్కృతిని హిందూ సంస్కృతిగా దిగజార్చుతున్నారు. మెజారిటీ మతస్తుల ఆధిపత్యం, నెలకొల్పి మైనారిటీ మతస్తులను రెండవ శ్రేణికారులుగా చేయ ప్రయత్నిస్తున్నారు.

మతాతీత రాజ్యాంగ భావనను, లౌకిక విధానాన్ని psudo-Secularisam నకిలీ లౌకికవిధానంగా చిత్రించ చూస్తున్నారు.

గోల్వాల్కర్-నాజీ నియంతృత్వాన్ని బలపరిచారు.

ముస్లిం ఛాందస వాదం, కూడా ఇదే కాలంలో తలెత్తింది. అది స్త్రీలకు అన్యాయం చేస్తున్నది. మూఢ భక్తిని మూఢ నమ్మకాలను పెంచుతూంది.

అలాగే సిక్కు మతోన్మాదులు ఖలిస్తాన్ వేర్పాటు నినాదం లేవదీసి, పంజాబ్‌ను దేశం నుండి విడగొట్టాలని, సామూహిక హత్యాకాండలకు దిగారు. సంవత్సరాల తరబడి అమాయక ప్రజల రక్తాన్ని ప్రవహింపచేశారు. సిక్కు మతోన్మాదానికి ప్రధాని ఇందిరాగాంధీ బలికావడం భారతదేశ చరిత్రలోనే అత్యంత విషాదకర విషయం.

మహాత్మాగాంధీ హిందూ మతోన్మాదానికి బలి అయితే, సిక్కు మతోన్మాదానికి ఇందిరాగాంధీ బలి అయిపోయింది.

రాజకీయాలను మతాన్ని ముడిపెడితే జరిగేవిపత్తు ఇదే. అందుచేత రాజకీయాలకు మతాన్ని ముడిపెట్టే ప్రయత్నాన్ని తిప్పికొట్టి, నిజమైన భారతీయ సంస్కృతి వారసత్వాన్ని అనుసరించి మత సామరస్యాన్ని మత సహనాన్ని, సర్వ మత సమానత్వాన్ని మనం సాధించాలి. అదే నేటి కర్తవ్యం.

**-పి. ఆర్. ఆర్.**

# మతము – తత్వశాస్త్రము

– శ్రీ పుట్టా సురేంద్రబాబు

అనేకమంది మేధావులచే గతంలోనూ, వర్తమానంలోనూ అనేక రకాలుగా విశ్లేషింపబడుతూ చర్చింపబడుతున్న ప్రముఖ విషయమిది. అయినా ఆ విశ్లేషణలేవీ ఈ విషయమై ఒక సమగ్రరూపాన్ని సమాజానికి అందించలేకపోయాయనడం నిష్ఠురవాస్తవం. "మతం లేకుంటే మనుగడే లేదు మనిషికి అన్న దగ్గరనుండి తత్త్వశాస్త్రంకూడా మతంలో ఒక భాగం మాత్రమే, ఇంకా చెప్పాలంటే ఏ సమాజానికైనా మతం హృదయం లాంటిదవుతుంది" అనేంతవరకు సాగిందొక పక్షపువారి ధోరణి.

ఇందుకు భిన్నంగా, మతం మానవ వికాసరూపమైన మనుగడకు ప్రధమ ప్రతిబంధకమనీ, అది ఒక మత్తుమందు లాటిదనినీ, మానవ జాతికి తత్త్వశాస్త్ర పురోభివృద్ధికి మతం చేసినంత చెడు మరేదీ చేయలేదనీ, కళ్ళుండీ చూడగలిగాలేగానీ ఇప్పటికీ దాని విషప్రభావం మానవ సమాజంపై ఏ మేరకు ప్రసరిస్తున్నదో తెలుసుకోవడం కష్టమేమీకాదనీ, మతాన్ని కూకటివ్రేళ్లతో పెకలించకపోతే మానవ వికాసం అనేదేలేదనీ, రాదనీ అనేంతవరకు సాగింది మరోపక్షపు ఆలోచన.

మొదటి ధోరణి మనుగడ సాగించడానికి కారణం మతం పేరిట చెప్పబడుతున్న అనేకాంశాలలో కొన్ని వ్యక్తి శీలానికీ, స్వార్థత్యాగానీ, ·ధర్మపరతకూ ఆలంబననూ, ప్రేరణనూ కలిగించేవిగా ఉండడం. మతానుయాయులుగా ఉంటున్న వారిలో కపటుల్ని మినహాయిస్తే మిగిలినవారిలో మానవత్వపు పోకడలు తగినంతగానూ గోచరిస్తాయి. అలాగే, మతానికి ప్రాధాన్యతనూ, ప్రాచుర్యాన్ని కలిగించిన ప్రవర్తకుల వ్యక్తిగత జీవితమూ, త్యాగనిరతి వగైరాలు సాంప్రదాయకంగా బ్రతుకుతున్న అనుయాయుల్లో ఎంతో ఉదాత్తంగా చిత్రీకరింపబడగా వారి వారి అదఃచేతనలో కూడా స్థిరంగా పాదుకుని పోయాయని, మరో ముఖ్య విషయాన్ని మనమిక్కడ గమనించాల్సి ఉంది. మానవ స్వభావంలోనే ఉన్న అనుకరణశీలత, మతాభిమానమూ (ఇది నాది అన్న భావం) ఇవన్నీ కలగలసి మత భావనను కాపాడుతున్నాయి.

## మతం ముసుగులో అత్యాచారాలు

అలానే మత వ్యతిరేక దృష్టి అప్రతిహతంగా కొనసాగుతూ ఉండడానికి కొన్ని కారణాలున్నాయి. అవేమీ ఊరకనే పుట్టలేదు. చరిత్రలో మతం ముసుగులో జరిగిన అరాచకాలు, అత్యాచారాలు, అసమానతలు కోకొల్లలు. ఇప్పటికీ మతం పేరిట జరుగుతున్న అనవసరపు నిమ్నాధిక్యతలు, అధికులుగా లెక్కింపబడుతున్న వారిలోని అయోగ్య లక్షణాలు, దుష్టవర్తనలూ ప్రస్ఫుటంగా కనబడుతూనే వున్నాయి. అదీన్నీకాక, మానవ సంఘంలో మత యుద్ధాల పేరున జరిగిన అమానుష మారణకాండా, సమిష్టి ప్రయోజనాలను దెబ్బతీస్తూ భిన్న మతాల మధ్య రావణకాష్టంలా రగులుతున్న వర్గవైషమ్యము మొదలైన వాటిని గమనించి వివేకం కలవారు ఎవరు మాత్రం వ్యతిరేకించకుండా వుండగలరు? గతం అలా వుండగా, ఇప్పటికీ ఆయా మత ప్రచారకులను, బోధకులనూ దగ్గరగా పరిశీలించగలిగితే వారిలో ఎక్కువ మందిలో నెలకొనివున్న అవినీతి, అరాచక స్వార్థప్రవృత్తి, ధనదాహము, కీర్తి, కాపట్యము (చెప్పడానికి – చేస్తున్నదానికి మధ్య ఎంతో వ్యత్యాసముండడం) త్యాగం పేరున స్వార్థం ప్రబలుతుండడంలాటివన్నీ మతస్తుల ఎడల వైముఖ్యాన్ని జనింపచేస్తుండగా, ఇది చాలదన్నట్లు కొందరు అక్కరలేనంత వ్యతిరేకతను హృదయంలో నింపుకుని, మనిషి స్వభావంలోనున్న (మనస్తత్వానికి సంబంధించిన) ఉద్రేకాలనూ, అనుసరణశీలతనూ రెచ్చగొట్టి వ్యతిరేక కార్యక్రమావళిని, అందుకు తగిన భావాలను సామాన్యులకు నూరిపోయడంద్వారా వారిని మతమంటేనే ఎలర్జీ – రోతకలిగే స్థితికి దిగజారుస్తున్నారు. ఇవన్నీ కలగలసి అవసరమైన వ్యతిరేకతతో ఆగిపోక అనవసరమైన మత వ్యతిరేక భావనను చావకుండా కొనసాగేట్లు చేస్తున్నాయి.

నిజానికి మతమన్న మాటకు భాషాపరంగావున్న అర్థం చాలా చిన్నది, సరళమైనది. 'మత్యుద్భవం మతం' అని వ్యుత్పత్తి. ఆలోచననుండి పుట్టిన అభిప్రాయమని దానర్థం. మతపరమైన అవకతవకలు పెచ్చరిల్లి మతమన్న మాటకు విపరీతార్థం వినియోగంలోకి రాకపూర్వం అది సార్థక ప్రయోగంగానే వుంది. పండితలోకంలో ఇప్పటికీ ఆ మాట ఆ అర్థంలోనే వినియోగంలోవుంది. కనుకనే ఆస్తికమతం, నాస్తికమతం, బౌద్ధమతం, జైనమతం, సాంఖ్యమతం, శైవమతం వగైరా వగైరా ప్రతి ధోరణికి మతమన్న మాట వాడబడింది. ఈ మధ్య వచ్చిన అద్వైతం శంకరమతానుసారం, విశిష్టాద్వైతమతం రామానుజ మతసారం అనటంలాటి వ్యవహారంకూడా ఈ అర్థాన్నే సూచిస్తున్నాయి. ఈ మతమన్న మాటనిలా దాని అసలర్థంలోనే తీసుకుంటే భాషాపదాల ప్రయోజనం మానవ సంఘానికి ఎలా చేకూరుతుందో అలానే ఇదీ ఉపయోగపడగలదు. ఈ పరిమితుల్లో ఈ మాట ఏమాత్రం దుష్టప్రయోగం కాదు పైగా చక్కటి ప్రయోగం కూడా. సంస్కృత భాష ఎక్కువగా వినియోగంలో నున్నంత కాలం భాషాభిజ్ఞుల మధ్య ఈ మాట ఈ అర్థంలోనే ప్రయోగించబడింది. ఇంతవరకైతే దీనివల్ల సమాజాని కొచ్చిన చిక్కేమీ వుండకపోను. ఇంతకుమించి దానికో క్రొత్త (అసహజమైన) రూపునివ్వడం ద్వారా లేనిపోని సమస్యను కొనితెచ్చుకుందీ సమాజం. ఈరోజు మతమన్నది,

దానిని అభిమానించేవారిలోనూ, వ్యతిరేకించేవారిలోనూ కూడా ఒక ప్రత్యేక అర్థంలో వాడబడుతోంది.

## మతగ్రంథాలు

దానికొక ప్రామాణిక గ్రంథం వుంటుంది; అది మనిషిని గురించీ, సమాజాన్ని గురించీ, ప్రకృతిని గురించీ కొన్ని నిశ్చితాభిప్రాయాలను కలిగి వుంటుంది; ప్రకటిస్తుంది. అవే సత్యమైనవనీ, అన్యమైన భావాలు సరైనవి కావనీ నొక్కి చెపుతుంది; నమ్మమంటుంది; అంగీకరించమంటుంది. ప్రశ్నిస్తే కోప్పడుతుంది. శిక్షిస్తానంటుంది. అవకాశముంటే (బలం సరిపోతే) తమని ప్రశ్నించినవారినీ, అంగీకరించనివారినీ మత ప్రతినిధులుగానున్నవారు అనూనుషంగా శిక్షించడమూ వుంది. అదొక చేదు నిజం. చారిత్రక వాస్తవం. అయితే ఈ రకమైన ఏ మతమ్మూ, మత ప్రతినిధీ ప్రశ్నించడం ఎందుకు శిక్షార్హమైందో పరీక్షించడంవల్ల ప్రమాదమేమో మాత్రం ఇంతవరకూ చెప్పలా! ఇకముందూ చెప్పరు. చెప్పలేదు కూడా. ఎందుకని? 1) మతం పేరిట ప్రామాణిక గ్రంథాలుగా చెలామణిలోనున్న వాటిలోని నిజానిజాలు తేల్చుకుందామనే నిజాయితీగానీ, తనకుతానె తన కొరకైనా వాటిని తేల్చుకోవడం అవసరమన్న వివేకంగానీ మత ప్రచారకులలోనూ, అనుయాయులలోనూ లేకపోవడం ఇందుకు ప్రధాన కారణంగా చెప్పుకోవచ్చు. . 2) స్వపర భేదాలు దృఢ పడడంతో రాగద్వేష సంకులమైన మనస్సు వీరాభిమానంతోనో, అకారణ ద్వేషంతోనో అజ్ఞానంతో కప్పబడి కొట్టుకులాడడం రెండో కారణం. 3) ముక్కూ మొహం తెలియని పయస్సు నుండి పారంపర్యంగా వర్తమాన, భావితరాల వారికి ఆయా అంశాలనూ వాటిపట్ల గుడ్డిగా తామేర్పరచుకున్న రాగద్వేషాలనూ రంగరించిపోయడం మరో కారణం. ఇవి చాలవన్నట్లు కుచ్చిత రాజకీయాలూ, వాటి కుతంత్రాలూ స్వార్థోపలబ్ధికై అవి ప్రదర్శిస్తున్న అభినయాలూ సామాన్య జనాన్ని పెద్ద విషవలయంలోకి లాగేస్తున్నాయి. దీపం శలభాన్ని ఆకర్షిస్తున్నట్లు ఆత్మహనన పర్యంతం గుంజేస్తున్నాయి. ఈ మహోధృతిలో మానవత్వపు విలువలు అట్టడుగునపడి కొట్టుమిట్టాడుతున్నాయి. చిక్కిశల్యాలయ్యాయి. సువ్యవస్థ కొరకై తాత్విక వేదిక ఆధారంగా ప్రారంభమైనప్పటికీ కాలక్రమంలో రకరకాల అవకతవకల్ని సంతరించుకున్న మత మతాంతరాలలో మనం మరువకూడని విషయమొకటుంది.

## మానవ విలువలు

నానాభ్రష్టు పట్టిస్తూ సమాజాభ్యుదయానికి అవరోధాలుగానున్న వాటితోపాటు, మహోదాత్తమైన మానవ విలువలూ కొండల్లో, గుట్టల్లో అరుదుగా లభ్యమయ్యే మణుల్లా - మతాల పేరిట చెలామణి అయ్యే గ్రంథాలలో వెతుక్కుంటే దొరుకుతాయి. ఆయా కాలాలలోని ఉదాత్త చరితులు అలాంటి వాటినే ఒక్కొక్కరు ఒక్కొక్కదానిని వెదికి పట్టుకుని వానికి సానబెట్టి నగిషీలు చెక్కి వాటి వెలుగులను సమాజంపైకి ప్రసరింపజేస్తూ వచ్చారు అవే ఆయా కాలాలలోని అన్ని సిద్ధాంతాల (మతాల) చరిత్రలోనూ అగుపించే సంస్కరణ రూపాలు. అయితే సంస్కరణ పేరిట అప్పటికున్న సమాజాన్ని పాశవికంగా మరింత అధోగతికి నెట్టివేసిన సంఘటనలూ తక్కువేంలేవు. గతంలోకి దృష్టి మరల్చగలగాలేగాని కావలసినన్ని కనిపిస్తాయి వికృత గాధాభివ్యంజకాలైన శైధిల్యాలు. ఇవన్నీ యిలా వుంచి ఈ మత విషయాన్ని మరోవైపునుండి చూస్తే ఒక విచిత్రం అగపడుతుంది.

ఈనాడు మతమన్నమాట సంతరించుకున్న 'గుడ్డిపోకడ' అన్న అర్థంవల్ల కాబోలు ప్రతి మతస్తుడూ తమది మతం కాదనీ ధర్మమనీ అంటే అదొక సమగ్ర జీవన విధానమనీ చెప్పడం ప్రారంభించాడు.

నాస్తికులెలాగూ తాము వ్యతిరేకులమనే చెప్పుకుంటున్నారనుకోండి. (తమాషా ఏమంటే వాస్తవానికి నాస్తికమూ ఒక మతమే అయినా ఆ మాటంటే వారికి గిట్టదు. ఎంత నచ్చచెప్పినా మనస్సుకు పట్టదు. ఎందుకని? వారిదీ మతపోకడ కనుకనే) మరి ఆస్తికులూ తమది మతం కాదంటూ మత వ్యతిరేక రూపమైన ఈ క్రొత్త పాట ఎందుకు మొదలెట్టారో సాఫీగా ఆలోచించినంతసేపూ తట్టడంలేదు. అటువంటప్పుడు అటు నాస్తికులూ వ్యతిరేకిస్తూ, ఆస్తికులూ తమది కాదంటున్న ఈ మత మహమ్మారి ఇంతకీ ఎక్కడ వున్నట్లు? ఈ విషయం మనకంటే ఆస్థికులూ, నాస్తికులే పరిశోధించి చెపితే బాగుంటుంది.

మరో విషయమూ గమనించాలి మనం. మత వ్యతిరేకులు, మతమనగానే అతిగా ద్వేషించడం, చీదరించుకోవడం చూస్తాం. ఏయే విషయాలు తాము మతాన్ని ద్వేషించడానికి కారణాలవుతున్నాయో అట్టి విషయాలే వున్న ఏ సంఘాన్నైనా అవి మత వ్యతిరేక సంఘాల పేరున వున్నా వ్యతిరేకించగల ధైర్యంగానీ, నిజాయితీగానీ, వివేకంగానీ ఈ అకారణ మతవ్యతిరేకులలో కానరాకపోవడం శోచనీయం. వారిని అకారణ వ్యతిరేకులు అనడానికి కారణం నేను పైన చెప్పిందే. ఉదాహరణకు మతవ్యతిరేక సిద్ధాంతాలుగా ప్రసిద్ధినందిన మార్క్సిజం, నాస్తికం, హేతువాదం, విప్లవవాదం వగైరాలు పరస్పరం వాటిలో అవే కలహించుకుంటూ ఎవరికి వారు ఎదుటివారిని మతతత్వ వాదులంటూ విమర్శాస్త్రాలు సంధిస్తున్నారు. ఇదో వింత. అసలింతకీ మతతత్వమంటే ఏమిటి? మతతత్వం ఎవరిది? అదిలేనివారెవరు? అన్నదే అసలు సమస్యా, చిక్కుముడీను. ఇది విప్పడం అంత సులభం కాదు. ఇలా విశ్లేషించుకుంటూ పోతూంటే మరో ఆశ్చర్యకరమైన అంశం ఎదురవుతుంది.

## అన్యమత ద్వేషం

ఒక వైపు మత వ్యతిరేకులమనేవారు మొత్తంగా అన్ని మతాల్ని వ్యతిరేకిస్తూ (తమదాన్ని విడచి) వాటిలోని మంచినీ చెడునూ కలగలిపి తగలెట్టే యత్నం చేస్తుంటే, మరోవైపు ప్రతి మతస్తుడూ అన్యమతస్తుల్ని, మతాన్నీ, మతవ్యతిరేకుల స్థాయి కేమీ తీసిపోకుండా వ్యతిరేకిస్తున్నాడు. ద్వేషిస్తున్నాడు. దెబ్బతీసేందుకు శక్తిమేర యత్నిస్తున్నాడు. ఎదుటివాటిలోని లొసుగుల్ని దొంతర్లు దొంతర్లుగా వెలికితీసి తూర్పారబడు

తున్నారు. అందుకవసరమైన సాహిత్యాన్ని టన్నులకొద్దీ సృష్టించి ప్రచారం చేస్తున్నాడు. రెండువైపుల నుండి సాగుతున్న ఇంత రాద్ధాంతానికీ, అమానుష కర్మకాండకూ, అసమానతలకూ, వర్గవిభేదాలకూ ఆలవాలమైన ఈ అపసవ్య మతానికి ప్రాతిపదిక ఎక్కడుంది? ఎక్కడుండగలదు? కేవలం రాగద్వేష సంకులమైన అజ్ఞానజనిత అంధానుసరణలోకాక! ఆ విషయమలా వుంచండి.

## తత్వశాస్త్రం

సరైన అర్థంలో తీసుకుంటే మతానికి ఆధారస్థానం (జనక స్థానం) తత్త్వశాస్త్రమే. అయితే, తత్వశాస్త్రం స్వరూపతః ఉన్నదాన్ని అన్వేషించడానికీ అర్థం చేసికోడానికి వివరించడానికి సంబంధించి వుంటుంది. అలానే దాని స్వభావంతో లక్షణముంటుంది. తెలిసినంతమేర వినియోగించుకుంటూ వుండడం, తెలియవలసింది తెలుసుకుంటూ వుండటం. ఈ స్వభావం, ఆస్వరూపం కనుక దెబ్బతింటే సజావుగా సాగవలసిన అన్వేషణ, అవగాహన, వివరణ వాటి కుండవలసిన స్థాయి దెబ్బతింటాయి. అదుగో అలా ఏర్పడ్డ రోగగ్రస్త తత్వశాస్త్రాలాధారంగా పుట్టిన జీవన విధానాలూ, ఆచార వ్యవహారాలూ ఆదర్శాలు మొదలైనవన్నీ, పునః పరీక్ష చేయనక్కరలేదనేంతగా, అనుయాయుల సముదాయాలలో స్థిరపడి, మతానికున్న సరైన అర్థంలోకాక నేడున్నట్లు వక్రరీతిలో మతాలై కూర్చుంటాయి. అదెలానో చూడండి.

చిన్న సంఘటన ఒకటి, ఈ మధ్య నా సమక్షంలో జరిగిందే, ఈ సందర్భంగా స్మరించడం ఉచితంగా వుంటుందనిపిస్తోంది. ఒక సంప్రదాయానికి చెందిన ఒక జగద్గురువుల సమక్షంలో వారి సిద్ధాంతానికే చెందిన ఒక గురుసార్వభౌముని మరొక పండిత ప్రకాండులు ప్రశ్నిస్తున్నారు. "స్వామీ ఈ మధ్య సమన్వయం, సమన్వయం అంటూ పెద్దలూ పిన్నలూ కూడా అతిగా మాట్లాడుతున్నారు. మరి ఈ సమన్వయమన్నది వాస్తవంలో ఆచరణ సాధ్యమేనంటారా?" అని. అంతటివారిలోనే అంతరంగంలో ఇదెలా సాధ్యం? ఇదెలా సాధ్యం అనిపిస్తున్న ఈ సమన్వయం వెనుకనున్న యిబ్బంది ఏమిటో నిజాయితీగా, హృదయపూర్వకంగా ఏదో ఒకదానిని అనుసరిస్తున్నవాళ్ళకుగాని ఎదురుపడదు.

మానవ సంఘంలో అన్వేషణ ప్రారంభం కాకపూర్వం తత్త్వశాస్త్రమూ లేదు, మతమూ లేదు. అన్వేషణ ద్వారా ఉన్నవాటిని అర్థం చేసికోవడం మొదలై చాల కాలం కొనసాగిన పిదపనే అనేకానేక అనుభవాల సారాంశంగా ఏర్పడ్డ వివేకం నుండి మాత్రమే తత్వశాస్త్రం పుట్టేందుకు వీలుంది. ఆపై అది క్రమంగా వృద్ధి చెందుతూ వచ్చింది. ఆ క్రమ వికాసంలో తనను గురించీ, ప్రకృతి గురించీ, సాటి ప్రాణుల గురించీ అవగాహన పెరుగుతున్నకొద్దీ, మనిషికి తానేమి చేయాలో ఏమి చేయకూడదో, అట్లే తన పట్ల ఎదుటివారెలా ప్రవర్తించడం మంచిదో అర్థమవుతూ వచ్చింది. అదే ధర్మానికి ప్రాతిపదిక అయింది. ఈ దశలో జరుగకూడనిదొకటి, మానవ సంఘంలో మానవ మస్తిష్కంలో చోటుచేసుకుంది. ఇంకా ఇంకా ఎంతో ఎదిగి సుసంపన్నం కావలసిన తత్త్వశాస్త్రమూ దాని కనుగుణంగా మార్పులూ చేర్పులతో నిరంతరం సరిచూసుకుంటూ సరిచేసుకుంటూ పరిపుష్టం కావలసిన ధర్మకాయమూ కూడా, ఇవి ఇంతే, ఇక వీటిని మార్చుకోనవసరం లేదు అనే స్థిరాభిప్రాయాన్ని నెత్తికెక్కించుకున్నాయి. ఆ భావాలలానే తరం నుండి తరానికి అందించబడ్డాయి. అలా ప్రారంభమైంది, సాంప్రదాయం పేరిట, ఆచారాలపేరిట, అంధానుసరణ అన్నది. దాని వికృత రూపమే అపసవ్యార్థంలో నేడున్న మతం, మతాలు అనేవి.

తనేమిటి, తన్నావరించిన ఈ ప్రకృతి ఏమిటి, తనకు దానిమధ్య గల సంబంధమేమిటి? అన్న అన్వేషణ, అవగాహనల నుండి ప్రారంభమైన తత్వశాస్త్రమూ మనిషి అవసరాలనుండి పుట్టిన ధర్మశాస్త్రమూ యదార్థంగా వుండవలసిన వాటి స్వరూపాల్ని కోల్పోయి సాంప్రదాయం క్రిందా, ఆచారాల క్రిందా, సమాజంలో వినియోగంలోకి వచ్చి విలువలు పొంది నప్పటినుండి వాటిలోనున్న మంచితోబాటు చెడూ నెత్తికెత్తుకోవడం ఆరంభమైంది. ఈనాడున్న రకరకాల ధోరణులలో ఆస్తిక నాస్తిక మార్గీయులలో ఏ ఒక్కరూ ఇందుకు మినహాయింపు కాదన్నది సత్య శోధకులు గుర్తించవలసిన నిప్పులాంటి నిజం. చేదునిజం కూడా.

ఈ పోకడ ఆరంభమైన రోజు నిజంగా మానవ సంఘానికి ఒక దుర్దినం. అయితే ఈ విధానంలో అవసరమూ, అనివార్యమూనైన విషయమొకటుంది. ***ఎప్పటికప్పుడు గమనించి వినియోగించుకుంటున్న అంశాలను ముందు తరానికి అందించడం అది మౌలికంగానే సమాజ మనుగడకూ, వికాసానికి కూడా ఆయువువట్టు. అయినా వివేకించవలసిన అంశమేమంటే, అందిన, అందుతున్న, అందగల వాటినన్నింటినీ ఎప్పటికప్పుడు ఎప్పుడవసరమైతే అప్పుడు పరీక్షించి, పరీక్షకిచ్చి సరిచూసుకునే ఒక శాస్త్రీయ పంథాను మానవ మస్తిష్కంలో ప్రవేశ పెట్టగలగాలి. అలా చేయగలిగితే సాంప్రదాయమూ చెడదు, సాంప్రదాయాల పేరున నేడు నెత్తికెత్తుకుంటున్న అజ్ఞానపు భాగాలను మోయవలసిన పనీ వుండదు. ఆ స్థితిలోని అవగాహనలు ఎప్పటికప్పుడు పాతక్రొత్తల మేలు కలయికల రూపంలో వుంటూ సమిష్టి శ్రేయస్సుకు ఉపకరణాలు కాగలుగుతాయి.***

మరో విషయమేమంటే, ఇప్పటివరకూ జరిగిన అన్వేషణల ద్వారా మనకు అందుబాటులోనికి వచ్చిన తాత్విక ధోరణులనన్నింటినీ సూక్ష్మపరిశీలన చేయగలిగితే తత్వశాస్త్రమింకా సుసంపన్నం కావలసే వుందనీ, ఏ ధోరణికాధోరణిగా ఏదీ యింకా సంపూర్ణరూపాన్ని సంతరించుకోలేదనీ స్పష్టంగా తెలుస్తుంది. తత్వాన్వేషణకులు తత్వశాస్త్ర పరిధిని ఇదమిద్ధంగా నిర్ణయించుకుని అన్వేషణ సాగించకపోవడమే దీనికి ప్రధాన కారణం. ఆ కారణంగా రకరకాల తాత్విక ధోరణులూ ఒక్కోటి ఒక్కో అంశంపై ప్రధానంగా దృష్టినిడుకుని అన్వేషణ సాగించడం, దానిని గురించే ప్రధానంగా ప్రతిపాదించడం

జరుగుతూ వచ్చింది.ఉదాహరణకు వేదాంతులు అంతరావలోకనం అంటూ బాహ్యాన్ని అప్రధానంగా చూడడం, భౌతికవాదులు మనిషి, మనస్తత్వము అన్నవాటికి ప్రాధాన్యతనివ్వక పదార్థం, పదార్థం అంటూ కొట్టుకులాడడమూ, మరింక కమ్యూనిస్టులైతే అంతా డబ్బులోనే వుంది అనడం వగైరా, వగైరాలెన్నో చూడవచ్చు. అయితే ఈ అసమగ్ర అన్వేషణలూ, వాటి పాక్షిక క్షేత్రాలు వాటినుండి పుట్టిన నానా తాత్విక ధోరణులూ వీటివల్ల ఏర్పడుతున్న ఇబ్బందులు లోపాలతో పాటు నిదానంగా ఆలోచించగలిగితే ఈనాడు వీటివల్ల మనకో సౌలభ్యమూ వుంది. అదేమంటే :

తత్వ శాస్త్రానికీ, ధర్మానికీ ఆధారస్థానమైన మనిషి అతని మనుగడా, దానికై ఏర్పడి వున్న సాటి వాటితో సంబంధాలు, అన్నవాటిని విడచి ఏ తత్వశాస్త్రమూ వుండదు. కనుక ఈనాడు మనమందరం **'అందరి హితం అసలు వాస్తవం'** అన్నది గుర్తించాలి ముందుగా. అప్పుడు అన్ని ధోరణుల యందలి వైజ్ఞానికాంశాల సమాహారాన్ని ఆవిష్కరించుకోవడం ఎంతో సులువు. అయితే ఇక్కడ రాగద్వేషాలు మమతాభిమానాలు అడ్డుగోడలు కాకూడదు. ఒకవేళ ఈ విధానాన్ని అనుసరించగల వివేకాన్ని మనమీనాడు ప్రదర్శించలేకపోయినా కాలమాగదు. కాలపరీక్షలో అసత్యాలూ, భ్రాంతులూ వీగిపోకా తప్పదు. కాబట్టి వివేకంతో సత్యప్రతిష్టకూ ధర్మాచరణానికీ మనవంతు కృషి సల్పడం అన్ని విధాలా మంచిది.

మతమన్న మాటకు అభిప్రాయం (మత్యుర్భవం మతం) అన్న అర్థాన్నలా వుంచి విస్తృతార్థంతో దానినిలా నిర్వచించుకోవచ్చు. సాంప్రదాయంపేర కొన్ని ఆచార వ్యవహారాలూ, విధినిషేధ రూపమైన ప్రణాళికలతో కూడి ఒకరకమైన జీవన విధానమూ, వందలవేల సం॥లుగా క్రమానుగతంగా సంతరించుకున్న సంస్కృతి, నాగరికతలూ వీటన్నింటికీ ఆధారస్థానంలో ఒకతాత్విక యోచన, వీటన్నిటి సమాహార రూపమే నిజంగా మతమంటే. దీనిని తీసివేయడం ఎవరివల్లాకాదు. ఆ అవసరమూ లేదు నిజంగా. ఇది మతానికి సమగ్రమైన, సరైన నిర్వచన రూపం. ఈ అర్థంలో మతాన్ని చూడగలిగితే మతం వల్ల అనర్థమేమీ లేదని తెలుస్తుంది. ఆనాడు అయిన్‌స్టైన్ వాడిన మతమన్న మాటకు ఎలా సంకుచితార్థం లేదో అలాగేనన్నమాట. అయితే సార్వత్రికంగా ఒక నియమం అమలులో వుండేట్లు మాత్రం జాగ్రత్త వహించవలసి వుంటుంది. అదేమంటే ప్రతి మతమూ ఎప్పటికప్పుడు వైజ్ఞానికమైన శాస్త్రీయ విధానాన్ని అందిపుచ్చుకుని తాత్వికపరంగానూ, ధార్మికపరంగానూ అవసరమైనంతమేర మార్పులూ చేర్పులూ చేసుకుంటూ ఆరోగ్యంగా వుంటూ మరింత సుసంపన్నం కావలసివుంది. అసలు మెలకువంతా యిక్కడే వుంది. ఈ అంశాన్ని గనుక పరిగణనలోనికి తీసుకంటే అది మతం పేరున వున్నా, మరోపేరున వున్నా అభ్యుదయ పథంలో కదులుతున్నట్లే. దీనిని గణించక మాది మతం కాదన్నా, శాస్త్రీయ జీవన విధానమన్నా మరోటన్నా ఆచరణలో జరిగేది మాత్రం తిరోగమనమే.

## అంధానుకరణ

మరో రెండుమూడు అంశాల్ని స్పృశిస్తే ఈ శీర్షికాంశాన్ని సంగ్రహంగా దర్శించినట్లు కాగలదు. మతానికుండవలసిన అసలైన అర్థంలో ఈనాడు ఏ మతాలూలేవు. కనుకనే వ్యవహారంలో మతమంటే అంధానుకరణ, అవైజ్ఞానికాంశాల కుంపటి; అమానుషకర్మకాండపరంగా ఎంతో చరిత్రకలది అన్న అర్థం స్వీకరింపబడుతోంది. కనుకనే ప్రతి మతస్తుడూ మాది మతం కాదు, మాది మతంకాదు అంటున్నాడు. మతానికీనాడు వాడుకలో నున్న వికృతార్థం దృష్ట్యా నిష్పాక్షికంగా విశ్లేషించి చూస్తే - మత వ్యతిరేక ధోరణులుగా చెప్పబడుతున్న నాస్తిక, హేతువాద, కమ్యూనిజ మాదిగాగల భౌతిక ప్రధాన వాదాలు కూడా మతరూపాన్ని సంతరించుకునే ఉన్నాయి. ఈ అంశాన్ని ఆయా ధోరణులలో నున్న సూక్ష్మ పరిశీలనా సక్తులు, సమర్థులూ గమనించి సంస్కరణలకై యత్నిస్తూనే వున్నారు. భవిష్య సమాజపరంగా చూస్తే, ఇది సంతోషించదగ్గ విషయమే అయినా ఈ తరహా వ్యక్తుల సంఖ్య స్వల్పాతిస్వల్పం.

అదలా వుంచి ఈ మధ్య కొందరు నూతన తాత్వికుల్లో మరో క్రొంగొత్త పోకడ కనిపిస్తోంది. అందు ప్రధానంగా, నిర్ణయాలకు రావద్దు, అభిప్రాయాలు పెట్టుకోవద్దు. నియమ నిబంధనలు వద్దు వంటి ప్రమాదకర భావాలు బలీయంగా వుంటున్నాయి. సామాజికంగా ఈ భావాలు ఎట్టి ఫలితాలు పుట్టించగలవోనన్న వివేకం వారిలో ఏ మాత్రం అగుపించడం లేదు. ఎందుకిలా జరిగింది? సాంప్రదాయాల పేరన ఏర్పడ్డ అతినియమాలు, నిష్ఠలూ, విధినిషేధాలు మొదలైన వాటివల్ల సమాజానికి జరిగిన అనర్థాలు గమనించడం జరిగింది. ఆ గమనింపు ద్వారా ఏర్పడ్డ ఆవేశం నుండి వాటికి ప్రతిక్రియాత్మకంగా ఏర్పడ్డ మరోరకపు అనర్థరూపాలివి. అక్కడ తగినంత స్వేచ్ఛ కట్టివేయబడగా ఇక్కడ తగినంత స్వేచ్ఛ ఉద్దేశింపబడింది. రెండూ అనర్థ రూపాలేనన్నదే ఇక్కడ మనం గమనించవలసిన విషయం.

**యదార్థ తాత్విక క్షేత్రమైన 'మనిషి - ప్రకృతి - సాటి ప్రాణులు - వీటి మధ్య వున్న సంబంధాలు, వుండదగిన సంబంధాలు' అన్నవాటివల్ల సరైన అవగాహన కలిగితే మాత్రం వ్యక్తికి పరిమిత స్వేచ్ఛ వుండాలన్న ప్రధాన సూత్రం బోధపడుతుంది. పరిమితుల్లేని స్వేచ్ఛగానీ, పరిమితంగానైనా స్వేచ్ఛ లేకపోవడంగానీ క్రమంగా సమాజాన్ని అస్తవ్యస్తం చేస్తాయి. రకరకాల ఘర్షణలకు దారితీస్తాయి. ఈ పరిమిత స్వేచ్ఛ అన్నదాని రూపాంతరాలే నీతి - న్యాయం అన్నవి. వీటనే మరోరకంగా విధులు - హక్కులు అనవచ్చు. ఇవి సక్రమంగా అమలులో వున్న సమాజవ్యవస్థ మాత్రమే సుస్థిరం కాగలుగుతుంది. 'అందరకు మేలు' అన్న ఆశయం ఆచరణలో సాధ్యం కావడమంటే పైన వివరించిన తాత్విక వివేకపు హద్దుల్లో**

(మిగతా 85వ పేజీలో)

అనుబంధం -1

# మతం ఎలా రూపొందింది?

**- దేవీప్రసాద్ ఛటోపాధ్యాయ**

మంత్రం నుండి మతంకు జరిగిన పరివర్తన ఎన్నటికీ పూర్తి కాలేదు. మతంగా రూపొంది మనకు సంక్రమించిన దానిలో మంత్రం మహిమలు గురించిన నమ్మకాలు, అనుష్ఠానాలు వున్నాయి. మతంలో మంత్రాల గురించిన అనేక భావనలు వున్నప్పటికీ మంత్రం అన్న దాని నుండి మతాన్ని వేరుచేసి చూడటం ఆసక్తిదాయకమైన విసయం.

ఆదిమవాసుల మంత్రాల గురించిన భావనలు చాలా మూఢ నమ్మకాలుగా కనబడినప్పటికీ, వీటిని ప్రత్యేకంగా పరిశీలించవలసి వుంటుంది. ఈ మంత్రాలను సర్వ సాధారణంగా సామూహికంగా ఉచ్ఛరించి ప్రదర్శిస్తూ వుంటారు. దీనికి ఒక అధిపతి అంటూ ఒక ప్రముఖ వ్యక్తి వుంటాడు. అంతేకాని ఒక మానవాతీత శక్తి గల దేవుడు, దేవత అన్నవారు మాత్రం వుండేవారు కాదు. ఈ మంత్ర తంత్ర ప్రదర్శన వలన అనుకున్న కోర్కె నెరవేరుతుందని భావించు తుండేవారు. ఇందువలననే కొంతమంది మంత్రాలు లేదా మహిమల ప్రదర్శన ఆ తరువాత శాస్త్రీయ విజ్ఞానానికి మూలకందమని చెప్పేటంతవరకు వెళ్లారు. ప్రకృతి శక్తులను ఆది మానవుడు అర్థం చేసుకోలేకపోయినప్పటికీ, ప్రకృతి శక్తులలో అంతర్భాగంగా వుండే సూత్రాల వలననే యిటువంటి మంత్రాల వలన సత్ఫలితాలు కలుగుతున్నాయని భావించేవారు.

భారతదేశంలో 'పూర్వ మీమాంస' అనే ఒక బలమైన తాత్విక ఆలోచన ఉద్భవించింది. ఇది ఆదిమ కాలంలో మానవుడు వూహించిన మంత్రాల గురించిన ప్రాథమిక భావనల సారాంశమే తప్ప వేరు కాదు. ఈ రకమైన తాత్వికులు దైవ భావాన్ని నిరాకరించడం కూడా అవసరమని భావించారు. చిల్లర దేవతల ఉనికిని కూడా త్రోసిపుచ్చారు. ఎందుకు? మంత్రాల మహిమ వలన అనుకున్న కోర్కెలు సఫలమవుతాయని రుజువు పరచడానికి అలా చేశారు. ఇది భారతీయ తత్వ శాస్త్రంలో విచిత్రమైన, విరుద్ధమైన విషయం. ఈ విధంగా పూర్వ మీమాంస కూడా చాలా సనాతన భావాన్నే కలిగి వుంది. అత్యంత సనాతన భావం కూడా ఒకోసారి విప్లవాత్మక స్వరూపానికి, ధోరణికి దారితీస్తుంది. ఆదిమ మానవుల మంత్రతంత్ర విద్యలకు, యజ్ఞ యాగాదుల రూపమిచ్చినది. ఈ పూర్వ మీమాంస తాత్విక విధానమే. ఆ తరువాత కాలంలో యీ యజ్ఞ యాగాదులు, క్రతువులు ఎంత మూఢనమ్మకాలకు, అభూత కల్పనలకు, భ్రమలకు దారితీశాయో లేక చెప్పనవసరం లేదు.

భారత మత చరిత్ర పుటల నుండి వేదకాల దేవతా గణాలను తుడిచిపెట్టే క్రమానికి యీ పూర్వ మీమాంస ప్రభావమే దారితీసిందా? ఏమైనప్పటికీ భారతదేశ మత వ్యవస్థలో వేదకాల దేవతా గణాలు నిలద్రొక్కుకోలేదు. ఇంద్రుడు, వరుణుడు, మిత్ర ఇత్యాది ఋగ్వేద దేవతలకు ఎక్కడా గుళ్లు గోపురాలు కట్టినట్లు మనకు కనబడదు. బాలి ద్వీపంలో మాత్రమే వరుణుడికి ఒక గుడి వున్నట్లు లూయిరెనో చెబుతున్నారు. నాటికి నేటికీ మిగిలి వున్న గుడి అదేనట.

మతం అన్నది రూపొందడంలో ఒక నూతన దృక్పథం ఆవిర్భవించింది. మానవాతీత శక్తులు వున్నాయని మొదటి సారిగా వూహించింది మతం. ప్రకృతిలో జరిగేదంతా యీ మానవాతీత శక్తులు - ఈ దేవతల అధీనంలో అజమాయిషీలో వుంటాయని భావించడం జరిగింది. వర్షం కురవాలా? వరుణ దేవునికి ప్రార్థనలు, పూజలు చేయాలి. ఆయన కరుణిస్తేనే వర్షాలు కురుస్తాయి. ఆ తరువాత మతం, మత విశ్వాసాలు పెరిగిన కొలదీ ఒకే ఒక దేవుడు - సర్వ జగత్తుకు మూలం, సర్వాంతర్యామి, సర్వాధిపతి అనే దేవుడు. ఒకే శక్తి పరిపాలిస్తోంది అనే భావం ప్రబలింది.

## నగర విప్లవంతో మతం

ఈ విధంగా ఆదిమ కాలంనాట మంత్రం, మహిమ, తంత్రం అన్నది మత రూపానికి ఎలా పరివర్తన చెందిందో చాలా ముచ్చటించుకోవడం జరిగింది. అయితే యీ పరివర్తన క్రమం గురించి తెలుసుకోవలసింది యింకా చాలా వున్నదనుకోండి. అయితే యిక్కడ ఒక విషయం గమనించాలి. ఆదిమకాలం నాటి వర్గరహిత, వర్గ పూర్వపు సమాజంలో మతం అన్నది వున్నట్టు పురాతత్వ పరిశోధనల వల్లకాని, మానుష శాస్త్ర, పరిశోధనల వల్ల కాని కనబడదు. నాగరీకీకరణ, నగర విప్లవం (పట్టణ జనావాసాలు పెరుగుదల) జరిగి ఉత్పత్తిని పెంపొందించి, సంఘటితమొనరించిన వారు క్రమంగా ఎక్కువ అధికార ప్రాబల్యం వహించినప్పటి నుండి మతం అన్నది రూపొందనారంభించింది.

ఈ దృష్ట్యా చూసినప్పుడు యీ ఉత్పత్తిని సంఘటిత పరచినవారు సమాజానికి చెందినవారే అయినప్పటికీ సమాజానికి అతీతులుగా, సమాజాన్ని శాసించే వారుగా వుండేవారని చెప్పవచ్చు. ఇటువంటి సామాజిక పరిస్థితి యొక్క తలక్రిందులు స్వరూపమే - మతం యొక్క ప్రాథమిక స్వరూపంలో ప్రతిబింబించినట్లు చెప్పవచ్చు. ప్రకృతి శక్తులు, ప్రకృతిలో అంతర్భూతంగా వుండే శక్తులు అవే సర్వాధిపత్యం, సర్వ శక్తిమతం అయిన శక్తులుగా యిక మానవుడు చూడటం మానివేసి - మంత్ర తంత్రాల వల్ల సమాజం యొక్క సమిష్టి యిచ్ఛకు అవి లోబడి వుండే శక్తులని, మంత్రాలు ఎలా చెబితే

అవి అలా లొంగి వుండే శక్తులు మాత్రమేనని భావించసాగాడు. అంటే మానవుడు తనకు ఒక అస్తిత్వం, ఒక స్వతంత్ర శక్తి వున్నదనే భావన క్రమంగా రూపుదిద్దుకొంది. రాజు దైవాంశ సంభూతుడు - అనే భావన, ప్రకృతి పరిణామాలను యీ భూపతులు అదుపులో పెట్టుకోగలరన్న నమ్మకం వచ్చింది. అంతవరకు ప్రకృతి అంతా దేవుళ్లు, దేవతల సమూహమే. వీరి అనుజ్ఞ లేనిదే గాలి వీచదు, తుపానులు, క్షామాలు, అంటు జాడ్యాలు, రోగాలు రావు. ఒక్కమాటలో మానవుని అదృష్ట, దురదృష్టాలు, భాగ్యభోగాలు సంపద, దారిద్ర్యాలు అని యీ దేవుళ్లు, దేవతల ఆగ్రహ అనుగ్రహాల వల్లనే కల్గుతున్నాయని మానవుడు ఊహించాడు.

ఏది ఏమైనప్పటికీ నగరీకరణ, నగర విప్లవం రానంతవరకు మతం యొక్క జాడ ఎక్కడా కనబడదని చెప్పవచ్చు. నగరీకరణ, ఉత్పత్తి విధానం ఏర్పడి శ్రమజీవులు, పాలక వర్గాలు అన్న విభజన జరగనంతవరకు మతం అన్నది ఏర్పడలేదు. పాలక వర్గాల చేతుల్లో, ముఖ్యంగా పురోహిత వర్గాల చేతుల్లో మతం అన్నది ఒక ఆయుధంగా, సర్వాధికార సాధనంగా అదికాదికంగా మారిపోయింది.

---

# మతము - తత్వశాస్త్రము

**(83వ పేజీ తరువాయి)**

విధులు-హక్కులు శక్తివంతంగా అమలులో వుండడమనే అర్థం.

చివరగా, వాటి వాటికున్న సరైన అర్థాల్లో తత్వశాస్త్రాన్ని విడచి మతంగానీ, మతంలేని తత్వశాస్త్రంగానీ వుండదు. అయితే వాటి అసలైన అర్థాలు మరుగున పడి మతమనే దానికి వ్యవహారంలో వికృతార్థం వుందీనాడు. కాబట్టి ఈనాడు మనం మతమన్నపేరును ఉపయోగించడం అనవసరం. ఎందుకంటే, ఆ పేరునే వుంచుకుని దానికున్న అసలైన అర్థాన్ని సమాజ వ్యవహారం లోనికి తేవడంకంటే, ఆ మాటను వదులుకుని అనుసరణయోగ్యమైన జీవన విధానాన్ని, పరీక్షలకు నిలువగల తాత్విక వేదికనూ కలగలుపుకుని ఏదో పేరున అందరం ఉపయోగించుకోవడం వైజ్ఞానికమూ, వివేకవంతమూ కాగలదు. అందరం ఈ వేదికకు రావాలేగాని దీనికో సరైన పేరు పెట్టుకోవడం ఏమంత కష్టం? అయినా పేరు అనేది గుర్తించడానికి మనం పెట్టుకున్న గుర్తు మాత్రమేనన్న వివేకం కూడా లేనివాళ్ళే పేర్ల గురించి ఘర్షించుకుంటుంటారు. అవునో కాదో ఆలోచించండి మీరున్నూ.

---

"ఈశ్వరుని , హృదయపూర్వకముగా ప్రేమించుటకును, త్రికరణ శుద్ధిగా భగవదాజ్ఞాను వరణమునకు మారుగా మనభక్తి అంతయు విగ్రహములకు స్నానము చేయించుటలోను బట్టలు కట్టుటలోను, నగలలంకరించుట లోను, ధూపదీప నైవేద్యము లర్పించుటలోను, భోగములు చేయించుటలోను, ప్రతిసంవత్సరము వివాహములు చేయించుటలోను రథోత్సవములలోను సమాప్తి నొందించి అంతటితో సరిపోయినను కొంత మేలుగానే యుండును కొందరు విగ్రహముల ప్రీతికై భుజములను కాల్చుకొనుచున్నారు. కొందరు భుజములందును, నాలుకయందును శూలములు గ్రుచ్చుకొనుచున్నారు కొరిదరు వీపులను గాలములు గ్రుచ్చుకొని సిడుగు లాడలోనగు చున్నారు.కొందరుపవాసములు చేసి శరీరములు శోష్లిల్లజేయు చున్నారు. కొందరు కోడిపెట్టలను మేకపోతులను, తుదకు దున్నపోతులను కూడా రాతి దేవతలకు బలియిచ్చి జీవహింస చేయుచున్నారు"

—వీరేశలింగము

విగ్రహారాధనము గురించి

అనుబంధం -2

# భారతీయ విస్మృత విజ్ఞాన యుగము తత్వశాస్త్రం, మతం, సంస్కృతి

-కీ.శే.ఆచార్య బి.యస్.యల్.హనుమంతరావు

భారతీయ సంస్కృతి కేవలము ఆధ్యాత్మికమైనదనే విశ్వాసం సర్వసాధారణమయింది. దైవచింతన, పారలౌకిక దృష్టి అనేవి ఆధ్యాత్మికతలోని ప్రధానాంశాలు. కొందరు భక్తులు ఆధ్యాత్మికతలోనేగాక, సమస్త సాంస్కృతికరంగంలోనూ భారతదేశమే ప్రపంచ రాజ్యాలన్నింటికీ గురుత్వం వహించిందంటూ ఉద్ఘాటిస్తారు. అది వేరేవిషయం. "ఒక్క గ్రీసు దేశాన్ని మినహాయిస్తే ప్రాచీనకాలంలో భారతదేశమే సక్రమ ఆలోచనా విధానాన్ని అలవరచుకొని, మానవ సహజమైన విజ్ఞాన పిపాసతో - సత్యాన్వేషణాసక్తితో తాత్త్విక రంగంలో ప్రాచీన నాగరికతా కేంద్రాలకు తలమానిక మయింది. గ్రీసుదేశం కూడా తన శాస్త్ర విజ్ఞానమునకు, తాత్త్విక ఆలోచనా పద్ధతులకు భారతదేశం నుండే ప్రథమ పాఠాలు నేర్చుకొని - వానిని పెంపొందించి పాశ్చాత్య దేశాల్లో ప్రచారం చేసింది" - అని రమేశచంద్ర దత్తు వ్రాసినాడు. ఇక్కడ మనకు - ప్రస్తుతమైన విషయము -ఇండియా నుండి గ్రీసు నేర్చిందా? గ్రీసునుండి ఇండియా నేర్చిందా? అనికాదు. పైన పేర్కొన్న పండితుని అభిప్రాయంలో - ప్రాచీన భారతదేశంలో పారలౌకికమైన దివ్యజ్ఞానమే గాక, లౌకిక ఆలోచనాక్రమంతో కూడిన యథార్థ విజ్ఞానము సైతం పెంపొందినట్లు స్పష్టము. వాస్తవానికి వైదికయుగం గడచినప్పటినుండి సహజ పరిణామ క్రమంలో ఏర్పడిన సహజ పరిస్థితుల ఫలితంగా భారతీయులు యథార్థజీవిత సమస్యలపై దృష్టి మరల్చి ఆలోచించసాగినారు. అంధ విశ్వాసముకాక వివేకము, హేతువాదము, వారి ఆలోచనలకు మార్గదర్శకాలైనవి. ఈ ఆలోచనా క్రమంలోనే ప్రకృతిని పరిశీలించి తత్పరి జ్ఞానంతో విశ్వక్రమంలో మానవుని స్థానాన్ని నిర్ణయించే ప్రయత్నాలు జరిగినాయి. ఆధునిక యుగంలో విరివిగా ప్రచారానికి వచ్చిన భౌతిక వాదాన్ని నాడే చర్చించి అందు అమూల్యమైన సంప్రదాయాలను మన ప్రాచీనులే స్థాపించి నారు. కాని ఆ సంప్రదాయాలలో అధిక భాగం కాలగర్భంలో లీనమైపోయినాయి? మరి కొన్నింటికి సంప్రదాయ పరిరక్ష కులు తమ కనుకూలమైన విపరీత వ్యాఖ్యానాలు కల్పించి తమ సహజరూపంలో వానిని పరిణామం పొందనీయలేదు. విల్ డురెంట్ అనే పాశ్చాత్య తత్వశాస్త్ర చరిత్రకారుడు చెప్పినట్లు భారతదేశ చరిత్రను పరిరక్షించుకుంటూ వచ్చిన బ్రాహ్మణులు, హైందవమత సంప్రదాయాలను గురించి , వాని పవిత్రతను గురించి ఒకే ఒక అభిప్రాయమే ఉన్నట్లు ఉద్ఘాటించి మనలను మోసగించినారని చెప్పవచ్చు. భారతీయ సంస్కృతి కేవలం పారలౌకిక మనే భావం కలగడానికి ఈ బ్రాహ్మణ ప్రచార ప్రభావమే కారణం! దీని ఫలితంగానే భారతీయ భౌగోళిక విజ్ఞానము దధిక్షీర సముద్రాలతో, వెండి బంగారు కొండలతో నిండిపోయింది; చరిత్ర వేలాది సంవత్సరాలు పరిపాలించిన చక్రవర్తులతో తలతోక లేకుండా తయా రయింది. ఇట్టి బ్రాహ్మణ (అ) విజ్ఞానాన్ని పాశ్చాత్య పండి తులు పరిహసించినారని మనము కోపింప వలసిన అవసరము కనిపించదు; నాటి అంధవిశ్వాసాలను నిర్మూలించి హేతువాద దృష్టిని ప్రోత్సహించుటే దేశభక్తులయిన వారి ప్రథమ కర్తవ్యము హేతువాద దృష్టి భారతీయ సంస్కృతిలో లేకపోలేదని పేర్కొన్నాము. విస్మృతమైన ఆ విజ్ఞాన సంప్రదాయాలను పునరుద్ధరించుటే నేటి జరూరు సమస్య.

## వైదిక మతము :

ప్రాచీన కాలంలో ప్రతితెగలోను పితృదేవతారాధన సర్వసాధారణము. ప్రకృతిలో కన్పించే ప్రతివైచిత్ర్యము పితృదేవతల ఆగ్రహానుగ్రహాలకు ప్రతిబింబమని భావించి వారికి ప్రత్యక్ష ప్రతినిధులుగా ఏ చెట్టునో పుట్టనో పూజించడమే నాటి మతము. తమ సంతాన శ్రేయస్సులో పితృదేవతలు శ్రద్ధవహిస్తారనే భావంతో వారి తృప్తికై బలులు, సంతర్పణలు జరిపేవారు. జీవనోపాధికై దేశాల వెంట సంచరిస్తున్న దశలో ఈ తెగలు తమ పితృదేవతలకు ఒకప్పుడు ప్రాతినిధ్యం వహించిన రాయిరప్పలను దర్శించి పర్వతములను, వనము లను, నదులను పూజించేవారు. భారతదేశానికి వచ్చినప్పుడు ఆర్యులీ దశలోనే ఉన్నారు. సాంఘికంగా ఆర్యులందరిది ఒకే కుటుంబము; వారందరినీ నాడు కూడగట్టి ఉంచింది రక్త సంబంధ భావనయే; అనగా తామందరు ఒకే కుటుంబ సంతతి అనే బలీయమైన గుడ్డి నమ్మకము. కాని ఇండియాలో ప్రవేశించిన ఆర్యులు అనార్యులతో మొదట ఘర్షణ పడినప్పటికీ క్రమంగా రాజీపడక తప్పలేదు. ఉభయుల మధ్య సన్నిహిత తత్త్వమేర్పడ సాగింది. అనార్యులు సహితము నాటికే మంచి నాగరికత

నిర్మించుకొని యుండిరి. వారి మత ఆచారాలు, దేవతలు, వైదికార్యుల పై బలమైన ప్రభావాన్ని ప్రదర్శించినాయి. ఈ ఆర్య - అనార్య సమ్మేళనము ఫలితంగా ఆర్యులు తమ దేవతలకు కల్పించుకున్న పైతృక వ్యాఖ్యానాలు అర్థం లేకుండా పోయినాయి. ఆర్య సమాజానికి పునాది ఐన రక్తసంబంధం విచ్ఛిన్నమయింది. ఈ కొత్త సాంఘిక పరిస్థితు లలో దేవతలు ఆర్య - అనార్య జాతులకు చెంద వలసిన సర్వజనీన స్వభావం పెగాక నైతిక విలువలపై సమాజాన్ని పునర్నిర్మించే అవసరం ఏర్పడినది. వైదిక బౌద్ధయుగాల మధ్యకాలంలో భారతదేశంలో జరిగిన మానసిక కృషి అంతటికీ, ఈ సమస్యలకు పరిష్కారములను చూడడమే లక్ష్యమయింది.

## నూతన మార్గాన్వేషణ:

ఉత్తరాపథమున ఆర్యులు స్థిరపడిన అనతికాలమునకే వైదికమతంలో అసంతృప్తి ప్రబలింది. అందుకు ప్రధాన కారణములను పైన పేర్కొనినాము. 1) దేవతలకు మనుజులకు మధ్య భావింపబడిన పైతృక సంబంధాలు తొలగిపోవడం, 2) నాటి సమాజానికి అవసరమైన నైతిక విలువలను వేదమతం రూపొందింపలేకపోవడము, 3) అనార్యమత ప్రభావము 4) వీనికి తోడుగ వైదికమతం అర్థరహితమైన కర్మకాండలతో నిండిపోయి ఆలోచనాపరులలో విశ్వాసమును నీరసింప జేయడం. భారతీయ ఆధ్యాత్మికత పట్ల సానుభూతి ఉన్న సిల్వైన్‌లేవీ పండితుడు వైదిక మతాన్ని గురించి ఈ విధంగా విమర్శించినాడు: "బ్రాహ్మణులమతం కంటె హింసాత్మక మైనదీ, ప్రాపంచికమైనదీ మరొక మతాన్ని ఊహించలేము. నాగరికత అని చలామణి అవుతూ నీతిపూతలు పూయబడిన వారి భావాలు, ఆటవిక యథార్థతతో మనకు విస్మయాన్ని కలిగిస్తాయి." దాస్‌గుప్తా, రాధాకృష్ణ మొదలైన భారతీయ విద్వాంసులు సైతం వైదికమతాన్ని గురించి ఇటువంటి అభిప్రాయాలనే వెల్లడించినారు.

వైదిక కర్మల నిష్ప్రయోజకత్వాన్ని గుర్తించిన ప్రజలు నూతన మార్గాలను అన్వేషించసాగినారు. నాటి ఆలోచనలు బహుముఖంగా సాగినాయి. మోక్షమార్గం, సాంఘిక సూత్రాలే గాక జననమరణములు, కష్టసుఖాలు, వీటన్నిటికీ మూలకారణం - మొదలైన అంశాలను గురించిన చర్చలు, పరిశోధనలు ప్రారంభమయినాయి. శ్వేతాశ్వతరోపనిషత్తులోని ఈ క్రింది ప్రశ్నలు పరిశీలించండి! "విజ్ఞుడవైన ఓ బ్రాహ్మణుడా! ఎందుకు జన్మించాము? ఏ విధముగా బ్రతుకుచున్నాము? మరణానంతరము పోవునది ఎక్కడికి? సుఖములోను, కష్టము లోను ఇక్కడ ఎవరి ఆజ్ఞలకు బద్ధులమై బ్రతుకుచున్నాము? కాలము ప్రకృతి, అవసరము, అదృష్టము, పంచభూతములు - ఇవియా? లేక పురుషుడు అని పిలువబడే అనంతశక్తియా కారణము? మాకు చెప్పవలసినది" నాటి ప్రజానీకంలో బయలుదేరిన ఆవేదన కీ వాక్యమే నిదర్శనము. అదేవిధముగా ఛాందోగ్య ఉపనిషత్తులోని 'అసతో మా సద్గమయ' అనే ఆరాటము!

## ఉపనిషత్తులు:

వైదికకర్మ మార్గానికి వ్యతిరేకంగా భక్తి, యోగ (తపో), జ్ఞాన మార్గాలు ప్రారంభమైనాయి. వీనిలో జ్ఞానమార్గము ప్రధాన మైంది. ఉపనిషత్తులది ఈ మార్గమే! జీవిత సమస్యలకు పరిష్కారముగా ఆత్మ సిద్ధాంతమును ప్రతిపాదించినవి ఉపని షత్తులు. ప్రాణమునకు, జీవి కార్యకలాపములకు ఆత్మయే కారణమనినారు ఉపనిషదృషులు. వారి దృష్టితో ఆధివ్యాధు లకు కూడ కారణం ఆత్మయే. చివరకు స్వప్నాలకుకారణం - ఆత్మ తాత్కాలికంగా శరీరాన్ని వీడి వెళ్ళడమేనని బృహదారణ్య కోపనిషత్తు భావించింది. కాని ఆత్మ స్వరూపాన్ని గురించి ఉప నిషత్తులు ఏకాభిప్రాయానికి రాలేకపోయినాయి. మానవునిలో ఆత్మ ఉన్నదని తీర్మానించినంతనే ప్రకృతిలో సైతం ఆత్మ ఉన్నదని అంగీకరింపవలసి వచ్చింది. ప్రకృతిలో వ్యాపించి యున్న ఆత్మయే విశ్వాత్మ. అదే శాశ్వత యథార్థము; ప్రకృతికి మూలకారణము 'వ్యక్తిలోని ఆత్మ, విశ్వాత్మ యొక్క అంశమే' - అనే జ్ఞానాన్ని పొందడమే జన్మ రాహిత్యానికి సాధనము; అదే మోక్షము. ఆత్మ స్వరూపమును గురించి అభిప్రాయ భేదములున్నప్పటికీ మోక్షానికి యజ్ఞాలు కాని, తపస్సుగాని, సాధనములుకావనీ, ఆత్మజ్ఞానమే ఏకైక సాధనమని ఉపనిషత్తులు చాటి చెప్పినాయి.

## ప్రజా ఉద్యమము:

ఉపనిషత్తుల జ్ఞాన పిపాస, సత్యాన్వేషణాసక్తి దేశమంతటిని కదిలించినాయి. హాప్‌కిన్స్ చెప్పినట్లు, "ఇంతకు పూర్వమే బ్రాహ్మణమతం మహాసముద్ర మధ్యంలో ఒంటరి దీవిగా నిలబడింది. ఆర్యజాతిని కూడ పూర్తిగా తన ఏలుబడిలో నుంచుకోలేకపోయింది." ఇక ఇపుడుక ఉపనిషత్తులతో నొక మహోద్యమము ప్రారంభమయింది; సంప్రదాయికంగా విద్యా వంతులు ఆలోచనా పరులతోనే ఈ ఉద్యమం ఆగిపోలేదు; సమస్త ప్రజానీకము శ్రద్ధాసక్తులతో ఆ ఉద్యమంలో పాల్గొ న్నది. ఉపనిషత్తుల తరువాత "బౌద్ధమత స్థాపనకు పూర్వం జరిగిన విజ్ఞానోద్యమాలలో చాలావరకు సామాన్య ప్రజానీక మునకు సంబంధించినవేకాని పూజారులకు వానితో ప్రమేయం లేదు." మోక్షమార్గమైన జ్ఞాన సముపార్జనకు ప్రజలకు స్వాతంత్ర్యం ప్రసాదించినవి ఉపనిషత్తులు; ఇక వారు పూజారులచేత కీలుబొమ్మలై యుండనక్కరలేదు. అందుచే యథేచ్ఛగా ప్రజలీ విజ్ఞాన మహోద్యమంలో పాల్గొన్నారు. "భారతజాతి దార్శనికుల జాతి" అన్న మాక్సు ముల్లరు వర్ణన ఈ కాలానికే వర్తిస్తుంది.

## రాజపోషణ:

ఈ సందర్భంలో మరొక ముఖ్యవిషయం సైతం గమ నింపదగి ఉంది. అనాదినుండి ఆర్యుల రాజకీయాలు మత ప్రోక్తములు. రాజులు పూజారుల ఆజ్ఞలను శిరసావహించేవారు. ఇట్టి మతరాజకీయ విధానాలలో సాధారణంగా రాజులకు, పూజారులకు, మధ్య సంఘర్షణ తప్పదు. ఈ సంఘర్షణ మన

చరిత్రలో వైదిక యుగంలోనే ప్రారంభమైనట్లు కన్పిస్తుంది. వశిష్ట విశ్వామిత్రుల మధ్య, పరశురామ కార్తవీర్యులమధ్య వైరం ఈ సంఘర్షణలోని చిన్న ఘట్టాలుగా భావించవచ్చును. ఉపనిషత్తుల కాలమునాటికి పూజారుల దౌర్జన్యం నుండి విముక్తి సాధించాలనే కాంక్ష రాజులలో బలపడింది. కర్మకాండలను తిరస్కరించడం ద్వారా ఉపనిషదిజ్ఞాన ఉద్యమం పూజారుల ప్రాబల్యమునకు గొడ్డలిపెట్టయినది. అందుచే నాటి రాజులీ ఉద్యమాన్ని ఆదరించి పోషించినారు. తత్ఫలితంగా నాటి రాజాస్థానాలు తాత్త్విక వాగ్వివాదాలతో ప్రతిధ్వనించినాయి. జనక, కేకయ, ప్రసేనజిత్తు, బింబిసార, అజాతశత్రు మహారాజుల జిజ్ఞాస లోకవిదితమే; ఋష్యాశ్రమాలేకాక దేశం నలుమూలల వి జ్ఞాన సమాజాలు వెలసినాయి. వేలకువేలు పరివ్రాజకులు దేశ సంచారం చేస్తూ తమ తమ సిద్ధాంతాలను ప్రచారం చేసేవారు. వీరి తాత్కాలిక నివాసార్థమై రాజులు, రాణులు సౌకర్యాలు కల్పించేవారు. శ్రావస్తిలో మల్లికా మహారాణి ఒక విడిది గృహం నిర్మించింది. లిచ్ఛవులు వైశాలిలో ఏర్పాటు చేసిన వాగ్వివాద మండపం, చంపక సరోవర తీరంలో గగ్గరామహారాని నిర్మించిన భవనాలు, రాజగృహం దగ్గర మోర నివాసంలోని విడిది గృహాలు ఈ పరివ్రాజకులకు ఉద్దేశించినవే. ఈ విధంగా బ్రాహ్మణ క్షత్రియ వర్ణాలు విరుద్ధా శయాలతో దేశంలోని రెండు ప్రత్యేక వర్గాలకు ప్రాతినిథ్యం వహించాయి. "బ్రాహ్మణులు అభివృద్ధి నిరోధకులు; అపౌరు షేయములని విశ్వసింపబడే వేదాలే వారి కాధారములు. వేదాలను వ్యాఖ్యా నించే హక్కు వారికి మాత్రమే వుంది. ఇక రెండవవారు క్షత్రియులు; సాంఘిక జీవితానికి సంబంధించిన సమస్యలను పరిష్కరించడంలో బాధ్యత ఉన్నవారు; కొంతవరకు అనార్య ఆచార వ్యవహారాలను సైతం అంగీకరించి ఆర్యలోకమున శాంతిభద్రతలను కాపాడడానికి తాపత్రయ పడేవారు. వీరిది విశాలదృక్పథం. స్వతంత్ర పరిశోధనల ద్వారా వేదవిజ్ఞానాన్ని విస్తరింప జేయడమే వీరి ఆశయం."

ఉపనిషత్తుల జ్ఞానవాదం అనేక సాంఘిక తాత్త్విక పరిణా మాలకు కారణమయింది. ఆత్మ ప్రతివ్యక్తిలోనూ వుంది; ఆత్మ విశ్వాత్మ యొక్క అంశమే అనడం చేతను, ఆత్మజ్ఞానమే మోక్షసాధన మనటం చేతను, ఆర్యజాతి ఆధిక్యతకు, అగ్రవర్ణాల ఆధిక్యతకు స్వస్తి చెప్పబడింది. ఆర్య అనార్యజాతి ఆధిక్యతకు, అగ్రవర్ణాల ఆధిక్యతకు స్వస్తి చెప్పబడింది. ఆర్య అనార్యజాతి సన్నిహితత్వానికి సమ్మేళనానికి మార్గం కల్పింపబడింది. వైదిక కర్మకాండల సంస్కృతీ పరిరక్షకులైన పూజారుల అధికారం నుండి విముక్తిపొందిన రాజులు సమైక్య జాతీయ శ్రేయస్సు లనుద్దేశించి పరిపాలన సాగించడానికి పూనుకొన్నారు. ఒకవిధంగా భారతదేశంలో , లౌకిక రాజకీయాల్లో ఇది ప్రథమ ప్రయత్నంగా భావించడంలో తప్పులేదు. మరొక విశేషం - ఆత్మ సిద్ధాంతం ద్వారా ఉపనిషత్తులు మానవుడు ప్రకృతి అంశమని చాటినాయి. ప్రాచీన ఉపనిషత్తులలో నొకటియైన 'శ్వాసన్వేద్యోపనిషత్తు.' ప్రకృతియే సృష్టికర్త; కాలమే లయ కారుడు; వీరే లోకపాలకులు; నమానవునకు సుఖదుఃఖాల నీయడంలో మంచిచెడ్డల ప్రమేయం వీరికి లేదు- అంటూ, ఆత్మ సిద్ధాంతాన్ని సైతం తిరస్కరించి భౌతికవాదానికి నాందిపాడింది.

పైన పేర్కొన్న అంశాలవల్ల నాటి మానసిక వాతావరణం లోని అశాంతి, ఆందోళన, ఆవేదన స్పష్టమవుతాయి; అంతే గాక నాటి ప్రజలు అనుభవించిన మానసిక వాక్స్వాతం త్ర్యము లను గూడ గ్రహిస్తున్నాయి. మతములో, ఆలోచనా రంగంలో ప్రబలిన అవ్యవస్థనుండి పెక్కుసిద్ధాంతాలు బయలు దేరినాయి. బౌద్ధవాఙ్మయం నాటికి 62 సిద్ధాంత భేదము లున్నట్లు తెలుస్తున్నది; జైనవాఙ్మయం 200 లకు పైగా పేర్కొంటున్నది. ఒక్కొక్క సిద్ధాంతమున కొక పరివ్రాజక సంఘ మేర్పడింది. అట్టి సంఘాలలో నిగంఠ, ఆజీవక, ముండసావక, జటిలక, మాగంధిక, త్రిదండిక, అవిరుద్ధక, గోతమక, దేవదమ్మిక అనేవి ప్రధానమైనవి. క్రమంగా ఈ సిద్ధాంత విభేదములు సమసి, వాని సారమో అనునట్లు 'దర్శ నములు' తయారైనవి. వీనిలో సాంప్రదాయక సిద్ధములైనవి సాంఖ్య, న్యాయ, వైశేషికాది షడ్దర్శనములు; సంప్రదాయేతర మైనది బార్హస్పత్య మనబడే లోకాయత దర్శనము. సాంఖ్య, బార్హస్పత్యములు బౌద్ధమునకు తాత్త్వి కముగ పునాదుల నిర్మించినవి.

## సాంఖ్యము :

దర్శనాలన్నింటిలో ప్రధానమైనది సాంఖ్యం. జేహెచ్ పండితుని అభిప్రాయంలో, "సృష్టి-మానవుడు, మానవుడు - అతని భవిష్యత్తుకు ఉన్న సంబంధం మొదలైన సమస్యలను గురించి ఆలోచనాపరుడైన మానవుని ఎదుర్కొనే విచిత్రప్రశ్న పరంపరకు వివేకము, హేతుత్వము ఆధారంగా సమాధానా లీయడానికి చేసిన లిఖితరూపకమైన తొలిప్రయత్నమే" సాంఖ్య దర్శనము(Indian Philosophy) . సాంఖ్యమే న్యాయవైశేషికాది ఇతర దర్శనాలకు మూలాధారమయింది. సాంఖ్య సిద్ధాంత కారుడు కపిలుడు; ఇతడు గౌతమ బుద్ధునకు రెండు శతాబ్దాలకు పూర్వం బుద్ధుని జన్మస్థలమైన కపిలవస్తు నగరంలోనే నివసించినట్లు తెలుస్తున్నది. సమకాలిక తాత్త్విక అరాజకతనుమాన్పి, మానవుని పీడించే శారీరక, మానసిక, ప్రాపంచిక, దైవికబాధలను తొలగించి , యథార్థ విజ్ఞానాన్ని మానవునకు ప్రసాదించటమే తన ఆశయంగా ప్రకటించినాడు కపిలుడు!

నాటివరకు కేవలము అంతర్వాణియో, ఆకాశవాణియో, దివ్యజ్ఞానమో, జ్ఞానార్జనకు సాధనాలుగా వుండేవి; వీని అసమ ర్థతకు, మోసానికి ప్రజల అజ్ఞానమే 'శ్రీరామరక్ష', . వీని ప్రయో జనాన్ని సామర్థ్యాన్ని నిరాకరించి శాస్త్రీయమైన మార్గాన్ని సూచించినాడు కపిలుడు. ఇంద్రియ గోచరం గానిది, ప్రయోగ సాధ్యాలకు నిలవనిది విజ్ఞానం కాదన్నాడు. 'దర్శనము' అనే మాటకు నిజమైన అర్థమే అది! ఈ ఆలోచనాక్రమంలోనే 'రక్తతర్పణాలు కోరే దేవుడు'. హేతువాదా నికి నాలబడడనీ, అందుచే అతడు లేడనీ, తనది 'అనీశ్వరవాద'మని నిర్భయంగా

చాటినాడు. సత్యాన్వేషణకు కపిలుడు సూచించిన సాధనలే ఐరోపాలో మధ్యయుగాం తంలో సర్ రోజర్ బేకన్ సూచించి క్రైస్తవమతాధికారుల ఆగ్రహానికి గురిఅయినాడు.

కపిలుని సిద్ధాంతంలో ప్రకృతి, మానవుడు మాత్రమే పరిశీలనకు సాధ్యమైనవి; యోగ్యమైనవి. అందుచేత అతడు తన ఆలోచనలను, పరిశీలనలను వానిపైనే కేంద్రీకరించి తద్వారా ప్రకృతి - భౌతిక మతాలకు పునాదులను నిర్మించి నాడు. కపిలుని దృష్టిలో ప్రకృతి శాశ్వతము; స్వయం సమృద్ధము. "ప్రకృతి పదార్థమయము; పంచభూతములు, ఇంద్రియములు, శరీరావయవములు మాత్రమే కాక బుద్ధి, పరిజ్ఞానము, మనస్సు అన్నీ పదార్థాలే. రూపంలో భేదమేకాని వస్తువు లన్నియు ప్రాథమికమైన ఏకైక కుటుంబానికి చెందినవి. ప్రపంచంలో ఐక్యత యున్నది. ఆ ఐక్యతయే ప్రపంచం ఒకే పదార్థం నుండి ఉత్పన్నమైనదను విషయమును రుజువు చేస్తున్నది.

సృష్టిని, వివిధ వస్తు సముదాయాన్ని కపిలుడు కార్యకారణ సంబంధంతో వివరించినాడు "ప్రకృతి పరిణామాత్మకము; నిరంతర అభివృద్ధి క్రమంలో విశ్వము క్రియాత్మకమైన పరిణామ సామర్థ్యాన్ని వ్యక్తీకరిస్తున్నది. ఈ సామర్థ్యం పదార్థానికి సహజ లక్షణము" అన్నాడు. ఈ సిద్ధాంతాలవల్ల 'ప్రపంచం గానీ, మానవుడుగానీ భగవంతుని సృష్టికాదు. ప్రపంచానికి గానీ, పరిణామానికి గానీ సహజమైన కారణాలు అందులోనే ఇమిడియున్నవి' అని స్పష్టమవుతున్నది. ఈ సిద్ధాంతాలన్నీ తాత్త్వికముగా సృష్టికర్తకుగానీ, విశ్వ అధినేతకు గానీ తావీయజాలవు. అదేవిధంగా సాంఖ్య సిద్ధాంతం సైతం తాను అనీశ్వరవాదము నని నిర్భయముగ ప్రకటించుకొన్నది" అనినాడు మాక్సు ముల్లర్ పండితుడు.

ప్రాణి జీవ కార్యక్రమానికి పంచవాయువులే - ప్రాణాపాన వ్యానోదాన సమానములు - కారణమని కపిలుని సిద్ధాంతము. అన్నింటికంటె ప్రధాన మైనది జీవోత్పత్తి సమస్య; అనగా పదార్థమయమైన ప్రకృతినుండి జీవము ఎట్లు ఉద్భవించినది?ఈ సమస్యను పరిష్కరించడానికి కపిలుడు ఆత్మ సిద్ధాంతాన్ని అంగీకరింపక తప్పలేదు. కాని ఆత్మ భగవంతుడు కాదని కపిలుడు స్పష్టంగా వివరించినాడు. 'ఆత్మ పదార్థము నుండి స్వతంత్రమైనది? విశ్వవ్యాపకమైనది? పదార్థంతో ఆత్మ చేరడంతో నే జీవి ఏర్పడుతుంది. ఆత్మ, పదార్థం నుండి (శరీరమునుండి ) శాశ్వతంగా విముక్తి పొందడమే మోక్షము. మోక్షానికి సత్ప్రవర్తనయే మార్గం" అని కపిలుని సిద్ధాంతము. "శాశ్వతమైన పదార్థంనుండి సర్వస్వతంత్రమైన ఆత్మను గుర్తించడమే కపిలునకు , ఆధునిక భౌతికవాదులకుగల ముఖ్యమైన భేదము" అని ఆర్.సి.దత్ అభిప్రాయము.

## బార్హస్పత్యము :

భౌతిక వాదాన్ని ప్రతిపాదించినప్పటికీ జీవిని వ్యాఖ్యానించ డానికి సాంఖ్య దర్శనము 'ఆత్మ'ను ఆశ్రయించింది. ఉపనిషత్తుల ఆత్మ సిద్ధాంత మీవిధంగా షడ్దర్శనాలలో పరాకాష్ట నందుకొన్నది. కాని నాటి జిజ్ఞాస ఆత్మవాదానికే పరిమితమైనదని భావించకూడదు. ఆత్మ ప్రాతిపదికను నిరాకరించికేవలము కాలము, ప్రకృతి ఆధారంగా ప్రపంచాన్ని వ్యాఖ్యానించే ఆలోచనాక్రమం శ్వాసన్వేద్యోపనిషత్తులోనే ప్రారంభమైనట్లు కనుగొన్నాము. క్రమంగా అనాత్మవాదము లనేకం ప్రచారం లోనికి వచ్చినాయి. ఈ అనాత్మవాదాల సారంగా బార్హస్పత్యమనే చార్వాకదర్శనము వెలిసినది. దీనికే 'లోకాయత' మని మరొకపేరు. నాటి విజ్ఞాన విప్లవ మహోద్యమమున చార్వాకులను వామ పక్షీయులుగా వర్ణించడం సమంజసమని పిస్తుంది. వీరిది అర్థరహితమైన ఉద్రేకంతో సాగించిన ప్రచారం కాదు. వీరి సిద్ధాంతాలు కేవలం విధ్వంసాత్మకములు కావు. హేతు వాదం వీరిలో ఉన్నత స్థాయినందు కొన్నది. భౌతిక వాద రీత్యా నైతిక వాద రీత్యా నైతిక సమాజ సంబంధాలలో మానవ వ్యక్తిగౌరవానికి ఔన్నత్యం సాధింపగల సూచనలే వీరి సిద్ధాంతాలు. వీరి దృష్టిలో "ప్రపంచాన్ని వ్యాఖ్యానించడానికి గానీ, అర్థం చేసుకోవడానికి గానీ సృష్టికర్త అనే ప్రాతిపదిక నిరుపయోగము. ప్రకృతి స్వభావసిద్ధంగా నేర్పడునది. నీరు చల్లగాను నిప్పువేడిగాను ఉండడం వాని ధర్మములే! మానవుని అనుభవంలోగాని, చరిత్రలోగాని, మానవుని కార్యకలాపాలలో గాని భగవంతుడు జోక్యం కల్పించుకొన్నట్లు తెలియరాదు. పదార్థమే యథార్థమైన సత్యం; ఆలోచనాశక్తిగల పదార్థమే బుద్ధి. బుద్ధితో గూడిన శరీరమే ఆత్మ. అందుచే ఆత్మ శరీరంతో పాటు నశిస్తుంది." జీవోత్పత్తిని గురించి సైతము వీరి సిద్ధాంతాలు చాలా శాస్త్రీయ మైనవి. "కొన్ని పదార్థాలు తమంత తాముగా ఉద్రేకాన్ని కలిగించవు? కాని వానితోనే తయారయిన పదార్థము (మదిర) ఉద్రేకాన్ని కల్గించినటులే శరీర అవయవములు రూపొంది నప్పుడు జీవి ఏర్పడుతుంది" అని - చార్వాకుల పరిశోధన . పరిణామక్రమంలో రసాయనిక మార్పు ఫలితంగా పదార్థ స్వరూపము, గుణము మారుననీ, జీవం ఉత్పన్నము కావడానికి గూడ అవకాశము లేకపోలేదనునది ఆధునిక రసాయనిక పరిశోధనలు తేల్చిన సత్యమే గదా! భౌతిక వాదంలో చార్వాకుల ఆలోచనలు మనకు సంభ్రమాశ్చర్యాలు కలిగిస్తాయి. ఇక మతము, భగవంతుడు అనేవి బలహీనుల సాధనాలని చార్వకుల నిర్ణయము. "చిర కాలంగా మానవులు మతమునకు అలవాటుపడి యున్నందున విశ్వాసం విజ్ఞానాన్ని నిర్మూలించ డంతో తాము నిస్సహాయులైనట్లు తమ జీవితమున దుర్భరము -భయానకమునయిన శూన్యం ఏర్పడినట్లుబాధపడతారు" నీతిని గురించి సైతం వీరి సిద్ధాంతాలు హేతుబద్ధమైనవి. దేవుని స్మృతి అవినీతినుండి మానవుణ్ణి నీతి పథానికి నడిపించుకొరడావలె నుండనవసరం లేదని, వ్యక్తిలో ఆత్మవిశ్వాసము, మనోదార్ఢ్యము, ఆత్మ గౌరవము ఏర్పడినంతనే మతానికి; దేవునికి స్థానం ఉండదని చార్వాకులు చాటినారు, "నీతి మానవ సహజము; సామాజిక జీవితానికి నీతి అత్యంత్యావశ్యకము; సదుపయోగము." కావున నీతి నీతి కొరకే; మానవ సుఖజీవితము కొఱకు. నీతికి భగవంతునకు సంబంధంలేదు. సహజంగా నీతిపరుడైన

...నవుడు నీతిగానుండుటకు భగవంతుని ఆశ్రయించుట అతని దౌర్భాగ్యము. అట్టి అవినీతికర పరిస్థితినుండి రక్షించు కొని ఆత్మగౌరవాన్ని నిలుపుకోవలెనని చార్వాకుల ఉపదేశము!

## బౌద్ధ ధర్మము :

ఈవిధముగ విస్తరించిన విజ్ఞాన మహోద్యమమునకు శిఖర ప్రాయము బౌద్ధధర్మము. నాటి ఉద్యమాలన్నింటిలో చిట్ట చివరిది బౌద్ధము. కాని ప్రసిద్ధమైనది. ప్రబలమైనది బౌద్ధమే. ఈ సిద్ధాంత స్థాపకుడైన గౌతమ బుద్ధునకు కపిల బృహస్పతుల వలె సునిశితమైన బుద్ధితోపాటు విశాలమైన హృదయముంది. ప్రాణికోటిపట్ల సజీవమైన దాక్షిణ్యావాత్సల్యాలు అతనిలో మూర్తీభవించినాయి. కొత్త సిద్ధాంతాన్ని స్థాపించడమేగాక ఆ సిద్ధాంతంపై పరిపూర్ణమైన సమాజమును నిర్మించడమే - పునర్నిర్మించడమే - అతని జీవిత కాంక్ష.

సాంఖ్య బార్హస్పత్యాలపై నేర్పడిన బౌద్ధధర్మము సమకాలిక మైన సాంఘిక తాత్త్విక సమస్యలకు పరిష్కార మార్గాలను సూచించింది. బౌద్ధధర్మము ప్రకారం "ప్రపంచము నిస్సం దేహముగా యథార్థము; జీవితమూ యథార్థమే. ఈ రెంటిని నిర్లక్ష్య మొనర్చుటకాని, వీటినుండి తప్పించుకొనుటకు ప్రయ త్నించడం కాని వెఱ్ఱితనము. మానవుని జీవిత గమనమాతని చేతిలోనిదే; ఆతని సుఖదుఃఖాల కతడే బాధ్యుడు."

"ఆత్మ ఉన్నదా? లేదా" అనేప్రశ్నకు సూటియైన సమా ధానం ఇవ్వడానికి నిరాకరించినాడు. కాని బౌద్ధం 'అనాత్మ సిద్ధాంతమే'నని పలువురు విమర్శకుల అభిప్రాయము." శరీర మున్నంత కాలము మానవుని దేవతలు - మానవులు చూడ గలరు; ప్రాణము పోయి శరీరము నశించినంతనే అతణ్ణి దేవతలుగాని, మానవులుగాని చూడలేరని బ్రహ్మ జాలసుత్తలో బుద్ధుని ఉపదేశము. అంతేగాక త్రివిధ మోహములలో ఆత్మలో విశ్వాస మొకటియనీ, ఆ విశ్వాసమే మానవుని పాపకార్యాలకు పురికొల్పుతుందని బుద్ధుడ బోధించినాడు. వివిధ భాగములు కలిసి రథమేర్పడునట్లుగానే, భౌతికములు, ఇంద్రియములు, మానసికములునగు పంచ స్కంధములు, కలిసి శరీరమేర్పడు నని బుద్ధుని భావన. జీవితంలో మానవుని 'కర్మ' ద్వారా ఏర్పడిన సంస్కారమే పునర్జన్మకు కారణంగా బుద్ధుడు బోధించినాడు. కాని కొందఱు విమర్శకుల దృష్టిలో బుద్ధునికి పునర్జన్మలో సైతం విశ్వాసం లేదు!

బౌద్ధధర్మంలో స్వర్గనరకములు లేవు. ఇహములోని సత్ప్రవర్తనకు పరలోకంలో బహుమతులుగాని, దుష్ప్రవర్తనకు శిక్షలుగాని లేవు. కాబట్టి బౌద్ధధర్మం ప్రకారం సత్ప్రవర్తన వ్యక్తి శ్రేయస్సుకు సమాజశాంతి, అభ్యున్నతులకే అని అనడంలో విప్రతిపత్తిలేదు. 'నిర్వాణం' అనేది ప్రపంచంలో సాధించి అనుభవించేది మాత్రమే. అది ఒక జీవితదశ. "పవిత్ర మానసిక శాంతితో కూడి పాపరహితము, నిరామయం ఐన జీవితమే నిర్వాణము. పవిత్ర జీవితమే బుద్ధుని చరమ లక్ష్యం; అదే నిర్వాణం; అదే బౌద్ధుల స్వర్గం."

"పతనోన్ముఖమైన సమకాలీన పూజారి గొప్పవిధాన ములకు బదులుగా, జిజ్ఞాసాత్మకమైన శాస్త్రీయ వాదానాపద్ధతి నవలంబించినాడు బుద్ధుడు. అతని పద్ధతియే మతంలో ఉత్సాహకరమైన నూతన మార్గాలను చూపింది." వ్యర్థమైన వాగ్వివాదాలతో కాలహరణం చేయక, యథార్థ జీవిత సమస్య లకు సూటిగా పరిష్కారములు సూచింప బూనడమే బుద్ధుని లోని నవ్యత. "ప్రపంచమెలా ఉద్భవించింది?'అనే ప్రశ్న కంటె, 'ప్రపంచము నేవిధంగా మరమ్మత్తుచేయవలె?' అనే సమస్య ప్రధానమైనది; పరిష్కారయోగ్యమైనది.

బౌద్ధధర్మము "దీనులపాలిటి కొత్త సువార్త"; నైతిక, సాంఘిక సంబంధాలతో సామాన్య ప్రజలను ఎదుర్కొంటున్న సమస్యలకు పరిష్కారపరిశోధనయే నాటి విజ్ఞానోద్యమమునకు ఆశయంగా పైన పేర్కొన్నాము. ఈ ఆశయంతో జరిగిన ప్రయత్నమునకు స్పష్టమైన రూపమునిచ్చి , ఆ పరిష్కార మార్గాన్ని ఆచరణలోకి తీసుకురావడమే బుద్ధునిలోని విశిష్టత. జాతి, వర్ణసమత్వము, వైదిక కర్మల నిష్ప్రయోజ కత్వము, సత్య అహింసలతో గూడిన వ్యక్తి నైతిక ప్రవర్తన - అనేవి మూల సూత్రాలుగా గ్రహించి, సాధ్యమైనంతవరకు తాత్త్విక క్లిష్టతలను తొలగించి నూతన జీవిత విధానాన్ని ప్రజలకు అందించినాడు బుద్ధుడు. అందుచేతనే ఒక విమర్శకుని దృష్టిలో "బౌద్ధమును మత విప్లవమునడంకంటె, సాంఘిక విప్లవమనడం ఎంతేని సమంజసము." వేదకాలంలోను, ఇతిహాసకాలంలోను ఆర్యులు అనార్య జాతులపై జరిపిన యుద్ధాలకంటె కూడ, అనార్యులను వశపరచుకొనుటలో ఎక్కువ సామర్థ్యాన్ని ప్రదర్శించినది బౌద్ధము. ఆర్య అనార్యజాతులను కూడగట్టడంలో బౌద్ధము దృఢమైన నైతిక సంబంధాన్ని ప్రసాదించింది.

నాటివరకు అగ్రవర్ణాల ఆధిపత్యంలో నున్న క్రింద వర్ణా లలో బౌద్ధమొక నూతన చైతన్యానికి కారణమయింది. బౌద్ధం ప్రబోధించిన సమతాభావం, ఆభావంపైసమాజాన్ని పునర్నించా లనే దీక్ష - ఈ రెండూ క్రింది వర్ణాలను పైవర్ణాలపై తిరుగుబాటుకు పురికొల్పినాయి. ఇందుకు నిదర్శనమే మగధ రాజ్యంలో జరిగిన రాజకీయ విప్లవము. క్షత్రియులైన శిశునాగు లను నిర్మూలించి, శూద్రులైన నంద వంశస్థులు మగధసింహా సనాన్ని ఆక్రమించినారు. మతంలోనూ, సమాజంలోనూ మాత్రమేగాక, రాజకీయాలలో సైతం అగ్రవర్ణాల గుత్తాధికార విచ్ఛిత్తియే నందవిప్లవ ప్రాధాన్యము. తరతరాలుగా క్రింది వర్ణా లలో అగ్రవర్ణాలపై పెరిగిన ద్వేషానికి, ప్రతీకార కాంక్షకు నిదర్శ నము. మహాపద్మనందుని "సర్వక్షత్రాంతక" బిరుదము. నంద రాచరికము బౌద్ధం సాధించిన సమగ్ర విప్లవానికి తార్కాణము!

## విప్లవ తిరోగమనము :

కాని, ఇతిహాసకాలమున ప్రారంభమైన విజ్ఞాన మహోద్య మానికి నందవిప్లవమే "భరతవాక్య" మైంది. అందుకు రెండు ముఖ్యకారణాలను పేర్కొనవచ్చు. మొదటి కారణం బౌద్ధం లోని లోపాలు, సాంఘిక సంబంధాలలో మార్పులను సూచించినదేగాని, బౌద్ధ ధర్మము ఆ సంబంధాలకు ప్రత్యక్ష

ఆకృతులైన సంస్థలలో మార్పులు తేవడానికి ప్రయత్నించ లేదు. ఆర్య రాజకీయ సిద్ధాంతాలను యథాతథంగా అంగీకరించింది. సమతా సిద్ధాంతంపై సమస్త ప్రజానీకము శ్రద్ధతో పనిచేయగల విశాల సంస్థను నిర్మింపజాలకపోవడమే బౌద్ధంలోని ముఖ్య లోపం. మరొక విశేషం; గౌతమ బుద్ధుడు, భారతీయుల దృష్టిని ప్రకృతి పరిశీలననుండి ఆత్మపరిశీలనపైకి మరలించినాడు. గ్రీకు సాంస్కృతిక చరిత్రలో సోక్రటీసుకు గల స్థానమే ఇండియాలో బుద్ధునకు ఉన్నదని చెప్పవచ్చు. సోక్రటీసు బోధనలన్నిటిలో ముఖ్యమైనవి "Know thyself" అని కదా! తత్ఫలితముగా కపిల కణాదులలో ఉన్నత శిఖరాల నందుకొనిన విజ్ఞాన ఉద్యమము తిరోముఖం పట్టింది! ఇక రెండవ కారణము: నంద విప్లవంవల్ల అగ్రవర్ణాలలో కలిగిన అలజడి. నాటివరకును క్షత్రియులు విజ్ఞాన ఉద్యమాన్ని పోషించినారు. కాని పరిస్థితులు విషమించినాయి. నందవిప్లమంతో వారి అధికారానికే ప్రమాదం సంభవించింది. అందుచే, బ్రాహ్మణులతో వైరము తమ అధికారానికి ముప్పు తెచ్చునని క్షత్రియులు, క్షత్రియులతో వైరము వర్ణధర్మాలకు , వైదిక ర్మలకు తద్వారా తమ మనుగడకు భంగం కల్గించగలదని బ్రాహ్మణులు గుర్తించినారు. అంతటితో బ్రాహ్మణ క్షత్రియ వర్గాలు రాజీపడి శతాబ్దాలుగా పెరిగివస్తున్న సాంఘిక తాత్విక విప్లవాన్ని ప్రతిఘటించే ఉద్యమానికి నాయకత్వం వహించారు. మగధలో క్షత్రియ వంశమైన మౌర్యులు ప్రతిష్ఠింపబడినారు ! ఈ రాజీఫలితంగా క్షత్రియులు వర్ణాశ్రమ ధర్మ రక్షణకు పూనుకొన్నారు. బ్రాహ్మణులు రాజకీయంగా క్షత్రియుల ఆధిక్యము నంగీకరించినారు. చంద్రగుప్తుడు జైన మతాభిమాని ఐనను చక్రవర్తిగా క్షత్రియుల బాధ్యతలనే నిర్వహించినాడు. ఈ వాతావరణంలోనే చాణక్యుడు తన అర్థశాస్త్రంలో లౌకిక రాజకీయాలకు పునాదివేయ ప్రయత్నించినాడు. అయినను రాజకీయ అధికారానికి మతం బలమైన సాధనంగా ఉపయోగించింది.

## విజ్ఞాన పునరుజ్జీవన ఆవశ్యకత :

విజ్ఞాన యుగం అంతరించింది; వైదికులు తమ మతాన్ని, సంప్రదాయాలను పునరుద్ధరించి రక్షించుకొనే ఆశయంతో నాటి విజ్ఞానాన్ని బలిచేసినారు. కపిల కణాదుల సిద్ధాంతాలను విపరీత వ్యాఖ్యానాలు చేసి మతంలో కలుపుకొన్నారు. హేతుత్వానికి , స్వాతంత్ర్యానికి బదులు, విశ్వాసము, అధికార దాస్యం ప్రబలినాయి; వైదిక సంప్రదాయ రక్షణకై పుక్కిటి పురాణాలు, ధర్మ సూత్రాలు తయారయినాయి. అదియే హిందూ ధర్మంగా, ఆధ్యాత్మిక సంస్కృతికి మూలంగా నేటికీ విశ్వసిస్తున్నారు; ప్రాచీన విజ్ఞాన సంప్రదాయాలు విస్మృతి పథంలో పడిపోయినాయి.

లౌకిక ప్రజాస్వామ్యం, శాస్త్ర, సాంకేతిక విజ్ఞానాభివృద్ధి, సమతా సమాజము తన లక్ష్యాలుగా స్వతంత్ర భారత జాతి ప్రకటించుకొన్నది. ఈ లక్ష్య సాధనకై జాతికి అవసరమైన ఉత్తేజము మన పుక్కిటి పురాణములనుండి లభించదనడం నిర్వివాదాంశం. కపిల, కణాద, గౌతమ బుద్ధాది దార్శనికులు స్థాపించిన విజ్ఞాన సంప్రదాయాలు మాత్రమే మనజాతికీనాడు శరణ్యములు. కాబట్టి రెండువేల ఏండ్లనాడు నిరోధింపబడిన విజ్ఞాన ఉద్యమాన్ని పునరుద్ధరించి, నాటి సంప్రదాయాలను, యథార్థరూపంలో అవలంబించడమే మన కర్తవ్యం. రాజకీయ, సాంఘిక సంస్కరణలు, ఆర్థిక విజయాలు, మన ప్రజలలో భావవిప్లవం జరిగిననాడే రుజువయిన శాశ్వతమైన ఫలితాల నియ్యగలవు. సమగ్రమైన జాతీయాభ్యుదయమే నిజమైన ఆధ్యాత్మిక ఔన్నత్యము!

---

While the controversy berween materialism and idealism was taking sharp form in the Unpanisadic India, there moved forward in the Ganga Valley Civilization a remarkable person to proclaim that all this- in fact metaphysical speculation in any form- was irrelevant. When stuck by an arrow, for example, and suffering from the agony of the wound, could there be any sense at all to speculate on the nature of the arrow-maker, etc.? Evidently not. The immediate thing to do was to pluck off the arrow and heal the wound that caused the pain. So also must be the case of men and women under the grip of fathomless suffering which the very existence in the world actually amounts to. Pain or suffering, suffering or pain- that is the basic fact of life. The first thing to do, therefore, is to understand that, not withstanding anything that may appear to the contrary, the main fact is nothing but suffering. But since nothing can be really uncaused this suffering. too must have its cause, the understanding of which is the second logical thing to do. Thirdly, since only by the removal of the cause one can also remove its effect, one has to strive after the actual removal of the cause of this all-pervasive suffering and thereby get rid of it. Only after the suffering is removed, one attains the state of bliss."

***- The Beginnings — Devi Prasad Chattopadhyaya***

అనుబంధం -3

# తత్వవేత్త, సమాజం బుద్ధుడు, శంకరుడు, వివేకానంద

- ఇ.యం.యస్.నంబూద్రిపాద్

అమెరికాకు వివేకానంద వెళ్ళి వంద సంవత్సరాలు గడిచాయి. చికాగో పార్లమెంటు ఆఫ్ రెలిజియన్స్‌లో ఆయన ప్రసంగించి, నూరేండ్లు గడిచాయి. ఈ శతవార్షికోత్సవాలను దేశమంతటా పెద్దయెత్తున జరుపుతున్నారు.

కాగా ఈ సందర్భాన్ని వినియోగించుకొని, హిందూత్వ రాజకీయవాదులు, వివేకానంద తత్వశాస్త్రాన్ని తామే సక్రమంగా అనుసరిస్తున్నామని గొప్పలు చెప్పుకుంటున్నారు. తద్విరుద్ధంగా ఇతర తత్వవేత్తలు, రాజకీయ కార్యకర్తలు స్వామి వివేకానందను, భారత పునరుజ్జీవనోద్యమ నాయకులలో ఒకరిగా గుర్తిస్తూ, గౌరవిస్తున్నారు.

కాలికట్ విశ్వవిద్యాలయంలో సంస్కృతశాఖ ఆధ్వర్యంలో ఇటీవల ఒక గోష్ఠి జరిగింది. అందులో నేను పాల్గొన్నాను. నేటి పరిస్థితులలో వివేకానంద తత్వశాస్త్రి ప్రాధాన్యత-అనేది విషయం. అప్పుడు నేనొక మాట చెప్పాను.

ఒక తత్వవేత్తయొక్క భావాల ప్రాధాన్యతను పూర్తిగా అర్థం చేసుకోవాలంటే ఆయన రచనలన్నిటినీ నిశితంగా అధ్యయనం చేయాలి. అంతేగాదు, ఆ తత్వవేత్త ఏ చారిత్రక నేపథ్యంలో జీవించాడోకూడా, సామాజిక, ఆర్థిక, సాంస్కృతిక వాతావరణంలో జీవించాడో కూడా గ్రహించాలి. అప్పుడే ఆ తత్వవేత్తను గురించి సరిగా వ్యాఖ్యానించగలము - అని.

రాజారామ్మోహనరాయిలాంటి మహనీయులు భారత పునరుజ్జీవనోద్యమానికి మూలపురుషుడు. అట్టి వారి కోవకు చెందినవాడే స్వామి వివేకానంద. ఆధునిక భారత పునర్వికాసానికి తోడ్పడే విధంగా స్వామి వివేకానంద వేదాంతాన్ని గూర్చి వ్యాఖ్యానించాడు.

ఈ గోష్టిలో నేను సమర్పించిన పత్రానికి నేను యీ పేరు పెట్టాను "భారతీయ పునరుజ్జీవన తత్వవేత్త" అని.

తెలిసిగాని, తెలియకగాని ప్రతి తత్వవేత్త తన చుట్టూ వున్న సామాజిక, రాజకీయ వాతావరణాన్ని, తమదైన సైద్ధాంతిక ధోరణి నుండే వ్యాఖ్యానిస్తాడు. (తాము సామాజిక ఘర్షణలకు దూరంగా వుంటున్నాము అని భావించే తత్వవేత్తలకు యిదే విషయం వర్తిస్తుంది.) ఈ విషయాన్ని ఉదహరించడానికి నేను, బుద్ధుణ్ణి, శంకరుణ్ణి-వివేకానందతో పోల్చి పరిశీలించాను. నేను చెప్పదలచుకున్నదేమంటే, ఎంతో గహనమైన తత్వశాస్త్రాన్ని బోధించిన తత్వవేత్తలు సైతం, యీ ప్రపంచాన్ని తమ దృష్టితో వ్యాఖ్యానించారు. అంతేకాదు, మార్క్స్ ఫ్యూర్‌బాపై సిద్ధాంత ప్రతిపాదనలలో పేర్కొన్నట్లు, యీ ప్రపంచాన్ని మార్చటానికి కూడా ప్రయత్నించారు.

## వర్ణ సమాజం అవతరణ

ప్రాచీన తెగల సమాజం విధ్వంసమై, వర్ణ సమాజం ఆవిర్భవిస్తున్న దశలో గౌతమ బుద్ధుడు జన్మించాడు. తమ సామాజిక జీవితాన్ని, సాంస్కృతిక వారసత్వాన్ని కోల్పోతున్న లక్షలాది ఆదిమ తెగల ప్రజల పట్ల గౌతమునికి పూర్తి సానుభూతి వున్నది. సమాజంలోని ఉన్నత శ్రేణికి చెందిన కుటుంబంలో పుట్టినప్పటికీ పీడిత, తాడిత ప్రజల పట్ల ఆయనకు పూర్తి సానుభూతి వున్నది. కనుక కొత్తగా ఆవిర్భవిస్తున్న వర్ణ సమాజం పట్ల అతడు తిరుగుబాటు లేవనెత్తాడు. అతి త్వరగా విచ్ఛిన్నమౌతున్న పాత తెగల సమాజాన్ని సంరక్షించటానికి పూనుకున్నాడు.

బౌద్ధ తాత్విక సిద్ధాంతసారం యిదే. వైదిక బ్రాహ్మణ ఆధ్యాత్మికత, భావవాదాలను ఆయన వ్యతిరేకించాడు. తాను బోధించిన భౌతిక వాదానికి, నాస్తిక వాదానికి ప్రత్యర్థుల తీవ్ర విమర్శలకు ఆయన గురైనాడు. తెగల సమాజం విధ్వంసమౌతున్న క్రమంలో నిరాధారులైపోతున్న ప్రజల తరపున ఆయన నిలబడ్డారు. బుద్ధుడు జీవించిన కాలంలోని సామాజిక సాంస్కృతిక రాజకీయ పరిణామాలను దృష్టిలో పెట్టుకుంటే కాని, గౌతముడు బోధించిన తత్వశాస్త్ర ప్రాధాన్యాన్ని మనం పూర్తిగా గ్రహించలేము.

అప్పటికే దాదాపు అంతరించిన సమాజాన్ని బుద్ధుడు తిరిగి ప్రతిష్టించటానికి పూనుకున్నాడు. తెగల సమాజానికి కాలదోషం పట్టిందని వస్తుగత చరిత్ర నిరూపించింది. అయినా బుద్ధుడు ఆ సమాజాన్ని గాఢంగా పట్టుకు కూచున్నాడు. కనుకనే బ్రాహ్మణ పెత్తందారీతనం చేతిలో బుద్ధుడు ఓడిపోయాడు. శతాబ్దాలుగా పెరుగుతున్న బౌద్ధ సామాజిక సాంస్కృతిక సాంప్రదాయం చిట్టచివరకు ఓడిపోయింది. బౌద్ధ మహా విద్యాలయాలు నిలవలేకపోయాయి. వర్ణసమాజంపై ఏర్పడిన నూతన సామాజిక సాంస్కృతిక శక్తులుపై చేయి సంపాదించాయి.

ఇదొక విషాదకర పరిణామం. బౌద్ధం భారతదేశం సరిహద్దుల అవతల సుదూర ప్రాంతాలకు విస్తరించింది. కాని

జన్మస్థలమైన భారతదేశంలో అతిస్వల్ప సామాజిక శక్తిగా మాత్రమే మిగిలిపోయింది.

బౌద్ధ తత్వశాస్త్రంపై పోరాటంలో శంకరుడు రంగప్రవేశం చేశాడు. ప్రధానస్థానం ఆక్రమించాడు. బౌద్ధ సిద్ధాంతంపై దాడి చేసే సందర్భంలో శంకరాచార్యులు ఎన్నో గహనమైన సూత్రీకరణలు చేశాడు. నిజానికి వర్ణ వ్యవస్థ ప్రాతిపదికపై ఏర్పడిన బ్రాహ్మణ సమాజాన్ని ఆయన అభిమానించిన సంగతి ఎంత దాచినా దాగవు. బౌద్ధ సిద్ధాంతంపై ఆయన విమర్శలోనూ, తన వేదాంత ప్రతిష్టాపనా యత్నంలోనూ, శంకరుడు తరచూ మనుస్మృతిని ప్రస్తావిస్తూ వచ్చారు. ఒకవైపున యావత్ జగత్తు మాయ అని బ్రహ్మ మాత్రమే పరమ సత్యమని అంటూనే, మనుధర్మ శాస్త్రానికి విరుద్ధమైన నియమాలన్నిటినీ ఆయన నిర్దాక్షిణ్యంగా ఖండిస్తూ వచ్చారు. బుద్ధుడు, మరణిస్తున్న తెగల సమాజ సంరక్షణకు పూనుకున్నట్లుగానే, శంకరుడు అప్పుడే తలెత్తుతున్న కుల సమాజ ఆవిర్భావానికి కృషి చేశాడు.

## కుల సమాజం – వర్గ సమాజం

బుద్ధుడు సమర్థించిన తెగల సమాజం కంటే, శంకరుడు సమర్థించిన కుల సమాజం ఆనాటికి అభివృద్ధికరమైందే అయినప్పటికీ కుల సమాజం నూతనంగా ఆవిర్భవిస్తున్న వర్గ సమాజముందు తట్టుకోలేకపోయింది. ఈ సమాజం అప్పుడు యూరప్‌లో ఆవిర్భవించసాగింది. ఆ తర్వాత చాలా కాలానికి భారత దేశంలో ప్రవేశించింది. కుల సమాజంలో బ్రాహ్మణునికి పెత్తనం, కుల సమాజ విధ్వంసానికి కారణమైంది. పాశ్చాత్య నాగరికతకు దాదాపు ఒకప్పుడు సమానంగానూ, కొన్ని సందర్భాలలో అంతకంటె ఉన్నతంగానూ వున్న భారతదేశం, శంకరుని తర్వాత కాలంలో వెనుకబడిన సామాజిక దేశంగా మారిపోయింది.

యూరప్‌లో పారిశ్రామిక, సాంకేతిక, రాజకీయ, సాంస్కృతిక విప్లవాలు వచ్చాయి. భారతదేశం యూరప్‌కు బానిసగా మారిపోయే స్థితికి వచ్చింది. శంకరుని వేదాంతం, ఒక భారతీయ చరిత్రకారుడు రాసినట్లు కేవలం ఒక తాత్విక పిడివాదం మాత్రమే కాదు. శాస్త్రీయ పరిశోధనను నిరుత్సాహ పరచిన సామాజిక రాజకీయ సిద్ధాంతం. ప్రాచీన, మధ్య యుగాలలో భారతదేశంలో ఎన్నో పరిశోధనలు వృద్ధి చెందాయి. ఎన్నో నూతన విషయాలను శాస్త్రజ్ఞులు ఆవిష్కరించారు. శాస్త్రీయ, సాంకేతిక పరిశోధనలు జరిగాయి. అలాంటి భారతదేశం శంకరుని అనంతర కాలంలో, యూరప్‌తో పోటీపడలేకపోయింది. యూరప్ అతి వేగంతో, శాస్త్ర సాంకేతిక రంగాలలో పురోగమించసాగింది.

## భారతీయ సమాజం– వెనుకబాటుతనం

యూరోపియన్ వ్యాపారస్తులు భారతదేశంలో అడుగు పెట్టటానికి భారతీయ సమాజం యొక్క సామాజిక, సాంస్కృతిక వెనుకబాటుతనం ఒక కారణం. ఈ యూరోపియన్ వ్యాపారస్తులు భారతదేశ వ్యవహారాలలో వేలు పెట్టసాగారు. ఏదో ఒక రాజకీయ పరిపాలనా పొందికతో మైత్రి పాటిస్తూ, చివరకు దేశాన్ని యావత్తు లొంగ దీసుకున్నారు. కనుక భారతదేశం స్వాతంత్ర్యాన్ని కోల్పోవడానికి, శంకరాద్వైత తత్వశాస్త్రానికి చాలా సంబంధముంది. ఈ తత్వశాస్త్రం భారతీయ సమాజాన్ని సాంస్కృతికంగా, ఆర్థికంగా, రాజకీయంగా బలహీనపరచింది.

ఈ గుణపాఠాలన్నీ గ్రహించిన, భారతీయ నూతన తరాల వారు యూరోపియన్ రాజ్యాలిచ్చిన సాంస్కృతిక, మేధోపర నాయకత్వాన్ని స్వీకరించసాగారు. మొదట్లో బెంగాల్‌లో ప్రారంభిస్తూ, తర్వాత భారతదేశమంతా విస్తరించిన, నూతన తరానికి చెందిన భారతీయ మేధావుల ఆవిర్భావానికి కారణం ఇది.

## పునరుజ్జీవనోద్యమ ప్రధాన లక్ష్యం

కుల సమాజంపై అన్ని వైపుల నుండి, సమర్థవంతమైన దాడులు చేయడం యీ మేధావుల గొప్ప సేవ. శంకరాచార్యులు సమర్పించిన కుల వ్యవస్థలపై దాడి చేయడంతో, యీ నూతన మేధావుల పునరుజ్జీవన కార్యక్రమం మొదలైంది. వీరే 19వ శతాబ్దానికి చెందిన పునరుజ్జీవన యోధులు. పునరుజ్జీవనోద్యమ ప్రధాన లక్ష్యమేమంటే శంకరాచార్యులు సమర్థించిన వర్ణ, కుల వ్యవస్థను కూలద్రోయటం.

అయితే వారు బుద్ధుని లాగ ప్రాచీన తెగల సమాజంవైపు నడవదలచలేదు. ప్రాచీన తెగల సమాజాన్ని గురించి బుద్ధునికి ఏవో తెలిసీ తెలియని అభిమానాలుండేవి. నూతన పునరుజ్జీవనోద్యమ సారథులు వాంఛించింది. ఆధునిక బూర్జువా సమాజం. యీ సమాజం ప్రాచీన తెగలసమాజానికి విరుద్ధమైనది. వర్ణ, కుల వ్యవస్థపై రూపొందిన సమాజానికి విరుద్ధమైనవి. ఒక నూతన సాంస్కృతిక, రాజకీయ, ఆర్థిక, సామాజిక, పునరుజ్జీవన వెల్లువ కొరకు, యీ నూతన పునరుజ్జీవనోద్యమంకృషి చేయసాగింది.

## వ్యాఖ్యానంకాదు– మార్చడానికి వివేకానంద కృషి

స్వామి వివేకానంద అట్టి వారిలో అగ్రగణ్యుడు. ఆయన తత్వవేత్త, మేధావి. భారతీయ సమాజాన్ని కేవలం వ్యాఖ్యానించడంతోనే సరిపుచ్చుకోలేదు. ఆ సమాజాన్ని మార్చటానికి కూడా కృషి చేశాడు. అయితే బుద్ధుడులాగా వెనుకచూపుతో తెగల సమాజాన్ని నిర్మించటానికి కాదు. ఆధునికమైన శాస్త్ర ప్రాతిపదిక కలిగిన రాజకీయ, ప్రజాతంత్ర, లౌకిక, భారత సమాజ నిర్మాణానికి కృషి చేశాడు. ఏ వేదాంత సిద్ధాంతాన్ని శంకరుడు, వర్ణ, కుల, సమాజస్థాపనకై వినియోగించుకున్నారో, అదే వేదాంత సూత్రాలను, కుల, సమాజానికి వ్యతిరేకంగా ప్రజలను సహకరించటానికి వివేకానందుడు వినియోగించుకున్నాడు. 'శూద్రుల పాలన' భావాన్ని వివేకానందుడు ప్రవేశ పెట్టాడు. ఆధునిక పరిభాషలో యిది కార్మిక వర్గ పాలన అని చెప్పవచ్చు. తన కేరళ పర్యటనలో అక్కడి వున్న వర్గ కుల

(మిగతా 101వ పేజీలో)

# మన జాతీయ మహాపరాధం కులసంకెళ్లు, స్త్రీల అణచివేత

**- స్వామి వివేకానంద**

అనుబంధం -4

మనదేశ సామాన్య ప్రజా బాహుళ్యాన్ని నిరాదరణ చేయడమే మన జాతీయ మహాపాతకమని నేను భావిస్తు న్నాను. ఇది మన పతన కారణాల్లో ఒకటి. మనదేశంలో రెండు మహాపాతకాలున్నాయి. ఒకటి స్త్రీలను అణగ ద్రొక్కడం,రెండవది పేద వారిని కుల నిబంధనలతో రాచి రంపాన పెట్టడం.

మనదేశ సామాన్య ప్రజలను చూడండి. వారి దృక్కులలో ఎంతవేదన, గుండెలలోఎంత అధైర్యం, నిరుత్సాహం! పెద్ద ఉదరాలూ, శక్తిలేని కాళ్ళు, చేతులూ! ప్రతిచిన్న విషయానికి వణికిపోయే భీరువులు వీరు! కుటీరాల్లో నివసించే నిజమైన మనజాతి తన పౌరుషాన్ని, వ్యక్తిత్వాన్ని మరచి పోయింది.తమ వారసత్వమైన అంతర్జ్యోతిని ప్రకాశింపచేసే అవకాశం మన సామాన్య ప్రజలకు ఏనాడూ లభింపచేయలేదు మనం. హిందూ, ముసల్మాను లేక క్రైస్తవుల అడుగుల క్రిందబడి నలిగి, దిట్టంగా జేబునిండా ధనమున్న ప్రతివారి పాదల క్రిందబడి అణగాోపోవడానికే, తమ జన్మ అని అనుకోవడం ఆరంభించారు యీ ప్రజలు.

రైతులు, సాలెవాళ్లు మొదలైన నిమ్నజాతి, నిరాధృతి ప్రజలు విదేశీయుల చేతిలో అపజయం పొందారు. తమవారి చేత అవమానాలు పొందుతున్నారు. వీరే అంతులేని వందల సంవత్సరాలనుండి తమ శ్రమకు ఫలితం ముట్టక పోయినా నిశ్శబ్దంగా పనిచేస్తున్నారు.

శ్రమించి సంపదను సృష్టించింది ఎవరు?

బ్రాహ్మణుల పరపతి, క్షత్రియుల శక్తి సామర్థ్యలు, వైశ్యుల కలిమికూడా ఎవరి పరిశ్రమవల్ల సాధ్యమైనాయో వారెక్కడున్నారు? అన్ని దేశాల్లో, అన్ని కాలాల్లో సంఘంలో ప్రధానాంశంపై కూడా తక్కువ జాతిగా పేరుపొందిన ఆ 'జాతి' చరిత్ర ఏమిటి? ఓ భారత శ్రామిక ప్రజలారా! మీ నిరంతర నిశ్శబ్ద పరిశ్రమ ద్వారా బేబిలోన్, పర్షియా, అలెగ్జాండ్రియా, గ్రీస్, రోమ్, వెనిస్, జెనీవా, డెన్మార్క్, హాలెండు, ఇంగ్లాండు దేశాలు ఒక్కటొక్కటిగా ఆధిక్యత పొంది, పేరెన్నిక గాంచాయి! కానీ మీరో? మిమ్మల్ని గురించి పట్టించుకునే వారెవరు ! లేరండి!

జీవన సమరంలో నిమగ్నమైపోయిన యీ జాతులకు జ్ఞానోదయానికి అవకాశం లేకపోయింది. మానవ సహజమైన తెలివి తేటలతో వారుయంత్రాలవలె ఎంతోకాలం ఒక్క తీరుగా పని చేశారు. వారి పరిశ్రమ ఫలంలో అధిక భాగాన్ని విద్యాధికులైన తెలివిగల ప్రజలు పుచ్చేసుకొన్నారు. ప్రతి దేశంలోనూ విషయం యిదే. కానీ కాలం మారింది. క్రింది తరగతులవారు మెల్లమెల్లగా మేల్కొంటున్నారు. ఈ సత్యం గ్రహించి ఐక్యగా ప్రతిఘటన జరుపుతున్నారు. తమకు ధర్మం ప్రకారం రావలసిన దానిని సాధించడానికి కృత నిశ్చయులైనారు. మొట్టమొదటగా మేల్కొని యిప్పటికి పోరాటం ప్రారంభించినవారు ఐరోపా, అమెరికాల్లోని సామాన్య ప్రజలు. మన భారతదేశంలో కూడా యీ జాగృతి చిహ్నాలు కనిపిస్తున్నాయి.

క్రింది తరగతుల వారిలో యీనాడు జరిగే సమ్మెలే దీనికి తార్కాణం. ఎంత యత్నించినా పై తరగతులవారు క్రింది వారిని ఎన్నడూ అణచి పెట్టలేకపోయారు. తక్కువ తరగతి వారు తమ న్యాయ సమ్మతమైన హక్కులను పొందేందుకు చేయూత నివ్వడంలోనే, ఉన్నత తరగతులవారి సంక్షేమం యిమిడి వున్నది.

## వాడుద్రోహి

చెమటోడ్చి పనిచేసే లక్షలాది పేద పీడిత ప్రజానీకం తమ గుండె నెత్తురు చిందించి సుఖడోలికలలో వూగించగా, పెరిగి, విద్యా వంతుడై, ఆ పేద జనం గురించి ఒక్కసారైనా ఆలోచించని వాడిని ద్రోహి అంటాను నేను. ధనికవర్గ చరిత్రలో, ఉన్నత వంశీయుల పురోహితుల, అధిపతుల చరిత్రలలో ఏ ఘట్టంలోనైనా, పేద ప్రజలను గురించిన చిన్న యోచన ఉన్నదా? వారి వర్గాల అధికార శక్తికి మూలం వీరి రెక్కల ముక్కల చాకిరేయేగా?

మనదేశంలోని ప్రతి అధమ, అన్యాయానికి మూల కారణం. యీ దేశ పేద ప్రజల స్థితియే. పురోహితుల అధికారం, విదేశీ దండయాత్రలు వారిని శతాబ్దాల తరబడి నేలకు త్రొక్కివేశాయి. చివరకు తాము మనుష్యులమని కూడా మర్చిపోయినారువారు. మన పూర్వీకులైన జమీందారీ భూస్వాములు సామాన్య మానవులను కాలిక్రింద అణగద్రొక్కి ఉంచబట్టి, ఆ బంధకులలోనైన ప్రజలు తాము మానవుల మన్న మాట దాదాపుగా మర్చిపోయినారు. పరిమితమైన ఒక పది మంది కేవలం తమ పొగరు, రాచరికపు అధికారాలు వూతగా కొని, దేశంలోని విద్యా వివేకాలనన్నిటినీ గుత్తగా తీసుకొనడమే మన దేశ వినాశనానికి కారణం. మన దేశంలో నిమ్న జాతికి, పేదవారికి, పతితులకు మిత్రుడనే వాడేలేదు. వారెంత ప్రయత్నించినా ఆ స్థితిలోంచి పైకి లేవరు నానాటికీ వారు క్రిందికి దిగజారి క్రుంగిపోతారు. క్రూర సంఘం కొట్టే దెబ్బలను భరిస్తారుగానీ, ఆ దెబ్బలు ఎక్కడ నుండి పడ్డాయో తెలుసుకోలేరు. కట్టెలు కొట్టేవారుగా, నీళ్ళు తోడేవారుగా శతాబ్దాలుగా బలవంతాన పనిచేసి, వారు తమ బానిసలుగానే పుట్టాయని విశ్వ

సించి, ఎప్పటికీ కట్టెలు కొట్టుకుంటూ, నీళ్ళు చేదుకుంటూ బ్రతుకుతున్నారు. వేదాంతానికి పుట్టినిల్లయినా మన యీ భూమిలో, మన ప్రజలు యీ స్థితిలోనే తరతరాలుగా మతి భ్రమణకు లోనై పడి వున్నారు. వారిని అంటుకుంటే కలుషితమై పోతాము, వారితో కూర్చుంటే మైలబడిపోతాము, నికృష్ట జీవులుగా పుట్టారువారు, నికృష్ట జీవులుగానే ఉండిపోవాలి. పర్యవసానమేమిటంటే వారు క్రుంగి కృశించి అణగిపోతున్నారు, యింకా యింకా అణగిపోయి, మానవుడెవ్వడూ దిగజారలేని అధమ స్థితికి చేరిపోయారు.

## మన దేశంలో ఎందుకు వెనుక బడి పోయింది?

అన్ని దేశాలలోకి మనదేశం ఎందుచేత అతి బలహీనమైనదీ, అతి వెనుకబడినదీ? 'శక్తి'ని గౌరవహీనంగా భావిస్తున్నాము. కనుకనే స్మృతులను రచించి కఠిన నియమాలతో కట్టిపడవేసి, పురుషులు స్త్రీలను కేవలం ఉత్పత్తి యంత్రాలుగా తయారు చేసివేశారు. పట్టుమని పదమూడేళ్ల నిండకుండానే బిడ్డల తల్లులైపోతున్న మన బాలికలను చూడండి. భగవంతుడా! నాకు సర్వమూ యిప్పుడు గోచరమవుతున్నది. "యాత్ర నార్యస్తు పూజ్యంతే రమంతే తత్ర దేవతాః" - "స్త్రీలను గౌరవించిన చోట దేవతలు సంతృప్తులవుతారు!" అన్నాడు అలనాటి మనువు. మనం భయంకర పాపులం, మన పతనానికి హేతువు స్త్రీలను 'తుచ్ఛ కీటకాలుగాను', 'నరకద్వారాలు'గాను పిలువడమే. స్వర్గానికీ, నరకానికీగల తేడా అందులోనే ఉన్నది.

"అర్హతనుబట్టి కానుకలను ఆ దేవుడే నిర్ణయిస్తాడు" ఆ భగవంతుణ్ణి కూడా అర్థ రహిత ప్రేలాపనతో మాయబుచ్చాలా! భగవంతుడు అన్నాడు, "త్వం స్త్రీ, త్వం పుమానసి, త్వంకుమార ఉతవాకుమందే" అని "నీవే స్త్రీవి, నీవే పురుషుడవు, నీవే బాలుడవు నీవే, బాలికవు కూడా" కానీ మనం మాత్రం "దూరమ వసరేచండాల"- "ఒరేయి అంటరానివాడా, దూరంగా పోరా!" అంటున్నాము. "కేనేషా నిర్మితా నారీ మోహినీ"- "మోహన స్వరూపిణియైన స్త్రీని ఎవరు తయారుచేశారు!"

జాతి అట్టడుగుకి దిగజారుతోంది. లెక్కకందని లక్షలాది జనుల శాపం మనకు తగిలింది. నిరంతర జీవనది ప్రక్కనే ప్రవహిస్తున్నది. కానీ దాహంతో ఆర్చుకునిపోయి చనిపోతున్న యీ ప్రజలకు మాత్రం మనం మురికి గుంటలోని నీరే పోశాము. కట్టెదుట కలిమి కనుల పండువ చేస్తోంటే యీ ప్రజలను ఆకలి మంటలకు ఆహుతి చేశాము. వారికి అద్వైతబోధ చేసి, వారిని మాత్రం మన శక్తినంతా వినియోగించి ద్వేషించాము. లోకాచారమనే ఒక ధర్మాన్ని కనిపెట్టాము- ఈ లెక్కకందని లక్షల ప్రజలకోసం, మనమంతా ఒక్కటే, అందరిలోనూ పరమేశ్వరుడొక్కడే అని సిద్ధాంతాలు వల్లెవేసి, అణుమాత్రంకూడా ఆచరణలో చూపించలేదు. ఇటువంటి వీరందరి శాపమూ మనమీద ఉన్నది.

భూ ప్రపంచంలోని ఏ మతమూ మానవుని ఘనత గురించి హిందూ మతం వలె ఉద్ఘాటించదు. అలాగే భూ ప్రపంచంలోని ఏ మతమూ కూడా హిందూ మతంవలె పేద, నిమ్న జాతి ప్రజల కుత్తుకులమీద ఎక్కి స్వారీ చేయదు. ఇప్పుడు మన మతం ఎక్కడ ఉన్నది? 'అస్పృశ్యత'లో అంటరాని తనంలో మాత్రమే ఉన్నది మన మతం. మనం వారిని తాకమూ! వారి పొడ తగులకుండా తప్పించుకుంటాము! మనం మనుష్యులమేనా? పరమేశ్వరా, మనిషికి మనిషి సహోదరుడు ఎప్పుడవుతాడు!

## మతంలో కులం లేదు

మతంలో కులంలేదు. కులమనేది కేవలం ఒక సాంఘిక వ్యవస్థ. కాబట్టి మతాన్ని నిందించి లాభంలేదు. మనుష్యులనే తప్పుబట్టాలి. పూజావ్రతాల ఆడంబరాలంటే విసిగిపోయి, మత తత్వజ్ఞుల ధోరణికి విభ్రాంతి చెందిపోయి ప్రజలు మూకుమ్మడిగా అనాత్మ వాదలో చేరిపోయారు. కుల సమస్యకు, పూజాడంబరాలు, మతతత్వం, అనాత్మవాదం- అనే మూడింట త్రికోణ పోరాటమూ- అనే వాటికీ ప్రారంభమిదే. ఇది ఈనాటి మన వరకు అపరిష్కృత సమస్యగానే మిగిలిపోయి, మనకు సంక్రమించినది.

జాతి ధర్మానికి పునాది సైతం కదలిపోయిందనడానికి నిదర్శనం మన పతనావస్థయే. 'జాతి ధర్మం' అని దేనినైతే పిలుస్తున్నామో దానికి పూర్తి వ్యతిరేక పరిస్థితే ఈనాడు నెలకొని ఉన్నది. శాస్త్రాలను అణచి తణచి చదవండి. శాస్త్రాల్లో కుల ధర్మాలుగా చేసిన నిర్వచనాలు ఈ భూమి మొత్తంమీద మాయమైనాయని, తేలిగ్గా మనకు అర్థమౌతుంది.

భారతదేశ పతనానికి హేతువేమిటి? కులాన్ని గురించిన నిర్వచనాన్ని విడిచిపెట్టడమే. భగవద్గీతలో చెప్పినట్లుగా, కుల నిర్మూలనంతో ప్రపంచమే నిర్మూలమై పోతుంది. ఈనాటి వర్ణమనేది నిజమైన 'జాతి'కాదు. జాత్యాభివృద్ధికి అవరోధం. 'జాతి' లేక వర్ణం లేక వైవిధ్యం అనే వాటి స్వతంత్ర చలనాన్ని అరికట్టింది. ఈనాటి కులం ఒక అమ్మాయిగానీ, అబ్బాయిగానీ పుట్టగానే జ్యోతిష్కులు ఆ శిశువు వర్ణ నిర్ణయం చేయడానికి సిద్ధపడతారు. అదే నిజమైన కులం- వ్యక్తిత్వం, జ్యోతిష్కులు దానిని గుర్తిస్తారు. తిరిగి ఈ పద్ధతి సంపూర్ణంగా ఆచరణలోకి రావడంవలన మనం ఔన్నత్యాన్ని అందుకోగలం. ఈ వర్ణ వైవిధ్యం అసమానత్వంకాదు. ప్రత్యేక సౌకర్యాలు కూడా కాదు. ఘనీభవించిన ఒక ధనికవర్గంగానీ, ప్రత్యేక మినహాయింపులుగల వర్గంగానీ వర్ణవ్యవస్థకు గొడ్డలి పెట్టువంటివి. అది కుల వ్యవస్థ కానేకాదు. 'జాతి' వ్యవస్థ తిరిగి అమలులోనికి రావాలి. వర్ణ పద్ధతి ఉన్న విఘాతాల నన్నిటినీ భేదించాలి. అప్పుడే మనం ఉన్నతిని అందుకొంటాము.

## స్వార్థపర వర్గాల వాదనలు

పేదవారికి, అజ్ఞానులకు స్వేచ్ఛనిస్తే, అంటే వారికి శారీరక స్వేచ్ఛ, ఆర్థిక హక్కులూ, సర్వమూ యిచ్చివేస్తే, ఉన్నత వర్గాలలోని పిల్లలతోబాటుగా ఈ పిల్లలకి తమ స్థితి మెరుగు

పరచుకోవడానికి, జ్ఞానం సంపాదించడానికి సకలావకాశాలూ యిస్తే, వారిలో వక్రబుద్ధి జనిస్తుందని కొందరంటారు. కానీ అలా అనేవారు సంఘ శ్రేయస్సును దృష్టిలో ఉంచుకుని అంటున్నారా లేక స్వీయ ప్రయోజనం కోసమా? మాతాచార్యకత్వమనేది మనదేశానికి చేటు తెచ్చిపెడుతోంది. మనిషి తన సోదరుణ్ణి అధోగతి పాలుచేసి, తాను అధోగతి పాలు కాకుండా ఉండగలడా? తనను తాను నొప్పించుకోకుండా యితరులను నొప్పించగలడా? బ్రాహ్మణ, క్షత్రియ నియంతృత్వ పరపీడనమంతా మూటగట్టుకొని, చక్రవడ్డీతోసహా వారి నెత్తినే పడింది. నిర్ణయాత్మకమైన కర్మ సిద్ధాంతం వారిపైనే ప్రభవిస్తూ వేయి సంవత్సరాల బానిసత్వాన్ని అధోగతినీ వారికి చవి చూపిస్తోంది.

ఎవరైతే గత వేయి సంవత్సరాలుగా పేదవారి రక్తాన్ని పీల్చి పిప్పిచేసి, వారిని బలిపెట్టి తాము విద్యాధికులైనారో, వారినే వందలు, వేల మంది బానిసలుగా అమ్మివేయడం జరిగింది. వారి భార్యలు కుమార్తెలు అవమానితులైనారు. వారి ఆస్తిపాస్తులు కొల్లగొనడం జరిగింది. ఇదంతా నిష్కారణంగా జరిగిన దంటారా?

ప్రజలలో అధిక భాగం నికృష్టకులాలకు చెందినవారే. పై కులాలవారు తిట్లు, దెబ్బలతో ప్రతి అడుగునా హింసలపాలు చేయడం వల్ల వారు తమ పౌరుషాన్ని కోల్పోయారు. బిచ్చమెత్తుకొనే వృత్తిలోకి దిగారు. వారే మన విద్యాబోధన ఖర్చు భరిస్తారు. వారే మన దేవాలయాలను నిర్మిస్తారు. ప్రతిఫలంగా తన్నులు తింటారు.

మనదేశంలో తక్కువ కులంలో పుట్టిన వారెవరైనాసరే, శాశ్వతంగా వారు నివశించినట్లే, ఆశ అనేదిలేదు వారికి తిరువాన్కూరు వెళ్లి చూడండి. అక్కడ పురోహితులు ఎక్కువ-దేశం మొత్తంమీద ప్రతి అంగుళం భూమికో కామందులు బ్రాహ్మణులే. అక్కడ నాలుగోవంతు ప్రజలు క్రైస్తవులైనారు. హిందువుల సానుభూతి లోపించిన కారణంగా మదరాసులో వేలాది నిమ్నజాతి ప్రజలు క్రైస్తవులుగా మారుతున్నారు. ఇది కేవలం ఆకలి మంటతో అనుకోకండి. మననుండి వారికి సానుభూతి దొరకనందునే అలా మారిపోయినారు.

## మత పరివర్తనకు కారణాలు

భారతదేశంలోని పేదవారిలో అధిక భాగం ముసల్మానులున్నారు. ఎందుచేత? వారిని కత్తితో బెదిరించి మతం మార్పించారన్నది అర్థంలేని మాట. జమీందారుల నుండి బ్రాహ్మణులనుండి విముక్తి పొందడానికే మారారు. ఈ కారణంగానే ఎంతోమంది జమీందారులున్న బెంగాల్ దేశంలో రైతులలో హిందువులకంటే మహమ్మదీయులు ఎక్కువ ఉన్నారు.

అస్పృశ్యులనబడు ప్రజలను, యిలాంటి అధ్వాన్న స్థితికి దిగజార్చిన వారెవ్వరు? ఎవరు దీనికి బాధ్యు? ప్రతిసారీ ఒకే జవాబు వస్తుంది. యీ ప్రశ్నకు. ఆంగ్లేయులు మాత్రంకారు. వారు యిందుకు బాధ్యులు కానేరారు. మన దౌర్భాగ్యానికి, అధోగతికి మనం మాత్రమే బాధ్యులం. క్రూర వర్తనకు సాకులుగా అనేక పారమార్థిక, వ్యావహారిక సిద్ధాంతాలను కనిపెట్టిన హిందూమతంలోని కుటిలులే యిందుకు కారకులు.

మనమెంతో పేదవారం అని ఎలుగెత్తి ఏడవడం మనం వింటుంటాం. కానీ పేదవారి క్షేమం కోసం ఎన్ని ధర్మ సంస్థలున్నాయో? మన దేశంలోని లక్షలాది నిరుపేదల బాధలు, వేదనలు తలచుకొని వారి ఆర్తిని విని ఎంతమంది నిజంగా కన్నీరు కారుస్తున్నారు? మనం అసలు మనుష్యులమేనా? వారి జీవన భృతికి, వారి అభివృద్ధికి మనం ఏమి చేస్తున్నాము?

మనం చాలా విషయాలు చిలకల్లా పలుకుతుంటాము కానీ వాటిని ఆచరించము. మాట్లాడ్డమేగానీ, ఆచరించకపోవడం మనకు అలవాటై పోయింది. దీనికి కారణమేమిటి? శారీరక బలహీనత! ఈ శారీరక బలహీనతే మన దౌర్భాగ్యాల్లో మూడో వంతుకు హేతువని చెప్పవచ్చును. మనం బద్ధకస్తులం. పనిచేయలేము, ఐక్యతగా కలవలేము. ఒకరినొకరు ప్రేమించుకోము, అతి గాఢమైన స్వార్థముంది. మనలో ముగ్గురు మనుష్యులం ఒకరినొకరు ద్వేషించుకుంటూ, ఒకరంటే ఒకరు అసూయపడకుండా దగ్గరకు రాలేము.

మన జాతిలో నిర్వహణా దక్షత పూర్తిగా లోపించింది ఈ ఒక్క లోపంవల్లనే అనేక దుష్పరిణామాలు కలుగుతున్నాయి. ఏదైనా ఒక అంశం గురించి ఐక్యతా ఘటన ఆరంభించడానికి మనం విముఖులుగా వున్నాము. నిర్వహణా సామర్థ్యానికి మున్ముందుగా విధేయత అనేది అత్యావసరం.

మనకు యిక్కడ రెండు చెడుగులున్నాయి. ఒకటి మన బలహీనత, రెండవది ద్వేషభావంతో, ఆర్ద్రత లోపించిన మన హృదయాలు. మనం లక్షల సిద్ధాంతాలను గురించి ఉపన్యసించవచ్చును. కోట్ల సంఖ్యలో మనకు మతాంతర్గత శాఖలుండవచ్చును. కానీ స్పందించే హృదయం లేనంతవరకు ఇవన్నీ ఎందుకూ కొరగావు.

అస్పృశ్యులు మనలోనే ఒక భాగమని భావించే వరకు మీరు, వారు, పేద, గొప్ప, పుణ్యాత్ముడు, పాపాత్ముడు అందరూ పరబ్రహ్మమైన ఆ పరమాత్మలోని భాగాలని భావించే వరకు, వారి కొరకు బాధపడాలి. అదే మన వేద ప్రబోధం.

# హిందూమతమే భారత సంస్కృతికాదు

**-పండిట్ నెహ్రూ**

అనుబంధం -5

హిందూమతం హిందువులు అనే మాటలు ఎలా వచ్చాయి?

మన పురాణేతిహాసాల్లో "హిందూ" అనేమాట ఎక్కడా కనబడదు. క్రీ.శ. 8వ శతాబ్దంలో ఒక తాంత్రిక గ్రంథంలో "హిందూ"అనే పదం వాడబడిందని వింటున్నాము. ఏ మతస్థులు కాకుండా ఒక దేశపు ప్రజలనే భావంలోనే ఆ మాట వాడబడింది. పార్సీల మతగ్రంథమైన అవెస్టాలోనూ, పాత పార్సీ భాషలోను ఈ మాట ఉపయోగింపబడింది కనుక చిరకాలంగా వాడుకలో మాత్రమున్నది. అప్పుడూ తరువాత వేయేండ్ల వరకూ కూడా సింధునది కివతలిప్రాంతమైన భారతదేశాన్ని, ప్రజలను పాశ్చాత్యులా పేరుతో పిలిచేవారు. సింధులోనుంచి వచ్చిన మాటే "ఇండస్", ఇండస్‌లో నుంచే హిందూ, హిందూస్థాన్ అనే మాటలుత్పన్నమైనాయి. "ఇండియా" కూడా అందులోనుంచి పుట్టినదే. క్రీ.శ. 7వ శతాబ్దంలో ఇండియాకొచ్చిన చీనా యాత్రికుడు "ఐ-సింగ్" తన యాత్రావిశేషాలను గ్రంథస్థంచేస్తూ "ఉత్తరాన్నుంచి వచ్చిన సెంట్రల్ ఏషియావారు, ఇండియా దేశాన్ని "హిందూ" అంటారు. కాని అది సరియైన పేరుకాదు. 'ఆర్యదేశం అనడమే బహుధా ఉచితము' అని వ్రాశారు. 'హిందూ' అనే పదాన్ని మతానికి ముడిపెట్టడం ఇటీవల జరిగినదే.

## ఆర్య ధర్మం

ఆ కాలంలో హిందూదేశంలో మతాన్ని సూచించే మాట 'ఆర్యధర్మం' ధర్మమంటే నిజానికి మతంకన్న విశిష్టమైనది. 'ధర్' ధాతువులోనుంచి వచ్చింది. అనగా కలిసి వుండడం అని అర్థం. ధర్మమనగా సమగ్రమైన ఆధ్యాత్మిక స్వరూపం. నైతిక ప్రవర్తనా విధానం, ధర్మనిరతి, న్యాయబుద్ధి, మానవుని విధులు, బాధ్యతలు అన్నీ అందులోనే ఇమిడున్నాయి. ఇండియాలో వెలసిన 'ఆర్యధర్మం'లో వైదిక మతాలు, తదితరములుకూడా కలిసే వున్నాయి. బౌద్ధులు, జైనులు కూడా ఆర్యధర్మమనే వాడేవారు. బుద్ధభగవానుడు తాను సూచించిన మోక్షమార్గాన్ని 'ఆర్యపథ'మనే అన్నాడు.

'వైదిక ధర్మం' అనే మాట పూర్వకాలంలో వేదాల్లో చెప్పబడిన వేదాంత మార్గాలూ, నైతిక ప్రవచనాలూ, కర్మ కాండలూ అన్నిటిని సూచించేటట్లుగా ఉపయోగింపబడింది. అనగా వేదాలను ప్రమాణంగా అంగీకరించేవారంతా వైదిక ధర్మానికి చెందినవారనే చెప్పవచ్చును.

'సనాతన ధర్మం' అంటే పురాతన మతమని అర్థం. ఆ మాటను బౌద్ధ జైన మతాలకు కూడా వర్తింపచేయవచ్చును. కాని నేడు హిందువులలో కొందరు ఛాందసులు మాత్రం దానిని కేవలం హిందూమతావలంబుల స్వంత సొత్తుగా భావించుకుంటున్నారు.

బౌద్ధ జైన మతాలు వైదిక ధర్మబద్ధమైన హిందూ మతం లోనివి కావని మాట నిశ్చయం. అయినా అవి కూడా హిందూ దేశంలోనే ఆవిర్భవించాయి. భారతీయ జీవితంలో, సంస్కృతిలో, వివేకంలో మమేకమైపోయాయి. మనదేశంలోని బౌద్ధుడుగాని జైనుడుగాని హిందువుడు కాకపోయినా భారతీయ సాంప్రదాయమైన సంస్కృతినే అనుసరిస్తాడు. అందుచేతనే భారత సంస్కృతిని కేవలం హిందూ సంస్కృతి అనడానికి వీలులేదు. తరువాత యుగంలో ఇస్లాం మత ప్రభావం చాలా హెచ్చుగా ఉండినా అసలు భారతీయ సంస్కృతిమూలాలు మారలేదు. నేడు శతవిధాలుగా పాశ్చాత్య నాగరికత, పారిశ్రామిక విప్లవం తాకిడులు తగులుతున్నాయి. అందువలన మన సంస్కృతిలో ఎట్టిమార్పులు కలుగుతాయో నిష్కర్షగా చెప్పలేము.

## హిందూ మతం అనిర్దిష్టమైనది

హిందూమతం చాల అనిర్దిష్టమైనది. స్థిరమైన స్వరూపం కలదికాదు. అందరికన్నివిధాలుగా సాక్షాత్కారమయ్యే బహుముఖి, అనిర్వచనీయం. మామూలు భావంలో దానిని మతమనాలో అక్కరలేదోకూడా తెలియదు. పూర్వము, ప్రస్తుతము కూడా, హిందూమతమెన్నో మతాలను, ఆచారాలను అన్వయించుకుంది. కొన్ని పరస్పర విరుద్ధంకూడా. దాని ప్రధానోద్దేశ్యం 'నీ బ్రతుకు నువ్వు బ్రతుకుతూ యెదటివాళ్ళ నిష్టం వచ్చినట్లు బ్రతుకనివ్వడం'లాగే తోస్తుంది. మహాత్మాగాంధీ హిందూమతాన్ని ఇలా నిర్వచించడానికి ప్రయత్నించాడు. "నన్ను హిందూమతాన్ని నిర్వచించమంటే అహింసామార్గాన సత్యాన్వేషణం చేయడమే అని చెప్తాను. దేవునియందు నమ్మకం లేకపోయినవాళ్ళు కూడా తాము హిందువులనుకోవచ్చును. నిరంతర సత్యాన్వేషణమే హిందూమతం. సత్యమతమే హిందూమతం. సత్యమే భగవంతుడు. భగవంతుని కాదన్నవారున్నారుకాని, సత్యాన్ని కాదనగలవారింతవరకు లేరు."

కనుక భారత సంస్కృతిని హిందూమతమనడం సబబు కాదు. చరిత్రలోనూ, పురాణాల్లోనూ వ్రాయబడిన వ్రాతల్లో హిందూ భావలెక్కువగా వున్నా 'హిందూ' అనే మాట సరికాదు. ఇంకా ఈ కాలంలోకూడా ఆ అభిప్రాయంలో 'హిందూ'

(మిగతా 141 పేజీలో)

అనుబంధం -7

# 'ఈనాటి మార్క్సిజం'

- శ్రీ ఎస్.జి. సర్దేశాయి

ప్రముఖ మార్క్సిస్టు సిద్ధాంతవేత్త ఎస్.జి. సర్దేశాయి ఈనాటి మార్క్సిజం అనే ఒక గ్రంథాన్ని తాజాగా రచించారు. అందులో మతాన్ని గురించి రాసిన భాగాన్ని ఈ దిగవ యిస్తున్నాము :

"ప్రపంచంలో అనూహ్యమైన పరిణామాలు జరుగుతున్నాయి. ప్రతిదేశంలోను యిలాంటి మార్పులే వస్తున్నవి. చిత్తశుద్ధి గల మార్క్సిస్టులందరు చాలా కష్టపడి ఆలోచించాలి. మార్క్సిజాన్ని సంస్కరించటానికి కాదు, ఆధునిక ప్రపంచ సమస్యల పరిష్కారానికి అనువైనదిగా మార్క్సిజాన్ని మార్చాలి.

మనమందరమూ ఒక పొరపాటు చేశాము. మార్క్సిజం గడ్డగట్టుకు పోయేటట్లు చేయటంలో అందరమూ బాధ్యులమే. ఇప్పుడు మార్క్సిజానికి నూతన జీవం పోయాలి.

సుదీర్ఘమైన శీతాకాల గాఢ రాత్రిని మార్క్సిజం ప్రస్తుతం అధిగమిస్తున్నది ఒక కవి చెప్పినట్టు తొందరగానో, ఆలస్యంగానో, చలికాలం తర్వాత గ్రీష్మరుతువు రాక తప్పదు.

## మతం : జాతి

ఇంతకు ముందు ప్రస్తావించిన బహుళ వర్గ వ్యవస్థలను నేను ప్రస్తావించను. అందుకు తగిన సామర్థ్యం నాకు లేదు. ఈ వయస్సులో కొత్త అంశాలను అధ్యయనం చేసే శక్తి లేదు కూడా. కాని మతాన్ని గురించి, జాతిని గురించి కొన్ని మాటలు చెబుతాను.

సామాజిక దురహంకారపూరిత, ఛాందసవాద ధోరణిలో, మతాన్ని, జాతిని దుర్వినియోగం చేయడాన్ని గట్టిగా ప్రతిఘటించవలసి వుంది. ఆ విషయంలో ఎట్టి సందేహమూ లేదు. ఐనప్పటికీ మతం, జాతిని గురించి మన భావాలు ఏకపక్షంగా వుంటున్నవి. అవి పూర్తిగా శాస్త్రీయమైనవి కూడా కావు. ఏమంటే చాలా విషయాలను మనం విస్మరిస్తున్నాము. లేక ఉపేక్ష చేస్తున్నాము.

ప్రజలకు మతం మీద విశ్వాసం వుండటానికి ప్రధాన కారణం, మత భావన కొనసాగుతూ వుండటానికి కారణం, మానవ జీవితంలో అస్థిరత్వం, భద్రతారాహిత్యం నెలకొని వుండటం ప్రకృతిపైన, సమాజంపైన మానవుని పెత్తనం ఇప్పటికీ చాలా పరిమితం. కనుకనే ఈ భద్రతారాహిత్య భావన ఏర్పడుతున్నది. ప్రకృతిని గురించి, సమాజాన్ని గురించి మనకు తెలిసింది చాలా తక్కువ. తెలుసుకోవలసింది చాలా హెచ్చు. ఈ భద్రతారాహిత్య భావనవలననే , ఏదో అమానుషశక్తులు తమ జీవితాలను నిర్ణయిస్తున్నాయనే భ్రమకు ప్రజలు లోనవుతున్నారు. ఆశక్తికి సాగిలపడి, ప్రార్థించి లొంగిపోయే పరిస్థితి ఏర్పడుతున్నది.

ఈ భద్రతారాహిత్యం ఏ మోతాదులో ఉన్నదో మనం తరచి ఆలోచించము. ఇది ఒక విధంగా సర్వవ్యాపితం.

## భద్రతా రాహిత్యం

జీవితం, మృత్యువూ అనే సమస్యనే తీసుకుందాం. తాను ఎంత కాలం జీవిస్తాడో, ఎప్పుడు మరణిస్తాడో మానవుడు తెలుసుకోలేడు. తీరా ఒక వ్యక్తి మరణిస్తే అతని కొక్కడికే కాక, అతని బంధువులకు, అతనిపై ఆధారపడిన వారికి కూడా చాలా యిబ్బందులు ఏర్పడుతున్నాయి. అధిక సంఖ్యాకులైన ప్రజలు వర్షాధారం మీద ఆధారపడి వ్యవసాయ పంటలపై జీవిస్తున్నారు. కరువు, లేక ఒక ఉప్పెన వస్తే మొత్తం రైతు కుటుంబాలన్నీ ధ్వంసమైపోతాయి. ఈ రెండూ మానవుని శక్తికి అతీతమైనవి, అతని అధీనంలో లేనివి. గత ఆగస్టు 10వ తేదీన దాదాపు వర్షాలు యిక కురవవు అనే భావం ఏర్పడగానే రైతులు, ప్రజలు, ప్రభుత్వం ఎంతగా ఆందోళన చెందారో మనం ప్రత్యక్షంగా చూశాము (11-8-93)

మన నగరాలకు మంచినీటిని సప్లైచేసే సరస్సులు దాదాపు ఎండిపోయాయి. ఈ సమస్య తీవ్రతను గురించి మనం పెద్దగా చెప్పుకోవలసినపని లేదు. చుట్టూ ఒకసారి చూస్తే సరిపోతుంది.

నిజానికి, ప్రకృతి యిప్పటికీ అంధప్రాయంగా, గుడ్డిగా ప్రవర్తిస్తున్నది. దానికి ఒక లక్ష్యం అంటూ లేదు. ప్రకృతి దుర్మార్గులను, సాధువులను ఉభయులను సృష్టిస్తున్నది రోజు కొక విచిత్రాన్ని సృష్టించి, ఆ మరుక్షణమే దానిని ధ్వంసం చేయటంలో ప్రయోజనం లేదు. (అన్నిటి కంటే ఎక్కువ ఆశ్చర్యకరమైనది మానవావతరణ) ఈ వైరుధ్యాలకు సమాధానం దొరకటం లేదు. దాంతో మతంపట్ల, దేవునిపట్ల ప్రజల విశ్వాసం తగ్గకపోగా, పెరుగుతున్నది. ఈ ప్రాకృతిక శక్తులపై అదుపు లేనంత కాలం, వీటిని అదుపు చేయలేనంత వరకు ప్రజలు మరింత భద్రతారాహిత్యానికి గురి ఔతూ వుంటారు. కర్మవాదాన్ని విశ్వసిస్తూ వుంటారు, మూఢ విశ్వాసాలకు బలి అవుతూ వుంటాం.

ఈశ్వరేచ్ఛను ఎవరూ గ్రహించ లేరు అనే నిర్ణయానికి వస్తాం. దీంతో మతంపై ప్రజల విశ్వాసం మరింత పెరుగుతుంది. ఈ భూగోళం, కాలాతీత, అనంత విశ్వాకాశంలో ఒక చిన్న పలుకు మాత్రమేనన్న గుర్తింపు, ఈ భద్రతారాహిత్య భావాన్ని మరింత ఎక్కువ చేస్తుంది.

## తర్కం జీవితం

మన సమాధానం మనకున్నది. ప్రకృతిలో ఈ వైరుధ్యాలు, తత్ఫలితంగా ఏర్పడే భద్రతారాహిత్య భావం, సహజం, అనివార్యం అని మనం చెబుతాము. ఇవన్నీ సృష్టికర్త ఉనికిని నిరూపించటానికి బదులు, సృష్టికర్త రాహిత్యాన్నే తెలియచేస్తుందంటాము. భద్రతారాహిత్య భావం జీవితంలో అంతర్భాగమని, లేని సృష్టికర్తను గురించి ఊహిస్తూ కాలం గడపక, ఈ సమస్యలను ధైర్యంగా ఎదుర్కోవాలని మనం చెబుతాము. కాని తర్క విద్యకంటే, జీవిత సత్యం చాలా బలమైనది. అది సహజం, అనివార్యమూ.

న్యాయబద్ధమైన సామాజిక వ్యవస్థ నిర్మాణం, విశ్వజనీన విద్యావ్యాప్తి, ఈ రెంటిద్వారా మతంలో విశ్వాసం సన్నగిలుతుందని మనం చెబుతూ వుంటాం. కాని శాస్త్రజ్ఞానం ఏ మేరకు విజ్ఞానాన్ని ప్రసరిస్తుందో,అంతకంటే తెలియని ప్రపంచం వందరెట్లు ఎక్కువ. కనుక, నా అభిప్రాయమేమంటే, మత విశ్వాసాలు ఈ ప్రపంచంతో పాటు వుంటూనే వుంటాయి. మనం చేయగలిగిందల్లా, మతం యొక్క ప్రయోజనాత్మక అంశాన్ని వినియోగించుకుని, విమర్శ కూడా కేవలం నిందాప్రచారం ద్వారాకాకుండా, విద్యాబోధన ద్వారా, ఉదాహరణలద్వారా నచ్చచెప్పే విధంగా సాగాలి.

నిజమే మతాన్ని స్వప్రయోజనాలకు వాడుకునే సామాజిక శక్తులు కొన్ని వున్నాయి. దోపిడీ వర్గాలు తమ బాకాలైన పురోహిత వర్గంతోడ్పాటుతో, మతాన్ని ఎల్లప్పుడూ స్వప్రయోజనాలకు వాడుకుంటూనే వున్నారు. వారి వాదన ప్రకారం, సామాజిక దురన్యాయం, దోపిడీ, అసమానత్వం అన్నీ కూడా దైవ సంకల్పాలు, ఎందుకలా జరుగుతుందో ఎవరికీ తెలియదు. ఈ వాదన మతానికి సంబంధించిన ఒక ఆచ్ఛాదనను సృష్టిస్తుంది. మనం నిజంగా న్యాయమైన, సామాజిక అసమానతలు లేని సమాజాన్ని సృష్టించిననాడు, ఈ దుష్ప్రభావం చాలా వరకు తగ్గుతుంది.

# బుద్ధుడు, శంకరుడు, వివేకానంద

(93వ పేజీ తరువాయి)

వివక్షను చూసి, విస్మయ పడి "ఇది నిజంగా పిచ్చి వాళ్ళ దేశం" అన్నాడు. రాజకీయ, సామాజిక, ఆర్థిక రంగాలలో సర్వ సమానత్వానికె వివేకానంద పిలుపునిచ్చాడు.

అంటే దీని అర్థం, వివేకానంద, సోషలిస్టు లేక మార్క్సిస్టు అని చెప్పడం నా ఉద్దేశ్యం కాదు. మార్క్సు సిద్ధాంతాలతో ఆయనకు పరిచయం లేదు. ఆ సిద్ధాంతాలను అర్థం చేసుకోలేదు కూడా. కాని ఆయన ప్రజాతంత్రవాది, సామాజిక తిరుగుబాటు దారుడు, భారతీయ సమాజాన్ని సంపూర్ణంగా మార్చు చేయాలని వాంఛించినవాడు. ఆయన, ఆయన తరానికి చెందిన ఇతరులు చేసిన కృషి వలననే, ఆధునిక కార్మిక వర్గం భారత దేశంలో అవతరించింది. మార్క్సిజంపై ఆధారపడిన విప్లవ సోషలిస్టు ఉద్యమం తలయెత్తింది.

స్వామి వివేకానంద నిజమైన బోధన ఇది. కొందరు వివేకానంద అనుచరులమని చెప్పుకుంటున్న వారు, స్వామిజీ యొక్క నిజమైన యీ బోధలను వక్రీకరించటానికి యత్నిస్తున్నారు. వివేకానంద విప్లవ సందేశాన్ని విస్మరిస్తున్నారు.

**(నవంబరు, 5 ఫ్రంట్‌లైన్ పత్రిక నుండి)**

# హిందూత్వమే సంస్కృతి కాదు

(97వ పేజీ తరువాయి)

పదాన్ని వాడడం మరీ తప్పు. పురాతన మతం, తత్త్వం కేవలం జీవితంలో ఒక దృక్పథం మాత్రమే అయితే స్థూలంగా భారత సంస్కృతిని హిందూ సంస్కృతి అనవచ్చు కాని, హిందూమతం పేర కొన్ని అనుల్లంఘనీయమైన విధులు, మంత్రతంత్రాలు, కర్మకాండలు మొదలైనవి ఏర్పడినపుడు దానిని సమగ్రమైన భారత సంస్కృతి అనడానికి వీలులేదు. దానికన్న ఒక మెట్టు దిగిందన్నమాట. క్రైస్తవుడుగాని, మహమ్మదీయుడుగాని భారతీయ సాంప్రదాయాన్ని, సంస్కృతిని అనుసరిస్తూనే తన మతాన్ని అట్లే ఉంచుకోవచ్చును. మతం మారనక్కర లేకుండానే, అతడు భారతీయుడుగా ఉండవచ్చును.

"ఇండియనో" అనే మాటకు సరియైన పదం "హిందీ" అటే మన సంస్కృతికి, చారిత్రక సాంప్రదాయాలకూ సరిపోతుంది. హిందూస్తానీ అనే మాటకు హ్రస్వస్వరూపం "హిందీ". పశ్చిమ ఆసియాలో, ఇరాన్‌లో, టర్కీలో, ఈజిప్టులో, ఇండియాను "హిందో" అనే అంటారు. ఇండియాకు సంబంధించిన అన్ని విషయాలను "హిందీ" అంటారు. మతంతో నిమిత్తం లేకుండానే భారతీయమైన విషయాలన్నిటిని 'హిందో' అనే అంటారు. భారతీయులను అమెరికావారు హిందువులంటారు. నిజానికి వాళ్ళ ప్రయోగం అంత తప్పుకాదు. "హిందీ" అని వాడితే మరీ మంచిది. కాని మన దేశంలో హిందీ అంటే దేవ నాగరి లిపికి పర్యాయపదమైంది. కనుక దానిని విశాలభావంలోనూ సహజంగానూ వాడడం కష్టం. బహుశా నేటి తర్కోపతర్కాలన్నీ అంతమైన పిమ్మట "హిందీ" పదాన్ని దాని సహజ స్వరూపంలో వాడతామేమో!

– "డిస్కవరీ ఆఫ్ ఇండియా" గ్రంథంలో

పోయిన పితృదేవతలకే శ్రాద్ధ పిండాలు చేరుటట్టయితే,దూర ప్రయాణంలో ఉన్నవారికి ఇక్కడ ఇంటివద్ద ఏల అన్నం పెట్ట రాదనీ ప్రశ్నిస్తూ కర్మ విధానాలలో గల లోపాలను బయట పెట్టాడు. జీవుడనేది బూటకమంటే పునర్జన్మ, పరలోకం కూడా బూటకాలైపోతాయి. నిప్పుకు వేడి, నీటికి చల్లదనం ఎట్లో అట్లే శరీరానికి చైతన్యం స్వభావమని చెప్పాడు. శరీరము నశించి బూడిద అయిన పిదప మరల దాని నుండి తిరిగి వచ్చు జీవములేదు.కనుక మానవుడు జీవించియున్నంత కాలము సాంఘిక నీతి పద్ధతులకు కట్టుబడి సౌఖ్యాన్ని అనుభవించాలి అని చార్వాకుడు నిర్ణయించాడు.

ఆస్తికభావాల్ని విమర్శిస్తూ దైవ భావం కన్నా, జీవుడను భావాన్నే విస్తారంగా చార్వాకుడు ఖండించినట్లుగా కనబడు తుంది. అది ఎందువల్లనంటే ఆనాటి హిందువులలో జగత్తంతా బ్రహ్మ స్వరూపం అనుకోవడం చేత ఇతర ఆస్తిక సాంప్ర దాయాల ప్రకారం మానవాతీతమైన దేవునకు మానవుని మీద ఉన్నంత ప్రభావం, బ్రహ్మయనుభావానికి లేదు. హిందూ మతంలో బ్రహ్మ అను భావం సత్యనిరూపణకే పనికివచ్చినది కాని, దినచర్యలోను, నీతి నిర్ణయంలోనూ మాత్రం జీవుడు కలడు అనే భావమే ప్రాముఖ్యం వహించింది. జీవుడ్ని అనుస రించే పునర్జన్మ, కర్మసిద్ధాంతాలు హిందూమతానికి ఆధారా లైనాయి. తమకు అర్థంకాని పనులను ఇతర ఆస్తికులు దైవి కాలు అనుకుంటే హిందువులు వాటిని పూర్వజన్మ కర్మ ఫలితాలనుకుంటారు. ఇట్లు దైవం అనే భావం వెనకపడి, జీవుడనే భావం ప్రాముఖ్యం వహించిన హిందూమతం మధ్య పెరిగిన చార్వాకుని 'లోకాయత మతం' జీవుడు, పరలోకం అనే భావాల్ని ఖండించడం సహజమే.

మానవ సమాజంలో ఆస్తిక దృష్టివల్ల ఏర్పడుచున్న అవినీతిని,అసౌఖ్యాన్నీ తొలగించడానికని ఇతర మత ప్రవక్తలు కొంత నాస్తిక దృష్టిని అనుసరించినా, ఆస్తికత్వాన్ని పూర్తిగా విడువలేక పోయేరు. దేవుడు, జీవుడు, పరలోకం అను భావా లను ఇంకో విధంగా పోషించారు. కాని ప్రాచీన యుగంలోనే చార్వాకుడు ఆస్తికత్వాన్ని పూర్తిగా ఖండించి, నాస్తిక్యాన్ని నిరూపించేడు. పరలోకం లేదనీ, మోక్షం కలదనే భావం అబద్ధ మనీ, మానవుడు ప్రాణం ఉన్న కాలంలోనే సౌక్యం అనుభ వించాలి అని చెప్పారు.మానవుడు తన పనులకు, అనుభవా లకు స్వతంత్రుడనీ, బాధ్యుడనీ తనను నడిపించే దైవం గానీ, పూర్వజన్మ, ఖర్మగాని లేవనీ స్పష్ట పరిచాడు.

## నాస్తికత్వభావానికితోడ్పడిన నిర్గుణ బ్రహ్మ

నిర్గుణబ్రహ్మ అను భావం ప్రబలి ఉండటంచేత ఇతర మతాలకంటే ముందుగా హిందూమతంలో నాస్తికత్వం ప్రబోధింపబడుటకు వీలుకలిగింది. కాని ఆ యుగంలో సత్యజ్ఞానాన్ని తర్కరీత్యా సంపాదించడానికి ప్రయత్నించేవారే కాని, తర్కం వల్ల వచ్చిన భావాలను అనుభవాలతో పోల్చి నిర్ధారణ చేసికొనవలెనన్న దృష్టి వారికి ప్రబలలేదు. అందు చేతనే ఒకవైపు పరబ్రహ్మ, జీవుడు, పునర్జన్మ, కర్మ అను భావా లున్నూ, ఇంకోవైపు ఇంద్రాది దేవతలు, యజ్ఞాది క్రతువులలో నమ్మకాలున్నూ హిందూమతంలో విరివిగా పెరిగాయి. నిజానికి ఇవేవీ నిర్ధారణకు నిలిచేవి కావు. అయినప్పటికీ ప్రజలు ఈ కుతర్కాల్లోను, మూఢ నమ్మకాల్లోను చిక్కుకుని ఉండేవారు. ప్రజాసామాన్యంలో సరియైన సత్య దృష్టిలేదు. మరియు అప్పుడు బ్రాహ్మణాధిక్యత విస్తారంగా ఉండేది. నాస్తికత్వం ప్రబలితే వర్ణ ధర్మాలకు, అర్చకత్వానికి దెబ్బతగిలేది. అందుచేత చార్వాకుడు ప్రవేశపెట్టిన నాస్తికత్వాన్ని అణచ డానికని వారు రకరకాలయిన ప్రయత్నాలు చేశారు. నాస్తి కత్వం దూష్యం అన్నారు. నాస్తికులతోసంప్రదింపులను నిషే ధించారు. షడ్దర్శనాలు, పురాణాలు, తరువాత భగవద్గీతవల్ల హిందూ మత సిద్ధాంతాన్ని పోషింప ప్రయత్నించారు. ఈ ఒత్తిళ్ళకు ఆనాటి ప్రజ లొంగిపోయారు. నాస్తికత్వం సంఘ సంస్థగా ప్రాచీన యుగంలో నిలువలేదు.

## ఆస్థిక భావాలు బలపడడానికి కారణం

అర్చకశాఖ ప్రాబల్య వల్లనైతేనేమి, వర్ణధర్మాల కట్టు దిట్టాల వల్లనైతేనేమీ ఆస్తిక భావాలే అంతకంతకు హిందూ మతంలో బలపడ్డాయి. హిందువులు ప్రాచీన నాస్తిక దృష్టినుంచి ఆస్తిక దృష్టివైపు పోసాగారు. విగ్రహారాధన కూడా హిందూమతంలో ఒక ప్రధాన స్థానం ఆక్రమించింది. ఇంత ఆస్తిక్యం ఉండడంచేత హిందూవులు అసౌఖ్యానికి పాలయి ఉండవలసింది. కాని ఇండియా విశాలమైన దేశం. సారవంతమైన నదీ ప్రాంతములు కలది కనుక ప్రజలు కూడు నీడలకు కష్ట పడలేదు. సాంప్ర దాయకంగా వస్తున్న దానితో సంతృప్తి పొంది అభివృద్ధిని ఆశించక పరలోకచింతనలో పడి ప్రజలు కాలం గడిపేవారు. క్రొత్త ప్రాంతాలను చూచి, క్రొత్త విషయాలను గ్రహించవలె నన్న కుతూహలం వారికి లేకపోయింది. ఇండియాదేశంలో గల ప్రత్యేక ప్రకృతి సౌకర్యాలను వారు వినియోగించుకోలేదు. నాగరికతను అభివృద్ధి పొందింపవలసినంతగా వారు వృద్ధి చేయలేదు. దీనికంతకు వారి తర్కం, పరలోక చింతనయే కారణం.

ఇతర దేశస్తులు తమ దేశంలోనికి రానంతవరకు హిందు వులు ఇలా ఉండగలిగారు. వీరిట్లు ఉంటూ ఉండగా, అరేబి యాలోనూ, యూరప్‌లోను మార్పులు జరుగు తున్నవి.ఆ దేశాలు ఇండియా అంత ఫలవంతమైనవి కావు.తెగ తెగల మధ్య యుద్ధాలు ఉండేవి.తర్కించుకుంటూ కూర్చునే అంత తీరిక వారికి లేదు. వారి ప్రవక్తలు జీవాత్మ, పరమాత్మ అనే ఊహా పరంపరలలో మునిగిపోలేదు. పురుష ప్రయత్నానికి హెచ్చు ప్రాముఖ్యత యిచ్చారు. సంఘాన్ని గట్టి నీతి నియమాలమీద ఆధార పరిచారు. సత్య దృష్టికి మాత్రం ఏదో ఒక దేవుని గట్టిగా నమ్మారు. అరేబియాలో మహ్మదు, యూరప్‌లో లూతరు ఇటువంటి మార్పులు తీసుకువచారు. వారి ప్రబోధాలవల్ల ప్రజల్లో ఉత్సాహం కలిగి, అభివృద్ధిని ఆసిస్తూ నలుదిశలా వ్యాపించారు.వారు ఇండియాలో కూడా ప్రవేశించారు. ప్రత్యక్ష

(మిగతా 106వ పేజీలో)

అనుబంధం -9

# మతము - గాంధీజీ

"మతం అంటే నా ఉద్దేశంలో, లాంఛన ప్రాయంగానూ, సాంప్రదాయాను సిద్ధంగానూ అనుసరించేది కాదు. అన్ని మతాల సారాంశం కల్గినదీ, మనని ఈశ్వర సాన్నిధ్యానికి చేర్చగల్గినదీ మాత్రమే మతం.

నిజానికి మన మతం మన ప్రతి చర్యనీ ఆవహించేదిగా వుండాలి. మతం అంటే పర్గాల క్రింద విడిపోయి, వాటినే మూఢంగా అనుసరించడం కాదు. విశ్వాన్నంతటినీ, నిర్దిష్టమైన నైతిక సూత్రాలతో నిర్వహించేశక్తిలో విశ్వాసమే నిజమైన మతం. అది మనకి అదృశ్యంగా వుండవచ్చు. అయినా అదే మహోన్నత సత్యం. ఆ సత్యంలో విశ్వాసమే మతం. అది హిందూమతము, ఇస్లాం మతము, క్రైస్తవ మతము వంటి మతాల కన్నా ఎంతో అతీతమైనది.

మతాలు, ఒకే పరిధి నుంచి కేంద్రానికి చేరుకునే వ్యాసార్థాల వంటివి. అన్ని మతాలదీ ఒకే లక్ష్యమయినప్పుడు మార్గం ఏదయితేనేం?

సహనము అన్నమాట నా కంత నచ్చదు. కాని అంతకన్నా మంచి మాట నాకు కనపడడం లేదు. ఇతర మతాల ఎడ సహనం చూపాలంటే, ఇతర మతాలు మన మతంకన్నా తక్కువ అని స్ఫురించవచ్చు. కాని అహింస మనకి సర్వమత సమానత్వం బోధిస్తుంది.

మానవుడు సృష్టించిన మతాలన్నీ లోప భూయిష్టమయినవే గనుక. వాటిలో ఏది మంచి ఏది చెడ్డ అన్న విచక్షణ కూడా అవసరం లేదు. ఆ సత్యం యొక్క బహుముఖాలలో ఎదో ఒక దానిని ప్రతి మతం ప్రతిఫలించవచ్చు. ఇతర మతాల యెడ మనకి గల గౌరవం వల్ల మనం వాటి దోషాలని గుర్తించకూడదని కాదు. మన మతంలో దోషాలు కూడా మనం బాగా తెల్సుకోవాలి. కాని వాటికోసం మతాన్ని వదిలి పెట్టక, ఆ లోపాలను దిద్దడానికి ప్రయత్నించాలి. అన్ని మతాలనీ సమదృష్టితో చూడగల్గిన నాడు మనం యితర మతాలలో మంచి సూత్రాలని మన మతంలో చేర్చడానికి వెనకాడము.

ఇతర మతాల యెడ సహనం అలవర్చుకున్ననాడు మనం మన మతం బాగా అర్థం చేసుకో గల్గుతాము.

సహనం వల్ల చెడు, మంచి, నిజము, అసత్యము, వీటి మధ్య గల వ్యత్యాసము తొలగిపోజాలదు. ఇక్కడ ఉదాహరించిన మతాలు ప్రపంచంలో వున్న ముఖ్య మతాలు మాత్రమే. అవన్నీ మామూలు మూల సూత్రాలపై ఆధారపడ్డవే. అన్నిటిలోనూ పావనమైన మహాభక్తులు జన్మించారు.

ప్రపంచంలో వున్న అన్ని ముఖ్య మతాల మూల సిద్ధాంతాలు నేను విశ్వసిస్తాను. అవన్నీ దైవోద్దీపితములనీ, ఆయా ప్రజలకి ఆయా పరిస్థితులలో అవసరమనీ అంగీకరిస్తాను. ఆయా మతాలు అనుసరించేవారి దృక్పథం నుంచి అన్ని మత గ్రంథాలని చదివినట్లయితే, అన్నిటిలోనూ మూల సూత్రాలు ఒకటేననీ, ఒకదానికొకటి సహాయకారి అనీ తెలుస్తుంది.

మతాలు ఒకరి నుంచి ఒకరిని వేరు చేయడానికి ఉద్దేశించినవి కావు. మనుష్యులని సమైక్య పర్చడం వాటి ఉద్దేశం.

ప్రపంచంలో అందరు మనుష్యులనీ, వారి మతమేదయినా, వారే దేశానికి చెందినా ప్రేమించాలి. ఆ విధంగా, ఒకరితో ఒకరు పరిచయం కల్గించుకోవడం వలన అన్ని జాతులు అభివృద్ధి అవుతాయి. అలా జరిగితే ప్రపంచం ఇప్పటికన్న జీవించడానికి ఎంతో మెరుగుగా వుంటుంది. అందుకనే నేను ఎక్కువగా సహనాన్ని అలవర్చు కోమని చెబుతాను. దానికై నేను పాటుపడుతున్నాను. ప్రతి మతాన్నీ మనం, ఆ మతస్థుల దృష్టితో పరిశీలించాలి. నేను కలలుగంటున్న భారత దేశంలో నేను ఒక్క మతం మాత్రమే- అంటే హిందూ మతమో, ముస్లిం మతమో క్రైస్తవ మతమో - వుండాలని వాంఛించను. ఆ మతాలన్నీ ఒక దాని ఎడ ఒకటి సహనం ప్రదర్శిస్తూ అన్ని మతాలూ వుండాలని నా అభిప్రాయం.

నేడు మనకి కావల్సినది ఒక మతం కాదు. మనకి కావల్సినది, వివిధ మతాల వారి మధ్య గౌరవం, సహనభావం. మనకి కావల్సినది వైవిధ్యంలో సమైక్యత. పుట్టకతోనూ, వాతావరణంవల్ల, పరిసరాలవల్ల ఉత్పన్నమయిన సాంప్రదాయాలని విచ్ఛిన్నం చేయడానికి ప్రయత్నించడం లాభదాయకం కాదు. సరిగదా అది దేవతాదూషణం వంటిది. అన్ని మతాల సారాంశం ఒకటే అయినా అది వేరువేరు రూపాలలో యిమిడి వుంది. మతాలనే యీ రూపాలు శాశ్వతం. విజ్ఞులైనవారు ఈ పై రూపాలకి మోసపోక వానిలోని ఆత్మని పరిశీలించాలి. హిందూవులు భారత దేశం నుంచి, ఇస్లాం మతాన్ని, క్రైస్తవ మతాన్ని యితర మతాలని తరిమి వేద్దామనడంగాని, యితర మతాలు హిందూ మతాన్ని అణచివేద్దామనిగాని అనుకోవడం వ్యర్థమైన ఆలోచన. సత్యం ఏ మతం యొక్క ప్రత్యేకపు సొత్తుకాదు.

మనం, హిందువులమనో, ముస్లిములమనో, క్రైస్తవులమనో అనుకోవచ్చు. కాని ఈ వైవిధ్యాల మధ్య ఒక సమత్వం నిర్దిష్టంగా చూడవచ్చు. ఏదో ఒక నాటికి ఈ మాతలకి చెందినవారందరూ అన్నిమతాలలోగల సమత్వం గ్రహించవచ్చు. వ్యత్యాసాలు కొద్ది అని తెల్సుకోవచ్చు.

అన్ని మతాలు నాకు పవిత్రమైనవే. మతం మార్చు నాకు ఇష్టం లేదు. మనం హిందువుని మరింత పవిత్రమైన హిందువుగాను, ముస్లింని మరింత పవిత్రమైన ముస్లింగానూ చేయాలి. మనలో మతం అంటే గల రహస్యపు గర్వాన్ని రూపుమాపాలి. మన ప్రార్థనలో "ఓ భగవాన్! నీవు నాకుచూపిన జ్యోతి వానికి కూడా చూపించు" అని ప్రార్థించ కూడదు. "అతనికి కూడా

అనుబంధం –11

# మతము – భగత్‌సింగ్

"నేనెందుకు నాస్తికుడను" అని భగత్‌సింగ్ జైలులో ఉన్నప్పుడు వ్రాసిన వ్యాసంలోని భాగాలను దిగువయిస్తున్నాం :

దేవుడు కనుక లేకపోతే మానవుడు కేవలం తనపైననే ఆధారపడవలసి వస్తుంది. విపరీతమైన కష్టాల మధ్య, పెను తుపాన్ల మధ్య ఎవరి కాళ్ళపై వాళ్ళు నిలబడగలగటం ఏమాత్రం చిన్న విషయం కాదు. అలాంటి సమయంలో అహంకారం అంటూ ఏమైనా ఉంటే అది ఎగిరిపోతుంది. అందరూ నమ్మే దానికి కాదనడానికి ఎవ్వరూ సాహసించలేరు. అలా కాదనగలిగితే ఆ వ్యక్తికి అహంకారానికి మించి మరో శక్తి అతనిలో వున్నదనే అభిప్రాయానికి రావలసివస్తుంది. ఇదీ ఆనాటి పరిస్థితి. నా కేసుకై తీర్పు ఇప్పటికే అందరికీ తెలిసిన విషయమే. అది మరో వారంలోపల ప్రకటించబడుతుంది. ఒక ఆశయం కోసం నా జీవితాన్ని త్యాగం చేయబోతున్నాననే సంతృప్తి మినహా మరొకటేమిటి వుంటుంది? దేవుడిమీద నమ్మకం వున్న హిందువైతే వచ్చే జన్మలలో ఒక రాజుగా పునర్జన్మ వుంటుందని ఆశించుతాడు. ముస్లిం లేదా క్రైస్తవుడైతే ఇలా త్యాగం చేసినందుకు స్వర్గంలో భోగభాగ్యాలను అనుభవించవచ్చునని ఆశించవచ్చు. కాని నాకు ఏమి ఆశ వుంది? నాకు తెలుసు. నా మెడకు ఉరితాడు బిగియడంతో అదే నా జీవితంల ఆఖరిక్షణం కాగలదని. ఇంకా ఆ తర్వాత ఏమీ వుండదు. ఒక లక్ష్యంకోసం పోరాడిన వ్యక్తి జీవితం ఆ విధంగా ముగియడం మినహా మరేమీలేదు. ఎలాంటి స్వార్థం లేకుండా లేదాఎలాంటి పారితోషికం ఇప్పుడు గాని,ఆ తరువాత గాని పొందకుండా నా జీవితాన్ని దేశ స్వాతంత్ర్య సాధనకోసం వినియోగించాననే సంతృప్తి, ఆనందం మాత్రమే మిగులుతుంది. మామూలుగా అయితే విజయమో, వీరస్వర్గమో అన్న ఆశతో యుద్ధంలో వీరులు తమ ప్రాణాల నర్పించడానికి సిద్ధపడతారు. కాని అలాంటిదేమీ లేకుండా మానవాళికి సేవ చేయడానికి, పీడితులకు విముక్తిని సాధించడానికి నిస్వార్థంగా అధికాధికంగా స్త్రీ పురుషులు ముందుకొచ్చినప్పుడు విముక్తి యుగానికి నాందిప్రస్తావన జరుగుతుంది.

## ప్రాక్ – పశ్చిమ వేదాంతాలు

ప్రాక్ పశ్చిమ వేదాంతాలు విభిన్నమైనవి. తిరిగి ప్రాచ్య దేశాల్లోని మతాల్లోనే ముస్లిమ్ మతం హిందూ మతానికి పూర్తిగా విరుద్ధంగా వుంటుంది. భారతదేశంలోనే బౌద్ధమతమూ, జైనమతమూ బ్రాహ్మణత్వంలో భిన్నంగా వుంటాయి.మళ్ళీ పరస్పర విరుద్ధమైన ఆర్య సమాజం, సనాతన ధర్మమూ వేరుగా వుంటాయి. చార్వాకుడు గత యుగాలకు సంబంధించిన మరో స్వతంత్రా లోచనాపరుడు. గత యుగంలోనే ఆయన దేవుడి అస్తిత్వాన్ని సవాలు చేశారు మౌలిక సమస్యలపైన ఈ మతాలన్నీ ఒక దానితో మరొకటి విభేదించుతాయి. అజ్ఞానాన్ని అధిగమించి ఈ నిగూఢమైన సమస్యకు పరిష్కారాన్ని కనుగొనడానికి బదులుగా వాటినే గ్రుడ్డిగా విశ్వసించుతూ మానవ ప్రగతికి అడ్డుపడుతున్నాం.

ప్రాచ్య దేశాలకు సంబంధించిన మతాలను గురించి అధ్యయనం చేయాలని నాకు ఎంతో ఆసక్తి వుంది.కాని అందుకు నాకు అవకాశం లభించలేదు. కాని ఈ ప్రకృతినంతటినీ శాసించే ఒక అతీతశక్తి లేదనే విషయంలో మాత్రం నేను గట్టిగానే వున్నాను. మేము ప్రకృతిని విశ్వసించుతాం. ప్రకృతిని తనకోసం ఉపయోగించుకోవడానికి, దానిపై ఆధిపత్యాన్ని సాధించడానికి మానవుడు ఎల్లప్పుడూ ప్రయత్నించాలి. మొత్తం అభ్యుదయ ఉద్యమం ఇందుకే కృషి చేస్తుంది.

## నా సూటి ప్రశ్నలు

ఇంక అతీత శక్తిపై నమ్మకం వుండేవారిని కొన్ని ప్రశ్నలు అడుగుదాం :–

ఈ భూమిని, ఈ ప్రపంచాన్ని సృష్టించిన ఒక సర్వశక్తివంతుడు సర్వాంతర్యామి, భగవంతుడు వున్నాడని మీరు నమ్ముతున్నారు. అలా అయితే దానిని ఆయన ఎందుకు సృష్టించాడో చెప్పగలరా? ఈ ప్రపంచలో ప్రజలు పేదరికంతో, రకరకాల కష్టాలతో, బాధలతో అనేక అత్యాచారాలకు గురవుతూ జీవించుతున్నారు.ఎవ్వరూ తృప్తిగా జీవించడం లేదు.

దయచేసి అది ఆయనకున్న శాసనాలకులోబడి చేస్తున్నాడని అనబోకండి, ఆయనే గనుక కొన్ని శాసనాలకు కట్టుబడి వుండవలసిన వాడైతే ఆయన సర్వశక్తి సమన్వయుడు మాత్రం కాజాలడు.మనందరి వలెనే ఆయన కూడా ఒదిగి మదిగి వుండ వలసిన బానిస మాత్రమే కాగలడు. ఇలా జనాన్ని బాధపెట్టడం ఆయనకు సరదా అని అనబోకండి.

నీరో చక్రవర్తి రోమ్ నగరాన్ని తగుల బెట్టించాడు. నీరో పరిమిత సంఖ్యలోనే ప్రజలను హతమార్చాడు. అనేక విషాదాలను తన విద్విలాసం కోసమే ఆయన జరిపించాడు. మరి అలాంటి నీరో చక్రవర్తి స్థానం చరిత్రలో ఏమిటి? చరిత్రకారులు ఆయనను ఏపేరునతో పిలుస్తారు? నీరో చక్రవర్తిని ఎన్నో రకాల విషభరితమైన, అప భ్రంశమైన పేర్లను పెట్టి పిలవాలో అన్నీ పెట్టి మరీ పిలుస్తారు. నీరోచక్రవర్తి పరమ నిరంకుశుడు, హృదయం లేని పరమ క్రూరుడు అని చరిత్ర పుటలన్నింటా వర్ణించబడ్డాడు.

ఒక చెఘింజ్ ఖాన్ తన క్రూరమైన సంతోషం కోసం వేలమందిని హత మార్చాడు. చెంఘిజ్ ఖాన్ పేరు చెపితేనే మనకు వళ్ళు మండుతుంది, అత్యంత ద్వేషం, అసహ్యం కలుగుతుంది. అలాంటప్పుడు ప్రపంచంలోని అశేష ప్రజల జీవితాలనే దుఃఖభాజనం చేసే దేవుణ్ణి, ప్రతి రోజు, ప్రతి

గంట, ప్రతి నిముషం కష్టాలతో, విషాదాలతో వారి జీవితాలను అథోగతి పాల్జేసే దేవుణ్ణి, ఈనాటికి వారిని కష్ట సముద్రాల్లో నిత్యమూ ముంచుతున్న దేవుణ్ణి మనం ఏమనాలి? చెంఘిజ్ ఖాన్, నీరోచక్రవర్తి ఎప్పుడో ఒకసారి చేసినదానికంటే దేవుడు ఈ ప్రపంచంలోని ప్రజలను నిత్యమూ కష్టాలకు, బాధలకు, అత్యాచారాలకు గురిచేస్తున్నప్పుడు ఆయనను ఎలా భజించాలి? ఎలా కొలవాలి?

మీకు నా సూటి ప్రశ్నం ఇది :- ఇంచుమించు నరక ప్రాయంగా వున్న ఈ ప్రపంచాన్ని ఆయన ఇలాఎందుకు సృష్టించాలి? ఎల్లప్పుడూ మానవులకు ఆవేదనలనూ, అశాంతినీ కలుగచేసే విధంగా ఈ ప్రపంచం ఎందుకు సృష్టించబడాలి? దేవుడు సర్వశక్తి సమన్వితుడుకదా? ఏదైనా సరే చేయడానికి చేయకుండా వుండటానికి కూడా ఆయనకు శక్తి వుంది కదా? అటువంటప్పుడు ఇన్ని దుఃఖాలు, బాధలు పడే మానవుల్ని ఆయన ఎందుకు సృష్టించాలి? ఆయన చేసిన పనిని మనం ఎలా సమ్మర్థించగలం?

పూర్వం ఒక రకం మృత్యుక్రీడ జరిపి ఆనందించేవారు వుండేవారుట. (గ్లాడిమేటరు సంస్థనిర్వాహకులువారు) ఆకలితో ఆరాటపడే సింహాలముందు, పులుల ముందు మనుషులను నెట్టేవారు. ఆ సింహాలకు, పులులకు ఆహారమై పోకుండా, ఎవరైనా ఒక అభాగ్యుడు బయటపడితే వాడికి పంచభక్ష్య పరమాన్నాలు పెడతాం, సర్వ సౌఖ్యాలు సంపదలు యిచ్చి సత్కరిస్తాం" అనే వారట. సరిగ్గా అలాగేవుంది దేవుడి సంగతి. సర్వజ్ఞుడు, సర్వశక్తి మంతుడు, సర్వ చైతన్యమూర్తి అయిన భగవంతుడు ఈ దుఃఖమయ ప్రపంచాన్ని, అందులో అష్ట కష్టాలు పడే మానవుడ్ని ఎందుకు సృష్టించాలి? అని నేను అడుగుతున్నాను. ఇదంతా ఆయన ఆనందానికే అయితే నీరో చక్రవర్తికి, భగవంతుడికి ఏమిటి తేడా?

## ముస్లిం సోదరులకు నాదో ప్రశ్న

మహమ్మదీయ సోదరులకు, క్రైస్తవ సోదరులకూ నాదొక ప్రశ్న :-

హిందూ మతస్తులకు వేసిన పై ప్రశ్నలకు మీరిచ్చే సమాధానమేమిటి? హిందువుల్లా మీరు పునర్జన్మను అంగీకరించరు. అలాంటి పునర్జన్మ సిద్ధాంతాన్ని మీరు విశ్వసించరు. పూర్వ జన్మలో చేసిన పాపాల ఫలితాన్ని, దుష్కృత్యాల ఫలితాలను మానవులు ఈ జన్మలో అనుభవిస్తారని మీరు హిందువుల వలె వాదించరు. అయితే మీరు చెప్పేదేమిటి? మీ విశ్వాసాలు ఏమిటి? ఈ ప్రపంచాన్ని సృష్టించటానికి భగవంతుడు వారంలో ఆరు రోజులు పని చేస్తూ వుంటాడట. సృష్టి ఆరు రోజులు చేసేవాడు ఏడో రోజున తను సృష్టించిన ప్రపంచంలో లోటు పాట్లను ఎందుకు తెలుసుకోడు? అనుభవాన్నుండి ఎందుకు నేర్చుకోడు? అలా కాక సృష్టి చేసిన ప్రతి రోజూ ఆఖరున "అంతా సవ్యంగా వుంది, అంతా సక్రమంగానే జరిగింది" అని ఎలా అనుకుంటాడు?

చెరసాలలల్లో మగ్గేవాళ్ళు, ఆకలి మంటలతో అలమటించేవాళ్ళు లక్షలాది, కోట్లాది ప్రజలు ఈ ప్రపంచంలో వున్నారు. దోపిడీ చేయబడుతున్న కష్ట జీవులు, కార్మికులు, అభాగ్యులు, దీనులు, హీనులూ వున్నారు. వీరంతాతమ రక్తాన్ని స్వేదంగా మారుస్తున్నారు. ఈ రక్తాన్ని పిండి పెట్టుబడి దారీ వర్గాలు రాంబందులవలె జలగల వలె వీరిని పీలుస్తూ సంపన్నులవుతున్నారు. లక్షలాది మందిని నిరుద్యోగులుగా, నిరర్థకులుగా చేస్తున్నారు. అంతేకాదు అవసరమైతే తమ లాభాల రక్షణ కోసం, అధికోత్పత్తిచేసి నిల్వపడి వున్న సరుకులను, ఆహార ధాన్యాలను సముద్రంపాలను చేస్తున్నారు. (పెట్టుబడి దారీ విధానంలో సంక్షోభం ఏర్పడినప్పుడు, ధరల మాంద్యం వచ్చినప్పుడు లక్షల కోట్ల టన్నుల పాలడబ్బాలను ఇతర ఆహార పదార్థాలను పెట్టుబడిదారీ వర్గాలు సముద్రపాలు చేస్తారు - అనువాదకుడు) ఆకలితో మలమలమాడే కోట్లానుకోట్ల ప్రజలకు ఈ ఆహారధాన్యాలను, పాలడబ్బాలను, బట్టలను తదితర జీవితావసర వస్తువులను పంచి పెట్టరు. తమ చెమటను రక్తాన్ని ధారపోసి శ్రామిక ప్రజలు పంటలు పండిస్తారు. తమ ఎముకుల నుసున్నంగా చేసి మహా భవనాలను కార్మికులు నిర్మిస్తారు.

## దీనికి భగవంతుని సమాధానం ఏమిటి?

వారందరూ దారిద్ర్యంతో కడుపునిండా తిండిలేక, బట్టలేక, ఇల్లులేక ఎందుకు అలమటించాలి? దీనికి భగవంతుడు ఏమి సమాధానం చెపుతాడు? ఇలా ఎందుకు జరుగుతున్నది? ఇలా ఒకవైపున జరుగుతూ వుంటే నా సృష్టి అంతా సవ్యంగానే వున్నదని భగవంతుడు ఎలా అనగలడు? దీనికి ఆయన ఏమైనా సమాధానం చెప్పగలడా. మౌనమే సమాధానమా?

వేదాలు చదువుతూవుంటే వినకూడనివాళ్ళు ఈ సమాజంలో వున్నారట. వేదంలోని ఒకముక్క విన్నప్పటికీ వాళ్ళ చెవుల్లో సీసం కరిగించి పోయాలట, అది వారికి శిక్షట? ఈ శిక్షలకు కూడా పూర్వ జన్మలో చేసుకున్న పాపఫలమే కారణమా? ఈ పాపం చేయడానికి కారకులు, బాధ్యులు ఎవరు? ఫలితాన్ని అనుభవించేది ఎవరు?

మరొక ప్రశ్న అడుగుతాను: భారతదేశాన్ని బానిసత్వంలో ముంచిన బ్రిటీష్ వారి మనస్సును మార్చి భారతదేశాన్ని తమ బానిసత్వాన్నుండి వారు విముక్తి కాబడేటట్లు ఎందుకు చేయకూడదు? పెద్ద పెద్ద ధనవంతులూ, పెట్టుబడి దారులు తమ వద్ద నున్న ధనాన్ని, ఉత్పత్తి సాధనాలను ప్రజల పరం చేసేటట్లు భగవంతుడు వారిలో హృదయ పరివర్తన ఎందుకు తీసుకుని రాకూడదు? ఆ విధంగా కష్టజీవు లందరినీ ఉద్ధరించేటట్లు చేయరాదా?

పరమ కిరాతకమైన ఈ దోపిడీ విధానం నుండి, బానిసత్వాన్నుండి యావత్ సమాజాన్ని దేవుడే స్వయంగా విముక్తి చేస్తే బాగుంటుంది కదా?

నా ఉద్దేశ్యంలోమానవుడు తనకున్న పరిమితులను, బలహీనతలను, లోపాలను దృష్టిలో వుంచుకుని, దేవుడనే

తమ కూతుళ్ళను, అన్నలు చెల్లెండ్రను, అత్తలు కోడండ్రును, భర్తలు భార్యలను వెంటబెట్టుకొనిపోయి పట్టపగలు పలువురు చూచుచుండగా దక్షిణలిచ్చి సంభోగ్యా మర్పించి పుణ్యంము పేరుచెప్పి వారిని నీతికిని, పాతివ్రత్యమునకును మృత్యు దేవతయైన యా గురువు శయన గృహమునకు బంపుట మతమగునా? పశుకృత్య మగునా?

"మతము పేరు చెప్పి చైతన్య శిష్యులగు వైష్ణవులు కొందరు తప్పత్రాగి సిగ్గెగ్గులు లేక గుంపులుకూడి వీధులలో వికారముగా వణుకురోగము వచ్చిన వారివలె తలలెగరవైచుచు గంతులు వైచునప్పుడు చూచువారికీ – మానవజాతి యింత మృగప్రాయ మగునాయని యాశ్చర్యము కలుగకపోదు.

## 'దేవుడుజార, చోరగుణసంపన్నుడా?'

"దేవునికి జార చోరత్వాది గుణములను ఆలోచించి తమ గీతములయందటి యపవిత్ర విషయములను కళ్యాణ గుణములను చొప్పించి భక్తి పరవశులై పాడుతూ, ఆ హేయ గుణములు తమ మనస్సులు కసహ్యములు కాకపోవుట వలన తామును వానిని సులభముగా పొంది కలలోనైనా పాప విచారములేక యుందురు.

"మనుష్య నిర్మితములయిన విగ్రహములనే నమ్మి కొలుచు వానికి ఇంద్రియ గోచరములగు పదార్థములను గొలుచుట ఇంద్రియ సుఖములకే యాసపడునట్లు జేయును. "బాహ్య పూజవలన ఇంద్రియములకు తృప్తి కలుగవచ్చును కాని యాత్మ శాంతి యెట్లు కలుగును?"

"...విగ్రహారాధనము లేని కాలములో విద్యచేతనే, నాగరికత చేతను సర్వజన సామాన్యమైన మహోన్నత దశయందుండిన మన దేశంలో విగ్రహారాధనము వెలసిన తరువాతనే ఐకమత్యాభావమును పొంది నానాట క్షీణించి యన్యాక్రాంతమై తుదకిప్పటికి హీనదశకు వచ్చినది..."

## 'మతాచార్యులకు ఇది ఒక జీవనాధారం'

ప్రజలలో మత మౌఢ్యాన్ని . అంధ విశ్వాసాలను ప్రేరేపించడం ఒక్క మతాచార్యులకు తప్ప మరెవ్వరికి లాభములేదని వీరేశలింగంగారు తెలుపుతూ యిలా అన్నారు:

"విగ్రహారాధనము వలన ఒక్క మతాచార్యులకు తప్ప మరెవ్వరికి ఏ విధమైన లాభము లేదు. వారికి జీవనాధారముగానుండుటచేత మత గురువు లెప్పుడును జనులను మూఢులుగానే యుంచి వారిని వంచించి విత్తమపహరించి కుటుంబ పోషణము చేసికొనుటకయి తమ చేతనయినన్ని కుతంత్రములు పన్ని విగ్రహారాధనమును నిలువబెట్టుటకే ప్రయత్నించాడు."

---

పవిత్ర ఖురాన్ తన విశ్వాసాలకు క్రిమినల్, సివిల్ శాసనాలు రెండింటినీ నిర్దేశించింది. ఉల్లంఘనకు శిక్ష విధించటం శిరోధార్యమైన చట్టం సారాంశమైతే, దొంగతనం, మానభంగం వగైరా క్రిమినల్ నేరాలకు శిక్షను ఖురాన్ నిర్దేశించిన విషయాన్ని గమనించాలి. అయితే సివిల్ విషయాలలో ఉల్లంఘనకు– అనగా యిచ్చిన రుణాలపై వడ్డీ వసూలు చేయటంపైగల నిషేధాన్ని ఉల్లంఘించినందుకు, లేక ఐదుగురు భార్యలకూ నీవు సమాన పరిగణన యివ్వలేనట్లయితే అటువంటప్పుడు రెండవ లేక మూడవ లేక నాల్గవ భార్యను కలిగివుండే హక్కు నీకు లేదన్న నిర్దిష్టమైన ఆదేశాన్ని ఉల్లంఘించినందుకు ఎటువంటి శిక్ష సూచించబడలేదు.

టర్కీ, ఈజిప్టు, సిరియా, ట్యునీషియా, మొరాకో, ఇరాక్, మలేసియా, ఇండోనేషియా, జోర్డాన్ వంటి దేశాలలో ఆధునిక స్థితిగతులు, పరిస్థితుల కనుగుణంగా పర్సనల్ లా సవరించుకోబడింది. ముస్లిం దేశాలన్నింటిలో, ఒక్క సౌదీ అరేబియా, ఎమెన్, బహరెన్, కువాయిత్ మాత్రమే కోడిపై చేయని (సంపుటీకరించని) ముస్లిం న్యాయశాస్త్ర సాంప్రదాయక రూపాలను పరిరక్షించుకుంటూ వస్తున్నవి. అటువంటప్పుడు ముస్లిం పర్సనల్ లా సడలించకూడనిదని, మార్చకూడనిదని, భగవంతుడు నిర్దేశించిన పవిత్ర పత్రమని చెప్పడం ఎలాగూ?

– ఎ. బి. బర్దన్

అనుబంధం -13

# మతం - లౌకిక సమాజం

- అంద్రే బెటె
(సామాజిక శాస్త్రవేత్త)

భారతీయ సమాజంలో లౌకిక వ్యవస్థ క్రమంగా ప్రవేశ్యాను తుందనే విశ్వాసం ఏర్పడటానికి భారతీయుల జీవితం నుండి మతం అదృశ్యమవుతుందనే నమ్మకం ఉండనవసరం లేదు. లౌకిక వ్యవస్థ పట్ల ఎంత గాఢమైన వాంఛ ఉన్నప్పటికీ, ఒక సామాజిక శాస్త్రజ్ఞుడు అటువంటి నమ్మకం కల్గి ఉండటం వింతగానే కన్పించవచ్చు. గత వంద సంవత్సరాలుగా సామాజిక శాస్త్రజ్ఞులు మతం, సమాజంల మధ్య సంబంధాలను అధ్యయనం చేస్తున్నారు. లౌకిక వ్యవస్థ ఒక సుదీర్ఘ క్రమంగా భావించిన వారు సైతం సామాజిక జీవితం నుండి మతం తొలిగిపోయే అంశంగా పరిగణించి రాసిన వారు దాదాపు లేరని చెప్పవచ్చు.

ప్రజల జీవితంలో మతానికి ప్రముఖ స్థానం ఉంటుందని భావించి సెక్యులరిజాన్ని మనం చర్చించాలి. ఇక్కడ తలెత్తే ప్రశ్న ఏమిటి? ఏ మేరకు ఎలా మత సిద్ధాంతాలు, మతాల పెత్తనం వాటి ప్రమేయం లేకుండా విశ్వవిద్యాలయాలు, హాస్పిటల్సు, బ్యాంకులు, పౌర, సైనికదుద్యోగ యంత్రాంగాలు లాంటి వ్యవస్థలను సమాజంలో పెంపొందించు కోగలం? మతం ప్రమేయం లేకుండా వాటి వ్యవహారాలను అవసరమయిన రీతిలో మార్పులు చేయాలి. లౌకిక సంస్థలను రూపొందించు కోవడం అంటే అర్థం, మతం ఆదేశాలతో, కోర్కెలతో నిమిత్తం లేకపోవటం - ఇది నేటి ప్రపంచ వ్యాపిత ధోరణి.

లౌకిక సంస్థలుపెరుగుదల నెమ్మదిగా, కష్టంతో, సాగుతున్న క్రమం. వాటి పెరుగుదలకు మూలం ఇంకా స్పష్టంగా మనకు అంతు చిక్కలేదు. ప్రభుత్వం విజ్ఞతతో వ్య[illegible] గల్గితే ఆ క్రమం సాఫీగా ఉంటుంది. అనాలోచితంగా [illegible]రించితే అది వి[illegible]తంగా పరిణమించవచ్చు. [illegible] మతాన్ని [illegible] కించడంకద్దు. [illegible] తమ కుటుంబ వ్యవహారంగా [illegible]స్తారు. రాజకీయ వేత్తలు, అధికారుల జోక్యం ముఖ్యంగా భారతదేశంలాంటి దేశాలలో వారిని [illegible]గా ప్రజలు భావిస్తున్న నేపథ్యంలో మత వ్యవహారాల[illegible] జోక్యాన్ని ప్రజలు నిరసిస్తారు. అదే సమయంలో మరి కొంతమంది సెక్యులరిజాన్ని పశ్చిమదేశాల భావంగా ముద్రవేసి, అది భారతీయ ఆత్మకు విరుద్ధమైనదిగా చిత్రించి, అటువంటి సంస్థల అవసరం లేదని, సొంత ప్రత్యామ్నాయాలను సృష్టించుకోవాలని ప్రకటించుతున్నారు.

ఆధునిక ప్రపంచానికి ప్రత్యామ్నాయాన్ని సృష్టించుకోవటం అంత సులభమైన పనికాదు.

మతాన్ని,రాజకీయాలను వేరుచేయటం ఎంత వాంఛనీయమైనప్పటికీ, ప్రజాస్వామ్యంలో రాజకీయ నాయకులు మత భావోద్రేకాలను ఉపయోగించుకోకుండా, లేదా మత నాయకులు రాజకీయ పొత్తులను దుర్వినియోగ పరచుకోకుండా నిరోధించటం కష్టసాధ్యం. ప్రజాస్వామ్య రాజకీయాలు సామాజిక విభజనపై పెరుగుతాయి. వర్గం, మతం జాతి పరంగా విభజన నేటి సమాజంలో ఉంది.

తరచు ఒక వాదన బలంగా విన్పిస్తూ ఉంటుంది. మన దేశం సాంస్కృతికంగా భిన్నమైంది. బ్రిటన్, ఫ్రాన్సు లాంటి పశ్చిమ దేశాలు వేరు. జనాభా పొందికలో గూడ మనదేశం భిన్నమైనదని మరిచిపోరాదు. భారతదేశంలో మైనారిటీ మతస్థులు గణనీయమైన సంఖ్యలో ఉన్నారు. మతాలకు గల ప్రత్యేకతలను, లేదా మతాల మధ్యగల విభేదాలను చెరిపివేయటం, అది శాంతియుతంగా వీలీనమా లేక బలాత్కారంగా మత మార్పిడి ద్వారానా, ఏమైనా ఆచరణలో అది అసాధ్యం. అందుచేతనే ఏ మత సిద్ధాంతం, మత సంస్థ ఆధిపత్యం చెలాయించ వీలులేని సెక్యులరిజం మనకు అవసరం. మత కోర్కెలతో ప్రమేయం లేని సంస్థలను పెంచి పోషించాలి.

సెక్యులరిజం అంటే అన్ని మతాలపట్ల సమాన గౌరవం అని ఒక అర్థం. మతం పట్ల కొన్ని సామాజిక రంగాలలో సమదూరం లేదా విముఖత అని మరో అర్థం నిర్వచిస్తున్నా[illegible] ఆ రెండు అర్థాలు ఒకటే కావు కాని ఆచరణలో [illegible] పర్యవసానాలు తరచు ఒకే విధంగా ఉంటాయి. [illegible]రిజం ఆ రెండు అర్థా[illegible] ఒక మితవాద తా[illegible] [illegible]ని పోలి ఉంటుంది. [illegible] విప్లవకర [illegible]కీయాలకు [illegible]న్నమైనది. [illegible] [illegible]మిక [illegible]జకీయాలక[illegible] అనుకూలమైనది. [illegible]క్యులరిజం [illegible] [illegible] విప్లవకారులు మతంపై చేసే దా[illegible] [illegible]క్యులరిజానికి విరుద్ధమైనది ఇది కూడా ఒక త[illegible] [illegible]ందనవాద[illegible] సాంప్రదాయక మత భావాలను, ప్రజాస్వామిక [illegible] [illegible]కీయాలకు ఇది శత్రువు

మత విభేదాలను తమ రాజకీయ పుద్దతుకొరకు రాజకీయ పార్టీలు రెచ్చగొట్టటంతో సెక్యులరిజం బలహీన పడుతున్నది. అన్ని మతాల పట్ల ప్రభుత్వం సమదృష్టిరంతో వ్యవహరించటంలో గందరగోళ పడినప్పుడు కూడా సెక్యులరిజానికి దెబ్బతగులుతున్నది. మత ఆచరణను ప్రభుత్వం చురుకుగా ప్రోత్సహించటం, అది ఎంత సమస్ఫూర్తితో ఆచరించినప్పటికీ, సెక్యులరిజాన్ని ప్రోత్సహించజాలదు. భవిష్యత్తులో అది పరాజయాన్ని కొనితెచ్చుకోటమే.

గొప్ప మతాలన్నింటిలోను సంస్కరణ ఒక సజీవమైన అంశంగా పనిచేస్తున్నది. కాని ప్రభుత్వ చొరవలో మత సంస్కరణ ఎప్పుడూ అనుమానాస్పదమే. మత సంస్కరణ అంర్గతంగా తలెత్తినప్పుడు ఎక్కువ విజయాలను సాధించింది

అది దీర్ఘకాలం ఉంటుంది. మత సంస్కరణకు భారతదేశ ప్రజలలో తగినంత సానుకూలమైన మత వాతావరణం ఉంది.

ప్రాచీన కాలంనుండి హిందూ దేవాలయాలలో మత పూజను కొన్ని కులాలవారు మాత్రమే నిర్వహిస్తున్నారు. ముస్లిం మసీదులలో ప్రతి శుక్రవారం ప్రార్థనలను పురుషులు మాత్రమే నిర్వహిస్తారు. స్త్రీలు కాదు. కొంతమంది హిందువుల విశ్వాసాలలో ఒక మార్పు కన్పిస్తున్నది. దేవాలయ పూజార్యత్వం అర్హత అన్ని కులాలకు ఉందని అంటున్నారు. దేవాలయాలను నిత్యం సందర్శించే హిందువులు ఈ భావనను ఎలా స్వీకరిస్తారో చెప్పటం కష్టం. కానీ ఈ విషయంలో సంస్కరణకు కొంత అవకాశం ఉంది. అది హిందువుల మధ్య పరిష్కారం కావాల్సిన అంశం.

ప్రభుత్వం సదుద్దేశంతోనే కావచు.సెక్యులరిజం లక్ష్యాన్ని ప్రోత్సహించేందుకు సంస్కరణలను ప్రవేశపెట్టాలని భావించవచ్చు. కాని అటువంటి చర్య, ముఖ్యంగా ప్రభుత్వం, మసీదులలో ప్రార్థనల నిర్వహణకు స్త్రీలు, పరుషులకు సమానార్హతను కల్పించగల స్థితిలో లేనప్పుడు బెడిసి కొట్టే ప్రమాదం ఉంది. దీనిలో ఉన్న నైతిక సంశయం స్పష్టమే. అందుచేత మతం అంతర్గత వ్యవహారాలలో ప్రభుత్వం యొక్క పాత్ర పరిమితంగా ఉండాలి. ఒక మతానికి అది సహాయం చేస్తే, అదే రీతిలో ఇతర మతాలకు సహాయం అందించటం కష్టంగా పరిణమించవచ్చు.

# తత్వ శాస్త్రం అంటే...

"ఒక పర్షన్ కవి ఈ సృష్టి రహస్యాన్నంతా ప్రాచీన తాళపత్ర గ్రంథంతో పోల్చాడు. ఈ గ్రంథానికి మొదటి పుటలు చినిగి పోయాయి. చివరి పుటలేవో ఎవరికీ తెలియదు.

ఈ కృషి ప్రయోజనం ఏమంటే జీవితం యొక్క అర్థం ఏమిటి? లక్ష్యం ఏమిటి అని తెలుసుకోవడం. మానవుడు ఆత్మ చైతన్యం పొందిన మరుక్షణం నుండి ఈ ప్రశ్నలు అతడ్ని వేధిస్తున్నాయి. జీవితం ప్రయోజనం ఏమిట? సృష్టిరహస్యం ఏమిటి? ఒక దశలో మానవుడు నిర్దిష్ట మార్గాన్ని ఎన్నుకున్నాడు. ఆలోచన,, హేతువాద మార్గాన్ని చేపట్టాడు. క్రమబద్ధమైన తాత్వికచింతనకు అదే మొదలు. ఆనాటి నుండి తత్వశాస్త్ర చరిత్ర మొదలైంది."

--"ప్రాచ్య పాశ్చాత్య దేశాల
తత్వశాస్త్ర చరిత్ర పీఠికలో
కీ॥ శే॥ డాక్టరు సర్వేపల్లి రాధాకృష్ణన్".

## ఆధ్యాత్మిక అనుభూతి

"ఉపనిషత్తులు ప్రారంభించిన ఆధ్యాత్మిక చింతనలో భాగంగా భారతీయ తత్వ శాస్త్రాన్ని అధ్యయనంచేస్తే తప్ప ఆధ్యాత్మిక భావ ప్రవంతిని అర్థంచేసుకోలేము. బౌద్ధం, జైనం వేద ప్రామాణ్యాన్ని అంగీకరించేవి కాకపోయినా అవి కూడా అంతరంగ మథనం, ఆధ్యాత్మిక చింతన మార్గాన్నే అనుసరించాయి.

ఆత్మ, అన్నా, శూన్యత అన్నా బ్రహ్మ అన్నా ఇదంతా మన అంతరంగం నుండి ఉద్భవించేది, మన హృదయాల ద్వారా అర్థం చేసుకోవలసింది. అంతరంగిక ప్రపంచానికి బాహ్య ప్రపంచానికి గల సంబంధమే తత్వశాస్త్రం.

--అద్వైత వేదాంతంపై
డాక్టరు సర్వేపల్లి రాధా కృష్ణన్.
(ప్రాచ్య, పాశ్చాత్య దేశాల తత్వశాస్త్ర చరిత్ర).

# సంపాదక లేఖలు

**ప్రముఖ స్వాతంత్ర్య సమరయోధులు, ట్రేడ్ యూనియన్ నాయకులు శ్రీ జోశ్యభట్ల సత్యనారాయణగారు "భారతదేశంలో మతం" సదస్సుకు దిగువ లేఖ పంపించారు.**

## I

దేవుడు, జాతి, మతం, కులం మానవులను మారణ హోమాలకు గురిచేస్తున్నాయి. ఇవి మానవులు సృష్టించినవే అయినా, తిరిగి, మానవులనే హతమారుస్తున్నాయి. మతాలన్నీ సమాజ పరిణామంలో ఒక దశలో, ఒక మహనీయుడు సృష్టించినవే. అలా ఒక మహనీయుడు, తాను నిస్వార్థపరుడై, తాను నమ్మిన సిద్ధాంతములను ప్రచారంలో పెట్టడం ద్వారాగదా మతా లేర్పడ్డాయి! ఈ విధంగా ఒక్కొక్క మహాపురుషుని సిద్ధాంతాలను నమ్మినవారంతా ఒక మతమై, తదితర మతాల యెడల ద్వేషం పెంచుకుని తనదే గొప్ప మతమని ప్రచారంలో పెట్టారు. ఇలా కొన్ని సిద్ధాంతాలను సృష్టించినవారే చివరకు ప్రవక్తలు దేవుళ్లయినారు. క్రీస్తు, మహమ్మద్, బుద్ధుడు, జైన, సిక్కు మత స్థాపకులంతా యిట్టివారే కదా. అందువల్ల మతాలను దేవుడు సృష్టించినవి కావు. మానవులే మతాలను సృష్టించారనేది వాస్తవం.

అన్ని మతాలు, తోటి మానవులందరిని ప్రేమించమనే చెపుతాయి. దేవుడొక్కడే అని చెబుతాయి ప్రచారకులు మాత్రం తన మత విద్వేషాన్ని పెంచారు. ఏ మతాలవారు వారు పేరుపెట్టిన దేవుడే, గొప్పవాడని నమ్మి ప్రచారం చేస్తారు. నేటి పరిస్థితిలో పరమతాన్ని ద్వేషించడం, ఒక మతంపై మరొక మతం మారణకాండకు పూనుకోవడం మతధ్యేయంగా తయారైంది.

ఇక దేవుడు సంగతి చూద్దాం. ఈ సృష్టికంతా నేడు ప్రపంచంలో మంచి చెడు లన్నింటికి, కుల, మతాల సృష్టితో సహా, దేవుడే కారణం అంటారు. అతడు ప్రేమ స్వరూపుడైనా, మానవులలో హెచ్చు తగ్గులకు, రోగాలకు, చావులకు, సర్వ పనులకు, దేవుడే కారణం అని అంటారు. "శివుడాజ్ఞ లేనిదే చీమ అయినా కదల" దంటారు. అసలు ఈ దేవుడ్ని ఎవరు సృష్టించారు? అని ప్రశ్న వేసుకుంటే, దానికి జవాబు లేదు అందువల్లనే అద్వైతులు, "జగన్మాయ" ఈ సృష్టి అంతా మిధ్య అని ఒక్కమాట చెప్పేస్తారు

గతితర్కం నమ్మినవారు, ప్రకృతిలో నిత్యం మార్పులు జరుగుతుంటాయని, రెండు అణువుల ఘర్షణ, ఐక్యతవల్ల కొత్తవి పుడతాయని, తద్వారా ప్రపంచంలో జరిగే ప్రతి మార్పూ ఆ విధంగా జరిగేదేకాని, భగవంతుని సృష్టివల్ల కాదని చెబుతారు. ప్రకృతి మార్పుతో మానవుడు ఉద్భవించిన పిమ్మట, మానవులు ప్రకృతిలో అర్థంకాని ప్రతి పనికి కారణం దేవుడని పేరుపెట్టుకున్నారు. అందువల్ల ఆదిమానవులలో ఏర్పడ్డ ఈ భావం, శాస్త్రవిజ్ఞానం, విపరీతంగా అభివృద్ధి చెందిన ఈ దశలో కూడా, ఆదిమానవులు సృష్టించిన దేవుడనే భావం స్థిరమై గాఢంగా నాటుకుపోయింది. వాస్తవానికి, దేవుణ్ణి మానవుడే సృష్టించాడు. ఈ దేవుడు ప్రేమ స్వరూపుడు. అందరిని ఒకేలా చూస్తాడని చెప్పేవారిని, నేడు సమాజంలో కోటీశ్వరులు, గర్భదరిద్రులను ఎందుకు సృష్టించాడు. ఈ మానవులకు, తుపాన్లు, భూకంపాలు, అగ్నిప్రమాదాలు, కుల, జాతి, మత, విభేదాలు ఎందుకు సృష్టించాడు? అని ఎవరైనా ప్రశ్నిస్తే, అప్పుడు దేవుణ్ణి కాపాడుకోడానికి, ఈ మేధావులు, వాటికి దేవుడు కారణం కాదని, అట్టి ప్రమాదాలకు గురి అయిన వారు పూర్వజన్మలో చేసిన కర్మఫలితమని చెప్పి, కర్మ అనే మాటను సృష్టించారు. పూర్వజన్మను ఎవరు చూశారు? ప్రాప్తం, అదృష్టం, ఈ విధంగా దేవుని రక్షణకు, అనేక త్రోవలు తొక్కవలసి వస్తోంది.

నేడు హిందూమతంలో ఈ దేవుళ్లకు కొరత లేదు. చనిపోయిన మత ప్రవక్తలతోబాటు, నేడు దినదినానికి దేవుళ్ల సంఖ్య పెరిగిపోతోంది.

నిన్న సమాజంలో అతి దుర్మార్గుడిగా పేరుపొందినవారు కూడా ఆకస్మాత్తుగా నేడు దేవుళ్లయి కూర్చుంటున్నారు. ఇట్టి దేవుళ్ల కాళ్లమీదపడి మొక్కుతున్న దేశాధ్యక్షులు, ప్రధానమంత్రులు, ముఖ్యమంత్రులు వున్న సమాజంలో మనం జీవిస్తున్నాం. వారలా ఎందుకు చేస్తున్నారంటే ప్రజలను యింకా మూర్ఖులుగా మార్చి, ప్రభుత్వ ప్రజా వ్యతిరేక చర్యలను కప్పిపుచ్చుకుని కష్టాలను తీర్చుకోడానికి ఆయా దేవుళ్లకు మొక్కుకోమని ప్రజలను ప్రక్కదారి పట్టించడానికనే విషయం గమనించాలి.

హిప్నాటిజంతో దొంగ దేవుళ్లు ధనస్వాములతో కలిసి అనేక సంస్థలు నెలకొల్పడం తమ ప్రభావాన్ని పెంచుకుని, ప్రజలను, ప్రభుత్వాలను తమ గుప్పెట్లో పెట్టుకుంటున్నారు. అందువల్ల దేవుళ్లను మానవులే, మహామేధావులతో సహా ఎలా సృష్టిస్తున్నారో తేలిగ్గా అర్థంచేసుకోవచ్చు.

దేవుడు, జాతి, మతం, కులం (వృత్తిరీత్యా ఏర్పడ్డది) మొదల గునవన్నీ మానవ సృష్టే అనేది, ప్రజలలో చైతన్యం కల్గించగల్గిననాడే మన ప్రజలకు విముక్తి.

**–జోశ్యభట్ల సత్యనారాయణ**

## II

36 సంవత్సరాల క్రితం 1958లో కీ॥శే॥ కంభంపాటి సత్యనారాయణగారి సంపాదకత్వంలో ప్రకటించబడిన ఆనాటి మార్క్సిస్టు సిద్ధాంత మాసపత్రిక '[illegible]' – "అద్వైత మతం" గురించి సదస్సు జరిపి ఆ తరువాత ప్రత్యేక సంచికను ప్రచురించింది. ఆ సంచికలో "అద్వైతవాద సారం – [illegible]న్ని సాంఘిక ప్రభావాలు" అన్న వ్యాసాన్ని సమర్పించిన మార్క్సిస్టు అధ్యయనపరులు తత్వవేత్త అయిన శ్రీ పాములపర్తి సదాశివరావుగారు (వరంగల్) "భారతదేశంలో మతం" ప్రత్యేక సంచి

కకు "శైవ మతం"మీద ఒక వ్యాసం వ్రాయవలసిందని సంపాదకవర్గం కోరగా వారు వ్రాసిన లేఖ దిగువ యిస్తున్నాము.

"మిత్రులు" పరకాల పట్టాభి రామారావుగారికి నమస్కారములు. మీ రెండు లేఖలూ అందాయి. నేను ఆరోగ్య, వృద్ధాప్య అశక్తతలవల్ల ఈ మధ్య ఉద్యమాలలో పాల్గొనలేకపోతున్నాను. కావున సదస్సులో పాల్గొనడం కష్టం.

హిందూత్వ మతవాదులు అని మీ రంటున్నది వాస్తవంలో 'రాజకీయవాదులనే! తమ అధికార సాధనకుగాను వారు మతాన్ని జాతీయతను వినియోగించుకుంటున్నారు. వారికి అధికారం వచ్చినప్పటికీ మతానికిగాని, హిందూ జాతీయ వాదానికిగాని ఒరిగేదేమీ లేదనిపిస్తుంది. లౌకిక ప్రజాస్వామ్యవాదులు కూడా మతాన్ని లేక హిందూ జాతీయతా వాదాన్ని వ్యతిరేకించే పాత్రను నిర్వహించలేరు. వాడుకోవాలనే చూస్తారు. అదంతా మనం యిప్పుడు అనుభవంలో చూస్తూ వున్నదే. కాని ప్రధానాకర్షణ అధికార సత్తా సాధనయేననిపిస్తుంది.

మీరు శైవం-వీరశైవం అనే అంశాలపై వ్యాసాన్ని కోరారు. శైవ-శాక్త వాదనలు చాలా ప్రాచీనమైనవి. అందులో ప్రతిభిజ్ఞ కాలాముఖం, గోళకీశాఖ, ఆరాధ్యశాఖ, బ్రాహ్మణేతర వీర జంగమ శాఖ, అగస్త్య మతం, గాణాపత్యం, స్కాందం అంటూ చాల పీఠాలు వుంటున్నాయి. దేవాలయాలు, జాతరలు కూడా అనేకం వున్నాయి. అవన్నీ దేవుడిని, ఆత్మను, వాటి సంబంధాన్ని ఆధారం చేసుకొని అనేక గ్రంథాల ద్వారా చర్చించారు. మంత్రతంత్రాలు ఉపాసనలూ, వ్రతాలు కూడా కొనసాగుతున్నవే వరంగల్‌లో భద్రకాళి, వీరభద్ర సాంప్రదాయం-సిద్ధేశ్వర సాంప్రదాయం కొనసాగాయి. ఆచార్య అభినవ గుప్తుడు, గోవిందభగవత్పాదులు, ఆదిశంకరాచార్య, శైవాగమాలను పాటించారు. లోహముద్రగాణాపత్య శాఖ కూడా ప్రఖ్యాత ఉదాహరణయే. ఇలాంటి వివరాలన్నీ మనకు చరిత్రలో విరివిగా లభిస్తాయి. కాని ఆయా పీఠ సంప్రదాయాల 'గ్రంథాలను చదివినవారు తక్కువ సంఖ్యలో కనపడతారు. సౌందర్య లహరి, లలితాసాహస్రి, సుబాగోదయస్తుతి మున్నగు స్తోత్రాలు ఆ రోజులలో ప్రాచుర్యాన్ని పొందాయి. వాట్లలో గొప్ప సాహిత్యాభిరుచి కూడా చోటుచేసికొన్నట్లుగా చూడవచ్చు. కుమార సంభవం, కిరాతార్జునీయం కూడా కావ్య వికాసంలో కనపడుతూవున్నవే. శైవాగమ-పురాణ వాఙ్మయం కూడా చాల విస్తృతమైనదే. జప, తపాలపై నొక్కడం జరిగినట్లు చూస్తాము

గురపరంపర, పీఠాలు, శిష్య విస్తరణ 'దీక్ష' మంత్రోపదేశం మొదలైన ఆచారాలు వుండేవి. అవి సాంఘికంగ ఒక Fraternity లాంటి 'ఐక్య' భావానికి దారితీశాయంటే సహజమే. బౌద్ధులు, జైనులు కూడా ఈ తరహా శైవ ఆచార సాంప్రదాయాలను తమ మతంలో ప్రవేశపెట్టుకొన్నారు. అందులోనూ శాక్త శాఖలూ, పునర్జన్మవాదం, దేవుని అవతారములు మున్నగు లక్షణాలు కనబడతాయి. జంతుబలులు, హననాలు కూడా కొనసాగాయి. దీన్ని మనం టిబెటన్ వజ్రయానం అనుకోవచ్చు. కాశ్మీర్, నేపాల్, అస్సాం, వంగ ప్రాంతాలలో శైవ-శాక్త సాంప్రదాయాలు ఎంతో కాలంగా కొనసాగుతున్నాయి. పునర్జన్మ వాదం కూడా ఆయా శాఖలలో కొనసాగుతుంది.

పై అంశాలను నేటి 'రాజకీయ' మతవాదులు మరల తిరగదోడటం జరిగేపనికాదు. కులాలుకూడా ఇప్పుడు వృత్తి ఆధారాన్ని కోల్పోయాయి. ఉద్యోగ నియామకాల్లో రిజర్వేషన్లు కావాలని మాత్రం అంటున్నారు.

ఏది ఎలాగైనా మనం మతాన్ని, కులాలను బహిష్కరించాలనిమటుకు కోరకూడదు. రాజకీయరంగంలో కానీ (moral, spiritual) ఆధ్యాత్మికత నైతిక విలువలు కొన్ని మత సాంప్రదాయాల్లో చోటుచేసుకొని వున్నాయి. అందులో ఒక సౌభ్రాతృత్వ శీలం వుందని విస్మరించకూడదేమో. కనుక ఆధారం కమ్యూనిటీ భావనయే అనుకోవాల్సి వుంటుంది రాజకీయాల్లోను. ప్రకృతి విజ్ఞాన రంగంలోను ఈ ఆధ్యాత్మిక నైతిక సహకారాత్మక పార్శ్వాన్ని ప్రవేశపెట్టడం ఎలాగ అన్నది చాల ముఖ్యం. మానవాళి జీవతాశ్యకతల నివారణకుగాను రాజకీయాలు, శాస్త్రదృక్పథం, హేతువాదం, ఇతోధిక ప్రాధాన్యత నియాల్సి వుంటుంది. సభ్య ప్రపంచం అలాంటి 'సంక్షేమ' విధానాన్ని అమలుపరచేలా చూడాలి యుద్ధాలనూ యుద్ధ ప్రమాణాలనూ అరికట్టి శాంతి దశలో నిర్మాణశీలతతో ముందుకు పోవాల్సి వుంటుందేమో. లేని తమకు ధనిక పేద దోపిడీ తత్వం వెర్రితలలు వేస్తుందనిపిస్తుంది. ........ సందేహం, అవిశ్వాసం, నిస్పృహ, అశక్తత అవేవి లేని ప్రపంచాన్ని భవిష్యత్తులో రూపొందించుకొనడం జరగాలి. ఇతరులను ఖండించడంకంటె మన వాదన నిజాయితీని నిరూపించుకొనే దిశలో ముందుకు సాగవలసి వుంటుంది. అవి సాంస్కృతిక అవసరం అనుకుంటాను.

నేను సదస్సులో పాల్గొనలేను. ఈ లేఖ ప్రచురణార్థమై కాదు. కావున గమనించగలరు.

—పాములపర్తి సదాశివరావు

*Printed and Published by T.Venkateswara Rao for Visalaandhra Vignana Samithi, Vijayawada-4. at Nagarjuna Enterprises, Vja - 4. Editor : Edupuganti Nageswara Rao.*

"కమ్యూనిజం" ప్రత్యేక సంచిక

# భారతదేశంలో మతం



కపిలవస్తులో బోధిస్తున్న గౌతమ బుద్ధుడు

జనవరి 1994 రూ.10.వెల.



మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | LPSA101M103 |
| పుస్తకం పేరు | కమ్యూనిజం |
| తారీఖు | 14 March 2025 |
| ముందు అట్ట | XCS |
| వెనుక అట్ట | XCS |
| మొత్తం పేజీలు | 121 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | C-I 98, 99, |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | P. Jayamma |
| పేజీలు విడదీసినది | P. Jayamma |
| స్కాన్ చేసినది | Saranya |
| పరీక్ష చేసినది | THASIN |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | good |

102, 103, 106, 107,
110, 111, BCI